# నవ్య

సంపుటి:13 సంచిక:35

2-11-2016

దీపావళి ప్రత్యేక సంచిక






## సాహితి దివ్వెలు


మేనేజింగ్ డైరెక్టర్
వేమూరి రాధాకృష్ణ

ఎడిటర్
ఎ.ఎన్.జగన్నాథశర్మ


### కథలు



### సీరియల్స్



### కవితలు



### శీర్షికలు




బొమ్మలు: బాలి, చందన, పినిశెట్టి   కార్టూన్లు: బాలి, సరసి, బాచి

ముఖచిత్రం: నరకాసురవధ
చిత్రకారుడు: సురేష్ కడలి


## అలవాటు పడాలి....

**మం**చిపాట వినాలనిపిస్తుంది. వినలేరు. మంచిపుస్తకం చదవాలనిపిస్తుంది. చదవలేరు. చలచల్లని వాతావరణంలో ఎంచక్కా మార్నింగ్‌వాక్‌కి వెళ్ళాలనిపిస్తుంది. వెళ్ళలేరు. అన్నీ అసాధ్యాలనిపిస్తాయి. వల్ల కాదనిపిస్తాయి. నుదుటన రాసి లేదని సరిపెట్టుకుంటారు. బాధపడతారు. అది తప్పు. ఏదైనా ప్రయత్నించి చూడాలి. ప్రయత్నమే ముందడుగు. కనీసం మూడు కిలోమీటర్లయినా నడవాలని నడక మొదలు పెట్టిన రోజే మూడు కిలోమీటర్లూ నడిస్తే కాళ్ళనొప్పులు తప్ప, అందులో సుఖం ఉండదు. అలాగే మంచిపుస్తకం కొనుక్కుని అదేపనిగా చదివితే ఆనందం ఉండదు. ఎంత మంచి పాటైనా వినాల్సినప్పుడే వినాలి. దానికీ ఓ సమయం, సందర్భం ఉంటుంది. అందుకు అలవాటు పడాలి.

ఈనాడు కొత్తగా ప్రవర్తించిందే రేపటికి అలవాటు అవుతుంది. సరదాలూ, సంతోషాలూ అలవాటు చేసుకోవాలి. అలవాటు చాలా బలమైనది. ఏదైనా మూడువారాలపాటు విడవకుండా ఆచరిస్తే, అదే అలవాటుగా పరిణమిస్తుంది. శ్రీశ్రీ మహాప్రస్థానం, తిలక్ అమృతం కురిసిన రాత్రి, బైరాగి ఆగమగీతి, నారాయణ రెడ్డి విశ్వంభర రాత్రికి రాత్రే అర్థం కావు. చదివి ప్రయోజనం కూడా ఉండదు. వాటిని రోజుకో కవితగా చదువుకోవాలి. అలా కవిత్వానికి అలవాటు పడాలి. అలాగే నడకైనా నడతైనా కొద్దికొద్దిగా అలవాటు చేసుకోవాలి. కొన్నాళ్ళకి అదే పెద్దగా అలవాటై ప్రత్యేకంగా నిలబెడుతుంది.



అమ్మానాన్నలను పలకరించడం, ఆత్మీయుల క్షేమసమాచారాలు అడిగి తెలుసుకోవడం, స్నేహితులకు చేదోడు వాదోడుగా ఉండడం, గుడికి వెళ్ళడం, మరచిపోకుండా అక్కడి గంట కొట్టడం, అడిగి మరీ ప్రసాదం స్వీకరించడం, ఆఫీసులో సహోద్యోగులతో చనువుగా ఉండడం, వేళకి ఇంటికి రావడం, భార్యామణితో కబుర్లు చెప్పడం, వేడివేడిగా కాఫీతాగడం, పిల్లలతో ఆడుకోవడం, వారిని చదివించడం అన్నీ అలవాటు చేసుకోవాలి. ఈ దీపావళి అందుకు మనల్ని సంసిద్ధుల్ని చేస్తుందని ఆశిద్దాం.




## మా అమ్మ పురిటి గది

మిషన్ హాస్పటల్‌లో
పచ్చి బాలింత
మా అమ్మ!!
నెత్తుటి గుడ్డును నేను
ధనుర్వాతంతో
బాధపడుతూనే...
నా చిన్ని పెదవులకు
స్తనాలందించిన అమ్మ...
ఊహల్లో...
తేలిపోయింది...
గగనతలంపైకి...
వెళ్ళిపోయింది-
నా కోసం అమ్మ!
ఎన్ని కలలు కందో
ఆ కలలు ఏమిటో!?
తెలుసుకోవాలని...
అమ్మ! తుది శ్వాస విడిచిన
ఆస్పత్రికి వెళ్ళాను-
అప్పటి పురాతన భవనం
పాకురు పట్టి....
పురిటి వాసనలా...
కమ్మగా ఉంది.
ఉమ్మ పాలు...
గుటక వేసినట్లుంది
భవనం నెర్రలతో
మొలిచిన మర్రిఊడలు
బాలింత అమ్మ
నడుముకు బిగించిన
కట్టులా,
తలకు వాసన కట్టిన
బట్టలా,
తెల్లగా మెరుస్తున్నాయి,
మెలికలు తిరిగి
ఇదే రూములో అమ్మ
తుది శ్వాస విడిచిందని...
నాయనమ్మ చెప్పింది
గతంలో
తడబడుతున్న అడుగులతో
ఆ గదిలోకి వెళ్ళాను
గోడలకు వేలాడుతున్న
గబ్బిలాలు... తలక్రిందులుగా
నా వంక చూస్తున్నాయి
ఆ చూపులు
నన్నాశీర్వదిస్తున్న మా అమ్మ
చూపుల్లా
దట్టంగా పెరిగి వేలాడు
తున్న
గరికపోచలు
మా అమ్మ ముంగురుల్లా
నన్ను ముద్దాడుతుంటే
నా నిలువెల్లా పులకించగా
అడుగులు జారుతున్నాయి
పచ్చని పాకురులో
ముందుకు తూలి తుప్పు
పట్టిన
కిటికీ చువ్వలను పట్టు
కున్నాను
అమ్మ రూపం!!
ఏ మూలనైనా కనిపిస్తుందే
మోనని
ఆరాటం!! తెలియని



ఉద్వేగం....!!
అమ్మా....!!!
ఆ నాటి నీ నెత్తుటి గుడ్డుని...
అరవై వసంతాలు పూర్తి
చేసుకుని
నీ వద్దకు వచ్చానమ్మా...
నీ వెక్కడున్నావోనని....
తపించిపోతున్నానమ్మా
నువ్వు పెట్టిన చివరి
ముద్దు...
నా ఊపిరై
సంజీవనిలా
నాకు జీవం పోసింది
నా కరస్పర్శ...
ఇంకా నన్ను తడుతూనే
క్రింద పడ్డ ప్రతిసారీ
నా వెన్ను తట్టి లేపుతుం
దమ్మా
గతాన్ని నెమరువేయాలని
ఎంతో ఆరాటంగా వచ్చాను
నీ రూపం - నీడలా
కనిపించినా చాలని అశగా...
పాకురు పట్టిన గోడల్ని.
తడుముతున్నానమ్మా
ఎంత కమ్మని వాసన
ఈ పాకురు!?
పై కప్పు పెంకుల నుండి
కారుతున్నాయి
మా అమ్మ కన్నీళ్ళు
అమృతధారలై
ఆనందబాష్పాలై
నన్ను అభినందిస్తూ
నన్ను ఆశీర్వదిస్తూ
నన్ను అభిషేకిస్తూ
నా ఈ జన్మకు
ఇంకేం కావాలి!?
స్మార్టు ఫోనులో
మా అమ్మ సుందర
రూపాన్ని
నా కలల కాన్వాస్‌పై
ఊహించుకుంటూ
ఎంతో
ఎన్నో
పరిమళాలు
వెదజల్లే
ఈ హాస్పటల్
పాకురు గదిని
తనివి తీరా బంధించాను
యూ ట్యూబ్ స్పర్శ
అమ్మ పేగుబంధంలా
ఫేస్‌బుక్ లైక్స్
తోబుట్టువుల అనురాగంలా
నన్ను ప్రతిక్షణం
ప్రేరేపిస్తూ
అమ్మ జ్ఞాపకాల్లో...

-మొవ్వ రామకృష్ణ
సెల్: 98490 06421



# జ్ఞానజ్యోతుల మనోరవళి దీపావళి

భోదీపదేవి రూపస్త్వం కర్మసాక్షిహ్యేమిఘ్నకృత్
యావత్పూజాం కరిష్యామి తావత్వం సిద్ధిదో భవ!
దీపం జ్యోతి పరబ్రహ్మ దీపం జ్యోతి జనార్దన
దీపోహరతుమే పాపం దీపజ్యోతిర్నమోస్తుతే

దీపము కలిగిన ఇంట, దాపున శ్రీలక్ష్మి ఉండి పాపంబులు పారద్రోలి ధనములనిచ్చున్, ఆరోగ్యం, శాంతినిచ్చి కాపాడుము బ్రహ్మాండ ముఖీ అని ఆ అమ్మవారిని వేడుకుంటూ ఆ జ్యోతి స్వరూపాన్ని లక్ష్మీదేవిగా భావించి దీప జ్వాలకు నమస్కరిస్తాం.

దీపం పరబ్రహ్మ స్వరూపం. జ్ఞానానికి చిహ్నం. నిర్లక్ష్యం అనే చీకటిని పారద్రోలే దివ్య జ్యోతి. దీపకాంతి చీకటిని పారద్రోలినట్టే, జ్ఞానం నిర్లక్ష్య ధోరణిని నిర్మూలిస్తుందని పెద్దలు చెబుతుంటారు. అందుకే అన్నింటిలోనూ విలువైనదైన గొప్ప జ్ఞానాన్ని సముపార్జించుకోవడం కోసం, అన్ని పవిత్ర సందర్భాల్లోనూ మన ఆలోచనలకు, పనులకు సాక్ష్యంగా జ్యోతి వెలిగిస్తాం.

దీపావళి అంటే దీపాల వరుస. భారతీయ సంప్రదాయంలో దీపానికి విశేష ప్రాధాన్యం ఉంది. అందుకే ఏ శుభకార్యం మొదలుపెట్టినా ముందుగా జ్యోతి వెలిగించి ప్రారంభించే సంప్రదాయం మనది. దీపపు కుందిలో పోసే నెయ్యి లేదా నూనె, వత్తి మనలోని కోరికలు, అహంభావ ధోరణులకు సంకేతం. భగవంతుని ముందు దీపం వెలిగించగానే మనలోని కోరికలు నెమ్మదిగా ఆవిరవుతూ, అహం కాలిపోతూ ఉంటుందని అర్థం చేసుకోవాలి.

నిజానికి దీపావళి మూడు రోజుల పండుగ. కొన్నిచోట్ల ఈ పండుగను ఐదురోజులు కూడా జరుపుకుంటారు. ఆశ్వయుజ మాసం కృష్ణపక్షంలో వచ్చే ఈ పండుగ మొదటిరోజు నరకచతుర్దశి, రెండోరోజు దీపావళి, మూడోరోజు బలిపాడ్యమిగా జరుపుకుంటారు. ఐదురోజులు పండుగ చేసుకునే వారు ధనత్రయోదశి, నరకచతుర్దశి, దీపావళి, బలిపాడ్యమి, యమద్వితీయ ఇలా జరుపుకుంటారు.

జ్ఞానానికి, ఐశ్వర్యానికి, ఆనందానికి ప్రతీకగా నిలిచే జ్యోతి మహాలక్ష్మి స్వరూపం. అలాంటి దీపావళినాడు జ్యోతిని లక్ష్మీదేవిలా భావించి గృహిణులు లక్ష్మీపూజ నిర్వహిస్తారు.

## నరకాసుర సంహారం

ఆశ్వయిజ శుక్ల చతుర్దశిని నరక చతుర్దశిగా జరుపుకుంటారు. అసురుడైన నరకుడు నశించిన రోజు. విష్ణుమూర్తి, భూదేవిలకు జన్మించిన కుమారుడు నరకాసురుడు. తల్లిచేతిలోతప్ప వేరే ఎవరి చేతిలోను మరణం సంభవించరాదని వరం కోరుకున్నవాడు నరకుడు. అలా వర

గర్వంతో విర్రవీగి ఎందరో మహిళలను చెర బట్టాడు. ఆ సందర్భంలో దుష్టశిక్షణ కోసం శిష్ట రక్షణ కోసం శ్రీకృష్ణ పరమాత్మ సత్యభామా సమేతుడై నరకాసురుడి మీదకు యుద్ధానికి దండెత్తుతాడు. ఇది తెలిసి ఆగ్రహం పట్టలేని నరకాసురుడు స్వయంగా తన బలగాలతో రంగంలోకి దిగుతాడు. శ్రీకృష్ణ నరకాసురుల మధ్య భీకర యుద్ధం జరుగుతుంది. నరకాసురుని వరం గురించి తెలిసిన నల్లనయ్య అతని బాణానికి మూర్ఛపోతాడు. అది చూసి సాక్షాత్తూ భూదేవి అంశ అయిన సత్యభామాదేవి తన సుకుమారాన్ని వదిలి నరకాసురునితో భీకరంగా యుద్ధం చేసి రాక్షసుణ్ణి సంహరిస్తుంది. అలా నరకుడి సంహారం జరిగిన రోజు కాబట్టి ఆరోజును నరక చతుర్దశి అంటారు. దీన్నే కొన్నిచోట్ల బోగిగా కూడా వ్యవహరిస్తారు. ఆ రోజు ఉదయాన్నే లేచి నువ్వుల నూనెతో అభ్యంగన స్నానం ఆచరిస్తారు.

### దివ్వెల వెలుగుల దీపావళి

నరకాసుర సంహారానికి గుర్తుగా ప్రజలు ఆనందోత్సాహాల మధ్య దీపావళి జరుపుకుంటున్నారు. ఆశ్వయుజ బహుళ అమావాస్యను దీపావళి పండుగగా జరుపుకుంటాం. ఈరోజు టపాకాయలు కాలుస్తూ, మిఠాయిలు తిని బంధుమిత్రులతో సరదాగా, ఆనందంగా గడుపుతుంటారు. కేవలం ఈ ఒక్కరోజే కాదు జీవితాంతం మన మనసు, ఇల్లు సుఖసంతోషాలతో ఓ పండుగలా వెలుగుతూ ఉండాలన్నదే దీపావళి పండుగ ముఖ్య ఉద్దేశం. దీపం నుంచి వచ్చే వెలుగు బాహ్యమైనదే కాదు అంతరమైనది కూడా. అంటే మన మనస్సు కూడా ఎలాంటి కల్మషం లేకుండా, మనలోని దుర్గుణాలు పోగొట్టుకుని, సుగుణాలు వెల్లివిరిసేలా వెలిగించుకోవాలనే వాస్తవాన్ని గుర్తుచేసేదే ఈ దీపాల పండుగ.

### శ్రీ మహాలక్ష్మి పూజ

పద్మప్రియే పద్మిని పద్మహస్తే పద్మాలయే పద్మదళాయతాక్షీ !
విశ్వప్రియే విష్ణు మనోనుకూలే త్వత్పాద పద్మం మయి సన్నిధస్వ !!

పద్మదళముల వంటి కన్నులు కలది, పద్మముల వంటి కమల హస్తాలతో నిత్యం అభయాన్ని ప్రసాదించేది. ఉదయ భానుడివంటి ప్రకాశవంతమైన దేహం కలిగి ఉండి, ఎరుపు, పసుపు మేళవించిన వస్త్రాలు ధరించినది, పరమార్థదాయని, విష్ణు ప్రియవల్లభ, కృపాకరి, లోకమాత ఆ మహాలక్ష్మీదేవి పాదపద్మములకు నమస్కరిస్తున్నాను.

దీపావళి పర్వదినంరోజు ఆ జగన్మాత మహాలక్ష్మీదేవిని సర్వోపచారాలతో పూజించి అర్చిస్తారు. అయితే దీపావళి పర్వదినం రోజున ప్రత్యేకించి లక్ష్మీదేవిని పూజించడానికి గల కారణాలు వివరించే పలు పురాణ గాథలు ప్రచారంలో ఉన్నాయి.

పూర్వం దూర్వాస మహాముని ఇంద్రుడి ఆతిథ్యానికి సంతోషించి మహిమగల ఒక హారం అతడికి బహూకరించాడు. కానీ ఇంద్రుడు ఆ హారం మహిమను, గొప్పతనాన్ని గుర్తించక దాన్ని తన వాహనమైన ఐరావతం మెడలో వేశాడు. ఆ హారాన్ని ఐరావతం కాలితో మట్టగించింది. ఆపాప ఫలితంగా దేవేంద్రుడు రాజ్యం కోల్పోయాడు. దీనస్థితికి చేరిన ఇంద్రుడు శ్రీహరిని ప్రార్థించగా, ఒక దీపాన్ని వెలిగించి దాన్ని లక్ష్మీ స్వరూపంగా భావించి భక్తి శ్రద్ధలతో పూజించమని చెప్పాడు. ఆ పూజలు ఆచరించిన దేవేంద్రునిపై లక్ష్మీదేవి కరుణాకటాక్ష వీక్షణాలు ప్రసరించడంతో తిరిగి ఇంద్రుడికి దేవలోకాధిపత్యం లభించింది. అప్పటినుంచి ఇప్పటివరకు ఎవరైతే దీపావళి రోజున దీపం వెలిగించి లక్ష్మీదేవిని పూజిస్తారో ఆ భక్తులఇంట దేవి స్థిరంగా ఉంటుందనే నమ్మకంతో పూజలు చేస్తారు. ఈ మాసంలో ప్రత్యేకించి దీపావళి రోజున ఆ శ్రీమాత ఇంటింటా భక్తుల విశేష పూజలు అందుకుంటుంది.

### యుగయుగాన దీపావళి

నాలుగు యుగాలలోనూ దీపావళి పండుగను ఆనందోత్సాహాలతో చేసుకోవడానికి విశేషమైన కారణాలున్నాయి. శ్రీమహావిష్ణువు వామనావతారుడై కృతయుగంలో రాక్షసరాజు బలిచక్రవర్తిని పాతాళానికి అణచివేశాడు. అది బలిపాలన అంతమైనరోజు. త్రేతాయుగంలో శ్రీరామచంద్రుడు రావణాసురుణ్ణి వధించి తిరిగి ఆరోజు అయోధ్యలో ప్రవేశించిన సుదినం. ద్వాపర యుగంలో నరకాసురుణ్ణి వధించిన రోజు. కలియుగంలో విక్రమశక స్థాపకుడైన విక్రమార్కుడు పట్టాభిషిక్తుడైన రోజు. ఇలా నాలుగు యుగాలలోనూ సంభవించిన వివిధ రకాల కారణాలతో ఈ విజయాలకు సూచికగా దీపావళి పర్వదినం జరుపుకుంటున్నాం.

**- దేవళ్ల మహేశ్ శర్మ అవధాని**

## ఒక్కో దీపానికి ఒక్కో పేరు

మనం ఇంట్లో చేసే నిత్యదీపారాధనను వృష్టి దీపారాధన అంటారు. అంటే ఇంటికి వెలుగునిచ్చి ఆ ఇంటిల్లిపాదికి ఐశ్వర్య సంపద కలిగించేది. అదేవిధంగా తులసికోట వద్ద చేసే దీపారాధన బృందావన దీపారాధన. దేవుడికి ప్రత్యేకించి చూపించే దీపారాధనలను అర్చన దీపాలు అని, నిత్యపూజలో ఉపయోగించే చిరుదీపాలను నిరంజన దీపాలని, గర్భగుడిలో వెలిగించే దీపాన్ని నందాదీపం అని అంటారు. ఎప్పుడూ వెలుగుతూఉండే దీపాన్ని అఖండదీపం అంటాం. లక్ష్మీదేవి ఉన్న గర్భగుడిలో వెలిగించే దీపాన్ని లక్ష్మీదీపం అంటారు. దేవాలయ ప్రాంగణంలో ఉన్న బలిపీఠంపై దీపాన్ని వెలిగిస్తే అది దేవాలయ దృష్టి నివారిణి. దీనిని బలిదీపం అని పిలుస్తారు. దానికి సమీపాన ఉన్న ఎత్తు స్తంభంపై వెలిగించిన దీపాన్ని ఆకాశదీపం అంటారు. దీపాల ఆకారాలు కూడా వివిధ రకాలుగా ఉంటాయి. శైవసిద్ధాంతం పాటించేవారు వెలిగించే దీపాలు నందిరూపంగా, నాగురూపంలో మేళవించిన దీపాలుగా కనిపిస్తే, విష్ణువు వద్ద దీపకృతులు, శంఖ, చక్ర, గద, పద్మ రూపాలుగా కనిపిస్తాయి.



## దీపారాధన ఎలా చేయాలంటే?

ఏకముఖ దీపం, మధ్యమం, ద్విముఖం కుటుంబ ఐక్యత, త్రిముఖం ఉత్తమసంతాన సౌభాగ్యం, చతుర్ముఖం పశుసంపద, ధన సంపద, పంచముఖం సిరిసంపదల వృద్ధి లాంటి ఫలితాలను కలిగిస్తుంది. దీపారాధనకు మట్టి, వెండి, పంచలోహాదులతో తయారైన ప్రతిమలు వాడడం శ్రేష్ఠం. దీపారాధన చేసేటపుడు తప్పనిసరిగా ప్రమిదల క్రింద చిన్న



పళ్ళెం పెట్టడం శ్రేష్ఠం. మట్టి ప్రమిదలో దీపారాధన చేస్తే ఆ ప్రమిద కింద మరో ప్రమిద పెట్టాలి. ఇంట్లో నిత్య దీపారాధన సంధ్యా సమయాలలో తప్పనిసరిగా చేయాలి. నిత్యం దీపారాధన చేయడంవల్ల శుభఫలితాలు కలిగి, దుష్టశక్తులు నశిస్తాయంటారు. దీపం వెలిగించడానికి ఒకే ఒక వత్తి ఉపయోగించరాదు. అగ్గిపుల్లతో దీపం వెలిగించరాదు. అగరుబత్తి ఉపయోగించవచ్చు. దీపారాధన తర్వాత మూడుచోట్ల కుంకుమపెట్టి అక్షతలు వేస్తే మంచిది. పూజమధ్యలో దీపం కొండెక్కితే ఓంనమఃశ్శివాయ అనే శివపంచాక్షరీ జపం చేస్తూ తిరిగి వెలిగించాలి.



# మాదో కొబ్బరిచెట్టు

ఇంద్రగంటి శ్రీకాంతశర్మ

**వీధి పెరట్లో అలికిడైతే గుమ్మంలోకి వచ్చి చూసింది విశాలాక్షి.**

**చుట్ట కాల్చుకుంటూ, చంకలో పెట్టుకున్న జనపనార చిలపతో తాడు అల్లుకుంటూ వీధి అరుగుమీద కూర్చున్న వెంపర్తి కనిపించాడు.**

**"నువ్వు రా! ఎంతసేపైంది వచ్చి" అంటూ బయటి అరుగుమీదకి వచ్చింది.**

**"ఆయ్, ఇప్పుడేనండి. మన గేదెని సిన్నకాలవకాడికి తోలుకెళ్ళి సుబ్బరంగా కడిగి, దొడ్లో కట్టేసొచ్చానండి. అయ్యగార్లేరాండి?"**

"నాయుడుగారి కొబ్బరితోటలలోకి వెళ్ళారు. వాళ్ళ నారాయుడు కబురు తెచ్చాడు".

"ఆయ్... దొడ్లో పనుంది రమ్మన్నారండి నన్ను. పన్లో పని, గేదెని కాలవకాడికి తీసికెళ్ళమని నిన్న జెప్పారండి".

"మరే! మంచిపనే చేశావు. 'సోవిcగాడు ఊరెళ్ళాడు. వాడి పెళ్ళాం నీళ్ళోసుకుందట."

"ఆయ్... దొడ్లో పనేంటో..." అంటూ ఇంటివెనక పెరట్లోకి వెళ్ళేందుకు లేచాడు. చంకలో తాడు అల్లిక పూర్తయింది. ఇందాక విశాలాక్షిని చూస్తూనే చుట్ట ఆర్పి, ఆ చుట్టముక్కని చెవిలో దోపుకున్నాడు.

'పద చూపిస్తా. అరటిచెట్లకి సొరుగులు కోసేసి, బోదెలు కట్టాలిరా! మన నూతినీళ్ళు వాటికి పట్టకుండా, మురికిగా బైటకొచ్చేస్తున్నాయి.

ఆ రెండు కొబ్బరిచెట్లనించీ ఎండుమట్టలు వేలాడుతున్నాయి. వాటిని లాగేసి, ఆకు దూసేసి, ఈనెలు తీసేస్తే చెల్లాయమ్మ వచ్చి బరక చీపుళ్ళు కట్టుకుంటుంది".

విశాలాక్షి వెంపర్తి వెంటే వచ్చి మాట్లాడుతుంటే, వాడు రెండు కొబ్బరిచెట్ల మధ్య నిలబడి కాయల తీరు పరకాయిస్తూ, చెట్ల చుట్టూ తిరుగుతున్నాడు.

"అన్నట్టొరేయ్, చెట్ల కాయలెప్పుడు దించుతావు? పుచ్చెలు బాగా రాలిపోతున్నాయి. ఏం చెయ్యాలంటావూ?" తనూ చెట్లవైపు పరీక్షగా చూస్తూ అడిగింది.

"సూద్దాం. అయ్యగారు రానీండి. ఈలోగా అరిటి సెట్ల పని సూసేసి, బోదెలు కట్టేత్తానండి"

"అలాగే కానియ్యి. అన్నం ఇక్కడే తిందువు గాని. ఇంతలో ఆయనా వస్తారు" అనేసి విశాలాక్షి పెరటిదండెం మీద ఆరేసి ఉన్న పట్టుపంచె తీసుకుని లోపలికి వెళ్ళింది.

●●●

"రెండుసెట్లూ కలిపి ఓ పాతిక్కాయ దిగొచ్చండి' పెరటి అరుగుమీద పడక్కుర్చీ వేసుక్కూర్చుని, సీతారామ్మూర్తి వింటున్నాడు.

"ఇంతేనా?"

"అంతకిమించి అక్కడ ఓపికేదండీ?" అన్నాడు వెంపర్తి, అరటిచెట్ల పని చూసేసి నూతిదగ్గర కాళ్ళు చేతులు కడుక్కుంటూ.

"అయితే ఏం చెయ్యాలంటావు?"

"సెప్పమంటారా? మన గొడ్లపాకకాడ గొయ్యేడదావండి. రేగడి పెళ్ళలు తిరగేసి, ఆటితో రెండు కొబ్బరిసెట్లకీ సుబ్బరంగా మొదళ్ళలో దిమ్మలు కడదావండి. సెట్టుపైని మొవ్వులో ఉప్పుమూట లెడదావండి. బాగవుద్ది. ఎండుమట్టల్లాగేశాం కదండి; సూద్దారండి".

"ఇంతకీ ఉన్నకాయ దించేద్దామా?"

"తొందరేటండి. నాల్రోజులాగుదాం" వెంపర్తి స్థిమితంగా మాట్లాడాడు. వాడంతే!

నాయుడుగారి కొబ్బరితోటలోనూ, అరటితోట




ఒక విశాల మైదానపు నిశ్శబ్దం ముందు
మనిషిని నుంచో బెడదాం,
సతతం విస్తరిస్తున్న ఎడారి నయనాల ముందు
మనిషిని నుంచో బెడదాం,
ఎగసి పడుతున్న సముద్రపు గగనాల
నీలికెరటాల ముందు

## నిశ్శబ్దం ముందు

మనిషిని కూచోబెడదాం
ధ్వంసమయిన ఎన్నో వేల ఊళ్ళ పొగలీనుతున్న
కట్టెల ముందు, మనిషిని పద్మాసనం వేసి కూచో
బెడదాం
ఎటుచూసినా కనపడే శ్మశానాల
నిర్ విముక్తి గర్భాల గహనాడవిలో
మనిషిని ప్రవేశపెడదాం
లేదు, అప్పుడే పుట్టిన పసిపాప నిర్మల
పాలభాగాల అద్దంలోకి తొంగి చూడమందాం
కుదురుగా కూచోవటం తెలిస్తే
సూటిగా చూడటం తెలుస్తుంది

ఇన్ని దృశ్యాల ముందు, ఇన్ని వేల కోట్ల
మనుషుల మహత్తర స్వప్నాల
అంతర్లోకపు ఆదిమత్వం ముందు
అమరత్వం ముందు
మనిషిని తపస్సు చేయమందాం
మనిషిని తన్ను తాను కనుక్కోమని చెబుదాం



పరుగెత్తుతున్న మనిషిని పట్టుకొచ్చి
భూమిలో ఒకచోట పాతుదాం
నాలుగు రాత్రుళ్ళనీ
నాలుగు పగళ్ళనీ పూయమని చెబుదాం

-శివారెడ్డి
ఫోన్: 040-24064195

లోనూ వాడికే పని. చాలా చిన్నప్పటినుంచి నాయుడుగారి పొలం పనులే చూసుకుంటున్నాడు. ఇప్పుడూ అక్కడే. ఆయనకే ఒక నర్సరీ కూడా ఉంది. కొబ్బరి మొక్కలు అమ్మడం ఆయనకు ఇష్టమైన వృత్తి.

నాయుడుగారి తమ్ముడు సూర్రావుకీ, సీతారామ్మూర్తికీ దోస్తీ. ఇద్దరూ ఊళ్ళో కాలేజీలో ఇంటర్ చదివాక, సూర్రావు బాపట్లలో అగ్రికల్చర్ బి.ఎస్సీ చదివి, రేడియోలో అగ్రికల్చర్ ప్రోగ్రాంలు చూసే ఆఫీసరయ్యాడు. ఎలా అయ్యాడంటే, స్టేట్ అగ్రికల్చరల్ డిపార్ట్‌మెంట్‌నుంచి ముందు డెప్యుటేషన్‌మీద వెళ్ళి అక్కడే స్థిరపడిపోయాడు. పాడి, పంటల గురించి కార్యక్రమాలు జరిపిస్తుంటాడు.

సీతారామ్మూర్తి బి.కాం చదివి, ఇంకా పై చదువులు చదవాలనుకున్నా, తండ్రి కూడా బ్యాంకు ఉద్యోగి కావడం వల్ల, ఆయన బలవంతపు ఏర్పాటు వల్ల బ్యాంక్ ఆఫీసరై మూడేళ్ళు పల్లెటూళ్ళు, మూడేళ్ళు పట్టణాలు అనే పంపిణీమీద దాదాపు పదిహేనేళ్ళుపైగా గడిపాడు. ముగ్గురు మగపిల్లల చదువులకోసం పల్లె పట్నం కాని మధ్యరకం పట్నం కదా అని ఇక్కడ స్థిరపడి ఇల్లు కట్టాడు. కాస్త ఆవరణగల ఇల్లు. మొక్కామోటికా పెంచడం ఇష్టం. విశాలాక్షికి పెరటితోటల పెంపకంమీద మోజు. పెద్దపిల్లాడు ఇంజనీరింగ్ కాలేజీలో చదువుతున్నాడు. రెండో పిల్లాడికి ఇంటర్ పరీక్షలయ్యాయి. మూడోవాడింకా హైస్కూల్ దశలోనే ఉన్నాడు.

సీతారామ్మూర్తికి సూర్రావు ద్వారా నాయుడుగారితో పరిచయం. మధ్యలో వ్యవసాయ పనుల సీజన్‌లో వచ్చి, తండ్రికి కొద్దిరోజులు మాటసాయం చేసి వెడుతుంటాడు సూర్రావు.

చాలారోజులైంది. అంటే ఎప్పుడో.. పదేళ్ళయిందేమో కూడా. రెండు కొబ్బరి మొక్కలు తెచ్చి పెరటి దొడ్లో పాతించాడు. అప్పుడే నాయుడుగారి జీతగాడు వెంపర్తిని పట్టుకొచ్చి, అతగాడికి అప్పుడప్పుడు ఇంటిపనులు అప్పగించడం మొదలు పెట్టాడు. వాడి సలహామీదనే గేదెని కూడా పెట్టుకున్నాడు. ఒప్పందం ఏమంటే వాడు గేదె పోషణాకారం అంతా చేసుకోవాలి. ఇంటి వాడకానికి సరిపడ శేరున్నరకి తగ్గకుండా పాలుపోసి, మిగిలినవి వాడు వాడుకోవచ్చు. ఖర్చు తనదే. కానీ సీతారామ్మూర్తి మాత్రం ఆ గేదెకు సేవచెయ్యలేడు. అదీ కథ.

ఇప్పుడు ఇంటపుట్టిన సమస్య ఏమిటంటే విశాలాక్షి మరొక్క కొబ్బరిచెట్టు తెచ్చి వేద్దామంటోంది. ఇంటి వాకిట్లో ఖాళీ దొరికినచోటల్లా పూలచెట్టో, అరటి చెట్టో, కూరపాదో పెట్టేసింది. అయినా అర్జంటుగా ఎందుకీ మూడో కొబ్బరి చెట్టు?

"అలా అనకండి. మూడో పిల్లాడికి అక్కర్లేదా? రెండుచెట్లు చాల్తాయా? మీరు తెప్పిస్తారా? వెంపర్తి చేత నేనే తెప్పించుకోనా?" విశాలాక్షి నసపెట్టేస్తోంది.

ఈ కొడుకులు పెద్దవాళ్ళై ఇంట్లో వాటాలకొచ్చినప్పుడు, రెండు చెట్లకాయలూ సమంగా పంచుకుంటే తీరిపోదా! అని సీతారామ్మూర్తి అభిప్రాయం.

"అహc! అలా ఎంతమాత్రం కుదరదు. ఎవరి చెట్టు వాళ్ళకి ఉండాల్సిందే. వాళ్ళపెళ్ళాలు ఎలాంటి వాళ్ళవుతారో" - విశాలాక్షి మొండి వైఖరి ప్రదర్శించింది.

"ఎప్పటి పెళ్ళాలు? ఎప్పటి తగాదాలు! రాబోయే కాలంలో వాళ్ళెక్కడికి వెళ్ళిపోతారో ఎవరికెరుక? ఈ కొంపనీ, కొబ్బరిచెట్లనీ కౌగిలించుకు కూర్చుంటారా ఏమిటి?" సీతారామ్మూర్తికి ఈ పోరు చిరాగ్గా, చొక్కాలో చీపురు ముల్లులాగా ఉంది.

కొన్నాళ్ళుగా ఈ వ్యవహారం నలుగుతుండగా, ఈరోజు సీతారామ్మూర్తికోసం నాయుడుగారు కబురంపారు. నాయుడుగారు పిలిపించడానికి ఒక కారణం ఉంది. సీతారామ్మూర్తికి ఎదురైన చిన్న సమస్యకంటే ఇదికొంచెం పెద్దది. ఇతను వాళ్ళ తోటకి వెళ్ళేసరికి అక్కడ ముందుగా, కొబ్బరికాయ దింపించే దగ్గర సూర్రావు కనిపించాడు. అవతల మరికొంత దూరంలో నాయుడుగారు, పనివాళ్ళు కాయలు ఒలుస్తూ వాటిని గ్రేడింగ్ చేసేచోట, నులక మంచం మీద కూర్చున్నారు.

సూర్రావు సీతారామ్మూర్తిని చూస్తూనే, "వచ్చావా? రా, రా మంచి సమయానికే వచ్చావు. నాన్న కబురంపాడు కదా?"

"మరే, ఏం కథ?" చుట్టూ వ్యవహారం పరకాయిస్తూ ప్రశ్నించాడు సీతారామ్మూర్తి.

"ఇప్పుడు కొబ్బరిమార్కెట్టు పరిస్థితి బాగా లేదు. ఇదివరకు సంగతి వేరు. సమస్య ఏమంటే, కాయలు ఒలిచిన డొక్క ఇంతవరకూ వేరేవాళ్ళకి అమ్మేస్తున్నాం. ఇప్పుడాయన ఏవంటాడంటే, కాయల అమ్మకం రాబడి పడిపోయింది గనక, డొక్క మనమే అట్టేపెట్టుకుని కాయర్ ఇండస్ట్రీ పెడదామంటాడు. మనకి యాభై చెట్లున్నాయి. బోలెడు డొక్క... ఓ మిషనుకొని పెట్టుకుంటే, పనివాళ్ళకీ వెసులుబాటు ఉంటుంది కదా!" అని.

"చెయ్యొచ్చు. అగ్రీ ఓరియంటెడ్ స్మాల్‌స్కేల్ ఇండస్ట్రీగా బాగానే ఉంటుంది మరి".

"ఏం చెయ్యడం? ఇక్కడ ఉండి ఎవడు నిర్వహిస్తాడు? ఉద్యోగం ఒకటుందిగా నాకు. నా వల్లకాదు. కాయర్ తియ్యాలి. బేళ్ళు కట్టాలి. మార్కెట్ ఫీజిబిలిటీ చూడాలి. నేను వద్దంటున్నాను".

"బాగానే ఉంది మీగొడవ. నాన్న నన్నెందుకు రమ్మన్నారో!"

దీని గురించే, ఏ బ్యాంకు అప్పుకోసమో... పద వెళ్ళి మాట్లాడు. నాకు సెలవులేదు. నిన్నవచ్చాను. ఇదిగో ఇంకా 'దింపు' కాలేదు. రాత్రికి వెళ్ళిపోవాలి".

సూర్రావు తోటలో ముందుకి నడిచాడు. సీతారామ్మూర్తి నాయుడుగారు కూర్చున్న దగ్గరికి వెళ్ళాడు.

**సీతారామ్మూర్తికి నాయుడుగారి తమ్ముడు సూర్రావుకి మంచి దోస్తీ. ఒకరు కొబ్బరితోట పెంచితే మరొకరు పెరట్లో కొబ్బరిచెట్లు పెంచారు. కొబ్బరితోటకి గిట్టుబాటు లేదు. నష్టాల్ని భర్తీచేసుకోడానికి నాయుడుగారు బ్యాంకులోనుతో కాయర్ ఇండస్ట్రీ పెడితే, సీతారామ్మూర్తి భార్య పెరట్లో ప్రేమగా కొబ్బరి చెట్లు పెంచుకుంటోంది. కాలం సజావుగా సాగుతుండగా, ఓ కాళరాత్రి తుపాను కాటేసింది. ఆ రాత్రి ఆ ఊళ్ళో ఏం జరిగింది?**

"నాయన్నాయనా! మూర్తీ వచ్చావా? నీ కోసమే చూస్తున్నా.." అంటూ ప్రారంభించి అరగంట పైగా మాట్లాడాడు.

కాయర్ ఇండస్ట్రీ పెట్టాలి. బ్యాంకు అప్పు కావాలి. వీలు చూసుకుని సీతారామ్మూర్తికూడా

ఇండస్ట్రీ అభివృద్ధికి ఒక చెయ్యి వెయ్యాలి. ఇదీ వారిద్దరి మాటల సారాంశం. రెండ్రోజుల్లో చెపుతానని తను ఇంటికి వచ్చేశాడు.

●●●

వెంపర్తి పనిపూర్తి చేసుకుని, విశాలాక్షి పెట్టిన అన్నం తినేసి వచ్చి సీతారామ్మూర్తి ఎదుట నిలబడ్డాడు.

అతగాడు వెంపర్తికేసి చూస్తూ కూర్చున్నాడు. వెంపర్తికి కాసేపు ఆ చూపు అర్థం కాలేదు.

కొంతసేపటికి ఆ చూపులో, "ఇంకేం పనిలేదు. వెళ్ళు" అనే మౌనసందేశం అంది కదిలాడు.

"ఇవాళ శనివారం కదా! మళ్ళీ శనివారం కనిపించు" అని సీతారామ్మూర్తి తన చూపుని అనువదించి చెప్పి, మత్తుగా కళ్ళు మూసుకున్నాడు.

"బయటేం కూర్చుంటారు? ఎండగా లేదూ? లోపలికి వచ్చెయ్యండి" అంటూ విశాలాక్షి కేక వెయ్యడంతో కుర్చీ మడిచి, దానితోసహా మధ్య హాల్లోకి వచ్చాడు.

"వెంపర్తిని పంపించేశారా?" అంది విశాలాక్షి.

"ఏం? ఇంకా ఏమైనా పని మిగిలిందా?" అన్నాడు. అక్కడ పడక్కుర్చీని సాగదీసి కూర్చుంటూ.

'అదే! కొబ్బరిమొక్క తెమ్మంటే సరిపోయేది




కదా."

"చోటేదీ?"

"ఏదో ఒక తీగో, పాదో పీకేస్తాను"

"సరే చెపుతానులే"

విశాలాక్షి వాచికంగా అప్పటికి ఊరుకున్నా, మానసికంగా దొడ్లో ఒక జాజిపందిరి పీకేసి కొబ్బరి చెట్టు నాటేసింది.

●●●

సూర్రావు ఎంతకాదన్నా, సీతారామ్మూర్తి ఎంత తాత్సారం చేసినా, నాయుడుగారి పంతమే నెగ్గింది. ఒకరోజున, కావలసిన పత్రాలన్నీ సమకూర్చుకుని నాయుడుగారు ఋణ నిమిత్తం బ్యాంకుకి వచ్చి, ఎదుట నక్షత్రకుడిలాగా కూర్చున్నాడు. సీతారామ్మూర్తికి కలగజేసుకోక తప్పలేదు. అవసరమైన ఏర్పాట్లన్నీ పూర్తిచేసి, వారం రోజులు తిరిగే సరికల్లా స్మాల్‌స్కేల్ ఇండస్ట్రీ కేటగిరీలో నాయుడుగారి కొబ్బరిపీచు పరిశ్రమకి ఋణం మంజూరు చేయించాడు. ఈ వైనం సూర్రావుకి ఫోనుద్వారా తెలియజేశాడు కూడా.

సరిగ్గా రెండు నెల్లు గడిచేసరికి, నాయుడుగారి కొబ్బరి తోటలో ఒకపక్కన యంత్రసామాగ్రి అమరింది. గుట్టలుగాపడిఉన్న కొబ్బరి డొక్కలకు చలనం వచ్చింది.

మరుసటి యేడాది ఉగాది రోజున సీతారామ్మూర్తి నిద్ర మంచం మీంచిలేచి, పెరటివాకిట్లోకి రాగానే, నవనవలాడే బాలకొబ్బరిమొక్క పాతేసి ఉంది. వెంపర్తి మొక్క మొదట్లోకి మట్టి తొక్కుతూ కనిపించాడు. విశాలాక్షి పెద్ద చెంబుతో మొక్కకి నీళ్ళు పోస్తోంది.

సీతారామ్మూర్తి ఎంత నిరోధించినా, మూడో కొబ్బరిచెట్టు రానే వచ్చింది. పోనీలే, మంచిదే అని సరిపెట్టుకున్నాడు.

ఆ ఏడాది వస్తూనే సీతారామ్మూర్తి ఇంట్లో చాలానే మార్పులు జరిగాయి. పెద్దకొడుకు ఇంజనీరింగ్ చదువై, పై చదువుకి అమెరికా వెళ్ళాడు. వాడికోసం ఎడ్యుకేషన్ లోన్‌పెట్టి పంపించక తప్పలేదు. రెండో కొడుకు ఎంసెట్ ర్యాంకు సాధించి, ఖరగ్‌పూర్‌లో బి.టెక్‌లో చేరాడు. మూడోవాడు వచ్చే ఏడాదికి 'నా మాటేం చెప్పావు?' అని కాలేజీకి తయారవుతాడు. సీతారామ్మూర్తికి చెప్పరాని డబ్బు తాకిడి వచ్చిపడింది. తమ ఊళ్ళో తండ్రి మిగిల్చిపోయిన పాత ఇంటికి విలువలేదు. స్థలానికే విలువ. అమ్మిపడేసి మూడోవాణ్ణి కూడా పైకిలేపాలి. ఇంత డబ్బుతాకిడి, వేడి, అతనికి ఎప్పుడూ తగలలేదు.

ఈ ఆరాటాలకి సాయం, సీతారామ్మూర్తికి కొలతగా మూడేళ్ళు పూర్తై బదిలీ వచ్చేసింది. ఈసారి సిటీకే, విశాఖపట్నం.

విశాలాక్షి, మూడో కొడుకు చదువుకి భంగం కలగకుండా ఉన్నచోటే ఉండడానికి నిశ్చయించింది.

సీతారామ్మూర్తి ఒక్కడే విశాఖపట్నం వెళ్ళిపోయాడు.

●●●

నాయుడుగారు కొబ్బరి వ్యాపారంలో వచ్చే నష్టాల్ని, కొబ్బరి పీచుతో సర్దుకుంటున్నారు.

వెంపర్తి వస్తూపోతూ విశాలాక్షి కొబ్బరిచెట్ల సంరక్షణ చేస్తూనే ఉన్నాడు.

విశాలాక్షి తన ఇద్దరు పెద్దపిల్లలూ, పెద్ద హోదాలకు ఎదుగుతారనే ధీమాతో, కట్నాల కలలు కంటోంది.

మూడోకొడుకు ముప్పూటలా చదువుతో వెక్కిసపడుతూ, ఇంటర్‌లో చేరడానికి ప్రసవవేదన పడుతున్నాడు.

ఈ కథంతా నడిచి, నిండా ఆరునెలలు గడిచాయో లేదో!

సీతారామ్మూర్తి అతికష్టంమీద నాలుగురోజులు సెలవు దొరకబుచ్చుకుని ఇంటికి వచ్చాడు.

1977 నాటినుంచీ కోస్తాతీరంలో తుపానులే తప్ప వర్షాకాల సమావేశాలు లేనేలేవు.

సూర్యుడు కనపడకుండా ఆకాశంలో మబ్బు మూసుకున్న రోజుని, 'దుర్దినం' అంటూంటారు.

సీతారామ్మూర్తి ఇంటికివచ్చిన రాత్రినుంచి భయంకరమైన గాలి, వాన ప్రారంభమయ్యాయి. విశాలాక్షికి ఆకాశంలో మామూలు మబ్బులు కమ్ముకుంటేనే చెప్పరాని భయం. తుపానంటే ఇంకేముంది? జ్వరంవచ్చి వణికిపోతుంది.

ఇందుక్కారణం ఉంది. పద్నాలుగేళ్ళ వయసులో తన స్నేహితురాలితో ఊరికి దూరంగా ఉన్న సినిమాకి వెళ్ళి, గుర్రబ్బండిలో తిరిగివస్తుంటే దారిలో పెద్దచెట్టు విరిగి బండిమీద పడి, స్నేహితురాలు చనిపోయింది. స్పృహ తప్పి కొమ్మలమధ్య పడి ఉన్న తను బతికింది.

విశాలాక్షి మూడోకొడుకుని గట్టిగా పట్టుకుని తమ గదిలో పడుకుని ఉంది. సీతారామ్మూర్తికి నిద్రలేదు. ఊళలు పెడుతున్న గాలిచప్పుడు, ఎక్కడ ఏం విరిగిపడుతున్నాయో, ఎగిరిపడుతున్నాయో... ఒకటే ధ్వనులు. వీటికి తోడు విశాలాక్షి ఆందోళనగా 'ఏవిటండీ ఆ చప్పుళ్ళు? అనీ, 'వాన తగ్గిందా?' అనీ.. మాటమాటకీ అరుస్తోంది.

ఒక్కసారిగా పెరట్లోంచి పెద్దచప్పుడు వినిపించింది. విశాలాక్షి గట్టిగా ఏడుపు ప్రారంభించింది. చీకటి బస్తాలో కుక్కేసి, ఎవరో కొట్టేసినట్టుగా ఉంది అందరికీ!

తెల్లవారింది. పక్కింట్లోంచి, ఎదురింట్లోంచి మనుషులు బలవంతంగా బైటకివచ్చి పాడైపోయిన, విరిగిపోయిన, నానిపోయిన, వస్తువుల్ని కూడదీసుకుంటున్నారు. వానపడుతూనే ఉంది. గాలితగ్గింది. పెరటి తలుపు తీస్తూనే విశాలాక్షి కెవ్వున కేకపెట్టింది. మూడో కొడుకూ, సీతారామ్మూర్తీ, ఒక్క ఉదుటనవచ్చి చూశారు.

నూతిమీదుగా ఒక కొబ్బరిచెట్టు వాలిపోయింది. ఒక కొబ్బరిచెట్టు పొగచూరినట్టు మాడిపోయింది.

మూడో కొబ్బరిచెట్టు మాత్రం పచ్చటి ఆకుల మీద నుంచి నీళ్ళుజారుస్తూ మెరుస్తూనే ఉంది.

కోనసీమ కొబ్బరి వైభవం కూలిపోయింది.

నాయుడుగారికి గొడుగుపట్టిన వెంపర్తి, తోట మొగదల నిలబడి మాటలేక చూస్తున్నాడు.

నాయుడుగారి కళ్ళలో నీళ్ళు!

యాభై చెట్లు ఎదిగిన తోట, నిలువునా మాడిపోయి ఉంది.

సీతారామ్మూర్తి పెరటివాకిట్లో మూడో కొబ్బరిచెట్టు, ఈజీవి చచ్చిపోదన్నట్టు పచ్చగా, నీళ్ళతడితో, ఊపిరి నిండుగా ఊగుతూనే ఉంది.

సెల్:98480 78079

# తులాభారం

– సరసి



**"ఎత్తెత్తి కాలేస్తే ఎంగిలాకులో పడిం దిట! అలాగయ్యింది ఆవిడ పరిస్థితి" అన్నాడు శవంలో బేతాళుడు. "ఎవరా విడ? ఏమా కథ? అని నువ్వు అడగ క్కర్లా.. నేనే చెప్తా" అన్నాడు మళ్ళీ తనే. "శ్రమ తెలియకుండా విను. పూర్వం... పూర్వం కాదులే ఈమధ్యే ఓ ఊళ్ళో కర్ణ భేరి, లావాదేవి అనే భార్యాభర్తలు న్నారు"**

'అవేం పేర్లూ?" అడిగాడు రాజు.

"కర్ణభేరిగారి అసలు పేరు శాతకర్ణి. స్కూల్లో చేర్పేటప్పుడు మేస్టారు ఏదో ధ్యాసలో ఉండి 'కర్ణ భేరి' అని రిజిస్టర్లో రాసేశాడు. దాంతో ఆ పేరే ఆయనకి ఖాయం అయిపోయింది. ఇక ఆమె విషయం. ఆమె తండ్రి ఓ వణిక్ ప్రముఖుడు. వ్యాపారంలో బాగా కలిసొచ్చాక లేక లేక కలిగిన తన బిడ్డకి అమ్మవారి పేరు కూడా కలపాలని 'లావాదేవి' అని పేరు పెట్టాడు. కథ రంజుగా సాగుతున్నప్పుడు మధ్యలో ఇలా ప్రశ్నలేస్తే నేను చెప్పను. మిడిల్ డ్రాపై పోతా. ఆపైన నీ ఇష్టం" అన్నాడు బేతాళుడు.

"ఓర్నీ అసహనం పాడుగానూ, ఇంక అడగన్లే, చెప్పు".

"వాళ్ళకి పిల్లల్లేరు. గుళ్ళూ గోపురాలకీ యధా శక్తి చందాలిచ్చే అలవాటుండేది లావాదేవికి. ఓరోజు కొందరు యువకులొచ్చి ఊరవతల కొండమీద 'అత్యానందస్వామి'కి ఆశ్రమం కడుతున్నామనీ, తోచిన చందా ఇవ్వమనీ అడిగారు. ఆలోచించి చెబుతా వెళ్ళమంది లావాదేవి.

ఆ రోజు దీపావళి. టీవీలో శ్రీకృష్ణుడి సిని మాలు వరసపెట్టి వేసేస్తున్నారు. శ్రీకృష్ణ తులాభారం సినిమాలో రుక్మిణి తన భక్తిని చాటుకున్న దృశ్యం చూసి లావాదేవి కళ్ళ నీళ్ళెట్టుకుంది. ఆ మాటకొస్తే తను కూడా అంతటి పతివ్రతే! తనకేం తక్కువ? అవకాశం వస్తే తను కూడా రుక్మిణిలా తన పాతివ్రత్యాన్ని నిరూపిం చుకోగలదు. అలా అనుకోగానే ఆమెకో ఐడియా వచ్చింది. తన భర్తని ధర్మకాంటాలో తూచి, అలా తూగిన ధనాన్ని ఆశ్రమానికి విరాళంగా ఇస్తే ఎలా ఉంటుంది? అత్యానందస్వామి కూడా ఆనం దిస్తారు అనుకుంది. వెంటనే 'అత్యానందం కాదు నీకది అంత్యానందం అవుతుంది. అంతడబ్బే? దిబ్బయిపోతావు' అంటూ అంతరాత్మ లోపల్నించి అరిచింది. మరైతే దేంతో పెట్టి తూద్దాం? ఏదో ఒకటి తూచాల్సిందే! బియ్యమా? పళ్ళూ కూర గాయలా? పప్పులూ ఉప్పులా? ఇల్లంతా కలయ చూసింది. ఎక్కడ చూసినా పాత న్యూస్‌పేపర్లు తప్ప ఇంకేం కనబళ్ళా. ఎస్! ఐడియా! పాత పేప ర్లతో తూద్దాం. ఎప్పట్నించో మంచిరేటు వస్తుం దని ఎదురుచూస్తూ గుట్టలు గుట్టలుగా పెట్టు క్కూర్చున్నాడు తన భర్త. వాటిని వాడేస్తే ఇల్లు కూడా ఖాళీ అవుతుంది. భలే ఐడియా! 'ఎంతైనా నువ్వు తెలివైనదానివే లావా!' అంతరాత్మ లోప ల్నించి అరిచింది. ఈ ఐడియాతో ఆమె జీవితం మారిపోలేదు గానీ, భర్త జీవితం మారిపోయింది.

ఆ రాత్రి ఊరంతా దీపావళి వెలుగులూ టపాసుల మోతలూ! బయట కోలాహలంగా

**దీపావళిరోజు టీవీలో కృష్ణుడి సినిమా చూస్తోంది లావాదేవి. తులసీదళంతో శ్రీకృష్ణుణ్ణి తులాభారం వేసి రుక్మిణి పాతివ్రత్యం నిరూపించుకున్న దృశ్యం చూసి స్ఫూర్తిపొందింది లావాదేవి. తనుకూడా అలాగే చెయ్యాలని సంకల్పించుకుంది. ఐతే దేంతో తులాభారం వెయ్యాలి? చాలాసేపు ఆలోచించి ఓ నిర్ణయానికొచ్చింది లావాదేవి. ఇక అప్పుడు మొదలయ్యాయి కర్ణభేరికి కష్టాలు! ఇంతకీ ఏమిటా కష్టాలు?**




## ఆమె లేనప్పుడు

ఆమె ఊరికెళ్ళక ముందు కూడా
ఇల్లుంది.
అయితే
ఇప్పుడు నాకు కనిపించే
ఇల్లు వేరు.

ఇంట్లో ఒక్కడినే
కదలాడుతున్నాను.
ఇంటి ముందు
విశాలమైన వాకిలి
కుక్కపిల్లలా
ముడుచుకొని పడుకుంది.
మేడమెట్లు
తీరిగ్గా మాట్లాడుకుంటున్నాయి.



బాల్కనీలోని మల్లెచెట్టుపై
మొగ్గలు గుప్పుమనేవి.
ఇప్పుడు విప్పుకోడానికి
మొరాయిస్తున్నాయి.
ఇన్నాళ్ళూ రెప్పలు
కళ్ళకు మూతల్లా పనిచేసేవి
ఇప్పుడవి నా చూపుల్ని
విస్ఫారితం చేస్తున్నాయి.

ఇవాళ ప్రతికుర్చీ
ఓ కళాఖండంలా
కనిపిస్తుంది.
కర్టెన్ కుచ్చిళ్ళు
అధ్యయనం చెయ్యాల్సిన
కావ్యఖండికల్లా ఉన్నాయి.
మా ఇంటినిండా
ఇంత కవిత్వముందని
ఇప్పుడే తెలిసింది.

ఎప్పుడో నిర్మించిన
గోడలపైన పటాలు
నలభై యేళ్ళ చరిత్రకు
అద్దం పడుతున్నాయి
ఫొటోలో ఆమె
ఇంతందంగా ఉందేమిటి!
వికసిస్తూ వికసిస్తూ
ఆగిపోయిన పుష్పంలా ఉంది.

ఇప్పుడామెది
మరింత పెరిగిన సంధ్యా సౌందర్యం
మా మధ్యన సంభాషణల్లో
గతం పాలు ఎక్కువైంది
భవిష్యత్తులోకి వెళ్ళాలని కోరిక
కానీ ఆ భవిష్యత్తు
ఇంద్ర ధనుస్సుందరంగా
కలిసిపోయిన రంగుల్తో మెరుస్తుంది.

ఆమె
ఊరికి వెళ్ళక ముందు కూడా
నేనున్నాను
కాని ఇప్పుడు నాకు నేను
పూర్తిగా కనిపిస్తున్నాను.

**-డా. ఎన్.గోపి**
**సెల్: 91-93910 28496**

ఉంది. అవేమీ లావాదేవి మీద ప్రభావం చూపించ లేదు. ఎప్పుడు తెల్లారుతుందా, ఎప్పుడు తన ఐడియాని పక్కింటి కల్మషగారికి చెబుదామా అని ఆలోచిస్తూ ఆ రాత్రి నిద్రే పోలేదు. తెల్లవారగానే గోడమీంచి గట్టిగా పిలిచేసరికి కల్మషగారు హడావుడిగా బైటికొచ్చింది. గడగడా తులాభార వృత్తాంతాన్ని అంతా చెప్పి భారం దించుకుంది లావాదేవి.

కల్మషగారు 'సెభాష్' అని మెచ్చుకుంటుందనుకుంది గాని అలాంటిదేం జరగలేదు.

"పాత పేపర్లతో తూస్తానని ఫిక్సయిపోయారా!" అంది మెడ పక్కకి తిప్పి.

"ఫిక్సయిపోవడమే కాదు మొక్కేసుకున్నా కూడా" అంది లావాదేవి పైకి చూస్తూ దణ్ణం పెట్టుకుని.

"సరే మీ ఇష్టం. అయితే ఓ డౌటు. ఆశ్రమం వాళ్ళు పేపర్లేం చేసుకుంటారు?"

"అదేంటండీ? ఆశ్రమం అన్నాక భక్తులు రారా? వాళ్ళకి తీర్థ ప్రసాదాలు పెట్టరా? వాళ్ళకి కాయితాలు అవసరం కావా? పైగా గచ్చు కడిగినప్పుడో, చంటిపిల్లలు నేల పాడుచేసి నప్పుడో పాత గుడ్డలు గానీ, పాత కాయితాలు కానీ అవసరపడవూ మరీ?"

"అలాంటప్పుడు పాతగుడ్డలే తూస్తే సరి! మొన్న హుద్‌హుద్ తుఫాను వచ్చినప్పుడు పంపిద్దామని మీరు నాలుగైదు మూటలు కట్టి, తీరా వాళ్ళు ఇంత ఛండాలంవి తీసుకోం అన్నారని బీరువా మీద పెట్టారు కదా! వాటితో తూచి ఇచ్చెయ్యొచ్చు కదా! అదీగాక పాతపేపర్లు ఎంత రేటు ఉన్నాయో తెలుసా? తెలిస్తే మీరు తూచరు. పైపెచ్చు అన్నయ్యగారు ఎలా లేదన్నా రెండొందల కేజీలుంటారు. ఆ లెక్కన చూస్తే.."

"చాల్లే వొదినా! అంత లేరు. మహాఅయితే వందోపాతికో ఉంటారు" ప్రకాశంగా అని, 'దీని దిష్టి తగలెయ్యా' అని మనసులో తిట్టుకుంది లావాదేవి.

"సరే మీ ఇష్టం. భక్తి ప్రధానం. పాత పేపర్లు అయితేనేం, పాత గుడ్డలైతేనేం?"

అటూఇటూ కాకుండా అనేసి "వస్తానొదినా.. కాఫీ అడుగంటిపోయిందో ఏమో" అంటూ హడావుడిగా ఇంట్లోకెళ్ళిపోయింది కల్మషగారు.

'తన ఐడియాని మెచ్చుకోకపోగా సందేహాలు దూర్చి బుర్ర పాడుచేసింది మహాతల్లి. పేరు సార్థకం చేసుకుంది' అనుకుని ఖిన్నురాలైంది లావాదేవి. తర్వాత నీరసంగా ఇంట్లోకి వెళ్ళి హాల్లో నేలమీద కూర్చుని పేపరు చదువుకుంటున్న భర్తని చూసి, కల్మషగారన్నట్టు ఈయన నిజంగా రెండొందల కేజీలుంటాడేమో! ఉంటే ఎన్ని రూపాయలు లాసో? ప్చ్! అనుకుని మళ్ళీ వెంటనే 'అయినా పాతివ్రత్యం పద్దు కింద ఎంత ఖర్చయినా వెనుకాడేది లేదని' నిర్ణయించుకుంది.

తనకేసలహా కావాలన్నా కల్మషగారే దిక్కు! ఆవిణ్ణి కాదనుకుంటే ఎలా? అనుకుని మధ్యాన్నం టీకి పిలిచిందావిణ్ణి. "పోనీ ఓ పని చేద్దాం. ఎలాగూ పేపర్లతో తూస్తానని మొక్కుకున్నారు కదా! ఓ నెల్లాళ్ళు ఆగండి. ఈలోగా 'అన్నయ్యగారి చేత ఓ పూట అన్నం మానిపించండి. కాఫీ, టిఫిన్లు బంద్ చెయ్యండి. కాస్త శ్రద్ధగా కృషి చేశారంటే ఎలా లేదన్నా ఓ అరవై డెబ్భయ్ కిలోలు



తగ్గుతారు. దాంతో మీకు ఆదాకి ఆదా, అటు అన్నయ్య గారి ఆరోగ్యానికి ఆరోగ్యం! డబుల్ ధమాకా ఫెస్టివల్ ఆఫర్!" అంది కల్మషగారు మేధావిలాగా ఫోజుపెట్టి.

"అద్భుతం! ఎలాగన్నా మీరు గ్రేటు కల్మష గారూ" అంటూ లావాదేవి కల్మషగారి చేతుల్ని తీసుకుని తిరగేసి అరచేతుల్లో చెమ్మచెక్కలా కొట్టి అభినందించింది. "మీ ఐడియాతో మా జీవితాలే మారిపోతాయి" అని కూడా అంది ఆనందంగా.

ఆ రోజు నించి కర్ణభేరిగారి ఖర్మ కాలింది. చిన్నప్పట్నించీ ఆయనకి మూడు పూటలా పూటుగా అన్నం తినే అలవాటు. అది కాస్తా ఇప్పుడు ఒక పూటకి సవరించబడింది. మిగిలిన రెండు పూటలూ, ఒక ఉడికించిన కూర ముక్క, అది చాలదంటే రెండు చెంచాల ఉప్మాగానీ, గుప్పెడు మజ్జిగలో నానబెట్టిన అటుకులు కానీ.

"నాకు స్నూను మీలూ, నీకు ఫుల్ మీల్సూనా? పాపం చుట్టుకుంటుందే నీకూ?" అంటూ ఆక్రోశించాడు కర్ణభేరిగారు.

"పుడ్డు మానిపించమని డాక్టరు గారెప్పుడో చెప్పారు. నేనే పోనీలే పాపమని ఇంతకాలం పెట్టాను. ఇప్పుడు దేవుడు కల్మషగారి రూపంలో వచ్చి సలహా చెప్పాడు. మీరు ఆరోగ్యంగా ఉంటేనే కదా నేనైనా, నా పసుపుకుంకుమలైనా" అంటూ మంగళసూత్రంతీసి కళ్ళకద్దుకుని ముక్కు చీదింది లావాదేవి".

'ఎప్పుడైనా కల్మష ఒంటరిగా సంచి పుచ్చు కుని రోడ్డుమీద కనిపించక పోతుందా? వెనక నించి నేను స్కూటరు మీద రాకపోతానా? అప్పుడు చెప్తా" అనుకున్నాడు కర్ణభేరి గారు కసిగా.

పదిరోజులు గడిచేసరికి కర్ణభేరిగారిలో గణనీయమైన మార్పు గోచరించింది. కళ్ళు గుంటలు పడ్డాయి. పొట్ట మీది ఎముకలు 'తర్టీ సిక్సు ప్యాక్' లాగా బైటికి కనిపించసాగాయి. కాళ్ళూ చేతులూ పొట్లకాయల్ని తలపిస్తున్నాయి.

ఓరోజు సాయంత్రం లావాదేవి కల్మషగారితో కలిసి షాపింగ్ కెళ్ళింది. ఏదైనా తినడానికి దొరుకుతుందేమోనని వంటింట్లోకి వెళ్ళాడు కర్ణభేరిగారు. అన్ని అలమరాలూ తాళాలు వేసున్నాయి. పిచ్చికోపం వచ్చింది. పెళ్ళాం మీద ఎలా ప్రతీకారం తీర్చుకోవాలో పాలుపోవడం లేదాయనకి. ఇంతలో 'పాత పేపర్లు కొంటాం' అంటూ కేక వినిపించింది వీధిలోంచి. ఐడియా! ఇంట్లో పేపర్లన్నీ అమ్మిపడేస్తే ఇంక తులాభారం ఏవిటీ నా తలకాయ్! ఆమెకి వ్రతభంగం అయిపోతే తనకి ఈ నిరాహారదీక్ష తప్పిపోతుంది అనుకుని బైటికెళ్ళి వాణ్ణి పిలిచి, ఒక్కటి కూడా మిగలకుండా పేపర్లన్నింటినీ అమ్మిపారేశాడు కర్ణభేరి.

లావాదేవి బజార్నించి వస్తూనే బేజారెత్తిపోయింది. ఖాళీ ఇల్లు చూసి, 'నా పాతివ్రత్యానికి భంగం కలిగిస్తే దేవుణ్ణి కూడా టాలరేట్ చెయ్యను. మీరెంత?" అంటూ బలంగా వీపు మీద ఒక్క గుద్దు గుద్దింది. కర్ణభేరికి కర్ణభేరి పగిలినంత పనైంది. వెంటనే 'ఆ... నా భార్యే కదా! బైటివాళ్ళు కాదు కదా!' అనుకుని సర్దుకుపోయాడు. గతంలో కూడా ఆలా సర్దుకుపోయిన సందర్భాలున్నా యాయనకి.

జరిగింది తెలుసుకుని కల్మషగారు అవాక్కయింది. 'ఏం ఫరవాలేదు. ఎత్తుకు పైఎత్తు మనమూ వెయ్యగలం. మా ఇంట్లో పాత పేపర్లుఉన్నాయి. అప్పుగా ఇస్తా తీసుకోండి. తర్వాత తీర్చేద్దురుగాని" అంది.

"మీ పేపర్లతో నా భర్తనెలా తూస్తా? శాస్త్రం ఒప్పుకోదు! నాకింకో ఐడియా వచ్చింది. ఈ వ్రతం ఫలానా కార్తీక మాసంలోనే చెయ్యాలని రూలేం లేదు. కాబట్టి ఆయనెత్తు పేపర్లు జమయ్యేదాకా

ఆగుతా. ఎన్నిరోజులైనా కానివ్వండి. అప్పుడే తూస్తా!" అంది లావాదేవి పైట చెంగు బిగించి నడుంలోకి దోపి.

'అంతదాకా అన్నయ్య గారుండొద్దా' అని అనీ అననట్టు అంది కల్మషగారు. ఆవిడ అనుకున్నట్టే అయ్యింది. ఓరోజు కళ్ళు తిరిగి పడిపోయాడు కర్ణభేరిగారు.

లావా కంగారుపడిపోయి ఆయన్ని లేవదీసి మంచం మీద పడుకోబెట్టింది. మరుక్షణం ఆశ్చర్యంతో నోరెళ్ళ బెట్టింది. ఇంత తేలిగ్గా ఈయన్నెలా లేపగలిగానబ్బా? అంత మనిషీ ఇంతగా తగ్గిపోయాడా?! కళ్ళల్లో ఆనందపు ఛాయలు పొడసూపాయామెకి.

మొహం మీద నీళ్ళు జల్లేసరికి కళ్ళు తెరిచాడు కర్ణభేరిగారు. పిలిస్తే పలకలేదు. గిల్లినా కదల్లేదు. కేవలం పిచ్చిచూపులే మిగిలాయి. అవే కడసారి చూపులేమోనని భయపడిపోయి, కల్మష గారిని వెంటబెట్టుకుని ఆటోలో ఓ మల్టీస్పెషాలిటీ హాస్పిటల్‌కి తీసుకుపోయింది లావాదేవి.

ఆమెని బైట కూర్చోబెట్టి కల్మష లోపలికెళ్ళి డాక్టరుతో మాట్లాడి వచ్చింది. వస్తూనే "మీ సమస్య తీరిపోయిందండీ!" అంది లావాదేవితో.

"అంటే? ఆయన గానీ.. యావండీ!" గట్టిగా అరిచింది లావాదేవి.

"ఛీ! అదేం లేదు ఊరుకోండి. చక్కగా ఉన్నారన్నయ్య గారు!" అంది కల్మష.

అంతవరకూ కథ చెప్పి టీ బ్రేక్ ఇచ్చాడు బేతాళుడు. "సావధానంగా విన్నావుకదా! కల్మష గారు డాక్టరు దగ్గర్నించి వస్తూనే సమస్య తీరిపోయిందని అంది. ఏవిటా సమస్య?

ఎలాతీరింది? డాక్టరు ఏం చెప్పాడు? సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నాసావిరంగా నీ తలకాయ్.." వాక్యం పూర్తి చెయ్యలేదు బేతాళుడు.

"చాల్చాలు.. తెలిసికూడా చెప్పక పోవడానికి నాకేవన్నా చిత్తచాంచల్యమా? తెలియదు! నువ్వే చెప్పు" అన్నాడు రాజు.

"సరే అయితే చెబుతా. అదేదో కల్మషగారి మాటల్లోనే విను.

'కల్మష ఉవాచ: లావాగారూ, అన్నయగారిని తూచడానికి సరిపడా కాగితాలు లేవనే కదా ఇంతవరకూ మీ బాధ? ఆ బాధ తీరిపోయిందిప్పుడు. డాక్టరుగారు ఇవిగో ఈ టెస్టులు రాశారు. ఇవన్నీ చేయించాక ఆ రిపోర్టు కాయితాలతో అన్నయ్య గారిని మూడుసార్లు తూచొచ్చు. అన్ని కాయితాలొస్తాయి! ఇంకా మిగులుతాయేమో కూడా. చూడండి. ఆ టెస్టుల లిస్టు చదువుతా" అంటూ కల్మష సీసాలో నీళ్ళు తాగి గొంతు సవరించుకుని చెప్పడం ప్రారంభించింది.

"బీపీ, షుగరూ, కొలెస్ట్రాలు, 'ఎ' నుంచి 'జడ్' వరకు బ్లడ్ గ్రూపు టెస్టులు, 'ఎ' నుంచి 'జడ్' వరకూ విటమిన్ టెస్టులు, హెపటైటిస్-ఎ, హెపటైటిస్-బి నుంచి 'జడ్' వరకూ పరీక్షలు, మెదడు, కాలేయం, మూత్రం, స్టూలు, బల్ల, మూత్రాశయ పరీక్షలు, సిటీ స్కానింగు, టౌన్ స్కానింగు, ఎమ్మారై, ఎమ్మార్వో, శల్యపరీక్ష, శీలపరీక్ష, లిట్మస్ పరీక్ష, వ్యక్తిత్వవికాస పరీక్ష, నిజనిర్ధారణ పరీక్ష, అణుపరీక్ష...."

"ఇక చెప్పకండి కల్మషగారూ... చెప్పకండి! డబ్బులు పోతే పోయాయి గానీ దేవుడీ విధంగా మేలుచేసి, మనకి కాయితాల కొరత తీర్చాడు. నాకు వ్రతభంగం కాకుండా కాపాడాడు!" అంటూ కల్మషగారి చెయ్యి అందుకుని తిరగేసి చెమ్మచెక్క కొట్టింది లావాదేవి ఆనందంగా.

సెల్:94405 42950



# భజంత్రీలు

డాక్టర్ నక్కా విజయరామరాజు

**మసీదులో అజా వినబడకముందే ఆ చుట్టుపక్కల ఇళ్ళల్లోనివారిని నిద్రలేపుతుంది రాజయ్య సన్నాయి. సూర్యుడు రుతువులను బట్టి కొంచెం ఎనకాముందుగా ఉదయిస్తాడేమో గానీ రాజయ్య సన్నాయిమాత్రం ఏ కాలంలోనైనా ఠంచన్‌గా తెల్లవారుజామున మోగా ల్సిందే!**

**రాత్రంతా నిద్రపట్టక తెల్లవారుజామున కునుకుతీసే ముసలీముతకలకు అదో తలనొప్పి వ్యవహారం. వేకువనే పనీ పాట్లుకెళ్ళేవాళ్ళకి, బడికెళ్ళి చదువుకునే బుడ్డోళ్ళకి మాత్రం రాజయ్య సన్నాయే అలారం గడియారం.**

"మసీదులో సాయిబు కూతెయ్యకముందే లేసి మా నిద్దర్లెందుకు పాడు సేత్తావురా రాజయ్యా?" అని రాజయ్య ఈడువాళ్ళు నిష్ఠూరాలాడేవాళ్ళు.

"నేను సన్నాయి వాయిస్తేగానీ మసీదులో అల్లాగానీ, గుళ్లో రాములోరు గానీ నిద్దరలేవర్రా" అనేవాడు రాజయ్య ముసిముసిగా నవ్వుతూ.

"ఈ వయసులో ఎందుకయ్యా అంతయాష్ట? చదివి బడిపిల్లల్లా పరీచ్చలు రాయాల్నా? పనిపాట కెల్లి గాదెలు నింపాల్నా" అనేది రాజయ్య భార్య సత్తెమ్మ.

"ఇది సాధనచెయ్యందే సాధ్యపడే విద్యకాదే పిచ్చిమొగమా! ఒకరోజుగానీ సాధన చెయ్యక పోతే నా సంగీతంలో తప్పులు నాకే తెల్సిపోతాయి. రెండ్రోజులు చెయ్యకపోతే పక్కవాద్యగాళ్ళు పసిగట్టేస్తారు. ఇంకా మూడోరోజుగానీ సాధన చెయ్యకుండా కచేరీలో కూర్చున్నామా, జనం ఇట్టే పట్టేస్తారే!" అనేవాడు రాజయ్య నవ్వుతూ.

పోయిన కృష్ణా పుష్కరాల్లో ఊపిరి సలపనన్ని ప్రోగ్రాములు చేశాడు. బందరునుంచి బెజవాడదాకా నిండా ప్రోగ్రాములే. ఆ తర్వాత ఖాళీ. ఈ ఏడాదే మళ్ళీ కృష్ణమ్మకి పుష్కరాలంటున్నారు. ఈ పుష్కరకాలంలో పెద్దప్రోగ్రాములేవీ తగల్లా. అయినాసరే ఏ రోజూ సంగీత సాధన ఆపింది లేదు. ఈ మధ్యకాలంలో భజంత్రీలకు జనాదరణ బాగా తగ్గింది. మళ్ళీ పాతవైభోగం వస్తుందనీ, తను పోయేలోగా ఈ విద్య ఎవరికన్నా నేర్పాలనేదే రాజయ్య ఆశ!

●●●

పెళ్ళి మండపం రంగురంగుల కరెంటు బల్బులతో దేదీప్యమానంగా వెలిగిపోతోంది. అందమైన అమ్మాయిలు పట్టులంగా ఓణీలు కట్టుకుని, బంగారు వడ్డాణాలు పెట్టుకుని పెళ్ళి మండపంలో సందడి చేస్తున్నారు. ఒంటినిండా బంగారు, డైమండ్ నగలు ధరించి ఖరీదైన పట్టు చీరలు కట్టుకున్న స్త్రీలు తమ వైభవం చూడండంటూ ధగధగ మెరిసిపోతున్నారు. సూట్లు, బూట్లు వేసుకున్న దర్జా బాబులు ధీమాగావచ్చి ముందువరసలో ఖరీదైన సోఫాల్లో కూర్చుంటున్నారు. కుర్రకారంతా ఉత్తరదేశపు వస్త్రధారణతో అటూఇటూ తిరుగుతూ హడావిడి చేస్తున్నారు.

రాజయ్య పెళ్ళిమంటపంలోకొచ్చాడు. కోరా పంచె, ఖద్దరు లాల్చీ కట్టుకున్న పెద్దమనుషులెవరన్నా కనబడతారేమో అని అతని కళ్ళు మండపమంతా వెదుకుతున్నాయి.

కల్యాణమంటపానికి ఒకచివర స్టేజీ కట్టి వుంది. పూలతో అందంగా అలంకరించారు. దాని మీద పెళ్ళితంతు జరుగుతోంది. అక్కడ జరిగే కార్యక్రమం కనబడకుండా అడ్డంగా గోడలా నిలబడ్డారు ఫొటోగ్రాఫర్లు, వీడియోవాళ్ళు. పెళ్ళి తంతు జరిపించే పంతులు గొంతుచించుకుంటూ మైకులో మంత్రాలు చదువుతున్నాడు. వాటిని ఆలకించే నాథుడేలేడు.

తిరణాల్లో తప్పిపోయిన పిల్లాడిలా హాలంతా

కవిత

## నువ్వా...
## నీ చిటికెన వేలూ....

అంచనాలకు అందని తుది మొదలు లేనప్పటి నుంచి...
నామ రూపాలకీ, అలాంటివెన్నో ఉండీ లేనితనానికీ..
అందనంతగా, పొందనంతగా..
ఉన్నంతలో లేనట్టూ... లేనంతలో ఉన్నట్టూ...
నువ్వున్నావు!
అనంతవిశ్వాన్ని కదిలిస్తూ, కదలికలు నేర్పిస్తూ,
కొలతలకీ, లెక్కలకీ లొంగని నీ చిటికెన వేలి కొసవుంది.
ఆకాశానికి చుక్కల్లాగా... అరల్లోని తేనెటీగల్లాగా...
రాత్రికి రాత్రి చెట్టును వాటేసుకున్న పున్నాగ పువ్వు ల్లాగా
నీ చిటికెన వేలి కొసను పట్టుకుని వేలాడుతూ
కదిలేవీ, కదలనివీ అన్నీ ఉన్నట్లు నేనూ ఉన్నాను!
రూపాల్ని సంతరించుకోడానికి సిద్ధమైన మట్టిముద్దలు
గిర్రుమని తిరుగుతున్న సారెకు అంటుకుపోయినట్లు
అందరితోపాటు, అన్నిటితోపాటు నీ చిటికెన
వేలును అంటిపెట్టుకుని



నేననేది తెలీనితనంలో నీతోనే, నీలోనే
నీకూ, నాకూ తేడా లేకుండా, తెలీకుండా తిరిగాను-
ఆ తర్వాత ఎక్కడ జరిగిందో, ఎలా జరిగిందో గానీ...
విచ్చుకున్న పూలూ, ఆరమగ్గిన పండ్లూ
స్వతంత్రాన్ని తెచ్చుకుని, చెట్టుబంధాన్ని తెంచుకున్నట్లు
మతిని సంతరించుకుని... మనసును సృష్టించుకుని
రంగుల వలల సంతలో నీ వేలికొసను విడిపించుకున్నాను.
అనంత జన్మలు అసంఖ్యాక ఆవృతాలై గడిచిన వేళ.
నా హృదయాన్ని ఎవరో మీటినట్లనిపించింది!
లోపలకు తొంగి చూస్తే కాంతి రహిత కాంతి
అనుభూతికి తప్ప దృష్టికీ స్పర్శకూ అందని నీ చిటికెన వేలు!
అంతే! నా హృదయం కెరటమై లేచింది
నీ చిటికెన వేలును దొరక పుచ్చుకుంది!
అనంత యుగాల అలసత్వాన్ని విడిపించుకుని...
ధ్యానవలయంలో బందీగా మారి..
అంతర్జలపాతమై లోలోపల.... నీ వైపుల దూకుతూనే ఉంది.

-ఓలేటి శ్రీనివాసభాను
సెల్: 94405 67151

తిరిగాడు రాజయ్య. పలకరించిన మనిషిలేడు. తెల్సినముఖం లేదు. కూర్చుందామంటే ఖాళీ కుర్చీలు లేవు. హాలంతా జనంతో కిక్కిరిసిపోయింది. జీలకర్ర బెల్లం కార్యక్రమం జరుగుతుండగా 'భజంత్రీలు! భజంత్రీలు' అంటూ మైకులో పెద్దగా కేకేశాడు పంతులు. ఆ మాటకోసమే ఎదురు చూస్తున్నట్టు "శ్రీ సీతారాముల కల్యాణం చూతము రారండీ" అంటూ కీర్తన అందుకున్నాడు సన్నాయి వాద్యకారుడు. డోలు సహకరిస్తోంది. హార్మోనియం వాయించే కుర్రోడు దిక్కులు చూస్తూ ఎడంచేత్తో హార్మోనియం రెక్క లాగుతున్నాడు.

వధూవరులపై అక్షతలు జల్లుతున్నారు. ఎవరో రాజయ్య చేతిలో అక్షతలుపెట్టారు. ఉన్నచోటు నుంచే వాటిని వధూవరులపైజల్లి రెండుచేతుల్తో మనస్ఫూర్తిగా ఆశీర్వదించాడు.

పెళ్ళికూతురు తండ్రి అమెరికాలో పెద్ద డాక్టరు. అందుకే అంత ఘనమైన ఏర్పాట్లు.. అంత ఆర్భాటం.

పుట్టిబుద్దెరిగినాక ఎన్నో పెళ్ళిళ్ళు చూశాడు రాజయ్య. అవన్నీ దీనిముందు దిగదుడుపే అన్నట్టున్నాయి ఏర్పాట్లు. ఇతనికిక్కడేంపనన్నట్టు చాలామంది తనను చూడ్డం గమనించాడు. అనవసరంగా వచ్చానా? పిలవని పేరంటానికెళ్ళడం అంటే ఇదేనేమో! కనీసం ఒక్కరూ పలకరించలేదు. తను ససేమిరా వెళ్ళనంటే వెళ్ళనన్నాడు. ఇంటిదే బలవంతం చేసింది. మనవరాలిపెళ్ళికి వెళ్ళకపోతే ఎట్టా? అంది. అబ్బాయి పెళ్ళిపనుల్లో పడి మర్చిపోయి ఉంటాడులే, శుభలేఖ పోస్టులో వేస్తే అందలేదేమో! అంది. ఎంత మనవరాలైనా... రక్తసంబంధమైనా... మర్యాద మర్యాదేగా! అసలు ఈ పెళ్ళికి రాకూడదనే అనుకున్నాడు. ఎట్టా వత్తాడు? అహ౦ ఎట్టావత్తాడు తను? వడ్డీలకు తిప్పే వేలుముడి ఈరాసామి దగ్గర్నుంచి కుంటెంకయ్య దాకా ఊళ్ళో పనికిమాలినోళ్ళనందర్నీ పేరు పేరున పిలిచాడంట పెళ్ళికి రమ్మని!

కనిపెంచిన తల్లిదండ్రులుమాత్రం ఆ అమెరికా డాక్టర్‌గారి కంటికానలేదంట! ఎంత సంపాదిత్తే మాత్రం రక్తసంబంధం ఎట్టా మరుస్తారంట!

ఎల్దామా వద్దా? అని చానారోజులు ఊగిసలాడాడు. ఆత్మాభిమానం వెనక్కిలాగినా పేగుబంధం మాత్రం వెళ్ళమని పోరింది. చివరాఖరికి రక్తసంబంధమే గెలిచింది. పెళ్ళికి వెల్తాలేవే అంటే ఇంటిది ఎగిరిగంతేసినంత పన్జేసింది. 'ఎటూ పెళ్ళికెల్తన్నావుగా ఆ సన్నాయికర్ర కూడా తీసుకుపోరాదూ.. వీలైతే నాలుగైదు కీర్తనలు వాయించు. ముక్కుమొఖం తెలీనోళ్ళకెంతమంది పెళ్ళిళ్ళలో వాయించలా!" అంది. "పెళ్ళికి పోతా పిల్లిని సంకనేసుకెల్లినట్టు ఇదెందుకే" అంటే ఇంతలావు కోపం వచ్చింది. దానికేం తెల్సు. పిచ్చిమొఖంది. ఈ సన్నాయితోనేగా వచ్చిన గొడవంతా! ఇదుంటే మన కులం తెల్సిపోద్దంట! అయినా మా శివుడికి బుద్ధిలేదులే! ఎర్రగాబుర్రగా ఉందని, మన కులంలో డాక్టరుకోర్సు చదివిన పిల్లేలేదని ఎనకా ముందూ చూసుకోకుండా పెద్దింటి అమ్మాయిని ప్రేమించి పెళ్ళి చేసుకున్నాడు. 'మీ వాళ్ళతో ఏ సంబంధం లేకుంటేనే పెళ్ళి' అనంటే డూ...డూ బసవన్నలా తలూపాడు. ఇప్పుడనుకుని ఏంలాభం? మనబ్బాయి మంచోడే! మనకులమే మంచిది కాదంట! మాతో మాటవరసకన్నా చెప్పలేదు. పెళ్ళికాగానే అమెరికా ఎగరేసుకుపోయారు. ఆరోజునుంచి మాటాలేదు, మంతీలేదు. ఉత్తరం లేదు, పత్తరంలేదు. అక్కడే ఇద్దరు పిల్లలు పుట్టారంట! పెద్దది అమ్మాయి. రెండోవాడు అబ్బాయి. వాడు చెప్పకపోయినా, వాడితోపాటు చదివిన కరణంగారబ్బాయి ఆడి సంగతులన్నీ పూసగుచ్చినట్టు చెబుతాడు. ఇంతకాలం ఆడిగురించి, ఆడి పిల్లల గురించి వినడమేగానీ కంటితో చూసిందిలేదు.

రెండు మూడేళ్లకొకపాలి అత్తగారింటికొచ్చి పోతావుండేవాడు. కబురుతెల్సి ఎల్దామని రొద చేసేది ఇంటిది. 'వద్దు పొమ్మన్నోళ్ళింటికి పిలవాపెట్టకుండా వెళ్ళడం ఏంమర్యాద?' అని కసిరేవోణ్ణి. ఎంతన్నా తల్లికదా! ఈ పెళ్ళికి తను కూడా వత్తానని వారంరోజుల సంది తెగ ఇదైపోయింది. తీరా బయల్దేరేటయానికి జ్వరంవచ్చి మంచంలో మూలుగుతోంది.

ఆలోచనల్లో మునిగిన రాజయ్య కళ్ళు కొడుకన్నా కనబడక పోతాడా అనే ఆశతో వెదుకుతున్నాయి.

అందమైన అమ్మాయిలు ట్రేల్లో రంగురంగుల కూల్‌డ్రింక్స్ అమర్చుకుని జనానికిస్తున్నారు. దాహంగా ఉంది. నీరసంగా ఉంది. గొంతు తడారిపోయింది. కాళ్ళు పీకుతున్నాయి. భజంత్రీలదగ్గర ఖాళీకుర్చీలు కన్పించినయి. పోయి కూర్చున్నాడు. అటుగావచ్చిన అమ్మాయిలు కూల్‌డ్రింకు ఇస్తారేమోనని చూశాడుగానీ ఇవ్వలేదు. తనను అడగలేదు. మొహమాటపడుతూ ఒకగ్లాసు తీసుకుని గటగట తాగేశాడు. ప్రాణం కొంచెం తేలికపడింది. దాహం తీరలేదు. ఇంకోటి అడుగుదామంటే వెళ్ళిపోయారు.

**అతడో గొప్ప సన్నాయివాద్య నిపుణుడు. సాక్షాత్తూ ముఖ్యమంత్రి సత్కారాలు అందుకున్న ఘనుడు! కానీ అదంతా గతం. ఇప్పుడు అతనో పల్లెటూళ్ళో కాలక్షేపం చేస్తున్నాడు. ఓ శుభోదయాన కారులో వచ్చిన యువకుడొకడు అతడింటిముందు దిగాడు. అతడికాళ్ళపైపడి విద్య నేర్పమని అడిగాడు. అందుకోసమే పనిగట్టుకుని అమెరికానుండి వచ్చానన్నాడు. ఆశ్చర్యపోయాడతను. ఇంతకీ అతనెవరు? ఏ బంధం అతన్ని ఇంతదూరం లాక్కొచ్చింది?**

ఇంతమందిలో తెల్సినముఖం ఒక్కటీ కనబడలేదు. అంతా కోడలి తాలూకు జనంలా ఉన్నారు. అబ్బాయికి బంధువులే లేరా?! అంతా

ఖరీదైన మనుషులే! అందరికళ్ళూ తన మీదే! పంటపొలంలో దిష్టిబొమ్మను చూసినట్టు అంతా తననే చూస్తున్నట్టుంది.

'శ్రీ సీతారాముల కల్యాణం చూతము రారండీ' పాటనే మళ్లీమళ్లీ వాయిస్తున్నారు. ఈ పాటకు వరసకట్టిన గాలి పెంచలగానీ వింటే ఆత్మహత్య చేసుకునేలా ఉందది. ఒక శృతిలేదు, లయలేదు, తాళంలేదు.

ఆసక్తిని గమనించిన డోలు వాయిద్యకారుడు పలకరింపుగా నవ్వాడు. ఆ పక్కన దీక్షగా సన్నాయి వాయించే మనిషి నోటినుంచి అదేపనిగా సొంగ కారుతోంది. శృతి, లయలేని వీరి వాయిద్యాలు వింటే చిరాకొచ్చింది. సోగ్గా నాజూగ్గా పొడుగుచేతుల చొక్కాని పేంటులోదోపిన కుర్రాడు హార్మోనియం రెక్క ఎడంచేత్తో లాగుతూ అమ్మాయిలవంక చూస్తున్నాడు.

రాజయ్యకు వారి వాలకం అర్థమైపోయింది. అన్నం ఉడికిందోలేదో చూడ్డానికి ఒక్కమెతుకు చాలదూ! చిరాగ్గా పక్కకితిరిగి "చేటపెయ్యిలాంటోల్లను తెచ్చారే!" అన్నాడు జనాంతికంగా. అప్పటి వరకూ భజంత్రీలనే గమనిస్తున్నాడింకో పెద్దమనిషి. "మా బాగా సెలవిచ్చారు! సన్నమో ముతకో సంతలో తేలిపోద్ది" అంటూ రాజయ్యవంక చూశాడు. అతనిముఖం ఆనందంతో వెలిగిపోయింది. గబుక్కున లేసొచ్చి రాజయ్యను వాటేసుకున్నాడు.




"ఎన్నాళ్ళకు తమదర్శనం కలిగింది బావా!" అన్నాడు. ఆ ఆత్మీయస్పర్శకు పొంగిపోయాడు రాజయ్య. ఒకళ్ళనొకళ్ళు తేరిపార చూసుకున్నారు. మంటపంలో అడుగుపెట్టిన దగ్గర్నుంచి తనను పలకరించిన దిక్కేలేదు. రాజయ్య మొఖం వెయ్యి వోల్టుల కరెంటుబల్బు అయ్యింది. ఎండాకాలం ఎడారిలో దారితప్పి తిరుగుతున్న బాటసారికి మంచినీటి చెలమ దొరికినట్టైంది.

"నువ్వెప్పుడొచ్చావ్ బావా....! అక్కాయ్ రాలా?"

"నేనొచ్చి గెంటయ్యింది. నువ్వెప్పుడొచ్చావురా సోమయ్యా?" కుశలప్రశ్నలైపోయి లోకాభిరామాయణంలో పడ్డారు చిరకాల మిత్రులు. పాత విషయాలు చర్చిస్తున్నారు.

హార్మోనియం కుర్రోడు పక్కచూపులాపి వీరినే గమనిస్తున్నాడు. వారిద్దరి సంభాషణ తిరిగి తిరిగి భజంత్రీల వైపు మళ్లింది.

"అసలు సరుకు లేదు" నోటికిచెయ్యి అడ్డు పెట్టుకుని మెల్లగా అన్నాడు.

"నూటికి నూరుపాళ్ళు కరెక్టుగా చెప్పావు బావా! ఇద్దరికీ శృతి లేదు. లయలేదు. ప్రోగ్రాం కెట్టా పిలిచారంటావ్?"

"ఎవ్వరూ పట్టించుకోవడం లేదు కాబట్టి సరిపోయింది. లేకపోతే మన భజంత్రీల పరువు గంగలో కలిసిపోయేది".

"ఇంకా పరువేం పరువులే బావా! మనబోటి వాళ్ళు ఎప్పుడైతే డోలు సన్నాయిలు పక్కనపడేశారో, అప్పుడే పోయింది.

అప్పట్నుంచి ఇట్టాంటి సచ్చూపుచ్చూ ఎక్కొచ్చి ప్రోగ్రామ్‌లు చేస్తోంది".

"ఏంచేద్దాం రా! కలికాలం. బ్రహ్మంగారు అప్పుడే చెప్పాడు".

"అవునండీ! మీరన్నది నూటికి నూరుపాళ్ళు నిజమే. మేము ఈ డోలు, సన్నాయి, హార్మోనియం పెట్టె అద్దెకు తెచ్చుకున్నాం" అన్నాడు హార్మోనియం వాయించే కుర్రోడు.

ముక్కులమీద వేలేసుకున్నారు ఇద్దరు మిత్రులు.

"ఒక గంటే ప్రోగ్రాం. మీరేమీ వాయించనక్కర లేదు. జీలకర్ర బెల్లంపెట్టే టయానికి ఏదో మొక్కుబడిగా తూ...తూ...డూం...డూం... అంటేచాలని మమ్మల్ని తీసుకొచ్చారండీ, ఈవెంట్ మేనేజర్!"

"ఆ!" ఆశ్చర్యపోయారు మిత్రులు.

"వీటికి అద్దెలు, రైలుచార్జీలుపోను తలో రెండొందలు మిగుల్తాయండీ!" అని చెబుతుంటే,

"వృత్తి రహస్యాలు అడ్డమైనవారి దగ్గరా వాగుతావుట్రా అక్కుపక్షీ" అంటూ హార్మోనియం కుర్రోడిమీదకు ఒంటికాలుమీద లేచాడు డోలు వాయిద్యకారుడు.

"పాపం ఆ కుర్రోన్నేమి అనకండీ! మేమేదో మాట్లాడుకుంటుంటే మధ్యలో దూరాడు. మీ విషయం కాదులే సామీ!" సర్దిచెప్పాడు రాజయ్య,

హాల్లో హడావిడి తగ్గుముఖం పట్టింది. అందరూ డైనింగ్ హాల్‌వైపు వెళ్తున్నారు. ఆ పక్కనే వున్న హాల్లో సినీసంగీత విభావరి జరుగుతోంది. కొత్తగాయకులు కొత్తకొత్త పాటలు పాడుతున్నారు. హాలంతా శబ్దాలతో హోరెత్తిపోతోంది.

భజంత్రీగాళ్ళు వారి సామాన్లు సర్దుకుంటున్నారు.

"బావా! నువ్వోకీర్తన ఎత్తుకోగూడదూ..."

"ఇప్పుడా..?! ఓపికేడదిరా!"

"పోనీ సన్నాయిమీద ఒక్కటంటే ఒక్కరాగం ఆలపించ గూడదు... నగుమోమూ... కనలేని ఇప్పటికి ముక్కూమొహంతెలీని వందలు వేలు పెళ్ళిళ్ళలో వాయించి ఉంటావు. మనవరాలిపెళ్ళిలో ఒక్కటంటే ఒక్కకీర్తన వాయించ గూడదూ?" మనవరాలి మాటెత్తగానే రాజయ్య మెత్తబడ్డాడు. "సన్నాయి తేలేదురా. కీర్తనపాడతా, నువ్వు డోలు వాయిస్తానంటే" అన్నాడు రాజయ్య నవ్వుతూ.

"తనుదూర సందులేదు మెడకోడోలన్నట్టు.. నేను మాత్రం డోలు భుజాన వేసుకుని తిరుగుతున్నానా! ఏదో బీరకాయ పీచు. పిలిచారని వచ్చా. నాకూ ఎప్పన్నుంచో ప్రోగ్రాంలు చెయ్యక వేళ్ళు దురద పెడుతున్నాయి" నవ్వాడు సోమయ్య.

"మీరు డోలుసన్నాయి వాయించే భజంత్రీలా?" అడిగాడు హార్మోనియం కుర్రోడు వాళ్ళనుచూస్తూ.

ఆ కుర్రోడివంక ఎగాదిగా చూసి, "ఈ పెద్దాయన ఇప్పుడు వయసుడిగి ఇట్టా ఉండాడు గానీ, ఈయన సన్నాయి వాయిస్తుంటే శ్రీకాకుళం నుంచి చెన్నపట్నం దాకా జనం ఊగి పోయే వాళ్ళు. ఈయన కచేరి చెయ్యని ఊరులేదు తెలుగు దేశంలో.

ఈ కళాకారుని విద్వత్తు మెచ్చుకుని అప్పటి ముఖ్యమంత్రి కాసు బ్రహ్మానందరెడ్డిగారు కాలికి బంగారుకడియం తొడిగి ఏనుగుమీద ఊరేగించారు.

ఈడ ఈ గుంటూరు నడిబొడ్డున ఆ మహాఉత్సవాన్ని ఈ రెండుకళ్ళతో చూశానయ్యా! కోడిగుడ్డు సత్రం నుంచి జిన్నాటవర్ మీదుగా హిందూ కాలేజి, ఏసి కాలేజి దాటి శంకరవిలాస్ సెంటర్ చేరింది ఊరేగింపు. ఆ సెంటర్‌లో మా భజంత్రీలు చేసిన సందడి అంతాఇంతా కాదనుకో. ఆయన్ని పూలదండలతో ముంచేశారు. ఊరేగింపు బీయీడీ కాలేజీ దగ్గరున్న 'లాడ్జి సెంటర్' చేరే సరికి లైట్లు వెలిగినయి. ఆయన ఏనుగుమీద ఊరేగుతుంటే చూడ్డానికి ఊరోల్లేకాదు, చుట్టుపక్కల పేరేచర్ల, జాగర్లమూడి, జొన్నలగడ్డ, అటు చేబ్రోలు దాకా జనం వచ్చారు. ఇసకేత్తే రాల్లేదనుకో! అంత జనాన్ని నెహ్రూగారి మీటింగుకే చూశా!" సోమయ్య ఊరేగింపుని కళ్ళకుకట్టినట్టు చెబుతుంటే రాజయ్య కళ్ళు చెమ్మగిల్లినై.

హార్మోనియం కుర్రోడు రెప్పవెయ్యడం మర్చిపోయి వింటున్నాడు. సోమయ్య భుజం తడుతూ "ఈడు మాత్రం తక్కువా! డోలు వాయిద్యంలో మొనగాడు. ఎన్నిడోళ్ళు పగల గొట్టాడో! రాజయ్య చెబుతుంటే ఆశ్చర్యంతో అలాగే చూస్తూ నిల

## ఎవరూ అడగలేదట!



***బు***ల్లితెర నుంచి వెండితెరకు వచ్చిన రేష్మి అనుకున్న స్థాయిలో సక్సెస్ సాధించలేకపోయినా, గ్లామర్ పాత్రలకు మాత్రం కేరాఫ్ అడ్రస్ అయింది. అందాల ఆరబోతలో రేష్మి తరువాతే ఎవరైనా అన్న పేరును సంపాదించుకుంది. అయితే ఐటెంసాంగ్స్ చేయడానికి తనకు ఎలాంటి అభ్యంతరం లేదంటూనే ఇంత వరకూ తనను వీటికోసం ఎవరూ సంప్రదించలేదని చెబుతోంది. ఎవరైనా తనకు ఐటెంసాంగ్స్‌లో ఛాన్స్ ఇస్తే తన సత్తా చూపిస్తానని అంటోంది.

బద్దాడు హార్మోనియం కుర్రోడు. తేరుకుని వాళ్లిద్దరినీ స్టేజిమీదకు తీసుకెళ్ళి డోలు, సన్నాయి వాద్యకారులకు పరిచయం చేశాడు. వాళ్ళ చేతులు అప్రయత్నంగా పైకిలేచి నమస్కరించినై. వారి పక్కన చోటిచ్చారు.

రాజయ్య చేతికి సన్నాయి, సోమయ్య చేతికి డోలు అందించాడా కుర్రోడు. అపురూప వస్తువుల్ని తాకిన ఆనందం వారిలోని ప్రతి అణువులో తొణికిసలాడుతోంది. వాటిని ఆప్యాయంగా తడిమారు.

ఇక ఆలస్యందేనికి, కానివ్వండి అన్నట్టు చూశారు భజంత్రీలు. వాయిద్యాలు శృతి చేసుకుంటుంటే కొంతమంది జేరారు. "దొరకునా ఇటువంటి సేవ..." సన్నాయిపై ఎత్తుకున్నాడు రాజయ్య. కీర్తన పూర్తయ్యేసరికి ఒక్కొక్కరు అటువైపు రాసాగారు. జనాన్నిచూసి "ఇంకో కీర్తన ఆలపించండి స్వామి" అన్నాడు సన్నాయి ఆసామి. అప్పటికే వందమందికిపైగా వచ్చారు.

"బావా! అటుచూడు! నువ్వు ఒక్క కీర్తన ఆలపిస్తేనే ఎంతమంది జమయ్యారో! ఇంగవకట్టిన గుడ్డవాసన ఊరకే పోదు. ఇంకోటి ఎత్తుకోవాల్సిందే" అన్నాడు సోమయ్య.

"అవునుస్వామీ! మీ విద్వత్తు తెలియక ఏదో మాట తూలాను. మన్నించి ఇంకో కీర్తన అందుకోండి" అన్నాడు డోలు కళాకారుడు.

"ఏదన్నా పాతపాట. మీ టైంలోది వాయించండి" అడిగాడు హార్మోనియం కుర్రోడు. అవునన్నట్టు తలూపాడు సన్నాయి వాద్యకారుడు. ఇంకొంతమంది జనం వచ్చారు.

'ఎచటనుంచి వీచెనో... ఈ చల్లనిగాలి...' అని పాట ఎత్తుకున్నాడు. పాట అయిపోయేసరికి కుర్చీలన్నీ నిండిపోయినయి. చప్పట్లతో హాలు దద్దరిల్లిపోయింది.

ఇద్దరి ముఖాలు ఆనందంతో వెలిగిపోయినై. చాలామంది కుర్చీలు దొరక్క నిలబడ్డారు.

పక్కహాలులో జరుగుతున్న సినీసంగీత విభావరి దగ్గర సగం కుర్చీలు ఖాళీ అయిపోయినై. కుర్రాళ్ళను ఉత్సాహపరచడానికి లేటెస్టు హిందీ, తెలుగు పాటలు పాడుతున్నారు. సంగీత వాయిద్యాలు హోరెత్తిపోతున్నాయి. భోజనాలుచేసి బయటికెళ్తున్నవారంతా నాదస్వరంవైపు మంత్రం వేసినట్టు వెళ్తున్నారు.

సినీసంగీత విభావరి దగ్గర జనం పల్చబడ్డారు. ఈవెంట్ మేనేజర్‌కి అర్థం కాలేదు. పక్కహాల్లో సన్నాయి ఇంకా మోగుతూనే ఉంది. డోలు విన్పిస్తూనే ఉంది. గంట ప్రోగ్రాం మాత్రమే అని చెప్పాం కదా! వాళ్ళు ఇంకా అక్కడేం చేస్తున్నారు? పరిగెత్తుకుంటూ పక్కహాల్లోకొచ్చాడు ఈవెంట్ మేనేజర్. జనం కుర్చీలు లేక నిలబడ్డారు. సన్నాయిపాట, డోలు, వాయిద్యం వింటూ తలలూపుతున్నారు జనం. మేనేజర్ స్టేజీమీద కళాకారుల్ని చూశాడు. మంత్రించిన బొమ్మలావెళ్ళి రాజయ్య పక్కన కూర్చున్నాడు. పాట అయిపోగానే చప్పట్లతో హాలు మారుమోగిపోయింది. వాళ్ళతో మేనేజర్ చేతులు జతకలిశాయి.

సినీ సంగీత విభావరి దగ్గర పదిమంది మించి లేరు. పెళ్ళికుమార్తె తండ్రి కంగారు పడిపోయాడు. లక్షలు ఖర్చు చేసి చెన్నై నుంచి పిలిపించాడు. వాళ్ళంతా పేరు ప్రఖ్యాతులు గడించిన సినీ కళాకారులు.

పెళ్ళికూతురు తండ్రి కళ్ళు కోపంతో ఎర్రబడ్డాయి. ఈవెంట్ మేనేజర్‌కోసం వెదుకుతూ పక్కహాల్లోకొచ్చాడు. అక్కడ జనం కిటకిటలాడుతున్నారు. టైం పదకొండు దాటిపోయింది. ఫ్లైట్స్‌కి, ట్రైన్స్‌కు వెళ్ళాల్సిన ఎన్.ఆర్.ఐలు చాలామంది ఉన్నారక్కడ. ఇంకా ఈ భజంత్రీల గొడవేందో అర్థం కాలేదు.

'ఎంత ఘాటు ప్రేమయో... ఎంతలేత వలపులో..' అద్భుతంగా వాయిస్తున్నాడు సన్నాయి మీద, వీనులవిందుగా డోలు వాయిద్యం సహకరిస్తోంది. అక్కడ ఆ రెండు శబ్దాలు మినహా వేరే ఏ రకమైన శబ్దం విన్పించడంలేదు. భజంత్రీల చుట్టూచేరి ఫొటోలు, వీడియోలు తీస్తున్నారు. సంగీత విభావరి దగ్గరుండాల్సిన తన కొడుకు డోలు పక్కన కూర్చుని తలూపుతున్నాడు. అతను పుట్టి పెరిగింది అమెరికాలోనే. చిన్నతనంనుంచీ సంగీతమంటే విపరీతమైన పిచ్చి. తన కొడుకు కోసమే ఈ పెళ్ళిలో ప్రత్యేకంగా చెన్నైనుంచి వెస్టర్న్ మ్యూజిక్‌పార్టీని పిలిపించాడు. అది చాలా కాస్ట్‌లీ ట్రూపు. మామూలుగా అవుట్‌డోర్ ప్రోగ్రామ్స్ ఇవ్వరు. చాలా ఇన్‌ఫ్లుయెన్స్ చేసి పిలిపించాడు. మరి వీడేంటి అక్కడుండక ఈ తూ...తూ...ఢూం...ఢూం... దగ్గరజేరి తలూపుతున్నాడు. కోపం నషాళానికంటింది. ఈవెంట్ మేనేజర్‌కూడా సన్నాయిపక్కన చేరి తాళం వేస్తున్నాడు.

అప్పుడు చూశాడు సన్నాయి వాయించే కళాకారుణ్ణి. ఆశ్చర్యంతో నోటమాట రాలేదు. బ్యాటరీ డిశ్చార్జి అయిన బొమ్మలా అక్కడే నిలబడిపోయాడు పెళ్ళికూతురు తండ్రి. పాట పూర్తైంది. చప్పట్లతో హాలు దద్దరిల్లిపోయింది.

ఫ్రెండ్సంతా అతనిచుట్టూ మూగారు. అభినందనలతో ముంచెత్తారు. 'వెరీ నైస్ ప్రోగ్రాం డాక్టర్ ఈతముక్కల. ఐ హేవ్ నెవర్ హర్డ్ సచ్ ఎ డివైన్ మ్యూజిక్. హి ఈజ్ ఎ గ్రేట్ మ్యూజీషియన్. వాట టాలెంటెడ్ మ్యాన్!!" ఫ్రెండ్సంతా చుట్టూజేరి అభినందనలతో ముంచెత్తుతుంటే ఉక్కిరిబిక్కిరై పోయాడు పెళ్ళికుమార్తె తండ్రి డాక్టర్ ఈతముక్కల.

'ఏమిటో ఈ మాయ!' మరో పాటెత్తుకున్నాడు రాజయ్య. జనమంతా పాటలో లీనమైపోయారు. అక్కడ వాతావరణం చూస్తుంటే సన్నాయి పాటలు పూర్తయ్యేదాకా ఎవ్వరూ కదిలేలాలేరు. చాలామందికి ఫ్లైట్స్. ట్రైన్స్ మిస్సయ్యేలా ఉన్నాయి.

పెళ్ళికుమార్తె తల్లి కంగారుపడుతూ అక్కడికి వచ్చింది. కోపంతో ఆమె ముక్కుపుటాలు ఎగిరెగిరి పడుతున్నాయి. జనాల్ని తప్పించుకుంటూ స్టేజి దగ్గరకొచ్చి అక్కడున్న భజంత్రీలను చూసింది. సన్నాయివాద్యకారుని చూసిన ఆమె ముఖం కందగడ్డలా మారింది. ఆ పక్కనే నిలబడి పాటలో లీనమైపోయిన భర్తను చూసి తోకతొక్కిన తాచుపామైంది. "నాకు చెప్పకుండా ఈ సన్నాయినెప్పుడు పిలిచావ్ మిస్టర్ ఈతముక్కల?" కోపంతో ఊగిపోయిందామె.

"ఐడోంట్ నో డియర్! బిలీవ్ మీ. ఐడిన్ట్ కాల్డ్ హిమ్. ఎలా వచ్చాడో ఎప్పుడొచ్చాడో తెలీదు" కంగారుగా మెల్లిగా ఆమెకే విన్పించేట్టు చెప్పాడు.

"మీ బుద్ధి మారదు" అంటూ రుసరుసలాడుతూ అక్కడినుంచి వేగంగా వెళ్ళిపోయింది.

పెళ్ళికొచ్చిన జనం పూలదండలతో, బొకేలతో, అభినందనలతో రాజయ్యను ముంచెత్తారు. ఆయనతో ఫొటోలు దిగడానికి పోటీపడ్డారు.

"ఐ హేవ్ నెవ్వర్ హర్డ్ సచ్ ఎ డివైన్ మ్యూజిక్ డాడ్! హి ఈజె గ్రేట్‌మాన్" అంటూ షేక్ హ్యాండిచ్చాడు కొడుకు. అతని మాటలకు డాక్టర్ ఈతముక్కల మెదడు మొద్దుబారిపోయింది. ఈ సన్నాయినాదంలో ఇంతటి మహత్తు ఉందని ఇంతవరకూ తెలుసుకోలేకపోయాడు. తనతండ్రి గొప్పదనాన్ని ఇతరులు.. చివరకు తన సొంత కొడుకొచ్చి చెబితేగాని తెలుసుకోలేకపో

యాడు. హాలు ఖాళీ అయిపోయింది. ఒంటరిగా మిగిలిపోయాడు. స్టేజీ దగ్గరకెళ్ళి తండ్రి కచేరీ చేసిన చోటును చేతులతో తాకి కళ్ళకద్దుకున్నాడు డాక్టర్ ఈతముక్కల. అతని చేతులు తడిసిపోయినై.

●●●

భజంత్రీల బృందంతో కలిసి రైలు బండెక్కాడు రాజయ్య. హార్మోనియం కుర్రోడు రాజయ్యను క్షణం వదలడంలేదు. అతనిలో ఒక త్యాగయ్యను, అన్నమయ్యను, క్షేత్రయ్యను చూడసాగాడు.

"ఇంతగొప్ప కళాకారుణ్ణి చూడ్డం జీవితంలో ఇదే మొదటిసారి. మన జన్మ ధన్యమైందికదూ" అంటూ డోలుసన్నాయి వాయిద్యగాళ్ళతో అంటే, అవునవునంటూ తూగుతున్నారు వాళ్ళు అప్పటికే.

"ఇంత గొప్పవిద్య మీరు ఎక్కడ నేర్చుకున్నారు స్వామీ! మీ గురువు ఎవరు?" అంటూ ప్రశ్నలతో ముంచెత్తుతున్నాడు రాజయ్యను. అతని ఉత్సాహానికి ముచ్చటేసింది. నవ్వుకున్నాడు.

బండి బయలుదేరింది. మూడువంతెనలు దాటింది. బోగీలో ఆట్టే జనంలేరు. ఉన్నా ఇద్దరు ముగ్గురు జోగుతున్నారు. చల్లటిగాలి వీస్తోంది. ఒంటికి, మనసుకి హాయిగా ఉంది. ఆ ఆనందం రాజయ్యను గతంలోకి తీసుకుపోయింది.

"మా గురువుగారి పేరు నటేశన్. ఉమ్మడి మద్రాసు రాష్ట్రం నుంగంబాకంలో వినాయకచవితి నుంచి సంక్రాంతిదాకా ఉండేవారు. ఆ తర్వాత రాష్ట్రమంతా తిరిగి కచేరీలు చేసేవారు. నాదస్వరంలో గొప్పపేరు. ఎక్కడెక్కడినుంచో ఆయన కచేరీలకొచ్చేవాళ్ళు. ఒకసారి తెనాలి, గాంధీచౌక్‌లో ఆయన కచేరి విన్నా. నేర్చుకుంటే నాదస్వరమే నేర్చుకోవాలనుకున్నా. ఆయన అందరికీ నేర్పడు. అప్పుడు నాకు పద్దెనిమిదో, పందొమ్మిదో. నాన్న లేడు. భజంత్రీల బృందంతో పాటు హార్మోనియం పట్టుకు తిరిగేవాణ్ణి. మొదటిసారి తెనాలిలో అడిగితే మాట్లాడలా. ఆ తర్వాత గుంటూరులో కలిశా. నా పట్టుదలచూసి చెన్నపట్నం రమ్మన్నాడు. అమ్మకిష్టం లేకపోయినా నా ఇష్టం కాదనలేక పంపింది. బండి సంగంజాగర్లమూడి చేరింది. ఎవ్వరూ ఎక్కలేదు. దిగలేదు. డోలు సన్నాయి వాయిద్యగాళ్ళ గురక వినిపిస్తోంది.

"ఇప్పుడు నాతోపాటు డోలు వాయించిన సోమయ్య, రాజారత్నం, మునిస్వామి, అల్టా మొత్తం ఆరుగురం కల్సి చెన్నపట్నం వెళ్ళి, ఐదేళ్ళు విద్య నేర్చుకున్నాం. సరళీస్వరాల నుంచి జంటస్వరాలు రాగాలు, ఆరోహణం, అవరోహణం... అదో లోకం. సంగీతలోకం. అమ్మగారు ఆండాళమ్మ. మాకు అన్నంపెట్టిన అన్నపూర్ణమ్మ. మొదటినెలకు ఐదు రూపాయలు ఇమ్మన్నారుగానీ నేను ఐదారునెలలు కూడా ఇవ్వలేదు" బండి తెనాలి చేరింది. సన్నాయి, డోలు వాయిద్యగాళ్ళు దిగారు. హార్మోనియం దిగలేదు. "నేను మీకూడా ఇంటిదాకా వస్తాస్వామి" అంటూ బతిమాలాడు. కుర్రోడు, రాజయ్య ఇల్లు జేరారు.

"నాక్కూడా నాదస్వరం నేర్చుకోవాలని చిన్నప్పట్నుంచి మహాకోరిక స్వామి! ఈ డోలు, సన్నాయి నేర్చుకుంటే కూటికి, గుడ్డకి రావురా. రేపునీకు పెళ్ళికి పిల్లనుకూడా ఎవ్వరూ ఇవ్వర్రా. చక్కగా బిఏనో, ఎంఏనో చదువుకుని, ఏ బీయీడీనో చేస్తే టీచరో, గవర్నమెంటుజాబో వస్తుందని బలవంతంగా నన్ను చదివించాడు మా నాన్న. కోరిక చంపుకోలేక అప్పుడప్పుడు ఈ భజంత్రీల బృందంతో కల్సి ప్రోగాముల కెల్తుంటాను స్వామి. ఇంతకాలానికి వెదకబోయిన తీగ కాలికి తగిలినట్టు మీ దర్శనం కలిగింది. నాకు విద్య నేర్పండి స్వామి" అంటూ రాజయ్య కాళ్ళమీద పడ్డాడు హార్మోనియం కుర్రోడు. తన విద్య తనతోనే ఆగిపోతుందని బాధపడ్డ రాజయ్యకు కుర్రాణ్ణిచూసి ఆశ కలిగింది.



భుజంతట్టి లేపాడు. "మంచి ముహూర్తం చూసుకునిరా" అంటూ అభయహస్తమిచ్చాడు రాజయ్య.

●●●

సంవత్సరం గడిచిపోయింది. రెండేళ్ళు వెళ్ళిపోయినై. వస్తానన్న హార్మోనియం కుర్రోడు పత్తాలేడు. అయినాసరే ఏ రోజూ సాధన ఆపలేదు రాజయ్య.

ఎప్పటిలాగే వేకువజామున లేచిన రాజయ్య సాధనలో కూర్చున్నాడు. చుట్టుపక్కల ఇళ్ళల్లో జనం వారివారి పనుల్లో పడ్డారు. అప్పుడు ఇంటి ముందొక కారొచ్చి ఆగింది.

పక్కింటి రంగయ్య ఓ కుర్రాణ్ణి వెంటబెట్టుకుని వచ్చాడు. ఎర్రగా, ఎత్తుగా, అందంగా ఆరోగ్యంగా ఉన్నాడు తను. అతను వచ్చీరాగానే రాజయ్య కాళ్ళమీదపడి "ఆశీర్వదించండి" అన్నట్టు అలాగే ఉండిపోయాడు.

ఎవరు? ఎప్పుడూ చూసిన గుర్తులేదు. ఎందుకొచ్చాడో ఏమో? పూటకి ఠికాణా లేనోణ్ణి ఏమని ఆశీర్వదించాలి?

"ఎవరు బాబూ తమరు? గుర్తు రావడం లేదు. నాతో ఏం పని?" ప్రేమగా అడిగిలేపి పక్కన చాపమీద కూర్చోబెట్టాడు.

"నాపేరు రాజేష్. నేను అమెరికానుంచి వచ్చానండి. అక్కడే పుట్టిపెరిగాను. అమ్మానాన్న తెలుగువారే. నాకూ తెలుగువచ్చు.

త్రీఇయర్స్ బాక్ గుంటూరులో జరిగిన మ్యారేజ్‌లో మీ మ్యూజికల్ కాన్సర్ట్ చూశా! ఇటీజ్ వండర్‌ఫుల్. ఐ లైక్ మ్యూజిక్. ఐ వాంటెడ్ టు లెర్న్ దట్ మ్యూజికల్ ఇన్‌స్ట్రుమెంట్. ఐ యామ్ సర్చింగ్ ఫర్ ద గురు. మై ఫాదర్ గేవ్ మి యువర్ ఎడ్రెస్" వచ్చీరాని తెలుగులో, చాలావరకు ఇంగ్లీషులో చెప్పాడు.

అమెరికాలో పుట్టిపెరిగిన అబ్బాయి సన్నాయి నేర్చుకోవడానికి ఇంతదూరం వచ్చాడా?! ఏమీ అర్థంకాలేదు రాజయ్యకు. పక్కన కూర్చున్న రంగయ్య వంక చూశాడు. "ఇది పక్కా పల్లెటూరు. ఈడ సరిగ్గా కరెంటు కూడా ఉండదు. మీ బోటోళ్ళకు తిండీ అదీ చానా కష్టం బాబు. గడిసేపు ఫోన్లు, కంప్యూటర్లు లేకుండా ఉండలేని మీ బోటోళ్ళు ఈడుండలేరు బాబూ" అన్నాడు రంగయ్య.

అమెరికా కుర్రాడు రాజయ్యవంక ఆశగా చూశాడు.

"అవును బాబూ! రంగయ్య చెప్పింది నిజమే. మీబోటోళ్ళకు ఇట్టాటిచోట కష్టం బాబూ! అయినా అది అంత తేలిగ్గా అబ్బే విద్యకాదు. దానికి బోలెడు సాధన కావాలి" అన్నాడు రాజయ్య.

"ఐయామ్ రెడీటు ఫేస్ ఎనీ ప్రాబ్లం. అన్నిటికీ తయారయ్యే వచ్చా" అన్నాడు కుర్రోడు స్థిరంగా.

వీరి సంభాషణంతా తలుపు వెనక ఉండి వింటోంది సత్తెమ్మ.

"ఇదుగో నిన్నే, లోనకొత్తావా" అని పిలిచింది. రాజయ్య ఇంట్లో కెళ్ళాడు.

"నిన్ను వెతుక్కుంటూ అమెరికా నుంచి వారసుడొత్తే ఇంకా ఏంది ఎనకాముందాడతన్నావు" అంది సంబరంగా.

మరునాడు పొద్దున్నే మసీదులో అజా వినబడక ముందే, జోడు సన్నాయిలు భూపాల రాగంతో ఊరంతటికి మేలుకొలుపు పాడాయి.

సెల్:94407 47768



# గిల్లికజ్జాలు

-గొర్లి శ్రీనివాసరావు

**'ఏమే, ఊరికే ఉండలేవా, నేనెక్కడకెళ్తే నీకెందుకు?' అడిగాడు కమల్ రోషంగా.**

**'చూడవే రాగిణీ, నీ కొడుకు నన్ను ఎలా నిలదీస్తున్నాడో? వీడికి తిండి ఎక్కువ పెడుతున్నావు, బాగా పొగరు ఎక్కువైంది' అంది దమయంతి.**

**'అబ్బ ఊరుకోండి ఇద్దరూ. తెల్లారితే మొదలుపెడతారు కీచులాటలు. ప్రశాంతంగా టీవి కూడా చూడనివ్వరు. అసలు మిమ్మల్ని పెట్టి డెయిలీ సీరియల్ తీస్తే బాగుంటుంది' విసుక్కుంది రాగిణి.**

'పోమ్మా నువ్వు మరీను. ఈ ముసలిదాని ముఖం చూసి, మొత్తం టీవి ప్రేక్షకులంతా బాధ పడాలా, మనం కష్టపడుతున్నది చాలదూ' అన్నాడు కమల్ వెటకారంగా.

'అబ్బో నా ముఖానికేమైందిరా.. నా పోలికే వచ్చింది నీకు కూడా. నా ముఖం బాగోలేదు అంటే నిన్ను నువ్వు తింటుకున్నట్లే, ఏమనుకుంటున్నావో!? అమ్మాయ్ నువ్వు వీడిని ఏదైనా హోటల్‌లో క్లీనర్‌గా అన్నా జాయిన్ చేసెయ్యవే, ఇంట్లో వీడి గొడవ పడలేక పోతున్నాం' అంది దమయంతి.

'ఏయ్ ముసిలీ, నేను చేసింది హోటల్ మేనేజ్‌మెంట్. పెద్ద స్టార్ హోటల్‌లో మేనేజర్‌ని అవుతాను తెలిసిందా' అన్నాడు కమల్ మొఖం ఎర్రగా చేసుకుని.

'అదీ చూద్దాం. నేను బతికుండగా జరుగుతుందా?? నాకు నమ్మకం లేదు!' అంది దమయంతి, మూతి మూడు వంకరలు తిప్పి.

'నువ్వు అప్పుడే ఎలాచస్తావు. పాపీ చిరాయువు అని ఊరికే అన్నారా!' అన్నాడు కమల్ వెటకారంగా చూస్తూ.

'ఒరే ఎప్పుడుచూడు, మా అమ్మ చావు గురించి మాట్లాడితేగాని నీకు తృప్తిగా ఉండదారా?!' చిరాకు పడింది రాగిణి.

'నేనా అన్నది. ఆ ముసిలిదే కావాలని నాతో అలా అనేలా చేస్తుంది. నువ్వేమో నన్ను తిడతావు. ఛీ' అంటూ బైటకు వెళ్ళిపోయాడు కమల్.

'నువ్వైనా ఊరుకోవచ్చు కదమ్మా. పిల్లలతో సమానంగా వాదులాటలేసుకుంటావు' మెత్తగా మందలించింది రాగిణి.

"ఏంటక్కా! మళ్ళీ గొడవపడ్డాడా అమ్మతో, కోపంగా వెళ్తున్నాడు కమల్. నేను పలకరించినా పలకలేదు. రుసరుసలాడుతున్నాడు' అన్నాడు అప్పుడే లోపలికి వస్తున్న శంతను.

'ఒరే, వీళ్ళు జాతివైరం ఉన్న కుక్క, పిల్లి లాంటి వాళ్ళు. ఇద్దరికీ క్షణం కూడా పడదు' అంది రాగిణి.

'అది ఎప్పుడూ ఉండేదేకదా! అమ్మకు వాడిని చూస్తే తిక్క లేస్తుంది' అన్నాడు శంతను.

'నాకేమీ పని లేదనుకున్నావేరా? చక్కగా నా పాటికి నేను భాగవతం చదువుకుంటూ ఉంటే నన్ను పిలిచి మరీ గిల్లికజ్జాలు పెట్టుకుంటాడు వాడు. అసలు నువ్వు, మీ అక్క బాగా గారాబం చేసి వాడిని ఇలా చెడగొట్టారు. వాళ్ళ నాన్న అక్కడెక్కడో అస్సాంలో పనిచేస్తూ ఉండటం వల్ల వీడిని కనీసం భయభక్తులలో పెట్టే మనిషి దగ్గర

లేకుండా అయిపోయింది' అంది దమయంతి.

'పోనీలేమ్మా. నిజానికి వాడు ఎంత బుద్ధిమంతుడో తెలుసా! ఈ కాలంలో పిల్లలు ఎలా ఉన్నారో! బైట తిరుగుతుంటాం కాబట్టి మాకు తెలుసు! ఇంటిపట్టున ఉంటావు, నీకేం తెలుసు వాడి గుణగణాల గురించి! చాలామంది పిల్లలకంటే వాడు చాలాచాలా మెరుగు తెలుసా!' అన్నాడు శంతను.

'అవునులే వాడు చాలాచాలా మంచోడు, నేనేమో చాలాచాలా చెడ్డదాన్ని' అంది దమయంతి.

'అలా ఎవరన్నారమ్మా! అది అలా ఉంచుగానీ, ఏరా శంతను, నీ పెళ్ళాం ఎప్పుడొస్తుంది ఊరి నుంచి' అడిగింది రాగిణి, మాట మార్చుతూ.

'ఇంకో రెండు రోజులలో వస్తుందట' అన్నాడు శంతను.

'వాళ్ళ నాన్నగారికి బాగోలేదని వెళ్ళింది కదా! ఇప్పుడెలా ఉందట ఆయనకు' అంది రాగిణి.

'ఇప్పుడు బాగానే ఉందట. హార్ట్ ప్రాబ్లమనుకుని భయపడ్డారు. కానీ అది గ్యాస్ ప్రాబ్లమేనట. కార్పొరేట్ హాస్పిటల్ కదా, అన్ని టెస్టులూ చేసి బారెడు బిల్లు చేతిలో పెట్టారట' అన్నాడు శంతను.

'పోనీలే, ఒంట్లో ఉన్న జబ్బులన్నీ ఒకసారి టెస్టులు చేసి చూస్తారు. దానితో చీకూచింతా లేకుండా హాయిగా బతికేయొచ్చు' అంది దమయంతి.

'అదీ నిజమేలే అమ్మా! అయినా వాళ్ళబ్బాయి పెద్ద సాఫ్ట్‌వేర్ ఇంజనీరు కదా! ఈ ఖర్చులు వాళ్ళకు భారమా ఏంటి?' అంది రాగిణి.

'అవునులే, హాస్పిటల్‌కి వెళ్ళడమంటే స్టార్ హోటల్‌కి వెళ్ళినట్లు వెళ్ళొస్తున్నారు జనాలు, ఈ మధ్య' అన్నాడు శంతను.

పిచ్చాపాటి కబుర్లలో పడిపోయారు

## సైకతశిల్పి




మన చేతుల వేళ్ళ సందుల్లోంచి
ఇసుక ఇట్టే జారిపోతుంది
వేళ్ళకేమీ మిగలదు ఇసుకకేదీ దక్కదు

అతను వేరు, ఇసుకే అతనికి
కలమూ కాగితమూ కుంచే
కాన్వాస్ కూడా!
అతని వేళ్ళల్లో ఇసుక ఒదుపుగా
ఒదుగుతుంది
అది జారదు, జాలువారుతుంది

సముద్ర హృదయం తెలిసిన
ఇసుక
ఆకాశదేహాన్ని రోజూ దర్శించే
ఇసుక
తడవుతూ పొడవుతూ పలు
అనుభవాల తళతళల్లో
మెరిసే ఇసుక - అతనికి చిన్న
ప్పట్నుంచీ పరిచితమే!

పేదరికం పెట్టెల్ని విసిరికొడితే
పూరీ బీచ్‌లో వచ్చిపడ్డాడు ఖాళీ
చేతుల్తో
ఏమీ లేదు ఇసుక తప్ప - కాళ్ళ



కిందా, కళ్ళ ముందూ
ఇంకేముంది, చేతుల్లోకి తీసుకు
న్నాడు ఇసుకనే
ఇష్టంగా, ప్రేమగా, బతుక్కి ఆస
రాగా, కళాద్రవ్యంగా
ఇసుకతలమీద ఇసుకకు
కొంగ్రొత్త రూపాలనిచ్చాడు

గురువు లేడు, సముద్రాన్ని విన్న
దేహం
ఆకాశాన్నీ దిక్కుల్నీ చదివిన
దేహం - అదే ఎరుక!
ఏమీలేని చేతుల్లోంచి లేచిన
చేతన, బతుకు అవసరం
విద్యను దేహం నుంచి బయటికి
పరిచి
ఇసుకా, చేతుల్తో తీరాల్ని అలంక
రించాడు!

ఇష్టదైవాన్ని తలచాడు
ఇసుక జగన్నాథమూర్తి ఐంది
వినాయకుని ముగ్ధప్రతిమ ఐంది
సముద్ర పురుషుడి తరళ దేహమైంది
చేతులు ఇసుక స్పర్శలో పవిత్ర
మయ్యాయి
పవిత్రమైన చేతుల్లో ఇసుక
లోంచి చెట్లను లేపాడు
చెట్లు బతకాలని వినమ్రంగా
ఇసుకభాషలో విన్నవించాడు

పుడమే సకలానికి ఆధారమని
యెరిగిన అతను
దాని తాపానికి కాగి కలత చెందాడు
ఇసుకకు తడి చేర్చి ఒక శీతల
రూపును తీర్చిదిద్దాడు
అరణ్యాలు ప్రాణతతితో వర్ధిల్లాలని
ఏనుగుల్నీ సింహాల్నీ సాగర
తీరంలో సృజించాడు
బహుశా అవి అతని వేపు కృత
జ్ఞతగా చూసి ఉంటాయి!

ప్రపంచాన్ని దర్శిస్తూ దర్శిస్తూ
ప్రణమిల్లాడు
థెరిసాకు, కలాంకు, మహాత్మునికి
వివేక పురుషుడికీ అనేక విజ్ఞు
లకూ మానవీయులకూ
ఇసుక తీరంలో వాళ్ళను కొలువు
దీర్చి, గౌరవ రేఖల్తో-

అతని సైకత ప్రాంగణంలో
ఆటల మైదానాలున్నాయి
బతుకుని పాడే, కాపాడే, వేడు
కునే చరణాలున్నాయి
అన్నిటిలోనూ అతని చేతుల
లావణ్య ముద్రలున్నాయి

పూరీ తీరంలో పుటకెత్తిన
అతను పుడమి మీద
ఎన్నో సముద్ర తీరాలకు ప్రయా
ణించాడు
ఇసుక పిలిచిన చోటుకల్లా,
గీతలే ఐన చేతుల్తో!

ఇసుకను చూసినప్పుడల్లా
అతను నాకు గుర్తుకొస్తాడు
గరుకైన మెత్తని అతని చేతులు
గుర్తుకొస్తాయి
చేతులకు దండం పెడతాను
చేతులతోనే కాదు
అతని రూపాలకు మురిసిన నా
హృదయంతో కూడా!
(సుదర్శన్ పట్నాయిక్‌కు)

**-దర్భశయనం శ్రీనివాసాచార్య**
**సెల్: 94404 19039**

ముగ్గురూ.

దమయంతి స్కూల్ ప్రిన్సిపాల్‌గా పనిచేసి రిటైర్ అయింది. ఆమెకు ఇద్దరు పిల్లలు. భర్త ఒక ఫార్మాకంపెనీలో పనిచేస్తూ ఉండేవాడు. అయితే రాగిణికి పదేళ్ళ వయసులో, అతడు యాక్సిడెంట్‌లో చనిపోయాడు. దమయంతి ఒంటిచేత్తో పిల్లలిద్దరిని పెంచి పెద్దచేసింది. రాగిణికి బ్యాంక్‌లో ఉద్యోగం దొరికింది. శంతనుకి రైల్వేలో ఉద్యోగం దొరికింది. రాగిణి భర్త ఓఎన్‌జీసీలో పని చేస్తాడు. ఎక్కువగా క్యాంపులలో ఉంటాడు. శంతనుకి పెళ్ళయి ఆరేళ్ళయింది. ఒక పాప, బాబు ఉన్నారు. దమయంతి ఇంట్లోనే అందరూ ఉంటారు. కింది పోర్షన్లో దమయంతి, రాగిణి ఉంటారు. శంతను పై పోర్షన్లో ఉంటాడు.

రాగిణికి కమల్ ఒక్కడే సంతానం. కమల్‌కి తల్లి అంటే బాగాఇష్టం. కాని అమ్మమ్మ అంటే అస్సలుపడదు. బహుశా తనతల్లి తనకంటే మరెవరితోనూ ఎక్కువ మాట్లాడకూడదని అనుకుంటాడేమో!

ఆరోజు రాత్రి భోజనాలు చేస్తున్నప్పుడు కూడా దమయంతికి కమల్‌కి మళ్ళీ వాగ్యుద్ధం జరిగింది.

'అమ్మా, ఈ ఎగ్‌కర్రీ ఇలా చేశావేంటి? నువ్వెప్పుడూ చేసేలా కాకుండా?' అడిగాడు కమల్. శంతనుతో సహా నలుగురూ డైనింగ్ టేబుల్ దగ్గర కూర్చుని భోజనం చేస్తూ ఉన్నారు.

'ఇది మా అమ్మ కనిపెట్టిన రెసిపీ రా! అమ్మమ్మ అడిగితే చేశాను' అంది రాగిణి.

'కూర బాగుందక్కా. అమ్మ చేసినట్లే చేశావు నువ్వు' అంటూ మరికాస్త వడ్డించుకున్నాడు శంతను.

'ఛీ యాక్. ఇలా వండేదా ఈ ముసల్ది. ఎలా తింటున్నారే బాబూ. నాకు రసం చాలు' అన్నాడు కమల్, తన ప్లేట్లో వేసిన కూరను ఖాళీ గిన్నెలోకి తీసేస్తూ.

'అబ్బో పందికేం తెలుసు పన్నీరు వాసన' అంది దమయంతి వ్యంగ్యంగా.

'ఏంటే ముసిలీ, నేను పందినా! నువ్వు పన్నీర్ కర్రీవా' అన్నాడు కమల్ కోపంగా.

'తెలుగు కూడా వచ్చిచావదు నీ కొడుక్కి. ఏమి చదువులే నాతల్లీ' అంది దమయంతి బోసినోటితో హాయిగా నవ్వుతూ.

'ఒరే నాన్నా, పన్నీరు అంటే రోజ్‌వాటర్ రా. పన్నీర్ కాదు' అంది రాగిణి నవ్వు ఆపుకుంటూ. శంతను కూడా బిగ్గరగా నవ్వాడు.

'ఈ ముసల్ది నన్ను ఆట పట్టిస్తుంటే మీరంతా నవ్వుతారా? ఇది ఎప్పుడు చస్తుందో గాని, అప్పటి వరకు, నాకు ఈ ఇంట్లో శాంతిలేదు' అన్నాడు కమల్ విసుగ్గా.

'పోనీలేరా కన్నా! వదిలెయ్. నీకు మామిడి పండు పెడతాను. ఇక గొడవచేయకుండా అన్నం తిను' అంది రాగిణి. లేచి వెళ్ళి ఫ్రిజ్‌లో నుంచి మామిడిపండు తీసి కడిగి, ముక్కలు చెక్కి ప్లేట్లో వేసి ఇచ్చింది.

'ఏమే రాగిణీ, నీ కొడుకేమైనా కలెక్టర్ అనుకున్నావా? నువ్వు అన్నం తినడం మానేసి మధ్యలో వెళ్ళి ఈ సేవలన్నీ చేస్తున్నావు. ఏం వాడు చేసుకోలేడా' అంది దమయంతి.

'ఊరుకోమ్మా. మరీ ఎక్కువ చేస్తున్నావు నువ్వు కూడా' అంది రాగిణి.

గుర్రుగా చూశాడు కమల్. మామిడిపండు ముక్కలు నోట్లో ఉండటం వల్ల అంతగా కోపం రాలేదు అతనికి!

'నేను మీ ఇద్దరినీ పెంచాను కాని, ఇంత గారాబం చేయలేదమ్మా' అంది దమయంతి మూతి తిప్పుకుంటూ.

'నువ్వు రాక్షసివి. నీకు ప్రేమలు తెలియవు. మా అమ్మ అలా కాదు. దేవత!' అన్నాడు కమల్, ప్లేట్‌లో సగం తిన్న అన్నం అలాగే వదిలేసి, మామిడిపండు ప్లేట్ తీసుకుని హాలులోకి వెళ్తూ.

'ఏంటమ్మా, వాడిని తిండి తిననియ్యకుండా' అంది రాగిణి కొంచెం బాధగా.

'అనవే. నువ్వు కూడా నన్నే అను. నీ మాటలు విని వాడు ఇంకా రెచ్చిపోతాడు. చూశావా వాడు ఎప్పుడూ ఏమంటుంటాడో. నేనెప్పుడు చస్తానా అని ఎదురుచూస్తున్నాడట' అంది దమయంతి.

హాల్లో టీవి సౌండ్ మరికాస్త పెంచాడు

**ఆ మనవడికీ, అమ్మమ్మకీ క్షణం కూడా పడదు. ప్రతి విషయంలోనూ ప్రతిరోజూ గొడవే. నువ్వు చచ్చిపోతేగానీ నాకు మనశ్శాంతి లేదు అంటూ ఉంటాడా మనవడు. అమ్మమ్మ కూడా తక్కువదేంకాదు. రెచ్చిపోతూ ఉంటుంది. భోజనాల దగ్గర గొడవ, మనవడికి ఉద్యోగం లేదని దెప్పిపొడుపులతో గొడవ ఇలా గడిచిపోతున్నాయి రోజులు. కానీ ఆకస్మికంగా ఒకరోజు ఏం జరిగిందంటే....**

కమల్. రాగిణి మౌనంగా ఉండిపోయింది. మాటలు పెరిగితే దమయంతి రాత్రంతా మేలుకోవడానికి సిద్ధం అని తెలుసు ఆమెకు. మరుసటిరోజు సోమ



## దాన్ని వదలదట!

'నాయకి'గా జనాల్ని భయపెట్టలేకపోయినా, ఆ జోనర్ మీద త్రిష మక్కువ పోనట్టుంది. అందుకే బాలీవుడ్‌లో ఓ హారర్ మూవీ రీమేక్‌లో నటించడానికి తెగ ఉబలాటపడిపోతోందట! 'నాయకి'గా భయపెట్టలేకపోయిన త్రిష బాలీవుడ్ రీమేక్‌లో ఎలా మెప్పించగలదు? అన్న అనుమానం ఆమె సన్నిహితులకే ఎక్కువగా వస్తోందట! ఇలాంటి ప్రయోగాలు మానుకోమని వారు త్రిషకు సలహా కూడా ఇచ్చారని అంటున్నారు. ఎవరు ఎన్ని విధాలుగా చెప్పినప్పటికీ తిరిగి ప్రేక్షకులను భయపెట్టడాని (అలా ఊహించుకోవలసిందే)కే త్రిష రెడీ అయిపోతోందట! ఇక ప్రేక్షకులను ఆ భగవంతుడే కాపాడాలంటూ టాలీవుడ్ జనాలు జోక్‌లు వేస్తున్నారు.

వారం. బ్యాంకుకి వెళ్ళాలి. నిద్రపోకుండా ఉండడానికి తనకు కుదరదు. రాగిణికి కనీసం ఎనిమిది గంటలు నిద్ర లేకపోతే మరుసటి రోజంతా చిరాకుగా అనిపిస్తుంది. ఎవరైనా ఆమెను నిద్ర మధ్యలో లేపితే వారిని కొట్టినంత పని చేస్తుంది.

భోజనాల తర్వాత శంతను పైపోర్షన్‌కి వెళ్ళిపోయాడు, నిద్ర వస్తోందని. దమయంతి తన గదిలోకి వెళ్ళింది. రాగిణి కూడా బెడ్‌రూమ్‌లోకి వెళ్ళిపోయింది. కమల్ హాల్లోనే పడుకుంటాడు. టీవిలో సినిమా చూస్తూ మెలకువగానే ఉన్నాడు.

అర్ధరాత్రి అయిన తర్వాత దమయంతి గదిలో నుంచి పెద్దగా అరిచినట్లు శబ్దం వినిపించింది కమల్‌కి.

'ఈ ముసల్ది తను నిద్రపోదు, మరెవరినీ నిద్రపోనీదు' అనుకుంటూ లేచి వెళ్ళాడు కమల్. గదిలో చీకటిగా ఉంది. లైట్‌వేసి చూశాడు. దమయంతి మంచం మీదలేదు. నేలమీద పడి ఉంది. మూతి వంకర్లు పోతున్నట్లు వికారంగా ఉంది. ఆమె పరిస్థితి చూసి భయపడ్డాడు కమల్. వెంటనే పరిగెత్తుకుంటూ రాగిణి బెడ్‌రూమ్‌లోకి వెళ్ళి లైట్ వేసి 'అమ్మా, అమ్మా' అంటూ ఆదుర్దాగా పిలిచాడు. ఠక్కున మెలకువ వచ్చింది రాగిణికి. కొడుకుని చూసింది. అతని మొఖంలో కనబడుతున్న ఆత్రుతకు ఆమె నిద్రమత్తు క్షణంలో ఎగిరిపోయింది. 'ఏమైందిరా?' అంది లేచి కూర్చుని.

అమ్మ...మ్మ., అమ్మ...మ్మ' అన్నాడు కమల్.

'ఏమైందిరా అమ్మమ్మకు, అంటూ గబగబా లేచి మంచందిగి పరిగెత్తింది రాగిణి. దమయంతి కుడి చెయ్యి, కుడి కాలు కొంకర్లు తిరిగిపోతున్నాయి. ఆమె నోటి నుంచి రక్తం వస్తోంది. బాగా భయపడిపోయింది రాగిణి. 'అమ్మా, అమ్మా' అంటూవెళ్ళి తల్లి పక్కన కూర్చుని చెయ్యి మామూలుగా చేయడానికి ప్రయత్నించింది. కానీ ప్రయోజనమేమీ లేకపోయేసరికి, 'మావయ్యను పిలుచుకు రారా' అంది గట్టిగా.

కమల్ క్షణంలో పైకి పరిగెత్తాడు. రెండు నిమిషాలలో శంతనుని వెంటబెట్టుకు వచ్చాడు.

పరిస్థితి చూసిన శంతనుకి తల్లికి స్ట్రోక్ వచ్చిందని అర్థమైంది. 'కమల్ అంబులెన్స్‌కి ఫోన్ చెయ్యిరా' అన్నాడు.

ఒక అరగంట తర్వాత దమయంతిని పెద్ద కార్పొరేట్ హాస్పిటల్‌లో ఐసియులో అడ్మిట్ చేశారు. డాక్టర్లు వెంటనే ట్రీట్‌మెంట్ మొదలుపెట్టారు. ఏ విషయమూ నలభై ఎనిమిది గంటలు గడిస్తేగాని చెప్పలేమన్నారు. రాగిణి, శంతను ఆఫీసుకి లీవులు పెట్టేశారు. కమల్ ఇంటికి, హాస్పిటల్‌కి మధ్య తిరగడం మొదలుపెట్టాడు. బైక్ మీద రాగిణిని తీసుకు వెళ్ళడం, తీసుకురావడం, మందులు కొనడానికి తిరగడం, అప్పుడప్పుడు లోపలికి వెళ్ళి చూడడానికి అనుమతి దొరికినప్పుడు వెళ్ళిచూసి రావడం. నలభై ఎనిమిది గంటలు అంటే రెండు రోజులు అనిపించలేదు వాళ్ళకి, నిజంగా నలభై... ఎ...ని...మి...ది గంటలు లాగే అనిపించాయి.

ముగ్గురి ముఖాలు పీక్కుపోయాయి. బాగానే ఉంది అనుకున్న మనిషి హఠాత్తుగా అంత సీరియస్‌గా అనారోగ్యం పాలవడంతో షాక్ అయిపోయారు ముగ్గురూ.

నలభై ఎనిమిది గంటలూ గడిచాయి. కమల్ తండ్రి రాజశేఖర్ కూడా వచ్చాడు. డాక్టర్లు అందరికీ కౌన్సెలింగ్ నిర్వహించారు. పేషంట్ వయసు ఎక్కువ కాబట్టి ఆమె ఆ స్ట్రోక్ ప్రభావాన్ని తట్టుకోలేక పోయిందని, హాస్పిటల్‌లో ఉండగా కూడా ఆమెకు మరో రెండు బలమైన స్ట్రోక్స్ వచ్చాయని, వాటి ప్రభావాన్ని చాలావరకు ట్రీట్ చేసి అడ్డుకున్నా ఆమె శరీరం నీరసంగా ఉండటంతో వాటి ప్రభావానికి గురయిందని చెప్పారు. చివరగా ఆమె గురించి ఇక తాము చేయగలిగింది ఏమీ లేదని, ఆమె ఎక్కువ కాలం బ్రతికే అవకాశాలు లేవని, ఇంటికి తీసుకెళ్ళి ఎవరైనా ప్రైవేట్ నర్సులను పెట్టుకుని మానేజ్ చేయాల్సిందే అని చెప్పారు.

వాళ్ళు చెప్పింది విన్న రాగిణికి తల్లికి ప్రాణగండం గడిచిందని సంతోషించాలో లేక ఆమె జీవచ్ఛవంగా శేషజీవితం గడపాలని బాధపడాలో అర్థం కాలేదు. ఎటువంటి వైద్యం చేసినా అమె పరిస్థితి మెరుగుపడడం జరగదని నిర్మొహమాటంగా చెప్పారు డాక్టర్లు. దమయంతిని ఇంటికి తీసుకు వచ్చేశారు. ఆమెను చూసుకోవడానికి ఒక నర్సుని కూడా పెట్టుకున్నారు. నర్సుకి ఇచ్చే నెల జీతం ఎక్కువే అయినా, కొన్ని పనులు చేయడానికి వారి సహాయం అవసరం ఉండటంతో తప్పలేదు. మొదటి కొద్దిరోజులకే ఇంట్లో ఒక పేషంట్‌ని బెడ్ మీద ఉంచి మానేజ్ చేయటమంటే ఎన్ని కష్టాలు ఉంటాయో రాగిణికి అర్థమైంది.

'కమల్, కాస్త సాయం చేయరా, అమ్మమ్మను కొంచెం పైకి ఎత్తాలి' అంది రాగిణి.

మొబైల్‌లో ఏవో మెసేజెస్ చూస్తున్న కమల్ వెంటనే దాన్ని పక్కకు పెట్టి గబగబా వెళ్ళాడు, అమ్మమ్మను పైకి ఎత్తడానికి. దమయంతి పక్కబట్టలు మార్చింది నర్స్. దమయంతికి మాట్లాడటానికి కుదరడం లేదు. ఆమె కళ్ళు మాత్రం ఎన్నో భావాలను పలికిస్తున్నాయి. తను అలాంటి దైన్యమైన స్థితిలో ఉండటం, కమల్ ఎలాంటి ఫిర్యాదు లేకుండా సేవచేయడం చూస్తుంటే ఆమెకు ఏదో చెప్పాలి అనిపిస్తోంది, కాని మాట్లాడే శక్తిలేదు!

గవర్నమెంట్ స్కూల్‌లో పనిచేసి రిటైర్ కావడం వల్ల దమయంతికి పెన్షన్ వస్తుంది. ఇక పదవీ విరమణ సమయంలో వచ్చిన మొత్తం ఇంటికోసమే ఖర్చుచేసింది. కూతురు, కొడుకు ఆమెకు అన్నీ అమరుస్తూ ఉండేవారు. దమయంతి తన పెన్షన్ డబ్బులు ఉదారంగా ఖర్చు చేసేసేది. అన్నీ బాగున్న రోజుల్లో ఆమెపై తాము పెడుతున్న ఖర్చు వారికి తెలిసిరాలేదు, కానీ అనారోగ్యంతో ఆమె మంచం పట్టేసరికి ఆ ఖర్చు అమాంతం పెరిగిపోయింది. మొదట్లో పెద్దగా ఆందోళన కలిగించకపోయినా క్రమేపి, ఆ ఖర్చులు భారంగా తోచసాగాయి రాగిణి, శంతనులకి.

'అక్కా, అమ్మ కోసం మనంపెట్టే ఖర్చు పెరుగుతూనే ఉంది. ఇలా అయితే మనకు ఇబ్బంది కదా!' అన్నాడు శంతను, ఆ రాత్రి డిన్నర్ తర్వాత కిందికి వచ్చి మాట్లాడుతూ.

'నిజమేరా! అవసరం అనేది, అనారోగ్యం అనేది ఎవరికైనా ఎప్పుడైనా రావచ్చు. ఓపికగా మనవంతు చేయగలిగినంత కాలం చేద్దాం. ఏమంటావు?' అడిగింది రాగిణి.

'ఏమీ అనుకోనంటే ఒక మాట అక్కా! నువ్వు, బావగారు ఇద్దరూ సంపాదిస్తున్నారు. మీకు ఈ ఖర్చులు అంత భారం కాకపోవచ్చు. కానీ నేను ఒక్కడినే కదా మా ఇంట్లో సంపాదించేది. అందుకని నేను నా వాటాగా, ఈ ఇంటికి రెంటుగా ఎంత ఇవ్వగలనో అంత ఇస్తాను. దానితో నువ్వు ఎడ్జస్ట్ చేయక్కా' అన్నాడు శంతను నేల చూపులు చూస్తూ.

'సర్లేరా, అమ్మ ఇంటికి 'రెంటుగా' అనే మాట వద్దు. అలా ఆలోచిస్తే అమ్మ ఇచ్చిన దేహానికి ఎంత రెంటు కట్టాలో మనకి ఎవరు చెప్పగలరు. నీకు శక్తి ఉన్నంత ఇవ్వు. ఫరవాలేదు, మానేజ్ చేద్దాం' అంది రాగిణి సీరియస్‌గా.

కమల్ టీవి చూస్తూ ఒక చెవి అటే వేసి వాళ్ళ సంభాషణ విన్నాడు. తరగని సంపదలు ఉన్నవాళ్ళ విషయం వేరు గాని, మనలాంటి వాళ్ళకు ఆర్థిక ఇబ్బందులు వస్తే ప్రేమలు, అనుబంధాలు నిలబడవేమో అనుకున్నాడు.

ఆ మాటలను దమయంతి కూడా విన్నది. కొడుకుపై కోపం రాలేదు ఆమెకు. కాని తనపై తనకు కోపం వచ్చింది. అనారోగ్యం వచ్చి మంచంలో పడి ఉండడం తనకే కాదు ఇంటిల్లిపాదికీ ఇబ్బందే. భగవంతుడు తననిలా మృత్యువు ముంగిట కూర్చుండబెట్టకపోతే, ఆ గుమ్మం దాటించి మృత్యు గృహానికి సాగనంపవచ్చు కదా అనుకుంది. నోరు తెరిచి మాట్లాడే శక్తి లేదు. శరీరాన్ని ఎటూ కదపలేని విధంగా చేసి తనను ఇలా అందరికీ భారంగా చేసింది ఈ అనారోగ్యం అని తనను తాను నిందించుకుంది. ఇలా అందరికీ భారం కావడం కంటే కమల్ అన్నట్టు 'చచ్చిపోవచ్చుగా...' తను అనుకుంది దమయంతి, మనసులో నిస్సహాయత, నిర్వేదం నిండిన మౌనంలో కూరుకుపోతూ!

రోజులు గడుస్తున్నాయి. మందులు పనిచేయడం తగ్గిపోసాగింది. దమయంతి పరిస్థితి రోజురోజుకీ క్షీణించి పోతోంది. ఆమెకు సేవలు చేసే నర్సుకి, కమల్‌కి మాత్రమే ఆమెలో వస్తున్న మార్పులు కనిపిస్తున్నాయి. రాగిణి, శంతను తమ తమ రోజువారీ రొటీన్లలో పడిపోయారు. మొదట్లో కనీసం రోజుకి రెండుసార్లు తల్లి దగ్గర కూర్చుని కొద్దిసేపు మాట్లాడుకునేవారు. ఆ మాటలు మొదట్లో తల్లికి ఉత్సాహం తెచ్చేవిధంగా ఉండేవి. ఆమె మాట్లాడలేక పోయినా, ఆమె స్పందనల్ని ఊహించుకుంటూ మాట్లాడేవాళ్ళు. మెల్ల మెల్లగా ఆ ప్రయత్నం మానుకున్నారు. తర్వాత్తర్వాత, అసలు ఆమె ఉన్న విషయాన్ని కూడా పట్టించుకోకుండా తమ ధోరణిలో తాము మాట్లాడుకోవడం మొదలు పెట్టారు!

తమ ప్రవర్తన ఇలా మారిన విషయం వారికి తెలియనే తెలియదు. తాము మునుపటి లాగానే ఉన్నాం అనుకుంటున్నారు వాళ్ళు. తన గురించి మాట్లాడటం ఆపి వేయడంతో తను ఊపిరితో ఉన్నా లేనట్లు అనిపించేది దమయంతికి. దానితో ఆమెకు జీవితం మహాభారంగా తోచడం మొదలు పెట్టింది. ఇక ఆమె మనసులో ఎప్పుడూ అదే ఆలోచన మెదిలేది, 'తను చచ్చిపోవచ్చుగా' అని. కాని అలా చచ్చిపోవడానికి కూడా తను ఏమీ ప్రయత్నం చేయలేని అశక్తురాలు అని గుర్తుకొచ్చి గుండెను రంపపుకోత కోసినట్టు విలవిలలాడేది. కమల్ చేస్తున్న సేవలు చూసి అప్పుడప్పుడు మిణుకుమిణుకుమంటూ ఒక ఆశ ఆమె మనసులో మెదిలినా, అంతులేని దట్టమైన మబ్బుల్లా ఆమె మనసుని నిరాశా నిస్పృహలు చుట్టుముట్టి ఆమెను 'చచ్చిపోవచ్చుగా' అనే ఆలోచనలలో ముంచేసేవి!

తాము ఇస్తున్న మందులు పనిచేయక పోవడం గమనించిన డాక్టర్లు, ఆమె తీవ్రమైన డిప్రెషన్‌కు లోనైందని, బ్రతకడం చాలా కష్టమని చెప్పేశారు. ఇక మందులు మెల్లగా ఆపేయడం మంచిదని ఒక సలహా కూడా ఇచ్చారు. కాని రాగిణి, శంతను మందులు ఆపడానికి ఇష్టపడలేదు. భగవంతుడు ఇచ్చిన ప్రాణం ఆయన నిలిపినంతవరకు ఉంటుంది. పోవాలని మేము కోరుకునే ప్రసక్తే లేదని కచ్చితంగా చెప్పారు డాక్టర్లతో.

ఇంట్లో ఆర్థిక పరిస్థితి, అమ్మమ్మ ఆరోగ్య పరిస్థితి కమల్‌పై ప్రభావం చూపించాయి. ఉద్యోగం గురించి తను చేస్తున్న ప్రయత్నాలను ముమ్మరం చేశాడు. 'మేనేజర్‌గానే చేస్తాను' అనే పట్టుదల సడలించి హోటల్లో ఫ్లోర్ మేనేజర్‌గా చేరిపోయాడు. కష్టమైన పనైనా శ్రద్ధగా చేయడం మొదలుపెట్టాడు. మొదటి జీతం అందుకునే వరకు ఇంట్లో ఎవరికీ చెప్పలేదు. జీతం వచ్చాక, పండ్లు, స్వీట్స్, బట్టలు కొని ఇంటికి తెచ్చాడు.

'ఏయ్ ముసిలీ, నాకు ఉద్యోగం రాదనుకున్నావు కదా, చూడు, జాబ్ తెచ్చుకున్నాను. నా జీతంలో ఖర్చులు పోగా మిగిలిన మొత్తం నీకే' అంటూ అమ్మమ్మకు తను తెచ్చిన పండ్లు, స్వీట్స్‌తో పాటు, బట్టలు ఇచ్చాడు. వాటితోపాటు, డబ్బులున్న కవర్ కూడా ఇచ్చాడు. అవయవాలు కదపలేని దమయంతికి ఆ క్షణంలో మనవడు తనపైన చూపిస్తున్న ఆపేక్షకు గుండెకరిగి, కళ్ళు ఆనందబాష్పాలతో నిండిపోయాయి. శక్తి అంతా కూడగట్టుకుని చేతులు కదపడానికి విఫల యత్నం చేసింది. నోటిని కదిపి ఏవో అస్పష్ట శబ్దాలు చేస్తూ స్పందించింది.

ఎప్పుడూ అమ్మతో కొట్లాడే కమలేనా వీడు అన్నట్లు ఆశ్చర్యంగా చూసింది రాగిణి, కమల్ వైపు.

'అమ్మా, నా జీతమంతా ఈ ముసిలిదానికి ఇచ్చేస్తాను. నీకు ఓకే కదా!' అన్నాడు కమల్ గద్గదమైన కంఠంతో.

'అలాగేరా కమల్' అంది రాగిణి ఆప్యాయంగా కన్నకొడుకు తల నిమురుతూ.

'ఈ ముసిలితో గొడవపడకపోతే నాకు ఏమీ తోచడం లేదమ్మా. ఏదో తమాషాకి చచ్చిపోవచ్చుగా అనేవాడిని కానీ నాకు అమ్మమ్మ అంటే చాలాఇష్టం. నేను అలా అన్నందుకే మీ అమ్మకు ఇలా అయిందని నాకు చాలా బాధగా ఉందమ్మా.

ఏయ్ ముసిలీ... నువ్వు చచ్చిపోకూడదు. నాకోసం బ్రతికే ఉంటావు కదూ! చెప్పవే, చెప్పు' అన్నాడు కమల్ కన్నీళ్ళు కారుస్తూ.

దమయంతికి కమల్‌ని దగ్గరకు తీసుకుని వెన్నునిమిరి అతని నుదుటిపైన ముద్దు పెట్టుకుని, అలాగేరా కమల్ అని చెప్పాలనిపించింది. ఆమె ముఖంలోని నిర్వేదం మాయమైపోయింది. ఒక అంతు తెలియని ప్రశాంతత ఆమె మనసంతా నిండిపోయి, ఆమె ముఖం ఒక వింతైన కాంతితో వెలిగింది. ఆమెలో చలనం ఆగిపోయింది. అయినా ఆమె చూపుల నుంచి ప్రేమ, వాత్సల్యాలు కమల్‌పై కురుస్తూనే ఉన్నాయి.

సెల్:91-9163340600




**చాలా రోజుల తరువాత తమ ఇంటికి వచ్చిన శ్రావ్యను చూసి చంద్రిక మొహం వికసించింది.**

**"ఏమిటే, బొత్తిగా నల్లపూస అయిపోయావు.." అన్నది చంద్రిక నవ్వుతూ.**

**"నల్లపూసా లేదు, తెల్లపూసా లేదు. ఈతిబాధలు... పురుళ్ళూ... హాస్పటళ్ళూ..."**

**"ఏమిటి? పురుడు నీకే?"**

**"నాక్కాదే బాబూ! మా మేనత్త పురిటికొచ్చింది. కొడుకు పుట్టాడు.."**

"ఓహో, మొగుడు పుట్టాడన్నమాట! మొగుడితో ముద్దులూ, మురిపాలూ.."

"ముద్దులూ, మొద్దులూ ఏం లేవుగానీ, రేపు బాలసారె. సకుటుంబ సపరివార సమేతంగా రావాలి.." అని పిలిచింది శ్రావ్య.

"కాఫీ పట్టుకొస్తాను. ఈలోగా ఈ ఆర్టికల్ చదువు.." అని చంద్రిక లోపలికి వెళ్ళింది.

ఆ ఆర్టికల్‌లోని సారాంశం ఏమిటంటే, అమెరికాలో ఓ అందాలభామ కోటీశ్వరుడికి వల విసిరి పెళ్ళి చేసుకుంది. ఏడాది తిరక్కుండానే విడాకులు తీసుకుంది. మనోవర్తి కింద నెలనెలా వచ్చేదాంతో దిగులు లేకుండా గడిచిపోతోంది. ఇక అడిగేవాడు లేడు. స్వేచ్ఛా జీవితం గడిపేస్తోంది. ఇటీవలి కాలంలో ఇలాంటి కేసులు ఎక్కువ అవుతున్నాయని వ్యాస రచయిత ముక్తాయింపు ఇచ్చాడు.

చంద్రిక కాఫీ అందిస్తూ "ఇదేదో బానే ఉందే?" అన్నది.

"అమెరికాలో ఏం చేసినా చెల్లుతుందేమో కానీ, ఇక్కడ ఆ పప్పులు ఉడకవు" అన్నది శ్రావ్య.

"కాలంతోపాటు ఆలోచనా ధోరణులూ మారుతున్నాయి" అన్నది చంద్రిక.

"విడిపోవాలన్న ఆలోచనతో పెళ్ళి చేసుకోవటం మోసమే గదా!"

"కట్నాలు గుంజటం, కిరసనాయిలు పోసి తగలబెట్టటం, చిన్నిల్లు, పెద్దిల్లు అంటూ మానసికంగా హింసించటం... వీటన్నింటినీ మన సమాజం మౌనంగా భరిస్తోందా లేదా? అలాంటప్పుడు ఆ అమెరికా అమ్మాయి ఆలోచన తప్పు ఎలా అవుతుంది?..."

ఇద్దరి మధ్య చాలాసేపు ఘాటుగా చర్చ జరిగింది. చివరకు శ్రావ్య విసిగిపోయి అన్నది.

"సరేలే... నువ్వూ ఇలాగే ఎవడినన్నా కట్టుకుని, విడాకులు తీసుకుని స్వేచ్ఛగా జీవించు. నిన్ను ఆదర్శంగా తీసుకుని మరికొంతమంది తయారవుతారు".

"వైనాట్? నలుగురు నడిస్తే... దారి ఏర్పడుతుంది"

"సర్లేవే... నేనూ చూస్తాగా... నీ ఆదర్శాన్ని ఎంతవరకు నిలబెట్టుకుంటావో?"

నవ్వుతూ చెయ్యి కలిపింది చంద్రిక.

•••

చంద్రిక అందంగా ముస్తాబై, బాలసారె

ఫంక్షన్‌కి వెళ్ళింది.

"ఎవరైనా ప్రొడ్యూసర్ చూస్తే నిన్ను హీరోయిన్‌గా బుక్ చేసేస్తాడు.." అన్నది శ్రావ్య.

"నిజంగా అంత బావున్నానా?" అని నవ్వింది చంద్రిక.

"చట్టం చట్టుబండలూ అడ్డొస్తున్నాయిగానీ, నేనే నిన్ను చేసుకునేదాన్ని.."

"నీ లెవెల్ చాలదే.."

"ఓహో... నీ ప్లాన్ వేరే ఉందిగదూ.." అని నవ్వింది శ్రావ్య.

ఆ ఫంక్షన్‌కి సదాశివరావుగారు సకుటుంబంగా వచ్చారు. ఆయన మాజీ రాజకీయ నాయకుడు. వేరే వ్యాపారమూ ఉంది.

ఆయన భార్య పిల్లాడి మెడలో బంగారు గొలుసు వేసి ఆశీర్వదించింది. ఆయన కొడుకు అర్జున్ కూడా వచ్చాడు.

శ్రావ్య చంద్రికను పరిచయం చేసింది.

"నా బెస్ట్‌ఫ్రెండ్! ఇండియాలో చదువంతా ఔపోసన పట్టేసింది. అభ్యుదయ వాది. కవిత్వం రాస్తుంది.."

"హాయ్.. నైస్‌టు మీట్ యు.. నాకూ కవిత్వం అంటే ఇష్టం.."

"రాస్తుంటారా?" అడిగింది చంద్రిక.

"ప్రయత్నం చేస్తుంటాను" అన్నాడు అర్జున్.

ఇద్దరూ ఒకచోట కూర్చుని కవిత్వం గురించి కబుర్లు కలబోసుకున్నారు. వెళ్ళేటప్పుడు కార్డు ఇచ్చాడు అర్జున్.

**చంద్రిక, శ్రావ్య స్నేహితులు. ధనవంతుణ్ణి పెళ్ళి చేసుకుని ఒక ఏడాదిలోపు విడాకులు తీసుకుని ఆ వచ్చే మనోవర్తితో హాయిగా కావాల్సినంత స్వేచ్ఛతో జీవించే ధోరణి అమెరికాలో పెరిగిపోతోందన్న వార్తను సమర్థించింది చంద్రిక. వ్యతిరేకించింది శ్రావ్య. వారిద్దరిమధ్యా దీనిపై వాడివేడి చర్చ జరిగింది. చివరకు వారిమధ్య జరిగిన ఆ చర్చ ఎక్కడికి దారితీసింది? నిజజీవితంలో వారిద్దరూ ఏం చేశారు?**

"మీరు ఎప్పుడైనా ఫోన్ చేయవచ్చు. అర్ధరాత్రి నిద్రలేపినా ఏమీ అనుకోను.." అన్నాడు నవ్వుతూ.

చంద్రిక నవ్వింది. కార్డు వంకే చూస్తుంటే శ్రావ్య దగ్గరకొచ్చి అన్నది.

"జాగర్త... చాలా పలుకుబడిగల ఫ్యామిలీ.."

"సో... వాట్?" అన్నది చంద్రిక.

రెండు రోజుల తరువాత చంద్రిక అర్ధరాత్రి ఫోన్ చేసింది.

"అర్ధరాత్రి అయినా చేయవచ్చునన్నారుగదాని.."

"మంచిపని చేశారు! నిద్రపట్టక నింగిలోని చంద్రిక వంక చూస్తున్నాను.."

"కవి హృదయం కదా.. ఏమనిపిస్తోంది?"

"వచ్చీరాని కవిత్వం... బులిబులి నడకలు.."

"దానంత అందం ఇంక దేనికీ లేదు... మేము వినొచ్చా?"

"నవ్వనంటే చెబుతాను.."

"చస్తే నవ్వను.."

"వినండి మరి... నువ్వు కిలకిలా నవ్వినప్పుడే కాదు, వలవలా విలపించినప్పుడూ నేను నీకు తోడు నీడై ఉంటాను. పరిమళాలు వీడని, వాడని పొగడపూల దండలు అల్లుతున్నప్పుడు, తోరణమై నీ ముంజేతిని చుట్టుకునే ఉంటాను. దిగంతాల కావలివైపు దిగులుగా దృష్టి సారించినప్పుడే కాదు. మహోజ్వల భవిష్యత్తు గురించి బంగారు కలలు కంటున్నప్పుడూ, నేను నీ కంటి చూపునై ఉంటాను. ఆశాసౌధాలు ఎక్కుతున్నప్పుడే కాదు, పర్వతశ్రేణులనుంచి జారిపడుతున్నప్పుడూ, నేను నీ బిగబట్టిన గుండె చప్పుడునై ఉంటాను. విధి నిర్దయగా ఇద్దరినీ ఉత్తర దక్షిణ ధృవాలకు విసిరేసినప్పుడు, నిలువెల్లా మంచులో కూరుకు పోతున్నప్పుడూ నీ నామ జపమే చేస్తుంటాను. నిన్ను ప్రేమిస్తూనే ఉంటాను.." అని ఆగాడు.

"వహ్వా.... ఏం చెప్పారండీ.. ఎక్కడన్నా దొరికితే, అక్షరానికో వరహా చొప్పున ఇవ్వచ్చు... ఇంతకీ మీ ప్రేయసీ, ఊర్వశీ ఎవరో? మేం చూడొచ్చా?" అని అడిగింది.

"దానికేం భాగ్యం? రేపు మధ్యాహ్నం మా కంపెనీకి రండి. చూద్దురుగాని.." అన్నాడు.

"ఊర్వశి నిజంగా వస్తుందా?" అని అడిగింది

చంద్రిక.

"కలలోనూ, ప్రేమకళలోనూ అసాధ్యాలు సుసాధ్యాలు అవుతాయి.." అన్నాడు.

అతను ఎటు తీసుకెళ్తున్నాడో ఆమెకు తెలుస్తూనే ఉంది. ఆమె వెళ్ళాలనుకుంటున్నదీ అటే - అసాధ్యాన్ని సుసాధ్యం చెయ్యాలని.

మర్నాడు మధ్యాహ్నం అతని ఆఫీసుకి వెళ్ళింది. పది నిమిషాల తర్వాత అడిగింది.

"మీ ఊర్వశి రాలేదేం?" అని.

"వచ్చావుగదా... కొలను అంచున సంచరించు రాయంచనంటూ.."

"నేను గాదు.. మీ ఊర్వశి.."

"లంచ్‌కి వస్తానంది. హోటల్‌కి వెళ్దాం.." అన్నాడు.

హోటల్‌కి వెళ్ళాక, పావుగంట తరువాత మళ్ళీ అడిగింది.

"వచ్చావుగదా... ముసిముసి నవ్వులతో మురిపెంబు నడకలతో.."

"నేను గాదు మీ ఊర్వశి.." అని నవ్వింది చంద్రిక.

"మీ రికమండేషన్ ముందు ఊర్వశి తట్టుకోలేక.. రాలేకపోతోంది.."




"నా రికమండేషనా?" అని ఆశ్చర్యంగా అడిగింది చంద్రిక.

"అందమైన రూపం, దేవుడిచ్చిన గొప్ప రికమండేషన్ లెటర్ లాంటిది. ఎక్కడికెళ్ళినా తిరుగుండదు" అన్నాడు అర్జున్.

"కానీ నేను మీ అంత గొప్పదాన్ని కాదు.."

"గొప్పవాడు ఎప్పుడూ ఒంటరివాడే! పైకి వెళ్ళే ప్రయ్నతంలో తనకు తెలియకుండానే అందరికీ దూరమై పోతుంటాడు" అన్నాడు అర్జున్.

"ఫర్వాలేదు.. పిలవండి. మీ ఊర్వశిని చూడాలని ఉంది..".

"రేపు ఇద్దరం ఢిల్లీ వెళ్తున్నాం.. మా కంపెనీ పనిమీద. మీరూ రండి, కంపెనీ ఇద్దురుగాని.."

"నేనెందుకు మీ మధ్యన.. పానకంలో పుడకలాగా.."

"పానకమూ లేదు... పుడకా లేదు. మీరు పావనం చెయ్యాలి. ఒక పనిమీద రెండుసార్లు వెళ్ళాను. పని కాలేదు. ఈసారి మీరు వస్తే పని అయిపోతుందన్న ఆశ..."

సెంటిమెంటుతో కొడుతున్నాడని అర్థమై నవ్వింది.

"పని కాకపోతే నన్ను తిడతారు.. వద్దులెండి"

"మీకు తెలియదుగానీ, కొంతమంది పక్కన నిలబడితే చాలు, చేతికి రక్షరేక కట్టుకున్నట్లే.."

"ఎన్ని రక్ష రేకలున్నా శ్రీరామరక్ష ఉండాలి.."

"అందుకే మీరుంటే చాలు, కొండల్ని పిండి కొట్టేస్తాను.." అన్నాడు.

"ఢిల్లీలో కొండలున్నాయా?" సీరియస్‌గా అడిగింది.

"తెలియనిచోట ప్రతివాడూ ఒక కొండ.. బండలాంటివాడే.."

విమానంలో ఢిల్లీ వెళ్ళారు. హోటల్లో దిగారు. అతను ఆమెను విడిచి బయటకు వెళ్ళలేదు.

"ఏదో పని ఉందన్నారు?.."

"పనిమీదే ఉన్నాను. మీకు కొంచెం కొంచెం దగ్గరవుతున్నాను"..

"మీ ఊర్వశి ఏది?"

"వచ్చావు గదా! కొత్త సొగసులు సంతరించుకున్న కొంజిగురుటాకులా... నవజీవన వసంతోత్సవాన్ని వెంట తెస్తూ.."

"నన్ను మీ ఊర్వశిలా చూడకండి. నేనసలే చాలా స్ట్రిక్ట్..." అన్నది చంద్రిక.

"అవునవును... స్ట్రిక్ట్‌గానే ఉండాలి. నాకు ఈ అలివేణి చిరునవ్వులు చాలు.. కంటి కొసల నుంచి జారిపడుతున్న కాంక్షలు చాలు.. వలపు తూగుటుయ్యాలూగించు చిలిపి మాటల సయ్యాటలు చాలు.." అన్నాడు.

ఢిల్లీలోను, ఆగ్రాలోను చూడాల్సిన ప్రదేశాలన్నీ తిరిగారు. అనుకోకుండానే ఆత్మీయతా భావంలో బందీలైపోయారు. ఒకరకంగా ఒకరినొకరు అర్థం చేసుకున్నారు. పెళ్ళి చేసుకోవాలన్న నిశ్చయంతో, తిరిగి వచ్చారు.

తమ పెళ్ళికి భూదేవి అంత అరుగులు వేసి, ఆకాశమంత పందిళ్ళు వేయాలని ఆశపడ్డాడు అర్జున్.

ఆమె మాత్రం రిజిస్టర్ మ్యారేజ్ చేసుకుందామన్నది. శ్రావ్యను రిజిస్ట్రార్ ఆఫీసుకు రమ్మన్నది చంద్రిక. పూలదండలు తెచ్చింది శ్రావ్య.

అర్జున్ తన కవితా ధోరణిలో అన్నాడు.. "జర రుజ మరణ దుర్గమారణ్యాల మధ్య నీవు నడుస్తున్నప్పుడూ, నేను నీ కాలి అందియల చప్పుడునై ఉంటాను." అని.

శ్రావ్య చంద్రికను ఒంటరిగా చూసి అడిగింది.

"అతను అంత సీరియస్‌గా చెబుతున్నాడు. నీ సంగతి ఏమిటి?"

"నా నిర్ణయంలో ఎలాంటి మార్పులేదు. ఏడాది... మహా అయితే రెండేళ్ళ తర్వాత విడాకులు తీసుకుంటాను.." అన్నది చంద్రిక.

"ఏ కారణంతో తీసుకుంటావు?"

"డొమెస్టిక్ వయొలెన్స్.. దానికి తిరుగులేదు" అన్నది చంద్రిక.

●●●

కొన్నేళ్ళు గడిచాయి.

సూర్యుడు జీవన సంధ్యలో ఉన్నాడు.

అర్జున్ చక్రాలకుర్చీలో కూర్చున్నాడు. చంద్రిక వీల్‌చెయిర్‌ను నెట్టుకుంటూ పార్కులోకి వచ్చింది.

ఆమె సాదా సీదా నేత చీర కట్టుకుంది. మొహం మీద వయసు గీసిన గీతలు, పడిన కష్టాలకు సాక్షీభూతాలుగా నిలిచాయి. నిండుగా నవ్వి ఎన్నేళ్ళయ్యిందో?

పార్క్‌లో పిల్లలు ఆడుకుంటున్నారు. పదేళ్ళ పిల్లాడు ఆటలో పరిగెడుతూ వచ్చి కుర్చీలో ఉన్న అర్జున్ మీద పడబోయాడు.

"సారీ, సారీ.... అంకుల్" అంటూ చంద్రికను తప్పుకోమని చక్రాల కుర్చీని తొయ్యటం మొదలెట్టాడు, దూరంగా ఉన్న తల్లి వంక చూస్తూ.

చంద్రిక కూడా ఆమె వంక చూసింది. శ్రావ్య...!

ఒక్క ఉదుటున శ్రావ్య వచ్చి చంద్రికను పట్టేసుకుంది.

"ఎన్నేళ్ళయిందే నిన్ను చూసి... గుర్తుపట్టలేకపోయాను" అన్నది శ్రావ్య.

జీవం లేని నవ్వు నవ్వింది చంద్రిక. ఆ కుర్రాడు అర్జున్‌తో కబుర్లలో పడ్డాడు.

శ్రావ్య, చంద్రిక ఒకచోట కూర్చుని ఆప్యాయంగా మాట్లాడుకుంటున్నారు.

"నువ్వు విడాకులు తీసుకుని, మనోవర్తి గుంజుతూ, ఇండిపెండెంట్‌గా, బేఫికర్‌గా, ఖుషీ ఖుషీగా జీవిస్తూ ఉంటావని అనుకుంటూ వచ్చాను. ఇంత దీనంగా చూస్తానని అనుకోలేదు.." అన్నది శ్రావ్య.

చంద్రిక కొద్దిసేపు మాట్లాడలేదు. బహుశా ధైర్యాన్ని కూడదీసుకుంటోందేమో - నెమ్మదిగా మొదలెట్టింది.

"యవ్వనంలో ఉన్నప్పుడు, వనంలో తిరిగే మృగరాజుకున్నంత ధీమా.. గర్వోన్నతి... ప్రపంచాన్ని శాసించగలమన్న ధైర్యం... నలుగురి కన్నా భిన్నంగా... గొప్పగా ఉండాలన్న ఆశ.. ఆవేశం ఆలోచనల్ని లాక్కెళ్తున్న సమయం.. జీవితం ఏదో తవ్వి తలకెత్తుతుందన్న భ్రమ.. ఏదీ జరగదు. ఆ నాలుగుమొహాలవాడు మన మొహాన ఏం రాశాడో అదే జరుగుతుంది.

"నిజమే... పెళ్ళికి ముందు డబ్బు ఉంటే చాలు ఏమైనా చేయవచ్చన్న భ్రమలో బ్రతికాను. మనిషి అండదండలు ఎంత అవసరమో, కాలం చెప్పిన పాఠాలవల్ల తెలిసింది. నాది ప్రేమ వివాహమా

అంటే - అవుననీ చెప్పాలి, కాదనీ చెప్పాలి. ఆయన నిజమైన ప్రేమ ముందు నా కపట ప్రేమ వెలా తెలాపోయింది.

"పెళ్ళైన కొత్తలో ఎలా ఘర్షణ పడాలో అన్న ఆలోచనతోనే ఉండేదాన్ని. కానీ ఆయన అన్నిటికీ 'సరే, నీ ఇష్టం' అంటుంటే ఘర్షణకు తావేది? ఆరు నెలల తరువాత నేను గర్భవతిని అయ్యాను. పిల్లల్ని కనటం నాకు ఇష్టం లేదు. అందుకు రెండు కారణాలు. ఒకటి అందం దెబ్బతింటుందని.. రెండోది లంపటంలో పడి కొట్టుకోవటం ఇష్టంలేదు. ఆయనకి ఇష్టం లేకపోయినా అబార్షన్ చేయించుకున్నాను. ఇలా రెండుమూడు సార్లు జరిగింది. చివరకు ఇంక పిల్లలు కలిగే అవకాశమే లేకుండాపోయింది. స్వయంకృతాపరాధం...

"ఆయన కంపెనీలో వాటా ఇవ్వమన్నాను. కంపెనీ నీదే గదా... నువ్వు రేపటినుంచి ఎం.డి.వి అన్నారు. అన్నంత పనీ చేశారు. ఇల్లు అమ్మేద్దామన్నాను. ఆ ఇంటితో ఆయనకున్న అనుబంధం నాకు తెలుసు. బాధను గరళంలా మింగి అమ్మేశారు.

"నా పుట్టింటివాళ్ళు చెప్పుకోదగ్గ మనుషులు కాదు. వాళ్ళంటే నాకే చిరాకు. కానీ ఆయన వాళ్ళను నెత్తిన పెట్టుకున్నారు. మా నాన్నకు త్రోట్ కేన్సర్... కన్నకొడుకు కన్నా ఎక్కువగా ఈయన మా నాన్నకు సేవచేశాడు. 'దేవుడు నీ రూపంలో వచ్చి ఆదుకుంటున్నాడు నాయనా' అంటూ చిన్నవాడైనా ఈయనకు చేతులెత్తి దణ్ణం పెట్టి వెళ్ళిపొయ్యాడు. మా తమ్ముడికి చదువు అబ్బలేదు. చిల్లర దొంగతనాలు చేసి పట్టుబడితే, పదేపదే ఈయన పోలీస్‌స్టేషన్లకి వెళ్ళి విడిపించుకొచ్చారు. మా అమ్మ మానసికంగా దెబ్బతిని, పిచ్చిదానిలా ప్రవర్తించేది. ఇంట్లోపెట్టుకుని పిచ్చి చేష్టలన్నీ భరించారు.

"నన్ను ప్రేమించిన నేరానికి నా కుటుంబాన్ని అంతటినీ ప్రేమించాల్సి వచ్చింది. భరించారు... సహించారు. ఆయన్ను వదిలించుకుందామని నేను ప్రయత్నించేలోపే, ఏదో ఉపద్రవం వచ్చిపడేది. ఆయనే గట్టెక్కించేవారు. నేను కోరుకున్నది ఆయన ఆదాయంలోని కొంత డబ్బు.. అది ఎంత పిచ్చి ఆలోచనో కాలం నాకు తెలియజెప్పింది. ఆయనదంతా నాదే అయినప్పుడు, ఇంక వాటా ఏమిటి? ఇక స్వేచ్ఛమాట... 'కాదు, లేదు' అన్న మాటలు ఆయన నోట రానప్పుడు, ఇంక ఇంత కన్నా స్వేచ్ఛ ఎక్కడుంటుంది?

"ఎక్కడ ప్రేమించే మనిషి పక్కన ఉంటాడో, అక్కడ భూతల స్వర్గం ఉంటుంది. స్వర్గంలోనూ ఉండేది ప్రేమే. ప్రేమ లేనిచోట నరకమే.

"భగవంతుడు నన్ను పరీక్షించాడు. శబరిమలై వెళ్ళి వస్తుంటే ఆయనకు యాక్సిడెంట్ అయింది. చక్రాల కుర్చీకి అంకితమైపోయాడు.

"అవిటివాడు అయ్యాడన్న బాధకన్నా, ఇంక నేను ఎప్పుడూ నీ భుజం పట్టుకుని నిలబడొచ్చునని సంబరపడే పసివాడిని ఎలా వదిలించుకోను?

"పెళ్ళిరోజు ఆయన అన్నమాటలే ఎప్పుడూ నా చెవుల్లో మారుమోగుతుంటాయి. జర రుజ... నీ కాలి అందియల.." పట్టరాని దుఃఖం పెల్లుబికి వచ్చి మాటల్ని మింగేసింది.

పైట చెంగులో మొహం కప్పుకుని కుమిలి కుమిలి ఏడ్చింది.

కొంతసేపటికి తెప్పరిల్లి ఎగబీలుస్తూ అన్నది.

"ఆజమాయిషీ చేసేవాళ్ళు లేకపోవటంతో కంపెనీ నష్టాల్లో కూరుకుపోయింది. మూసేశాం... మిగిలిన కొద్దిపాటి డిపాజిట్స్ మీద వచ్చే వడ్డీతో ఉండీలేనట్లు ఉంటున్నాం.." అని ముగించింది.

"సారీ చంద్రికా... ఆయనకు ట్రాన్స్‌ఫర్స్... ఇండియా అంతా తిరుగుతూ గడిపాం. ఈ మధ్యనే మళ్ళీ ఇక్కడికొచ్చాం. అయిదారేళ్ళు అయ్యింది.." అన్నది శ్రావ్య.

"రేపు మీ ఆయన్ని, పిల్లాణ్ణి తీసుకుని మా ఇంటికిరా... చాలా రోజులైంది..."

"ఆయన రారు..."

"ఏం?"

"నాకు విడాకులు ఇచ్చారు! ఏడాది అయింది. మరొకామెను పెళ్ళి చేసుకున్నారు....'

"అవునా?... ఈ వయసులోనా?" అని ఆశ్చర్యంగా అడిగింది చంద్రిక.

అవునన్నట్లు తలూపింది శ్రావ్య... దూరంగా ఎటోచూస్తూ.

**సెల్: 99595 56876**



# భిక్ష

పి.వి.బి. శ్రీరామమూర్తి

**రాత్రి పది గంటలైంది. బ్యాంకుకి తాళాలు వేసుకుని ఇంటికొచ్చేసరికి! రాగానే అరుంధతి గ్లాసుతో నీళ్ళిచ్చింది. తాగాను.**

**అప్పుడు చెప్పింది.**

**పిడుగులాంటి వార్త!**

**నాక్కోపం నషాళానికెక్కింది. "నీకు బుద్ధుందా? నన్నడక్కుండా, నా ప్రమేయం లేకుండా నిర్ణయాలు తీసుకోవటం నీ ఇష్ట మేనా? అందులో నా విషయంలో' అన్నాను.**

జీవితంలో అరుంధతిమీద అంత నోరు చెయ్యటం ఇరవైఏళ్ళ కాపురంలో అదే మొదటిసారి. అరుంధతి దుఃఖం ఆపుకోలేకపోయింది. భళ్ళు మంది. పైటకొంగు నోటికడ్డంగా పెట్టుకుంది.

"క్షమించండి. ఈ ఒక్కసారికీ నా మాట మన్నించండి. జీవితంలో మరెప్పుడూ మీకు చెప్ప కుండా మీ విషయంలోనే కాదు, నా విషయంలో కూడా నేనే నిర్ణయం తీసుకోను" అన్నది కళ్ళు తుడుచుకుంటూ.

నాకు సమస్యేదైనా తీవ్రంగా వేధించినప్పుడు పరిష్కారం కోసం సిగరెట్టు కాల్చటం అలవాటు. వెంటనే సిగరెట్టు నోట్లో పెట్టుకుని లైటర్‌తో వెలిగించాను.

"అదిగో! అక్కడే మీకూ నాకూ వస్తుంది. రాత్రంతా 'ఖళ్... ఖళ్'మని ఒకటే దగ్గు. మీరు అసలు నిద్రపోలేదు. రాత్రేకాదు, ఈ మధ్య మీకు దగ్గూ, కఫం ఎక్కువైంది. మందులా పని చెయ్యటం లేదు. సిగరెట్లు మరీ ఎక్కువైపోయాయి. మానమంటే మానరు!" అంది.

"ఏం చెయ్యను. బ్యాంకులో పని ఒత్తిడి ఎక్కు వయింది. స్టాఫ్ తక్కువ. వీరయ్య అటెండరైనా కంటికిరెప్పలా ఉన్నాడు కాబట్టి సరిపోయింది, బుర్ర వేడెక్కినప్పుడు దానికి విశ్రాంతి అవసరం. వాలంటరీకీ టైం కాదు" అన్నాను.

"అందుకే, పొద్దున్న అన్నయ్య వస్తే నాగోడు చెప్పుకున్నాను. చెపితే ఈ పరిష్కారం చూపెట్టాడు. ఈ ఒక్కసారీ నామాట కాదనకండి" చేతులు పట్టుకుని బతిమలాడింది.

ఎంతోసేపు ఆలోంచించాను.

ఆమె నిర్ణయంలో తప్పులేదనిపించింది.

అనవసరంగా నోరు చేసుకున్నందుకు చాలా బాధపడ్డాను, రాత్రల్లా!

•••

సోమవారం ఏకాదశి!

అయ్యప్పస్వామి కోవెల రద్దీగా ఉంది!

ఆలయం నిండా స్వాములుగా మాల వేసుకో బోయేవారే!

గురుస్వామి మా బావే!

మా వీరయ్య కూడా మాల వేయటానికి తగిన సామగ్రితో వచ్చి నన్ను చూసి ఆశ్చర్యపోయాడు.

"బాబూ! తమరూ..."

"అవును వీరయ్యా! నా చేత సిగరెట్లు మాన్పించ టానికి అమ్మగారీ నిర్ణయం తీసుకున్నారు. పోనీలే, ఈ విధంగానైనా సిగరెట్టు మానేయగలనేమో చూద్దాం!"

"బాబూ! ఈ నలభై రోజులే కాదు, ఆ తరువాత కూడా మానేస్తేనే ఈ దీక్ష ఫలితం. మీ ఉప్పు తిని బతికినవాణ్ణి కాబట్టి మీకు చెప్పలేదిన్నాళ్ళూ. తమరు దగ్గుతున్నప్పుడల్లా సెప్పాలనుకునేవాణ్ణి, సిగరెట్లు తగ్గించమని. తమరేమనుకుంటారోనని సెప్పలేక పోయాను" అన్నాడు.

వీరయ్య మా పాలేరు కొడుకు.

మా ఊళ్ళో మాకు తోటలూ, పొలాలూ ఉన్నాయి. మా నాన్నగారిది కరణీకమే అయినా ఊరికి రాజు. నలుగురన్నదమ్ములం. ముగ్గురు అక్కచెల్లెళ్ళు. అందరూ మంచిస్థితిలో ఉన్నవాళ్ళే!

నాన్నగారే అప్పట్లో అన్నారు 'నీ బ్యాంకులో

# (ఆధునిక మహిళకు ఆందోళన కలిగించే రొమ్ములో గడ్డలు) లేదా రొమ్ములో కణితులు

ఆధునిక మహిళ అన్ని రంగాల్లో ముందుకు దూసుకుపోతుంది.కాని ఈ క్రమంలో చదువులని, కెరీర్ అని, ప్రమోషన్స్ అని, మ్యారేజ్ ప్లానింగ్, ప్రెగ్నెన్సి ప్లానింగ్ లేటు కూడ అవుతుంది. పెరుగుతున్న మానసిక ఒత్తిడి, పెరుగుతున్న పని చేసే గంటలు, కాలుష్యానికి గురవటం, శరీరంపై, వేళకి సరియైన ఆహారం తీసుకోలేక పోవటం, వండే సమయం కూడ లేక, ఎక్కువగా ఫాస్ట్ మరియు సూపర్ ఫుడ్స్ మీద ఆదారపడటం మరియు బిజి బిజి లైఫ్‌లో పాపాయికి నిర్దిష్ట కాలంపాటు పాలు ఇవ్వలేని పరిస్థితి. కారణాలేమైతేనే పట్టణ మహిళలు ఎక్కువగా రొమ్ము క్యాన్సర్ కు గురవుతున్నారు. అయితే గ్రామీణ ప్రాంత మహిళలు ఈ సమస్యకు అతీతులేమీ కారు, వారిలో కూడా రొమ్ము క్యాన్సర్ పెరుగుతూ ఉండటం మరింత బాధాకరం. ఇంకా విస్మయం చెందిచే విషయం ఏమిటంటే పురుషులలో కూడ ఈ క్యాన్సర్ కన్పించటం.

రొమ్ము క్యాన్సర్ గురించి తెలుసుకునే ముందు ఒక్కసారి వక్షోజ నిర్మాణము, రొమ్ము ఇతర సమస్యలగురించి తెలుసుకుందాం. వక్షోజాలు అనుసంధాన కణజాలగ్రంధులకు చెందిన కణజాలం మరియు కొవ్వు కణజాలం అనే మూడు రకాలకణజాలంతో నిర్మితమయి ఉంటాయి. ఒక్కో వక్షోజంలో 20 దాకా లోబ్స్ వాటిలో లోబ్యూల్స్ అనే చిన్న చిన్న క్షీర గ్రంధులు, వీటిని కలిపే సన్నని గొట్టాలు డక్ట్స్, వీటిలో నుండి ఉత్పత్తి అయిన పాలు బయటకు రావటానికి నిపిల్స్‌పైన సన్నని రంధ్రాలు ఉంటాయి.

స్త్రీలలో వారి వయస్సు మీద ఆధారపడి, నెలసరి ముందు రోజుల్లో గర్భిణిగా ఉన్నప్పుడు, ఇచ్చే స్త్రీలలో మెనోపాజ్ వయస్సు లో ఇలా వివిధ దశలలో రొమ్ముల్లో అనేక మార్పులు, ఇతర రకాలసమస్యలు తలెత్తుతూ ఉంటాయి. రొమ్ములో గడ్డలాగా తగలగానే క్యాన్సర్ కానే కాదు. ఆ కణితి కొంత కాలంగా ఉంటూ, పెరుగుతూ, గట్టిగా, కదలకుండా నొప్పి లేకుండా ఉంటే మాత్రం అనుమానించాల్సి ఉంటుంది. స్త్రీలలో నిపిల్స్ ద్వారా ఇన్‌ఫెక్షన్స్ సోకి చీముగడ్డలు ఏర్పడటం. రొమ్ము కణజాలంలో సిస్టలు ఏర్పడి ఫైబ్రోసిస్టిక్ బ్రెస్ట్ డిసీజ్ రావడం జరుగుతూ ఉంటుంది. ఇలాంటి సందర్భాలలో కూడా తడిమి చూసుకున్నప్పుడు గడ్డలాగా తగలవచ్చు కాని ఇవి నొప్పిగా ఉండటమే కాక కదులుతూ ఉంటాయి. సాధారణంగా ఇటువంటి గడ్డలు యాంటీబయాటిక్స్‌తో తగ్గుతూ ఉంటాయి.

ప్రతి స్త్రీ ఇరవై ఏళ్ళ నుండే వారి ఆరోగ్యం పట్ల అవగాహన పెంపొందించుకుని రొమ్ములను స్వయంగా పరిక్షించుకోవటం చాలా ముఖ్యం. నెలసరి అయిన ఏడవ రోజు స్నానం చేసేటప్పుడు సబ్బుచేతులతో, వేళ్ళ మధ్యభాగంలో రొమ్మును భాగాలుగా విభజించుకొని పరిక్షించుకోవాలి. ఇలా క్రమం తప్పకుండా చేయటం వలన వారి రొమ్ము నిర్మాణం అర్థం అవ్వటమే కాకుండా రొమ్ము కణజాలంలో ఎటువంటి మార్పు ఉన్నా ఇట్టే పసిగట్టగలగుతారు. వయస్సు పై బడే కొద్ది రొమ్ము క్యాన్సర్ వచ్చే ప్రమాదం చాలా ఎక్కువగా పెరుగుతూ ఉంటుంది. 30 ఏళ్ళ లోపు అరుదుగా, 40 ఏళ్ళలో 200 మందిలో ఒకరికి, 50 ఏళ్ళలో 50 మందిలో ఒకరికి, 80 ఏళ్ళ పై బడిన స్త్రీలలో ప్రతి 8 మందిలో ఒకరికి వచ్చే ప్రమాదం ఉంటుంది.

అందుకే 30 ఏళ్ళు పైబడిన స్త్రీలు స్వయంగా రొమ్ములను ప్రతి నెలా పరిక్షించు కోవటంతో పాటు వైద్యులసలహా మేరకు అల్ట్రాసౌండ్, మామోగ్రామ్ వంటి స్క్రీనింగ్ టెస్టులు అనుమానంగా ఉంటే యం.ఆర్.ఐ., బయాప్సి వంటి ఇతర పరీక్షలు చేయించుకోవటం తప్పనిసరి. మిగితా క్యాన్సర్‌లాగానే ఈ క్యాన్సర్ ఎవరిలోనైన వచ్చే ప్రమాదం, ఖచ్చితమైన కారణం తెలియకపోవటం ఉన్నా కొంత మంది స్త్రీలలో కొన్ని కారణాలు ఈ క్యాన్సర్ రావటానికి మరింత దోహదం చేస్తాయనే చెప్పుకోవచ్చు.

1. అవివాహిత స్త్రీలు, పిల్లలు కలుగని స్త్రీలు
2. పాలు ఇవ్వకపోవటం
3. 10 ఏళ్ళలోపే రజస్వలఅయిన వాళ్ళకు
4. 55 ఏళ్ళ తర్వాత కూడ నెలసరి ఉండటం
5. దీర్ఘకాలం పాటు హార్మోన్ల మీద ప్రభావం చూపించే మందుల వలన
6. ముందుగా గర్భాశయం, అండాశయం క్యాన్సర్ ట్రీట్‌మెంట్స్ తీసుకున్న స్త్రీలు
7. దగ్గరి బంధువులలో, రక్త సంబధీకులలో బ్రెస్ట్ క్యాన్సర్ ఉన్నప్పుడు
8. స్మోకింగ్, ఆల్కహాల్ వంటి అలవాట్లు ఉన్నవారిలో ఈ క్యాన్సర్ వచ్చే ప్రమాదం ఎక్కువగా ఉండవచ్చు. కాబట్టి వీరు మరింత జాగ్రత్తగా ఉంటూ క్రమం తప్పకుండా స్క్రీనింగ్ టెస్టులు చేయించుకోవటం చాలా ముఖ్యం. వీరు తప్పనిసరిగా నలభై ఏళ్ళు పైబడ్డాక ప్రతి సంవత్సరం అల్ట్రాసౌండ్, మామోగ్రమ్ చేయించుకోవాలి. ఈ స్క్రీనింగ్ టెస్టులను ఎటువంటి రిస్క్ లేని స్త్రీలు, 40 ఏళ్ళ లోపు ఒక్కసారి, తర్వాత 40 నుండి 50 ఏళ్ళ లోపు ప్రతి రెండు సంవత్సరలకొకసారి, 50 ఏళ్ళు పైబడ్డాక ప్రతి సంవత్సరం తప్పనిసరిగా చేయించుకుంటూ ఉంటే ఒకవేళ రొమ్ములో కణిత



**Dr. Ch. Mohana Vamsy**
Chief Surgical Oncologist
Omega Hospitals, Hyderabad.
Ph : 98480 11421

ఏర్పడినా తొలిదశలో కనుక్కోగలుగుతాము కాబట్టి పూర్తిగా నయం చేయగలగటం రొమ్ము మొత్తాన్ని కాకుండా, గడ్డను మాత్రమే తీసివేసే లంఫెక్టమి చేయటం సాధ్యమవుతుంది. గడ్డ పెరిగే కొద్ది లక్షణాలు బయట పడటం, లింఫ్ నాళాలకు వ్యాపించటం, ఇతర అవయవాలు క్యాన్సర్‌కు గురవటం జరుగుతూ ఉంటుంది. బ్రెస్ట్ క్యాన్సర్ లక్షణాలు ఈ విధంగా ఉంటాయి.

1. మొదటగా రొమ్ము లో గడ్డ తగలటం
2. రొమ్ములో, చంకలో గడ్డ లేక వాపు కన్పించటం
3. చనుమొన (నిపుల్) సైజులో మార్పు, లోపలికి తిరిగి ఉండటం
4. చర్మం మందం కావటం, సొట్టపడటం
5. రొమ్ము నారింజ తోలు మీద గుంటలులాగా గరుకుగా ఉండటం
6. బ్రెస్ట్ సైజులో, షేపులో, రంగులో మార్పు
7. రొమ్ము మీద ఎంతకూ నయంకాని పుండు
8. చనుమొన నుండి రక్తంతో కూడిన స్రావాలు రావటం.

పై లక్షణాలు కన్పించే సరికే బ్రెస్ట్ క్యాన్సర్ తొలిదశను దాటిపోయే అవకాశం ఉంటుంది. క్యాన్సర్ గడ్డ రకం, స్టేజ్, గ్రేడింగ్ బట్టి సర్జరీతోపాటు కీమో, రేడియేషన్, హార్మోన్ థెరఫీల కాల వ్యవధి నిర్ధారింపబడి ఉంటుంది. వయస్సు పైబడిన స్త్రీలలో కంటే చిన్న వయస్సులో వచ్చే రొమ్ము క్యాన్సర్ వేగంగా వ్యాప్తి చెందుతుంది. కాబట్టి ప్రతి స్త్రీ బ్రెస్ట్ క్యాన్సర్‌పై అవగాహన చిన్న వయస్సు నుండే పెంపొందించుకుంటే చాలా మంచిది.

(బ్రెస్ట్ క్యాన్సర్ సర్జరీ, అంకోప్లాస్టిక్ సర్జరీలపై వివరాలు వచ్చే సంచికలో...)

(సశేషం)

ఏదైనా ఉద్యోగం చూడరా!' అని. వాడు టెన్త్ పాస య్యాడు. మా ఊరి బ్యాంకులో వేయించాను. అవి వాళ్ళకే రిజర్వు చేయబడ్డాయి కాబట్టి సునాయాసంగా కుదిరింది. తరువాత నాన్న పోవటం... అమ్మ మంచం పట్టటం కారణాన నేను మా ఊరి బ్రాంచికి బదిలీ మీద వచ్చాను.

సొంత ఊరికి వచ్చానన్న పేరేగానీ, వచ్చాక ప్రారంభమయ్యాయి కష్టాలు. అందరూ తెలిసిన వాళ్ళు... ఊళ్ళో రాజకీయాలు... గ్రూపులు... లోన్లు తీసుకున్నవాళ్ళు కట్టకపోవడాలు.. జప్తులు... తెలిసిన వాళ్ళ మీద కేసులు పెట్టడానికి మొహమాటం. రాజకీయ నాయకుల ఒత్తిళ్ళు. మొదట్లో బ్యాంకు ఉద్యోగం ఎంత గొప్పగా ఉండేదో, ఇప్పుడంత కష్టంగా ఉంది.

ఈ పరిస్థితుల్లో లేని అలవాటు సిగరెట్టు!

మొదట్లోనే అరుంధతి వారించింది.

నచ్చచెప్పాను.

రానురానూ ఎక్కువైంది.

సిగరెట్టు మాన్పించటానికి ఎన్నివిధాలో ప్రయత్నించింది. అలిగి భోజనం మానేసేది. ఫలితం లేక ఉపవాసాలూ, మొక్కుబడులూ చేసుకుంది. 'మంత్రాలకు చింతకాయలు రాల్తాయా?'

'ఊహు! మాన్పించలేకపోయింది'

ఫలితమే! నాచే సిగరెట్టు మాన్పించటానికి చేసిన చివరి ప్రయత్నం - స్వామిదీక్ష!

తప్పలేదు.

ఆమె ఇష్టాన్ని దేన్నీ కాదనలేను!

కారణం-

నేను కాదనగలిగిన 'ఆమె ఇష్టం' లేదు కనుక!

ఆలోచనల్లో ఉండగా-

గురుస్వామి తొందర పెడుతున్నారు.

అందరూ సమావేశమయ్యాం. అతను నియమాలు చెప్పారు. 'అబద్ధం ఆడకూడదు. వ్యసనాలకు దూరంగా ఉండాలి. కిందనే పడుకోవాలి. కాళ్ళకి చెప్పులు కూడదు. స్త్రీ సాంగత్యం పనికిరాదు. నల్లటి వస్త్రాలు ధరించాలి. మాలధారణ చెయ్యాలి. ఒంటి పూటే భోజనం. రాత్రి పూట బన్నాన్నం అంటే ఏదో ఫలహారమో, పళ్ళో తీసుకోవాలి. కులభేదాలు లేకుండా భిక్ష తీసుకోవాలి. (భజన కార్యక్రమం ఎవరింట జరిగితే వాళ్ళింట పెట్టే అల్పాహారాన్నే భిక్ష అంటారు) రోజూ సత్సంగం, ఉపన్యాసాలూ, భజనలూ తెల్లవారు జామున, రాత్రివేళ తప్పనిసరి. అందరూ సోదర భావంతో ఉండాలి. ఆవేశకావేశాలకి తావివ్వకూడదు' గురుస్వామి దీక్షా సూత్రాలు వల్లించారు.

నాకు గుండెల్లో రాయిపడింది.

'సిగరెట్టు' తప్ప నాకు ఇతరత్రా ఇబ్బంది లేదు!

నా బావమరిది కావటం చేతనో, బ్యాంకు మేనేజర్ని అన్న భావం చేతనో, నాన్నగారికున్న పేరు వల్లనో నాకే మొదట మాలధారణ!

రాత్రంతా ఆనందంతో నిద్రలేని అరుంధతి అలారం పెట్టి, కోవెలకు తగిన సరంజామాతో పంపింది. చలి గజగజ వణికిస్తున్నా చెరువుకెళ్ళి స్నానాలు చేసి, అందరం విభూతి పూసుకుని, నల్ల వస్త్రాలు ధరించాం, అప్పటికే!

మొదట గురుస్వామి తులసిముద్ర మాల మెళ్ళో వేసి పూజ ప్రారంభించారు. అప్పట్నించీ నా కష్టాలు ప్రారంభం అయ్యాయి. సిగరెట్టు లేకపోవటం తరువాత నన్నిబ్బంది పెట్టేవి కాళ్ళకి చెప్పులు లేకపోవటం. ఏ పనైనా చేస్తే ఆ పనిలో మునిగిపోవటం, నూటికినూరుపాళ్ళు ఆ పనికి న్యాయం చేయటం నాన్నగారి నుంచి నేర్చుకున్నాను. అందుకే కొంతమంది ఉత్తికాళ్ళతో నడవలేక మోటారు బళ్ళమీద వెళ్ళినా నేనిష్టపడలేదు కానీ, అలవాట్లో చాలాసార్లు సిగరెట్టు పెట్టెమీదకు చేయివెళ్ళినా తమాయించుకున్నాను. వారం రోజులు

**అతడో బ్యాంకు మేనేజర్. భార్యమాట మన్నించి అయ్యప్ప మాల వేసుకున్నాడు. పాటించాల్సిన నియమాలు గురుస్వామి చెప్పారు. అబద్ధం ఆడకూడదు. కిందనే పడుకోవాలి. కాళ్ళకి చెప్పులు వేసుకోకూడదు. స్త్రీ సాంగత్యం పనికిరాదు. నల్లటి వస్త్రధారణ, ఒంటిపూట భోజనం, కులభేదాలు లేకుండా భిక్ష తీసుకోవడం... ఇవన్నీ తను పాటించగలడా? అతడి గుండెల్లో రాయిపడింది!**

విపరీతమైన తలనొప్పి. ఉదయాన్నే స్నానం, పూజ, సాయంత్రం (అదే రాత్రి!) అలసి రావటం - చన్నీటి స్నానం... తరువాత భజన కార్యక్రమం... నా అవస్థచూసి 'మీకెన్ని కష్టాలు పెట్టానండి. పాపిష్టిదాన్ని' అని కన్నీళ్ళు పెట్టుకుంటే వారించాను శ్రీమతిని.

ఆఫీసులో వీరయ్య వచ్చి చేతులు జోడించి నిలబడ్డాడు. పని ఒత్తిడిలో తలెత్తి చూడలేదు. నా దృష్టి 'సిస్టం' మీదే ఉంది.

'అయ్యా!' అన్న వీరయ్య పిలుపుతో తలెత్తి చూశాను.

"ఏం స్వామీ!"

"నాదో చిన్న మనవి. నా ఇంట భజన పెట్టాలనుకుంటున్నాను. తమరికో మాటచెప్పి.. అహ.. మీర్రావద్దులెండి" అన్నాడు.

"అదేం స్వామీ?"

"మీరు మా పేటకేటొస్తారు?"

"ఏం? నేను రాకూడదా?"

"అలాక్కాదు. మీరు గొప్పింటోరు. మాలాటోళ్ళిల్లకి... " ఆగిపోయాడు.

"భలేవాడివే. నేను తప్పక వస్తాను. మనమంతా ఆ భగవంతుని బిడ్డలం".

"బాబూ!"

"బాబూ అనకు. 'స్వామీ' అను. అది నియమం".

"సామిగోరూ! మా పేటలో అందరూ పందాలు కట్టారు. మీరు గొప్పింటోళ్ళు మా ఇంటికిరారు' అని! అదే ఆళ్ళ మతంలో అలాటి తేడాలుండవని".

"ఏం ఫరవాలేదు, వస్తాలే స్వామీ!"

వీరయ్య నివసిస్తోన్న పేటలో అందరూ ప్రభువుని నమ్ముకున్న వాళ్ళే. సర్టిఫికెట్లో తమ కులాల పేర్లు చెప్పుకుంటారు మళ్ళీ. వీరయ్య మాత్రం నేను ప్రభుత్వం ఉప్పు తింటున్నాను. ఆత్మద్రోహం చేసుకోలేనని, పుట్టిన హైందవునిగానే ఉండిపోయాడు.

భజన రోజున వీరయ్య సెలవు పెట్టాడు.

ఆరోజే జోనలాఫీసరు రావటంతో నేను భజనకు ఆలస్యమయ్యాను. నేనెళ్ళేసరికి భజన జోరుగా సాగుతోంది. అయ్యప్ప నామావళి మైకులో మారు మోగుతోంది.

నన్ను చూసి అందరూ లేవబోతే వారించాను.

ఆ తరువాత పరిచిన జంబుఖానా మీద అందరూ ఆశీనులయ్యారు. అందరూ నన్ను కుర్చీమీద కూర్చోమన్నారు. నేను ఒప్పుకోలేదు. వాళ్ళ పక్కనే కూర్చున్నాను. ఆకు భోజనం. "బాబూ! తమకు వేరే పంతులుగారిచేత వండిపించాను" అన్నాడు వీరయ్య.

## వారిని చూసి భయపడదట!

**టాలీవుడ్** చందమామ కాజల్‌కు ఆ మధ్య అవకాశాలు బాగా తగ్గాయి. కొత్త నీరు వచ్చి పాతనీరును కొట్టినట్టు కొత్త హీరోయిన్ల రాకతో కాజల్‌ని పక్కన పెట్టేశారన్న వార్తలు బాగా షికారు చేశాయి. కానీ వాటన్నింటిని కాజల్ తోసి పుచ్చుతోంది. కొత్త వారు ఎంత మంది వచ్చినా తాను భయపడేది లేదనీ, తన అవకాశాలు తనకు ఎప్పుడూ ఉంటాయని అంటోంది. దానికి 'ఖైదీ 150' సినిమా నిదర్శనమని చెబుతోంది. టాలీవుడ్‌లో తన హవా తగ్గలేదనీ, చాలా అవకాశాలు వస్తున్నా అన్నీ చేయడం లేదని స్పష్టం చేస్తోంది.

"వీల్లేదు. మీ ఇంట్లో వండిందే తినాలి"

"సామీ. మీరు పెద్దింటోళ్ళు. మా ఇంటికి రావడమే మా అదురుష్టం" అన్నారు వాళ్ళింటి వాళ్ళు! దూరంగా క్రీస్తు సువార్త బోధన వినిపిస్తోంది 'అల్లలూయా'! ముక్తకంఠంతో.

"చూడండి బాబూ! నేనిక్కడ భజన పెట్టినానని ఆళ్ళు పోటీగా పెట్టినారు!" అన్నాడు వీరయ్య.

"చూడు వీరయ్య! మనం అందరం భగవంతుని బిడ్డలం. అందరు ప్రార్థించేది ఆ దేవుణ్ణే. పూజా విధానాల్లో మార్పేగానీ, భక్తి ఒకటే. అన్ని మతాల ప్రబోధం ఒక్కటే!" అని నేను చెప్పటంతో ఎవరూ మాట్లాడలేదు.

"బాబూ, నామాటినండి. మీ బోయినం వేరేగా చేపించాం. మీకా పెసాదం ఇస్తాం పుచ్చుకోండి" అని తెచ్చాడు. నాకృష్టమనిపించింది. తెమ్మన్నాను. వీరయ్య ఆనందంగా తెచ్చాడు.

"ఇది అందరి ఆకుల్లో సమానంగా పంచు. అందరితోపాటు నాకూ, నువ్వు నీ ఇంటచేసిన ఫలహారమే పెట్టు. చూడండి.. మనం ఈ దీక్ష ద్వారా నేర్చుకోవలసింది ఎంతో ఉంది. నలభై రోజులు అవగానే మళ్ళీ మనం పూర్వరూపం దాల్చటం కాదు. మనలో మార్పు రావాలి. కుల, మత భేదాలు విడనాడాలి! మనం అందరం మానవులం. మన కులం అదే! గీతాకారుడు కూడా అదే చెప్పాడు. గుణ, కర్మల బట్టి కులాలేర్పడ్డాయి కానీ పుట్టుకతో కాదు. అందరు తింటున్నదీ అన్నమే. ఆ అన్నం పెట్టింది శ్రామికుడు. రైతన్న. పరబ్రహ్మ. ఇలా మనుషుల్లో దేవుణ్ణి వెతుక్కోవాలి. అదే భక్తిలో పరమార్థం" అన్న నా మాటలు విని, సువార్త సభల నుంచి వచ్చిన వీరయ్య సోదరులు చెమ్మగిల్లిన కళ్ళతో నిశ్చేష్టులై నిలుచుండిపోయారు!

సెల్:94400 59047



# కుక్కలు

-సలీం

**రాత్రి పదకొండుగంటలు దాటి ఉంటుంది. వీధులన్నీ దాదాపు నిర్మానుష్యంగా ఉన్నాయి. విద్యుద్దీపాలకాంతి చీకటిని పారద్రోలడానికి విశ్వప్రయత్నం చేసి ఓడిపోయి నందువల్లేమో మసకచీకటిగానే ఉంది. గంట క్రితమే వర్షంపడి వెలిసింది. వాతావరణం చల్లగా ఉంది. మెల్లగా సైకిల్ తొక్కుతూ ఆలోచనలో పడ్డాను. ఓ స్నేహితుడి పెళ్ళికి వెళ్ళి వస్తున్నాను. ముహూర్తం తొమ్మిదీ నలభైకి ఉండటంవల్ల భోజనాలుచేసి బయల్దేరేటప్ప టికి ఈ సమయమైంది. అతను బ్యాంక్‌లో ఉద్యోగం చేస్తున్నాడు. నేనే నిరుద్యోగిలా మిగిలిపోయాను.**

నాకూ పెళ్ళీడు వచ్చింది. రూపాయి సంపాదన లేని నాకు పిల్లని ఎవరిస్తారు? చదువుకునే రోజుల్లో ఎంత అశ్రద్ధ చేశానో. ఇప్పుడు పశ్చాత్తాపపడటం వల్ల చదువు రాదుగా. నాన్న మున్సిపాలిటీలో పారి శుధ్యకార్మికుడిగా పని చేసేవాడు. నలభైనాలుగేళ్ళకే అనారోగ్యంతో అకాల మరణంపాలైతే ఆ ఉద్యోగం అన్నకిచ్చారు. అన్నకు పెళ్ళయింది. ఓ పాప కూడా.

అన్న మంచివాడే. నాకు ఏదో ఒకపని ఇప్పించటం కోసం మున్సిపాలిటీలో చాలామంది కాళ్ళు పట్టుకున్నాడు. కాని ఫలితం దొరకలేదు. ఇప్పటికీ ప్రయత్నిస్తూనే ఉన్నాడు. రోడ్లు ఊడ్చే పని దొరికినా చాలు. సంతో షంగా చేసుకుంటా. వాళ్ళ పెద్దసార్ ఇంట్లో పనులే మైనా ఉంటే తనే అన్నీ తన నెత్తిమీద వేసుకుని చేస్తుంటాడు. ఎప్పటికైనా కరుణించి నాకో చిన్న ఉద్యోగం ఇప్పిస్తాడని ఆశ.

కుక్కల అరుపులు వినిపించి ఆలోచనల్లోంచి బైటపడ్డాను. రోడ్డుకి ఎడంవైపు చెత్తకుండీదగ్గర మూడు కుక్కలు పోట్లాడుకుంటున్నాయి. నాకు కుక్కలంటే చాలా భయం. అనాలోచితంగానే సైకిల్ ఆపి ఓ కాలు నేలకి ఆనించి ఆ కుక్కలవైపు చూశాను. చెత్తకుండీ బైట ఎంగిలి విస్తరాకులు చెల్లాచెదురుగా పడి ఉన్నాయి. కుక్కలు మూడూ ఒక దానిమీద ఒకటి భీకరంగా అరుచుకుంటున్నాయి. నేను ఇంటికెళ్ళా లంటే ఆ చెత్తకుండీ దాటుకునే వెళ్ళాలి. మరో దారిలేదు. కానీ కుక్కలు మీదపడి కరుస్తాయేమోనని భయం.

కొద్దిసేపు వేచిచూస్తే కుక్కలు వెళ్ళిపోతాయన్న ఆశతో కదలకుండా అక్కడే నిలబడ్డాను. నాకు పదేళ్ళ వయసున్నప్పుడు జరిగిన సంఘటన గుర్తొచ్చి భయంతో ఒళ్ళు జలదరించింది. ఆ రోజు అమ్మ జ్వరంతో పడుకుంది. అన్న స్కూలుకి వెళ్ళాడు. అమ్మకోసమని మందుబిళ్ళలు తీసుకుని, తినడానికి బన్నురొట్టె కొనుక్కుని ఇంటివైపు నడుస్తున్నాను. నా వెనక అలికిడైంది. తలతిప్పి చూశాను. ఓ కుక్క చొంగ కార్చుకుంటూ నా వెనకే వస్తోంది. దాన్ని అదిలించాను. ఆగిపోయింది. మళ్ళా నేను కదల గానే నా వెంట రాసాగింది. నాకు భయమేసి పరు గెత్తాను. అదీ పరుగెత్తింది. ఒక్క గెంతుగెంతి నా చేతి లోని బన్నురొట్టె లాక్కునే ప్రయత్నం చేసింది. నేను కిందపడిపోయాను. అది తన కోరలు కన్పించేలా నోరంతా తెరిచి భీకరంగా మొరిగింది. నా మీదపడి భుజం కొరికింది. నొప్పితో అరచి బన్నురొట్టె వదిలే శాను. దాన్నినోట కరుచుకుని నావైపు ఉరిమి చూసింది. ఈ లోపల మనుషులు రావడం గమ నించి అక్కడినుంచి పారిపోయింది. భుజం నిండా గాయం. రక్తం కారిపోతోంది.

ఇంటికెళ్ళాక రక్తంచూసి అమ్మ కంగారు పడింది. నీళ్ళతో గాయంకడిగి, అంత జ్వరంలో కూడా అమ్మ నన్ను ఆస్పత్రికి తీసుకెళ్ళింది. ఎన్ని ఇంజక్షన్లో. వారాని కొకటి బొడ్డు చొప్పున. నొప్పిభరించలేక రెండు ఇంజక్షన్ల తర్వాత ఇకవద్దని చెప్పాను. 'బిడ్డ బయ పడ్తున్నాడు. రెండు ఏయించుకున్నాడుగా. సాలవా?' అని కాంపౌండర్ని అడిగింది అమ్మ. 'పూర్తికోర్సు తీసు కోక పోతే ప్రాణానికే ప్రమాదం. ఆ కుక్కకు రేబీస్ వ్యాధి ఉంటే అది మీ అబ్బాయికి సోకే అవకాశం ఉంది. అటువంటి చావు పగవాడికి కూడావద్దు' అన్నాడు కాంపౌండర్. అంతే. కిక్కురుమనకుండా మిగతా మూడు ఇంజక్షన్లు చేయించుకున్నాను.

అప్పటినుండీ కుక్కలంటే హడల్.

ఆలోచనల్లోంచి బైటపడి మళ్ళా కుక్కలేం చేస్తున్నాయోనని చూశాను. ఒకదానివైపొకటి ఉరిమి చూసుకుంటూ గుర్రుమంటూనే విస్తరాకుల్లో మిగిలిన ఆహార పదార్థాల్ని తింటున్నాయి. ఇదే సరైన అవకాశమనుకుని సైకిల్ వేగంగా పోనిచ్చాను. అదే నేను చేసిన తప్పనుకుంటాను. ఓ కుక్క సైకిల్ వెనక పడింది. దాన్నుంచి తప్పించుకోడానికి పిక్కల బలం కొద్దీ సైకిల్ తొక్కుతున్నాను. అది వదలకుండా చాలా వేగంగా పరుగెత్తుతోంది. ఒకట్రెండు సార్లు అది నా కాలిని సమీపించి ప్యాంటుని రాసుకున్నట్టనిపించి మరింతవేగం పెంచాను. ఆయాసం వస్తోంది. ఓపిక సన్నగిల్లుతోంది. అది నా పిక్క పట్టుకోవడం ఖాయం అనిపించి వణికిపోయాను.

మసకచీకటివల్ల రోడ్డు సరిగ్గా కనిపించడం లేదు. పెద్ద గుంటలో సైకిల్‌చక్రం పడటంవల్ల ఎగిరి సైకిల్తో సహ కింద పడ్డాను. కుక్క కంగారుపడి కొద్దిదూరంలో నిలబడి పెద్దగా మొరగటం మొదలెట్టింది. అది నా మీద దాడి చేయనందుకు మనసులోనే దేవుణ్ణి తలుచుకుని లేచి బట్టలకు అంటినమట్టి దులుపుకుని సైకిల్ఎక్కి తొక్కటం మొదలెట్టగానే మళ్ళా కుక్క వెంటబడింది. ఇంటి సమీపం వరకూ నన్ను తరిమి ఆగిపోయింది. కుక్కకాటు నుంచి తప్పించుకున్నందుకు హాయిగా ఊపిరి పీల్చుకున్నాను.

●●●

"ఏమైతేనేం నీకు ఉద్యోగం వేయించానురా" అన్నాడో రోజు అన్న.

నా సంతోషానికి పట్టపగ్గాల్లేవు. ఇన్నాళ్ళు అనుభవించిన నిరుద్యోగపర్వపు నరకయాతన తప్పుతున్నందుకు సంతోషపడ్డా.

"ఏం ఉద్యోగం అన్నా" అడిగా.

"మున్సిపాలిటీలో వీధికుక్కల్ని పట్టుకుని పిల్లలు పుట్టకుండా ఆపరేషన్ చేసే సెక్షన్ ఒకటుంది. దాన్లో ఉద్యోగం".

"నేనేం చేయాలి."

"వీధి కుక్కల్ని పట్టుకుని వ్యాన్‌లో వేసుకుని రావటం, వాటికి ఆపరేషన్‌చేశాక మళ్ళా వాటిని వదిలి రావటం... ఇంతే పని... మా సార్ చెప్పారు".

"కుక్కల్ని పట్టుకునే ఉద్యోగమా... ఛీ... నాకొద్దు. అసలే కుక్కలంటే నాకు భయమని నీకు తెల్సుగా. దీని బదులు నువ్వు ఏ పని ఇప్పించినా చేస్తాను. రోడ్లుఊడ్చే పని, చెత్త ఎత్తేపని... ఏదైనా పర్లేదు. కుక్కల జోలికివెళ్ళే పనిమాత్రం చేయను".

అన్న నన్ను సముదాయించే ధోరణిలో "ఎంతోమంది ఉద్యోగాలు దొరక్క బాధపడుతున్నార్రా. దాదాపు మూడు సంవత్సరాలు మా పెద్ద సారు ఇంట్లో నానా చాకిరీచేసి కుక్కచావు చస్తే ఈ ఉద్యోగం దొరికింది. నామాటిను. రేపే చేరిపో. ఈ అవకాశం చేజారితే మళ్ళా రెండు మూడేళ్ళు ఎదురుచూడాల్సి రావొచ్చు. నేను ఒకరి ద్దర్ని కనుక్కున్నాను. మంచి ఉద్యోగమనే చెప్పారు".

"నేనేమైనా చిన్నపిల్లాణ్ణి అనుకుంటున్నావా నమ్మడానికి? కుక్కల్నిపట్టడం మంచిపనా? ఉద్యోగం లేకపోతే పస్తులైనా పడుకుంటానుగాని ఈ పని మాత్రం చేయను" అన్నాను కరాఖండిగా.

అన్న నా పక్కన కూచుని అనునయిస్తున్నట్టు భుజం మీద చేయివేసి చెప్పాడు. "ఈ పనివల్ల నువ్వు సమాజానికి చాలా సేవచేస్తున్న విషయం నీకుతెలుసా? నీ చిన్నప్పుడు కుక్క కరిచింది గుర్తుందా? అలాంటి కుక్కల్ని పట్టుకెళ్ళి ఆపరేషన్ చేయడంవల్ల వాటిసంఖ్య పెరక్కుండా కంట్రోల్‌లో ఉంటుంది. వాటికి రోగాలు సోకకుండా ఇంజెక్షన్లు వేసి వదుల్తారట. పొరపాటున ఎవరినైనా కరిచినా వాళ్ళకు ప్రమాదం ఉండదు. అంటే నీవల్ల సమాజానికి చాలా మేలు జరుగుతుందన్నమాట".

"నాకు కుక్కలంటే భయం" అన్నాను. అప్పటికే నా గొంతు బలహీనపడటంవల్ల మాట నూతిలోంచి వచ్చినట్టు వచ్చింది.

అన్న పెద్దగానవ్వాడు. "నువ్వు వల పట్టుకుని వాటిని పట్టుకోడానికి వెంటపడితే నిన్నుచూసి అవి భయపడి పారిపోతాయి. నా మాటిను. రేపు డ్యూటీలో చేరిపో. ఆలస్యం చేస్తే ఇంకెవరైనా ఉద్యోగం తన్నుకుపోయే ప్రమాదముంది".

ఆ ఉద్యోగంలో చేరకతప్పలేదు. మొదటి మూడు నెలలూ శిక్షణ ఇచ్చారు. ఏయే ఏరియాలో ఎన్ని వీధికుక్కలున్నాయో సర్వేచేయడం కాణ్ణించి వాటిని ఎన్ని రకాలుగా పట్టుకోవాలి, వెటర్నరీ డాక్టర్ దగ్గరకు ఎలా చేర్చాలి, రెండ్రోజులు వాటికి ఎలాంటి ఆహారం పెట్టాలి, వదిలేముందు ఎలాంటి జాగ్రత్తలు తీసుకోవాలి లాంటివన్నీ చెప్పారు. ఈ మూడునెలల్లో కుక్కలకు సంబంధించిన చాలా విష యాలు తెల్సుకున్నాను. ఆల్ఫా కుక్కలవల్ల ప్రమాదం ఉండదట. అవి మనుషుల్తో స్నేహంగా ఉంటాయట. బీటా కుక్కలు మాత్రమే అసహనంగాఉండి దాడి చేస్తాయట. పిల్లలు పుట్టకుండా ఆపరేషన్ చేశాక ఏ ప్రాంతం నుంచి వాటిని ఎత్తుకొచ్చామో అదే ప్రాంతంలో వదిలేయాలట. అలా వదలనికుక్కలే స్కూటర్ల వెనకా కార్ల వెనకా పరుగెత్తుతాయట. కుక్కల్ని పట్టుకుని చంపడం నేరమట. కేవలం రేబిస్ వ్యాధి సోకిన కుక్కల్ని, నయంకాని, రోగంతో చావుకి దగ్గరగా ఉన్న కుక్కల్ని మాత్రమే చంపొచ్చట.

అంతా బాగానే ఉంది కానీ కుక్కల్ని పట్టుకునేటప్పుడు కూడా వాటికి ఏ మాత్రం నొప్పి కలక్కుండా ప్రవర్తించాలనీ, వాటిని దయగా చూడాలని చెప్పినప్పుడు నాకు నవ్వొచ్చింది. కుక్కలుకదా మనుషుల్ని కరవకుండా దయగా చూడాల్సింది. వీళ్ళ వెంట ఎప్పుడైనా కుక్కలుపడి తరిమితే తెలుస్తుంది. పైనపడి భుజాన్నో పిక్కనో పట్టుకుని పీకినప్పుడు అర్థమవుతుంది. కుక్కలంటే ఏమిటో...

శిక్షణ పూర్తయ్యాక నేను యాదయ్యతో కలిసి పని చేయాలని ఆర్డర్ వేశారు. యాదయ్యకు యాభై పైనే వయసుంటుంది. ఇద్దరు ఆడపిల్లలు ఒక మగపిల్లాడు. అందరికీ పెళ్ళిళ్ళు అయిపోయాయి. మనిషి సన్నగా బద్దలా ఉంటాడు. జుట్టుబాగా పల్చబడి తెల్లబడింది. మనిషి మాత్రం ఎప్పుడూ నవ్వుతూ చలాకీగా సరదాగా ఉంటాడు.

మొదటిరోజు యాదయ్యతో కలిసి కుక్కల్ని పట్టుకోడానికి వెళ్తున్నప్పుడు ఉదాసీనంగాఉన్న నన్ను చూసి "ఏమిటీ సంగతి? ఫీల్డులో మొదటిసారి వెళ్తున్నందుకు ఉత్సాహంతో ఉరకలెయ్యాలి కదా. కుర్రవాడివి అలా మొహం వేలాడేసుకుని కూచుంటే

## డేటింగ్ అంటే తెలియదట!



తను పేరుకి హీరోయిన్ అయినా ఇప్పటి అమ్మాయిల్లా డేటింగ్ వంటి వ్యవహారాలేవీ తనకు తెలియవు అంటోంది సోనమ్ కపూర్. చిన్నతనం నుంచి సినిమాల వాళ్ళ మధ్య తిరగడంతో అందరూ తనకు తెలిసిన వారేననీ, వారితో స్నేహం తప్ప శృంగారం లేదా డేటింగ్ వంటి వ్యవహారాలేవీ చేయలేదని స్పష్టం చేసింది. అయితే పునీత్ మల్హోత్రాతో ఉన్న సంబంధం గురించి అడిగితే మాట దాటేసింది. బికినీ వేసుకుని స్విమ్మింగ్‌పూల్ మధ్య చేసిన రచ్చ విషయంలో కూడా సోనమ్ నోరు మెదపలేదు. అంతకు ముందు తండ్రి కారణంగా సినిమా అవకాశాలు రాలేదంది. ఇప్పుడేమో సినిమా కుటుంబానికి చెందిన దాన్ని కావడంతో ఇప్పటి అమ్మాయిల్లా డేటింగ్ చేయలేకపోయానంటోంది.

ఎలా? ఏమైనా సమస్యఉంటే నాతో చెప్పు... ఇక నుంచి నీకు బాసైనా గురువైనా నేనే" అన్నాడు.

"ఈ ఉద్యోగం నాకు ఇష్టంలేదు" అన్నాను.

"ఏమైందీ ఉద్యోగానికి?"

"కుక్కల్ని పట్టుకునే ఉద్యోగమా... అని నా స్నేహితులు అందరూ నవ్వుతున్నారు".

"వాళ్ళు అమాయకులు. వదిలెయ్. అనుభవంతో చెప్తున్నాను విను. బంగారంలాంటి ఉద్యోగం. నా ఇద్దరు కూతుళ్ళకు పెళ్ళిళ్ళు ఎలా చేశానను కున్నావు? నా కొడుకుని పెద్దచదువులు ఎలా చదివించాననుకున్నావు? అదంతా ఈ ఉద్యోగం చలవే. కుక్కని కొడితే డబ్బులు రాల్తాయి అనేమాట ఎప్పుడైనా విన్నావా? ఇక్కడ కుక్కల్ని పట్టుకుంటే చాలు డబ్బులు రాల్తాయి" అంటూ వంకరగా నవ్వాడు.

అతనేమంటున్నాడో నాకర్థంకాలేదు. "నాకు కుక్కలంటే భయం" అన్నాను.

"అమ్మో... ఎంత తప్పుమాట! కుక్కలంటే ఎవరను కున్నావు? మనపాలిట కల్పవృక్షాలు, కామధేనువులు. మనం వాటి ఫొటో ఇంట్లోపెట్టుకుని పూజించాలి తెలుసా. అవి ఉండబట్టేకదా మనం ఇలా రెండుచేతులా సంపాదించుకోగలుగుతున్నాం. వాటినేమీ అనకు" అన్నాడు.

ఓ రోడ్డుపక్కన వ్యాన్ ఆపాడు డ్రైవర్. అక్కడ ఓ నాలుగైదు కుక్కలు చెట్లకింద విశ్రాంతి తీసుకుంటున్నాయి.

"మనం ఈరోజు చెయ్యాల్సినపని ఇదే. ఆ కుక్కల్ని పట్టుకుని వాన్లో వేసి వెటర్నరీ సర్జన్‌కి అప్పగిస్తే చాలు" అన్నాడు వ్యాన్ దిగుతూ యాదయ్య.

"అదేమిటి? రోజుకి కనీసం పది కుక్కల్ని పట్టుకోవాలని కదా చెప్పారు?" వ్యాన్ దిగాక అడిగాను.

"పది కుక్కల్ని పట్టుకుని అప్పగించినట్టు రికార్డుల్లో రాస్తాంగా" అంటూ నావైపుచూసి కన్నుగీటాడు. ఈ లెక్క లేమిటో, ఏం జరుగుతోందో నాకు అర్థం కాలేదు.

"పద పట్టుకుని వ్యాన్లో వేద్దాం" అంటూ యాదయ్య ముందుకు కదిలాడు.

"ఎలా పట్టుకోవడం? వలలేవీ? శిక్షణ ఇచ్చేటప్పుడు చెప్పారుగా. నైలాన్ వలలుంటాయనీ అవి పొడవాటి రాడ్ల చివర ఉండటం వలన కుక్కల నుంచి ఎలాంటి ప్రమాదమూ ఉండదని" అన్నాను భయం భయంగా.

"నైలాన్ వలలా పాడా? మనచేతులే వలలు. కుక్కల్ని ప్రేమగా దగ్గరకు పిలిచి మెడదగ్గర మెల్లగా నిమురుతూ ఎత్తుకుని వ్యాన్లో వేయటమే. చాలా సులభం. నేను చేస్తాను. చూసి నువ్వుకూడా అలానే చేయి"

"నేనలా చేయను. మొన్ననేగా పాతిక నైలాన్ వలలు కొన్నారని చెప్పారు. ఆ వలలు మనకివ్వకుండా స్టోర్ రూంలో దాచిపెడితే ప్రయోజనం ఏమిటి?"

"నువ్వు కొత్తకదా.. నీకు చాలా విషయాలు చెప్పాలి. వలలు కొనరు. కొన్నట్లు బిల్లులు పెడ్తారు. మనం పది కుక్కల్ని పట్టుకుంటే వాటిని పాతిక కింద రికార్డుల్లో చూపిస్తారు. ఒక్కో కుక్కకి రెండు రోజులు ఆహారానికయ్యే ఖర్చు, ఆపరేషన్ ఖర్చు, మందుల ఖర్చు, రేబీస్ ఇంజెక్షన్ల ఖర్చు ప్రభుత్వంనుంచి క్లెయిం చేస్తారు. మిగిలిన మందుల్నీ, ఇంజెక్షన్లను మెడికల్ షాపులకు, ప్రైవేట్ వెటర్నరీ ఆస్పత్రులకు అమ్ముకుంటారు".

"అన్యాయం కదా. మనం ఎందుకు దీనిలో భాగస్వాములం కావాలి? నేను దొంగలెక్కలు చూపను".

యాదయ్య నావైపు పిచ్చోణ్ణి చూసినట్టు చూశాడు. "అలా చేస్తే మనల్ని ఉద్యోగాలనుంచి పీకేసి కొత్తవాళ్ళను తీసుకుంటారు. నోరు మూసుకుని మనకొచ్చేవాటా తీసుకోవటమే ఉత్తమం" మాట్లాడుతూనే యాదయ్య రెండు కుక్కల్ని పట్టుకుని వ్యాన్లో వేశాడు. మిగతా కుక్కలు ప్రమాదం పసిగట్టి యాదయ్య ప్రేమగా పిలిచినా దూరంగా పారిపోయి భయం భయంగా చూస్తున్నాయి.

వ్యాన్లోంచి రెండు గోనెపట్టాలుతీసి ఒకటి తను తీసుకుని మరొకటి నా చేతికిచ్చాడు. వాటి మూతి దగ్గరున్న తాడు పట్టుకుని లాగితేచాలు గట్టిగా బిగుసుకుపోతుంది. కుక్కల వెంట పరుగెత్తి ఓ కుక్క మెడని గోనె సంచితో కప్పేసి తాడు లాగాడు. అది ఊపిరాడక కొట్టుకుంటున్నప్పుడు దాని మిగతా శరీరాన్నికూడా గోనెసంచిలో నొక్కేసి వ్యాన్లో వేశాడు. నేనూ అలా చేద్దామని ప్రయత్నించా. ఎన్నిసార్లు ప్రయత్నించినా కుక్కమెడని గోనెసంచిలో బిగించడం ఎలానో తెలియలేదు. యాదయ్యనవ్వి "ఈ రోజు పనంతా నేనే చేస్తాలే. రేపట్నుంచి నువ్వా సగంపని చేయాలి. సరేనా" అన్నాడు.

రిజిస్టర్లో ఆరోజు పదకొండు కుక్కల్ని పట్టుకున్నట్టు నమోదుచేశాడు యాదయ్య. మరునాడు వెళ్ళినప్పుడు గమనించాను. ఆ ఐదుకుక్కల్ని ఒకే కేజ్‌లో ఉంచి వాటి ముందు ఓ మూకుడులో కొద్దిగా పెరుగన్నం పెట్టారు.

"ఇంత తక్కువ ఆహారం పెట్టారేమిటి? ఒక కుక్కకు కూడా సరిపోదే" అన్నాను యాదయ్యతో.

"ఇళ్ళల్లో పెంచుకునే జాతికుక్కల్ని మేపినట్టు ఊర కుక్కల్ని కూడా మేపితే వీళ్ళకేం మిగుల్తుంది?" అన్నాడు.

**వీధికుక్కల్లో రేబీస్ వ్యాధి నివారించేందుకు వాటిని పట్టుకుని ఇంజెక్షన్లు చేసి వదిలేస్తారు. ఈ కథలో అతనికి సరిగ్గా ఇదే ఉద్యోగం దొరికింది. కానీ కుక్కలంటే చచ్చేంతభయం అతనికి. కుక్కల్ని పట్టుకోవడంలో యాదయ్యే అతగాడికి గురువు. మరి పనిలో జేరిన కొత్త శిష్యుడికి ఈ గురువు ఎలాంటి శిక్షణ ఇచ్చాడు? శిష్యుడికి కుక్కలంటే భయంపోయిందా? లేక జాలిపుట్టిందా?**

నోరులేని జంతువులకు పెట్టాల్సినతిండిలో కూడా మిగుల్చుకుంటున్న అక్కడి మనుషుల్నిచూసి అసహ్యం వేసింది.

వాటికి ఆపరేషన్‌చేశాక వదిలిపెట్టేముందు వ్యాక్సిన్ వేశారు. నేనూ యాదయ్య వాటిని వ్యాన్లో ఎక్కించుకుని వదిలిరావడానికి బయల్దేరాం. ఓచోట వ్యాన్ ఆపించి కుక్కల్ని వదిలేస్తుంటే "మనం

# థైరాయిడ్

థైరాయిడ్సమస్య నేడు ప్రపంచంలోని పారిశ్రామిక ప్రదేశాలలో మరియు తక్కువ అభివృద్ధిచెందిన ప్రదేశాలలో ఎక్కువగా విస్తరించింది. సాధారణంగా ఈ సమస్య పురుషులతో పోలిస్తే స్త్రీలలోఎక్కువగా కని పిస్తుంది. మానవుడి శరీరంలో ముఖ్యమైన గ్రంథులలో థైరాయిడ్ ఒకటి. థైరాయిడ్ గ్రంథి మెడ మధ్యభాగంలో గొంతు ముందు సీతాకోకచిలుక ఆకారంలో శ్వాస నాళానికి ఇరు ప్రక్కలా ఉంటుంది. ఈ గ్రంథి పిట్యూటరి గ్రంథి ఆధీనంలో ఉంటుంది. ఇది థైరాయిడ్ హార్మోన్లను ఉత్పత్తి చేస్తుంది. ఇవి రక్తప్రసరణలోకలిసి శారీరక ఎదుగుదలతో పాటు వివిధ జీవప్రక్రియలను నిర్వహి స్తాయి. శరీరంలో తగిన మోతాదులో థైరాయిడ్ హార్మోన్లు లేనప్పుడు పిట్యూటరీ గ్రంథి అవసరాన్ని గ్రహించి టి.ఎస్.హెచ్. హార్మోన్ని విడుదల చేస్తుంది. ఈ టి.ఎస్.హెచ్. సంకేతాలతోనే థైరాయిడ్ గ్రంథి టీ3 (ట్రై ఐడో థైరోనిన్), టీ4 (థైరాక్సిన్)అనే థైరాయిడ్ హార్మోన్లను ఉత్పత్తిచేసి రక్తప్రవాహంలోకి పంపుతుంది. థైరాయిడ్ గ్రంథిలో ముఖ్యంగా రెండుతేడాలను చూస్తాం. అవి టీ3, టీ4 తగ్గటం వల్ల హైపో థైరాయిడిజమ్, రక్తపరీక్షలో టీ.ఎస్.హెచ్ పెరగటం, టీ3, టీ4 తగ్గటం లేదా నార్మల్గా ఉంటుంది. టీ3, టీ4 పెరగటం వల్ల హైపర్ థైరాయిడి జమ్ చూస్తాం. థైరాయిడ్గ్రంథిజీవక్రియలకు ముఖ్యమైనది. ప్రపంచ జనాభాలో సుమారు 7.5 % థైరాయిడ్సమస్యలతో బాధ పడుతున్నారు. పురుషులలో కేవలం 1.5 % కలదు. టీ3, టీ4 హార్మోన్లు శరీరంలో 1బి.యం.ఆర్ మెటబాలిక్ రేట్ పెంచుతుంది, కార్బో హైడ్రేట్ కొవ్వు పదార్థాల సంశ్లేషణ వ్యవస్థల మీదప్రభావం చూపుతుంది. థైరాయిడ్ హార్మోన్ ఉత్పత్తిలో అయోడిన్ పాత్రముఖ్యమైనది. ఈ అయోడిన్ లోపం వల్ల కూడా థైరాయిడ్ డిజార్డర్స్వస్తాయి. థైరాయిడ్ హార్మోన్లఉత్పత్తి ఎక్కువైనా, అలాగే తక్కువైనా కూడా అది సమస్యగా పరిణమిస్తుంది. వీటి అసమతూల్యత వలన హైపో థైరాయిడ్, హైపర్థైరాయిడ్ మరియు గాయిటర్ అనే దీర్ఘకాలిక సమస్యలు తలెత్తుతాయి.

**హైపో థైరాయిడ్:** ఇది సర్వసాధారణంగా కనిపించే థైరాయిడ్సమస్య. మన శరీరంలో థైరాయిడ్ హార్మోన్లు కావలసిన దాని కంటే తక్కువ మోతాదులో ఉత్పత్తి కావడం వలన ఇది వస్తుంది.

**లక్షణాలు:** దీనివలన అలసట, ఏకాగ్రత లేక పోవటం, జుట్టు రాలడం, స్త్రీలలో ఋతుసమస్యలు, బరువు పెరగడం ఈ హైపోథైరాయిడిజమ్ ఈ దశాబ్దంలో పురుషుల కంటే స్త్రీలలో చాలాఎక్కువ శాతం చూస్తుంటాము. హైపర్ థైరాయిడి జమ్: శరీరంలో థైరాయిడ్ హార్మోన్లు అవసరాన్ని మించి ఎక్కువ మొత్తం లో ఉత్పత్తి అవుతుండటాన్ని హైపర్ థైరాయిడిజమ్ అంటారు. ఈ సమస్య ఏ వయసు లో వారికైన రావచ్చు. కాకపోతే 20-40 సం॥ల మధ్య వయసువారిలోఎక్కువగా కనిపిస్తుంది. మొత్తం బాధితులలో 80% హైపో థైరాయిడిజమ్ కనిపిస్తే మిగితా 20% హైపర్ థైరాయిడిజమ్ కనిపిస్తుంది. కానీ దీన్నిత్వరగా గుర్తించలేకపోయినా, నిర్లక్ష్యం చేసినా దుష్ప్రభావాలు తీవ్రంగా ఉంటాయి. **లక్షణాలు:**1.ఆకలిబాగా ఉంటుంది కానీ బరువు తగ్గుతారు. 2.అధిక వేడిని తట్టుకోలేక పోవడం. **గాయిటర్:** థైరాయిడ్గ్రంథివాపు వలన వచ్చే సమస్యలను గాయిటర్ అంటారు. ఇది ముఖ్యంగా



**డా. మురళి అంకిరెడ్డి**
M. D (Homeo)
**స్టార్ హోమియోపతి**

అయోడిన్ లోపం వలన వస్తుంది. దీనిలో నొప్పి ఏమి ఉండదు. కానీ ఏదైనా థైరాయిడ్ గ్రంథికి ఇన్ఫెక్షన్ వచ్చినపుడే నొప్పి ఉంటుంది. దీనిని థైరాయిడ్ హైటస్ అంటారు.

**లక్షణాలు:** గొంతుక్రిందవాపు,స్వరంలో మార్పులు, ఆహారం మింగడానికీకష్టంగాఉండటం,శ్వాస తీసు కోవటంలో ఇబ్బందులు ఏర్పడతాయి.

**చికిత్స:**థైరాయిడ్సమస్యలకు జీవితకాలంమందులు వాడే పనిలేకుండా, ఈ సమస్యరావడానికీగలమూల కారణాన్ని గుర్తించి, వ్యక్తిగతంగా రోగి స్థితిగతులకు అనుగుణమైన హోమియోపతి వైద్యం చేయడం ద్వారా థైరాయిడ్ హార్మోన్ సమస్యలను నయం చేయువచ్చు. హోమియోపతి మందులు హెచ్.ఆర్.టీ విధానంతో కాకుండా థైరాయిడ్ గ్రంథి అసమ తూల్య తను సరిచేసి టీ3, టీ4 హార్మోన్స్ను సహజ పద్ధతిలోవిడుదలచేయడానికీ ఉపయోగపడతాయి. హోమియోపతి వైద్యవిధానంలో థైరాయిడ్ రావటానికీ మూలకారణాలన కనుగొని, శారీరక, మానసిక లక్షణాలు విచారించి సరైన హోమియోమందుల తత్వవిచారణ ద్వారా చికిత్స చేయువచ్చును.



# చర్మం మీద నల్లమచ్చలు, తెల్లమచ్చలు

చర్మం యొక్క వర్ణమునకు మన శరీరంలోని మెలానిన్ పిగ్మెంట్ కారణంగా ఉంటుంది. ఈ మెలానిన్ పిగ్మెంట్ ఉత్పత్తిలో ఉన్న హెచ్చు తగ్గుల వల్ల మన చర్మంలో తెల్లమచ్చలు లేదా నల్లమచ్చలు రావచ్చు. మెలానిన్ పిగ్మెంట్ వల్ల చర్మం, కంటికి, జుట్టుకి వర్ణం వస్తుంది.

నల్లమచ్చల రుగ్మతలు:

**1. పోస్ట్ ఇన్ఫ్లమేటరీ హైపర్ పిగ్మెంటేషన్:** గాయం లేక వాపు వచ్చి మానడం వల్ల చర్మంలో నల్లమచ్చలు రావడాన్ని పోస్ట్ ఇన్ఫ్లమేటరీ హైపర్ పిగ్మెంటేషన్ అని అంటారు. ఈ అవస్థకి తరువాతనే మొటిమలు, సోరియాసిస్, ఎటోపిక్ మరియు కాంటాక్ట్ డెర్మటైటీస్, లైకెన్ ప్లానస్ వచ్చే అవకాశం వుంది. దీని వల్ల తెల్లమచ్చలు అప్పుడప్పుడు వచ్చే అవకాశం వుంది.

**2. మెలాస్మా:** శరీరంలో ఏ భాగమైతే ఎక్కువగా ఎండకి బహిర్గతం అవుతుందో అక్కడ ఈ విధంగా గోధుమ వర్ణంలో వున్న మచ్చలు వస్తాయి. ముఖ్యంగా ముఖము, చేతులు, పాదాలు, ఈ రకమైన మచ్చలు గర్భిణిలో కూడా చూడవచ్చు, కాని ఇవి ప్రసవం తరువాత వాటికంతట అవే పోతాయి.

**3. సోలార్ లెంటిజినెన్స్:** ఎక్కువ అల్ట్రావైలెట్ లైట్కి (కిరణాలకి) బహిర్గతం అయినప్పుడు చర్మం మీద నల్లగా చిన్నచిన్న మచ్చలు వస్తాయి. ఇవి ప్రాథమికంగా, ముఖం, చేతులు, చాతి, వీపు, కాళ్ళమీద వస్తాయి.

**4. ఎఫిలైడ్స్:** ఇవి సాధారణంగా పిల్లల్లో ఎక్కువగా కనబడతాయి. పిల్లలు ఎక్కువ ఎండకి బహిర్గతం అవడం వల్ల వస్తాయి. ఇవి ఎరుపు రంగు నుండి గోధుమరంగులో ముఖము, మెడ, ఛాతి, చేతుల మీద వస్తాయి. ఇది స్వయంగా వాటికంతట అవే చలికాలం వచ్చేసరికి మానిపోతాయి.

**తెల్లమచ్చలు:**

**1. విటిలిగో:** మెలెనిన్ శాతం తక్కువ అవ్వడం వల్ల చర్మం మీద తెల్లమచ్చలు ఏర్పడతాయి. ఇవి మృదువుగా, తెల్లమచ్చలుగా ఏర్పడతాయి. ఇవి శరీరం మీద అక్కడక్కడ లేదా మొత్తం కూడా రావచ్చు. **2.ఆల్బినిజమ్:** శరీరంలో పూర్తిగా మెలెనిన్ పిగ్మెంట్ లేకపోవడం వల్ల ఈ రకమైన తెల్లమచ్చలు వస్తాయి. జుట్టు రంగు మరియు చర్మం రంగు తెల్లగా మారిపోతుంది. వంశపారంపర్యంగా వచ్చే అవకాశం వుంది.

**3. టీనియా మెర్సికలర్:** ఇది ఒకరకమైన ఫంగల్ ఇన్ఫెక్షన్. దీనిలో చర్మంపై అనేక తెల్లమచ్చలు. పొరలలో కూడా వస్తాయి. ఈ మచ్చలు అప్పుడప్పుడు పెరుగుతాయి కూడా. చర్మం జిడ్డుగా ఉన్నవాళ్ళు, చెమటలు ఎక్కువగా వస్తున్నవాళ్ళు, వ్యాధినిరోధకశక్తి తగ్గినవాళ్ళు వీళ్ళకి ఇవి ఎక్కువ రావడానికి అవకాశం వుంది.

**నిర్ధారణ:** రోగి శరీర, మానసిక, వంశపారంపర్య చరిత్ర ఆధారంగా రోగనిర్ధారణ చేయువచ్చును.

**చికిత్సవిధానం:** ఆయుర్వేద వైద్యనుసారం దూషించబడిన వాత, పిత్త, కఫ దోషాలను సమస్థితిలోకి తీసుకుని వచ్చే ఔషదాలు అద్భుతమైన లేపనాలు, పంచకర్మ విధానాలు ఉన్నాయి. వ్యాధి ఆరంభంలోనే రోగి ఆలస్యం చేయకుండా వైద్యుల్ని సంప్రదించి వ్యాధిని పూర్తిగా నివారించుకోవచ్చును.

**డా. మనోహర్.** M. D (Ayurveda)
**స్టార్ ఆయుర్వేద**

## న్యాయవాది రాజాజి

సుప్రసిద్ధ దేశ భక్తులు సి.రాజగోపాలాచారి సేలం (తమిళనాడు)లో న్యాయవాదిగా గొప్ప పేరుప్రఖ్యాతులు సంపాదించారు. రకరకాల కక్షిదారులతో ఆయనకు వింత అనుభవాలు కలిగేవి.

హత్యానేరం ఆరోపించబడిన ఒక ముద్దాయిని రాజాజీ తన వాద నైపుణ్యంతో ఉరిశిక్ష పడకుండా తప్పించి నిర్దోషిగా నిరూపించి విడుదల చేయించారు. విడుదల అయిన తర్వాత అతను రాజాజీని దర్శించుకొని, కృతజ్ఞతలు తెల్పి ఒక కోరిక కోరాడు. తాను హత్య చేయటానికి ఉపయోగించిన కత్తిని కోర్టువారి నుండి తిరిగి తనకు ఇప్పించమన్నాడు. ఏమంటే ఆ కత్తి తమ ఇంట తరతరాలుగా ఉన్నదని, అది తమకు చాలా విలువైనదని కూడా చెప్పాడు. అలా అడిగిన వాడిమీద, తన మీద తన వృత్తిమీద పట్టరాని కోపమూ, అసహ్యమూ ఆయనకు కలిగాయి.



**సేకరణ: రామమోహనరాయ్**

వీటిని తెచ్చింది ఈ ప్రాంతం నుంచికాదు. మీరు మరిచిపోయినట్టున్నారు. మనం ఇంకా ఓ కిలోమీటర్ దూరం వెళ్ళాలి" అన్నాను కంగారు పడుతూ.

యాదయ్య దిలాసాగా నవ్వాడు. "నాకు గుర్తుంది. అందుకే ఇక్కడ వదులుతున్నా".

"మాకు శిక్షణాతరగతుల్లో ఇలా చేయకూడదని చెప్పారు. ఇలా చేయడంవల్ల కుక్కలు కొత్త ప్రాంతంలో ఇమడలేక అసహనానికి లోనవుతాయనీ, అందువల్లనే వాహనాల వెంట పరుగెత్తుతాయనీ చెప్పారు. ఈ ప్రాంతంలో నివాసం ఉంటున్న కుక్కలు వీటిని తమ స్థావరాల్లోకి రానివ్వకుండా అడ్డుకుంటాయి. దానివల్ల కుక్కల మధ్య పోట్లాటలకు అవకాశం ఉంది" అన్నాను.

"పిల్లకాకికేం తెలుసు. ఉండేలుదెబ్బ అన్నారు అందుకే. నువ్వు చెప్పేవిషయాలు నాకు తెలీవనా? ఇలా చేస్తేనే మనుషులు ఇబ్బందులకులోనై మనకు ఫోన్లు చేస్తారు. మనం వీటిని మళ్ళా వ్యాన్లోకి ఎక్కిస్తే డబ్బులిస్తారు. అంతా ప్రశాంతంగా ఉంటే మనల్ని ఎవరు పట్టించుకుంటారు?" అన్నాడు వెకిలిగా నవ్వుతూ.

కాసిని డబ్బులకోసం మూగప్రాణుల జీవితాలతో ఆడుకుంటున్న యాదయ్యమీద గొంతుదాకా కోపంవచ్చినా నా సీనియర్ కాబట్టి దిగమింగుకున్నాను.

నెలాఖరులో ఏడుకుక్కల్ని పట్టుకున్నాం. అందులో రెండు చావుకి దగ్గరగా ఉన్నాయి. ఒకటి ముసలితనంవల్ల, రెండోది అనారోగ్యంవల్ల. దార్లో నాకెప్పటినుంచో మనసులో పీకుతున్న అనుమానాన్ని యాదయ్య ముందుంచాను. "ఆపరేషన్లు చేసినదానికి రుజువుగా తొలగించిన అవయవాల్ని నెలవారిగా ఒకగాజు సీసాలో వెనిగర్లో భద్రపరచి మూడు నెలలకొకసారి చెకింగ్‌కి వచ్చే వాళ్ళకు లెక్క చూపించాలికదా. మరి చేయని ఆపరేషన్లు చేసినట్టు ఎలా రుజువు చేస్తారు?"

దానికి యాదయ్య ఏదో జోక్ విన్నట్టు పగలబడి నవ్వి "ఇంత అమాయకంగా ఉంటే ఎలా బతుకుతావు? చెకింగ్‌కి వచ్చేవాళ్ళు మనుషులు కారా? వాళ్ళకు డబ్బులు చేదా ఏమిటి?" అన్నాడు.

వ్యాన్ నిర్మానుష్యమైన ఓ ప్రదేశంలో ఆపారు. "ఇక్కడాపారేమిటి?" అని అడిగాను. అక్కడంతా చెట్లు గుబురుగా పెరిగి ఉన్నాయి.

"కొన్ని పనులు చాటుగా చేయాలి. ఈ రెండు కుక్కలూ పాపం మరణయాతన అనుభవిస్తున్నాయి కదా. వీటికి విముక్తి ప్రసాదించొద్దా? మెర్సీ కిల్లింగ్" అంటూ వంకరగా నవ్వుతూ వాటిని కిందికి దింపి మెడకుతాడు బిగించి చంపేశాడు.

అది చూసినప్పుడు కలిగిన షాక్‌వల్ల కొన్ని నిముషాలు నాకు నోరు పెగల్లేదు. దాన్నుంచి తేరుకుని "దీన్ని మెర్సీ కిల్లింగ్ అంటారా? ఎంత అమానుషంగా చంపారో. గెజిట్‌లో చెప్పినదాని ప్రకారం వాటికి బాధ తెలియకుండా కదా చంపాలి. మొదట మత్తు ఇంజక్షన్ ఇచ్చాక తర్వాత పొటాషియం క్లోరైడ్ ఇంజెక్షన్ ఇచ్చి..."

నా మాటలు మధ్యలోనే తుంచేస్తూ యాదయ్య అన్నాడు. "ఇప్పుడు అలానేగా వీటిని చంపడం జరిగింది. మన కళ్ళెదుటే వెటర్నరీ డాక్టర్‌గారు ఆ ఇంజెక్షన్లు ఇచ్చారు కదా. నోర్మూసుకునిచూడు. చూడలేకపోతే కళ్ళుకూడా మూసుకుని కూచో".

వ్యాన్లో ఉన్న మిగతా ఐదుకుక్కల్ని కూడా ఒక దాని తర్వాత మరొకదాన్ని దింపి తాడు మెడకు బిగించి చంపాడు.

"ఇవి ఆరోగ్యంగా ఉన్న కుక్కలు. వీటినెందుకు చంపుతున్నారు??' అని నిలదీశాను.

"అబ్బబ్బ... నీతో చచ్చేచావులా ఉందే. ప్రతిదానికీ అడ్డు పడుతున్నావు. నీకు అర్థమయ్యేలా చెప్తా విను. ఇలా ఆరోగ్యంగాఉన్న కుక్కల్నికూడా చంపటంవల్ల చాలా లాభాలున్నాయి. వీటిని మెర్సీ కిల్లింగ్ చేసి చంపినట్టు రికార్డులో నమోదు చేయటంవల్ల వాటికోసం వాడినట్టు చూపించే ఇంజెక్షన్లని బైట మార్కెట్లో అమ్ముకోవచ్చు. పది కుక్కలకు ఆపరేషన్లుచేసి పాతిక్కి చేసినట్టు చూపిస్తున్నాం కాబట్టి కుక్కల సంఖ్య తగ్గలేదెందుకని ఎవ్వరూ ప్రశ్నించకుండా వీటిని చంపేయటంవల్ల లెక్క సరిపోతుంది. వీటి చర్మాన్ని లెదర్ ఫ్యాక్టరీలకు అమ్ముకుంటే డబ్బులొస్తాయి" అన్నాడు యాదయ్య.

నేను ఆక్షణమే ఓ నిర్ణయానికొచ్చి ఇంటికి రాగానే అన్నతో చెప్పాను.

"ఎంత కష్టపడితే ఈ ఉద్యోగం దొరికిందో తెలుసా? అయినా కుక్కలంటే భయమని ఎవరైనా బంగారంలాంటి ఉద్యోగం వదులుకుంటారా?" అన్నాడు.

"నాకిప్పుడు కుక్కలంటే భయంలేదన్నా. వాటి మీద అమితమైన జాలి ఉంది. అవి కనిపించినప్పుడల్లా వాటిని దయగా దగ్గరకు తీసుకోవాలనిపిస్తోంది. చివరికి రేబీస్ సోకిన కుక్కలన్నా భయం లేదు. వాటితో జాగ్రత్తగా ఎలా వ్యవహరించాలో నాకు తెలుసు. కానీ ఆపరేషన్ల పేరుతో దయాదాక్షిణ్యాలు లేకుండా కుక్కలపై దుర్మార్గాలు చేస్తున్న మా వెటర్నరీ డాక్టర్ని చూసినా, యాదయ్యలాంటి మిగతా సిబ్బందిని చూసినా భయమేస్తోందన్నా... చాలా భయ మేస్తోంది" అన్నాను.

**సెల్:917588630243**



## హెపటైటిస్, హెర్పిస్‌లకు చెక్

**హెపటైటిస్** వైరస్ శరీరంలోకి ప్రవేశించిన వెంటనే లక్షణాలు బయటపడవు. రోగలక్షణాలు కనిపించడానికి చాలా ఏళ్లు పడుతుంది. కొంతమందిలో వైరస్ సోకిన 4 వారాలు లేదా 12 వారాల తరువాత కొన్ని రోగలక్షణాలు బయటపడతాయి. వైరస్ ఎప్పుడైతే కాలేయంపై దాడి చేస్తుందో అప్పుడు లక్షణాలు బయటపడతాయి. అంతవరకు ఇది సోకిన విషయం తెలియదు. ఆకలి తగ్గిపోవడం, వాంతులు, మూత్రం పచ్చగా రావడం, కళ్లు పసుపుపచ్చగా మారడం, జ్వరం, ఒళ్లు నొప్పులు అధికంగా ఉండటం వంటి లక్షణాలు కనిపిస్తాయి. వ్యాధి నిర్ధారణ కోసం హెపటైటిస్-బి(హెచ్‌బిఎస్ ఏజి) పరీక్ష చేయించాలి. హెపటైటిస్-బి ఉన్న కొందరిలో లివర్ ఫెయిల్యూర్‌కు దారితీస్తుంది. కొన్ని ఏళ్ల నుంచి వైరస్ ఉన్నవారిలో కాలేయం క్రమంగా దెబ్బతింటూ లివర్ సిర్రోసిస్‌కు దారితీయవచ్చు లేక లివర్ క్యాన్సర్‌గా మారవచ్చు.

**హెర్పిస్ సింప్లెక్స్**

పురుషాంగంపైన చెమట పొక్కుల మాదిరిగా నీటి పొక్కులు కనిపిస్తాయి. నీటిపొక్కులు ఎర్రగా ఉండి దురద ఉంటుంది. నీటిపొక్కులు పగిలిపుండు పడుతుంది. ఈసమయంలో చికిత్స తీసుకోకపోతే ఇతరులకు సోకే ప్రమాదం ఉంది. లైంగిక కలయిక ద్వారా సంక్రమించే ఈ వ్యాధిని హెర్పిస్ అని అంటారు. స్త్రీలలో కూడా యోని మీద చిన్న చిన్న పొక్కులలాగా వచ్చి ఎర్రగా మారి నొప్పిని కలిగిస్తాయి.

**హోమియో చికిత్స :** హెపటైటిస్ బి, సి వ్యాధులను సమర్ధవంతంగా అడ్డుకునే చికిత్స హోమియోలో ఉంది. వైరల్‌లోడ్‌ను పూర్తిగా తగ్గించడం ద్వారా ఆరోగ్యవంతమైన జీవనం గడిపే అవకాశం దక్కుతుంది. హోమియో చికిత్స అనంతరం వ్యాధి మళ్లీ తిరగబెట్టదు.

## ఆస్తమా శాశ్వతంగా పోదని ఎవరన్నారు?

**ఆస్తమా, సైనసైటిస్...** రెండు వేరు వేరు వ్యాధులైనా రెండింటికి సంబంధం ఉంది. దీర్ఘకాలంగా సైనసైటిస్‌తో బాధపడుతున్నప్పుడు ఆస్తమాగా మారే అవకాశం ఉంటుంది. వేగంగా వ్యాపిస్తోన్న వ్యాధుల్లో ఆస్తమా ఒకటి.

**కారణాలేంటి? :** 5 మైక్రాన్ల కన్నా తక్కువ ఉండే పార్టికల్స్ సైనస్‌లో ఆగకుండా నేరుగా ఊపిరితిత్తుల్లోకి వెళ్లిపోతాయి. వీటిని బయటకు పంపించడానికి శరీరం ప్రయత్నిస్తుంది. ఫలితంగానే తుమ్ములు వస్తుంటాయి. అంతేకాకుండా వాతావరణ కాలుష్యం, ఇంట్లో పరిసరాలు శుభ్రంగా లేకపోవడం, దుమ్ము, ధూళి ఎక్కువగా ఉండే ప్రదేశాల్లో ఉండటం వంటివి ఆస్తమాకు, సైనసైటిస్‌కు కారణమవుతాయి.

**లక్షణాలు :** తరచు జలుబు చేయడం, జలుబుతో ఎక్కువ రోజులు బాధపడటం అనేది సైనస్ వ్యాధి ప్రాథమిక లక్షణం. ఆ తరువాత దశలో జలుబు చేసినపుడు ముక్కులు బిగదీసుకుపోతాయి. తల అంతా బరువుగా ఉంటుంది.ముక్కు నుంచి పసుపు పచ్చని, ఆకుపచ్చని ద్రవాలు రావడం మొదలవుతుంది. ఆస్తమాలో కనిపించే ప్రధాన లక్షణాలు దగ్గు, ఆయాసం, పిల్లికూతలు కూడా ఉంటాయి. కొంత మందిలో దగ్గు మాత్రమే ఉంటుంది. దీంతోపాటు ఛాతీ పట్టేసినట్లుగా ఉంటుంది.

**హోమియోతో దూరం**

మూలకారణాన్ని తొలగించే విధంగా హోమియో వైద్యం ఉంటుంది. హోమియో చికిత్స తరువాత వ్యాధి తిరిగి రావడం అంటూ జరగదు. హోమియో మందుల్లో ఎటువంటి దుష్ప్రభావాలు ఉండవు. ఇతర చికిత్సల వల్ల తాత్కాలిక ఉపశమనం కలుగుతుందే తప్ప శాశ్వత పరిష్కారం లభించదు. కానీ హోమియో వల్ల సైనసైటిస్, ఆస్తమా శాశ్వతంగా తగ్గుతాయి.

**Dr. K Ravikirane**
M.D.,M.sc(psych), P.G(virology)LONDON
గోల్డ్‌మెడల్ ఫర్ ఎక్సలెన్సీ ఇన్ మెడిసిన్
మాస్టర్స్ హోమియోపతి
అమీర్‌పేట్, కూకట్‌పల్లి, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్,
విజయవాడ, కరీంనగర్, విశాఖపట్నం,తిరుపతి
ఫోన్ : 7842 106 106, 9032 106 106



## హెచ్‌ఐవి ఉంటే మరణం తప్పదా?

**హెచ్‌ఐవికి** చికిత్స లేదా? హెచ్‌ఐవి సోకితే మరణమేనా! అంటే కానే కాదు. హెచ్‌ఐవి సోకినా అందరిలాగే సాధారణ జీవితం, ఆరోగ్యవంతమైన జీవితం గడపవచ్చు. ఎప్పటికీ ఎయిడ్స్‌గా మారకుండా చూసుకోవచ్చు. ఒక్కమాటలో చెప్పాలంటే హెచ్‌ఐవి వైరస్‌ను హోమియో మందులతో కట్టడి చేయవచ్చు.

**లక్షణాలు కనిపించడానికి....**

హెచ్‌ఐవి శరీరంలోకి ప్రవేశించగానే ఎటువంటి మార్పులు కనిపించవు. కొన్ని సంవత్సరాల తరువాత వ్యాధికి సంబంధించిన లక్షణాలు ప్రారంభవవుతాయి. అంటే సీడీ 4 కణాల సంఖ్య తగ్గిపోయిన తరువాత వ్యాధి లక్షణాలు కనిపిస్తాయి. హెచ్‌ఐవి శరీరంలో ప్రవేశించిన తరువాత ఎన్ని రోజులకు బయటపడవచ్చని అనేది వారి ఆహారపు అలవాట్లు, ఆరోగ్యస్థితి, ఇతర వ్యాధులపై ఆధారపడి ఉంటుంది. కొందరిలో ఐదారేళ్లకే సీడీ 4 కణాలు బాగా తగ్గిపోయి ఇన్‌ఫెక్షన్లు మొదలవుతాయి. మరికొందరిలో పదేళ్లు పడుతుంది.

**హోమియో చికిత్స ఎలా పనిచేస్తుంది**

హోమియో మందుల వల్ల సీడీ 4 కణాల సంఖ్య గణనీయంగా పెరుగుతుంది. అవకాశవాద ఇన్‌ఫెక్షన్లకు చోటు లేకుండా పోతుంది. ఆకలి బాగా పెరగడంతో బరువు పెరగడం ప్రారంభిస్తారు. హెచ్‌ఐవి అని తెలియగానే మరణం తప్పదనే భావనలో ఉంటారు. కానీ అది నిజం కాదు. హోమియో చికిత్స తీసుకోవడం ద్వారా అందరిలాగే సాధారణ జీవితం గడిపే అవకాశం లభిస్తుంది. హెచ్‌ఐవి ఎయిడ్స్‌గా మారకుండా నిరోధించవచ్చు.. ఒకసారి హెచ్‌ఐవి సోకాక దాన్ని పూర్తిగా తొలగించే మందులు లేవు. అయితే హోమియో మందులతో వైరస్‌ల సంఖ్య అతి తక్కువ స్థాయికి చేరుకునేలా చేయవచ్చు.

## పైల్స్ ఉంటే రోజూ నరకమేగా?

**పైల్స్, ఫిషర్** సమస్యలతో బాధపడే వారి సంఖ్య తక్కువేమీ కాదు. కాకపోతే, సమస్య మరీ తీవ్రమై భరించలేని స్థితికి వస్తే కానీ , చాలా మంది డాక్టర్‌ను సంప్రదించరు. ఈ సమస్యలు ఉన్నవారిలో ఎక్కువ మంది శస్త్ర చికిత్సలకు వెళతారు. నిజానికి శస్త్ర చికిత్సల వల్ల తాత్కాలిక ఉపశమనం లభిస్తుందే తప్ప అది సమస్యను సంపూర్ణంగా తొలగించదు. వ్యాధి మూలాలను సమూలంగా తొలగిస్తే గానీ ఈ సమస్యలు పూర్తిగా కనుమరుగైపోవు.

**అర్శమొలలు(పైల్స్) :** మలద్వారం పక్కన ఉండే దమనులు ఉబ్బిపోవడాన్నే అర్శమొలలు అంటారు. ఈ సమస్య ఉన్న వారిలో మల విసర్జన సమయంలో రక్తం పడుతుంది. కొన్నిసార్లు రక్తం మలంతో కలిసి వస్తుంది. గర్భిణీ స్త్రీలలో కూడా పైల్స్ సమస్యకు గురయ్యే వారు ఎక్కువే. కాకపోతే ప్రసవం తరువాత చాలా మందిలో తగ్గిపోతాయి.

**యానల్ ఫిషర్ :** కొన్నిసార్లు మలద్వారం వద్ద చర్మం చిట్లిపోయి రక్తస్రావం అవుతూ ఉంటుంది. మలవిసర్జన సమయంలో, విసర్జన తరువాత కూడా మంటగా ఉండడం. కొందరిలో విసర్జనకు ముందుగానే రక్తం పడుతుంది.

**హోమియో వైద్యం**

పైల్స్‌కు సంబంధించిన వైద్యంలో హోమియోలో ఒక విలక్షణమైన విధానం ఉంది. ప్రత్యేకించి దెబ్బతిని వాచిపోయిన దమనులను తిరిగి పూర్వస్థితికి తెచ్చే సామర్థ్యం హోమియో మందులకు ఉంది. అందుకే ఇక్కడ పైల్స్ సమస్య శాశ్వతంగా తగ్గిపోతుంది. రోగికి అతి త్వరితంగా ఉపశమనం లభిస్తుంది. ఫిషర్ సమస్యకు శాశ్వత పరిష్కారం లభిస్తుంది. ఎలాంటి దుష్ప్రభా వాలూ లేకుండా పైల్స్, ఫిషర్‌లనూ సమూలంగా తొలగించే సామర్థ్యం హోమియోకి ఉంది.



# నవ్వే

## కన్నెగంటి అనసూయ

**"ఎందుకా నవ్వు? వేళాకోళమా? వెళ్ళిపోయింది కాక ఆ నవ్వొకటి? అయినా నీకెందుకంత తొందర..? రా... కిందకు దిగిరా..! పంచుకున్న పాటల్లో, నాలుక్కళ్ళనీ ఒక్కటిగా చేసి చూసిన దృశ్యాల్లో, వన్‌బైటు కాఫీలో, విసురుకున్న వెన్నెల సోనల్లో... దూరేసి, దూర్చేసి, జీవితాన్ని కూరేసి, కూర్చేసి... కలిసేకదా.. పంచుకున్నాం! నాకోసం నువ్వన్నావ్, నీ కోసం నేనన్నావ్, మందికోసం మన మన్నావ్.. మరిప్పుడేమిటిలా..? మందినీ, నా మదినీ వదిలి నీదారి నువ్వు చూసుకున్నావ్? కలిసే వెళదామని అలా ఎలా వెళ్ళిపోగలిగావ్? నువ్వులేని ఈ జీవి, నీ జ్ఞాపకాల నిజాలను వెతుక్కుంటూ, రాత్రిళ్ళు మనసు పేగు కదిలి కదిలి నిద్రకి ఉరి వేస్తోంటే.. అణువణువూ దుఃఖం నిండిన నా అన్నవాహి కంతా ఖాళీ...! రా.. వచ్చి తినిపించు. అన్నీ తెలిసిన మహాయోగిలా అలా నవ్వకు. నా గుండె ఒరుసుకుపోతోంది. నవ్వద్దన్నానా..? ఎందుకు నవ్వుతున్నావ్..?"**

ఎదుట కేన్‌కుర్చీలో కూర్చుని, ఎన్నిసార్లు చెప్పినా వినకుండా, వెనక్కీముందుకీ ఊగుతూ తెరలు తెరలుగా నవ్వుతున్న కృష్ణ నెత్తిమీద ఒక్కటివ్వబోయి, తూలి ముందుకు పడిపోయాను.

ఎంతటి తడబాటు? అసలే కృష్ణ అర్ధాంతర అంతర్ధానంతో అణువణువునా ఆక్రమించేసిన ఒంటరితనం.. ఆపైన మరిచిపోలేని అతని జ్ఞాపకాల్లో అనుక్షణం మునిగి తేలుతూ భ్రమలో తూలి ముందుకు పడిపోబోయేసరికి ఒక్కసారిగా దుఃఖం ఎగజిమ్మింది. కృష్ణలేని ఈ నిస్సారమయ జీవితంలో తనకింక ప్రతీది తడబాటేనేమో! ఆలోచనల్ని చెదరగొడుతూ ఫోన్... అమ్మేనేమో! స్వరాన్ని సవరించి కాల్‌బటన్ నొక్కాను. అమ్మే...!

"ఏం చేస్తున్నావమ్మా...?' ఆ పిలుపుతో దుఃఖం దిగంతాలని తాకగా.. మనసు మౌనరోదనకి గురైంది.

"విశాలా... హలో... నిన్నే... పలకవేం... అమ్మా విశాలా?" "ఆ... అమ్మా.." అతికష్టం మీద గొంతు పెగల్చాను.

"జ్యూస్ తాగావా..?"

"ఆ....!"

"నిజమేనా?"

"ఆ...! రెడీ అవుతున్నా. రేపు కాలేజ్. మార్కెట్‌కెళ్ళి పళ్ళూ, కూరగాయలూ తెచ్చుకుందామని..'

"ఉంటానంటే వద్దన్నావ్. ఒక్కదానివీ వెళ్ళగలవా?" "తప్పదు కదా...!" ఉడుకుమోయిందమ్మ.

కాసేపయ్యాక ఫోన్ పెట్టేసి ముఖం కడుక్కుని చెప్పులు బయటేశాను. పక్కనే హష్ పప్పీస్, కృష్ణ ఫేవరెట్ షూస్. కొన్నప్పుడు ఎంత గొడవచేశాడో, అంత ఖరీదైనవెందుకని. ఏమనుకున్నానో అని అనుకుంటూ... మళ్ళీ అంతలోనే,

"యు స్పెన్ట్ వన్ ఫుల్‌డే ఫర్ మి...! దట్ ఈజెనఫ్..." వింటూనే చళ్ళున ఒక్కటిచ్చాను వీపుమీద..

"నేనే నీకోసం బ్రతుకుతుంటే ఒకరోజంటావా?" అంటే, ఎంత నవ్వించాడని!

భారమైన మౌనంతో తలుపుకి తాళం వేస్తుంటే...

"ఏమ్మా...! టీ తాగావా? వద్దామనుకున్నాను.. కాసేపు. పడుకున్నావేమోనని రాలేదు" ఎదురింటి ఆంటీ పలకరింపు. ఊహించలేదేమో ఉలిక్కి పడి సన్నగా నవ్వాను. "అమ్మ వెళ్ళిపోయారటగా..?" అవునన్నాను తలొంచుకునే, తప్పు చేసినదానిలా...

ఆంటీ దగ్గరకొచ్చి తన మునివేళ్లతో నా తలపైకెత్తి నన్నే చూస్తూ...

"మధ్యలో వచ్చాడు. మధ్యలోనే వెళ్ళిపోయాడు. అంతకుముందూ నువ్వే... ఆ తర్వాతా నువ్వే... ఎప్పటికీ నువ్వే! ఇది సంధికాలం. తర్వాత అంతా సర్దుకుంటుంది. ఈ మాత్రం అర్థం అయితే అంతా హ్యాపీ అమ్మా..."

"మనకి మాత్రమే రాలేదుకదా..? అలవాటు



## అవకాశం రావడమే గొప్ప

మిల్కీ తమన్నా నోటి వెంట ఈ మాటలు విన్న వారు మొదట ఆశ్చర్యపోయినా, ఆ తరువాత ఆమె చెప్పిన లాజిక్ విని నిజమే కదా అనుకున్నారట! ఇంతకీ అసలు సంగతేమిటంటే 'బాహుబలి-2'లో తమన్నా రోల్ పెద్దగా ఉండదు. దీనిమీద ఆమె అభిమానులు అసంతృప్తి వ్యక్తం చేశారట! దానికి తమన్నా, "మొదటి భాగంలో నా పాత్ర చాలా చిన్నది అయినా డైరెక్టర్‌గారు దాన్ని అద్భుతంగా తీర్చిదిద్ది నాకు ఎనలేని పేరు తీసుకొచ్చారు. రెండవ భాగంలో ఆ కొద్దిసేపు కనిపించడం అన్నది గొప్పే తప్ప, నన్ను అవమానించినట్టు కాదు" అంటూ చెప్పుకొచ్చింది. తమ్ము ఎంత అందంగా ఉంటుందో ఆమె మనసు కూడా అంత అందంగా ఉంటుందని ఆమె అభిమానులు తెగ మురిసిపోతున్నారు.

పడాలి. తప్పదు. ఏదైనా అవసరం అయితే పిలు.."

సరేనంటూ గేటువైపు నడుస్తుంటే కాలు కదల్దే...! నన్నెవరో గమనిస్తున్నట్టూ, ఎక్కడో ఏదో పోగొట్టుకున్నట్టూ... ఓడిపోయిన భావన, మర్చిపోయిన శోధన.. చెట్టునొదిలిన ఆకులా, గూడునివదిలిన పక్షిలా.. తాడు తెగిన పతంగంలా... గాల్లో వేల్లాడుతూ... ఏదో.. ఏదేదో శూన్యత. ఏమిటది? ఎందుకీ తేడా?

ఆలోచన్ల సుడిగుండంలో కొట్టుమిట్టాడుతూ ఎలా మార్కెట్‌కి చేరానోగానీ ఏరుతున్న కాయ కాయలో కృష్ణే కనిపిస్తుంటే. "మేడమ్... కొంచెం పక్కకి జరుగుతారా?" అన్న పిలుపుతో ఉలిక్కిపడి పక్కకి జరిగాను.

నిజానికి కృష్ణే చూసుకునేవాడు ఇలాంటివన్నీ. కృష్ణలేని ఈ మూణ్ణెల్ల కాలంలో ఎవరో ఒకరు దగ్గరుండటం, ఎవరెవరో పలకరించటానికి రావటం, ఆ కాసేపూ జ్ఞాపకాల నెమరేతా, అనుభూతుల కలబోతల్ని వినేకొద్దీ మనసు మూగగా రోదిస్తుంటే...

"వదినా...! బాధపడొద్దని చెప్పనుగానీ మనసుకెలాగూ ఇది మందుకాదు. మనసుతో పాటు శరీరం కూడా బలహీనపడితే కష్టం. ఇది తాగు" అంటూ ఏదో ఒకటి తాగించేసేది పెద్ద వదిన.

నిజమే..! కానీ ఎందుకు ఒప్పుకోలేకపోతున్నాను...? కృష్ణతో పెనవేసుకున్న నా మనసు మెలిక ఇంకా విడివడలేదని, ఎప్పటికీ విడివడదని ఎందుకు వీళ్ళందరికీ చెప్పలేకపోతున్నాను..?

ఎద కదలికలను అవిశ్రాంతంగా తెలుపుతూ అలసిన నా కళ్ళనే చూస్తూ....

"ఇంకో నెలైనా ఉంటానే... ఒక్కదానివే ఉండలేవ్...?" బ్రతిమలాడింది అమ్మ.

విషయం తెలియగానే కట్టుగుడ్డల్తో వచ్చేసిందేమో, వచ్చి మూణ్ణెల్లు దాటిపోయింది.

"వద్దమ్మా...! నేను కాలేజీకి వెళ్ళానంటే ఇంట్లో నీకే తోచదు" అనేసరికి అయిష్టంగానే బయలుదేరింది.

రేపటితో ఆఖరు లీవు. ఎల్లుండి నుంచీ కాలేజ్‌కి వెళ్ళాలి. పరామర్శలూ, పలకరింపులూ, జాలీ, సానుభూతి గాయాన్ని కెలికి కెలికి వదిలపెట్టవూ. హే భగవాన్...!"

ఆలోచిస్తుండగానే కళ్ళముందేదో కదులుతున్న భావన? ఏమిటదీ? తల వెనక్కి విదిల్చి తేరిపార చూశాను ఏమై ఉంటుందా అని. ఎవరో కమలాపండుని నా కళ్ళముందు ఆడిస్తున్నారు? ఎవరబ్బా? ఎందుకలా? పిచ్చికోపం వచ్చి తలవిదిల్చి చూశాను. మళ్ళీ అతనే. ఇందాక పక్కకి జరగమన్నతను.

"ఈయనకేం పని లేదా?" అని కోపంగా అనుకుంటున్నంతలో... మనసు పొరల్లో ఏదో కదలిక... దాన్ని ఛేదిస్తూ...

"మేడం...! కమలాలు ఎప్పుడూ కూడా ఇలా గట్టిగా ఉన్నవాటినే ఎంచుకోవాలండి. రసం బాగా వస్తుంది. పైగా తియ్యగా కూడా ఉంటుంది. ఆడవాళ్ళు... మీకు తెలియదని కాదు గానీ, మీరు ఏరుతున్న కాయల్ని చూస్తుంటే ఎందుకో చెప్పాలనిపించింది. ఏదో ఆలోచిస్తూ ఏరుతున్నట్టున్నారు. మీరు అస్సలు మంచికాయలు ఏరుకోవటం లేదు. కావాలంటే మీ సంచిలో చూడండి. ఇప్పుడే ఒక పాడైపోయిన కాయని కూడా దాన్లో వేసేసుకున్నారు. ఇలా చెబుతున్నానని ఏమీ అనుకోకండి".

అతని చొరవకి...తెల్లబోయాను. "థాంక్సండి" అన్నానేగాని అతన్నెక్కడో చూసినట్టనిపించి గబుక్కున లేచి నిలుచున్నాను, సంచినలా పట్టుకునే. ఇంచుమించుగా అతనిదీ అదే స్థితి.

"మీరు... నువ్వు...నువ్వు... ఇక్కడేంటి?" ఆశ్చర్యంగా అన్నాను గుర్తుపడుతూనే.

"ఓ...గాడ్... విశాల కదా..?" అతనూ లేచి నిలబడ్డాడు, సంభ్రమంగా నన్నే చూస్తూ...

"ఇన్నేళ్ళ తర్వాత మీరు త్వరగానే పోల్చారే.." అన్నాను ఒకింత ఆశ్చర్యంగా.. "ఎందుకు పోల్చలేను?" అంటూ ఫక్కున నవ్వాడు.

"అయినా నువ్వేం మారలేదు! ఎదుటివాళ్ళని మోటివేట్ చేసి, సంతోషపెట్టే ఏ అవకాశాన్నీ వదలవు కదా...! అప్పుడూ ఇంతే!" కాలేజీ రోజులు గుర్తొచ్చాయ్. మళ్ళీ నవ్వాడతను.

అతన్నే చూస్తుండిపోయాను కొద్దిసేపు. వయసు రీత్యా వచ్చిన పెద్దరికం, చెంపల దగ్గర నెరసిన జుట్టు... నల్లగా, ఒత్తుగా ఉండే జుట్టుని రకరకాల కటింగ్‌లకి గురిచేసి తెగ ఫోజులు కొట్టేవాడు చందూ, కాలేజ్ రోజుల్లో.

"ఇదివ్వాళ్టి స్టైలా? అబ్బ ఏం ఫోజు?" అంటే.. "అదేగా నా ఐడెంటిటీ. లేదంటే నన్ను చూసేదెవరు?" అనేవాడు తేలిగ్గా నవ్వేస్తూ...

"లేదులే.. చందా...! తెల్లనైన మనసుందిగా నీకు! అదెప్పుడూ ఓపెనే...! కాబట్టే నీ చుట్టూ ఉన్న ప్రతీ వస్తువూ, ప్రతీ వ్యక్తీ నీ వాళ్ళవుతుంటారు. నీ జుట్టు కాదు... నీ హెల్పింగ్ నేచర్ నీ ఐడెంటిటీ.."

అవును...! నిజమే...! ఎదుటివాళ్ళ కష్టాన్ని తన కష్టమే అనుకునే అతని మంచితనపు లోతు అలాంటిది. అంతటిది. చంద్ర ముఖంలో ఎప్పుడూ నవ్వుతో కూడిన అదే ప్రశాంతత. అతనిలో ఉన్న ప్రత్యేకత అది. నవ్వటం ఆపేసినా ఆ ఛాయలు అంత త్వరగా పోవు అతని మోము పైనుంచి, ఆ జాడలు అక్కడే నడయాడతాయి.. కాసేపటి దాకా.

ఆలోచిస్తూనే అప్పుడే గమనించినట్టు చుట్టూ ఓసారి చూసి...

"భూమి గుండ్రం.. నిజమే కదా...! భలే కనిపించావు... చందా...! ఇంతకీ ఎక్కడుంటున్నావ్? ఏం చేస్తున్నావ్?" అన్నాను చందాని చూడగానే అప్పటి దాకా నా మనసులో గూడు కట్టుకున్న దిగులు కాస్తంత సడలి కొత్త ఉత్సాహం రాగా, జనసమ్మర్థం లేని చోటికెళ్ళి ఒకపక్కగా నిలబడి సంచిని గోడకి చేరవేస్తూ.

"నువ్వింకా మర్చిపోలేదన్నమాట ఆ పేరు.." అన్నాడు నవ్వుతూనే నా వెనగ్గా వచ్చి...

"నీ జ్ఞాపకం నాకు ఖర్చే... అలాంటప్పుడు నిన్నెలా మర్చిపోతాను... చందాలతో పదిమంది కలిసి చేసే ఏ పండగొచ్చినా, పనొచ్చినా నువ్వే గుర్తొస్తావు. అలా చందాల కోసం వచ్చేవాళ్ళల్లో ఎవరు నిజాయితీపరులో, ఎవరుకాదో తెలియదు. అలా అని వచ్చిన వాళ్ళందరికీ ఇవ్వలేం కదా. పోనీ

> **భర్త జ్ఞాపకాలు కుంగదీస్తున్నాయామెను. జీవితం నిస్సారమైపోయింది. అంతలోనే ఆకస్మికంగా కనిపించాడామెకు కాలేజీ మిత్రుడు చందా. ఏం చేస్తున్నావ్ అని అడిగితే, చెప్పను చేసిచూపిస్తున్నా, చూడాలనుకుంటే వచ్చి చూడు అంటూ టైమ్ చెప్పాడతను. ఆసక్తిరేగింది ఆమెలో. వెళ్ళింది. అతడు చేస్తున్నదేమిటో చూసి ఆశ్చర్యపోయింది. ఆమె కూడా ఆ దారినే ఎంచుకుంది. ఇంతకీ ఆమె ఎంచుకున్న దారేమిటి?**

ఒకళ్ళకిచ్చాం కదా అని మిగతావాళ్ళకి ఇవ్వకుండా పంపించేద్దామా అంటే వారిలో చిత్తశుద్ధితో సేవ చెయ్యాలనుకునే ఏ చందా అయినా ఉండొచ్చు కదా.. అందుకని ఒట్టి చేతుల్తో పంపించటం ఇష్టం లేక, వచ్చినోళ్ళందరికీ కాదనకుండా కొద్దో గొప్పో ఇచ్చి పంపిస్తూనే ఉంటాను. చదువుకునేటప్పుడేమో... నువ్వు సామాజిక సేవా కార్యక్రమాల్లో మునిగి తేలుతూ నీ రికార్డులన్నీ నాతో రాయిస్తూ నా పాకెట్ మనీనే కాదు నా టైమును తీసేసుకుని సాధించేవాడివి. ఇప్పుడేమో... ఇలా సాధిస్తున్నావ్..."

"అవును...! అప్పట్లో నా రికార్డులన్నీ రాయాల్సి రావటం నీకదో పెద్ద శిక్ష...! ఆ శిక్ష నీకు. వండర్ఫుల్ పర్సనాలిటీ ఆఫ్ ది ఇయర్ అవార్డు నాకు... గుర్తుందా?" అన్నాడు పాతరోజుల్ని తలచుకుని




## చిన్ని చిన్ని కానుకలు

రెక్కలు పట్టుకుని మరీ
రాత్రి గౌతమి ఎక్కించారు మిత్రులు
మొలకు కవిత్వ ఖడ్గం
వేలాడుతున్న వాణ్ణికదా
తీరా ఎక్కాక
శాతకర్ణిని కాకుండా ఎలా ఉంటాను.
తెల్లవార్లూ స్వప్నంలో
ఒకటే కవితారాజ్య విస్తరణ యుద్ధం!
తెల తెలవారుతుండగా
బండి స్టేషన్ చేరుకున్నాక
బోగీలోని చివరాఖరి ఒక్క ప్రయాణికుడూ
దిగిపోతాడనగా
చిన్ని చిన్ని కానుకలు
ముచ్చటగా మూడు తారసపడ్డాయి.

•••



బెర్తు దిగి
ఉన్ని శాలువాను
ఒక్క ఉదుటున దులిపి
పాత మడతల దారుల్లో
మడత పెడుతుంటానా
ఇంతలో ఎదురు బెర్తు
సన్నని ఇరుకు సందులోంచి
నన్ను బైటకు తీయవా అంటూ
ఓ వెండి ఉంగరం
నా వైపే ఉక్కిరి బిక్కిరిగా చూస్తోంది.
తీరా చేతిలోకి తీసుకుని చూస్తే
'రవి' అన్న రెండు హిందీ అక్షరాలు మిలమిలా మెరిశాయి.
ఆ క్షణం నా అరచేతిలో సూర్యోదయం

•••

అటు నుండి ఇటు తిరిగానో లేదో
బెర్తు తలం పాలు వద్ద ఉన్న స్టీలు స్టాండులోంచి
లేత అరిటాకు రంగులో ఉన్న
టప్పర్ వాటర్ బాటిల్ ఒకటి
నన్ను విడిపించవా అన్నట్టు
నీటి కళ్లతో దీనంగా అర్థిస్తోంది.
దాన్ని ఎత్తి యిలా చేతుల్లోకి తీసుకున్నానో లేదో
శరీరం అంతటా అంతర్వాహిని సరస్వతి
గొప్ప అంతర్లయతో ప్రవహిస్తున్నట్టు
లోపలి నుండి వొకటే ఏటి నీటి గలగలలు.

•••

చివరగా
కాళ్ళన్నాక అరిగినవో తెగినవో ఉన్న
ఒక చెప్పుల కోసం వెతగ్గా
మక్కా మదీనాలో
సైతానుపైకి రాళ్ళు రువ్వినట్టుగా
రెండు చెప్పుల్నీ తలా ఒక పక్కకు తన్నుకుపోగా
వెతుకుతూ వెతుకుతూ
లోయర్ బెర్త్ కిందికి తొంగి చూశాను-
మాసిన చెప్పుల పక్కనే
తళతళా తళుకులీనుతూ
కొత్త రూపాయి బిళ్ళ
చిన్నప్పుడు నిద్రపోతున్న
అమ్మకొంగు ముడి విప్పి దొంగిలించిన రూపాయి!
చెప్పులు కాళ్లకు తొడుక్కుని
రూపాయి బిళ్ళను కన్నీళ్ల అడ్డం పడిన కళ్లకు అద్దుకున్నాను.

•••

ఈ వస్తువులేవీ
నావి కావని నాకు నమ్మకంగా తెలుసు.
రేపు నాకు కూడా నా సమస్త వస్తు సముదాయాన్నీ
నిర్దయగా ఈ భువిమీద వొదిలేసి వెళ్ళాల్సిన సమయం
ఒకటి వస్తుందని నిశ్చయంగా తెలుసు.
కుంతి నదిలో కర్ణుణ్ణి వొదిలేసినట్టు

-శిఖామణి

సెల్: 98482 02526

పకపకా నవ్వుతూ...

ఇంటర్ చదివే రోజుల్లో చంద్ర ఎవరికెప్పుడు ఏ సహాయం కావాలన్నా క్లాసులెగ్గొట్టి మరీ నేనున్నానంటూ ముందుండేవాడు. స్టాఫ్‌కి టీ తీసుకొచ్చే రాజు చెల్లెలికి పెళ్ళైనా, కాలేజీలో ఆయమ్మగా పని చేసే రాజమ్మ భర్తపోతే, ఆ కుటుంబాన్ని ఆదుకోవాలన్నా... చంద్రాయే ముందుండేవాడు. చివరికి ల్యాబ్ అటెండర్ తండ్రికి ఆరోగ్యం బాగా లేకపోయినా చందాయే. అందుకు కావాల్సిన డబ్బు కోసం అందరి దగ్గరా చందాలు వసూలు చేసేవాడు. క్యాంటీన్‌కి వెళ్ళటం మానేసి మరీ చంద్రకి ఆ డబ్బు ఇచ్చేసేవాళ్ళం అంతా. ఒకరకంగా అప్పటి ఆ బ్యాచ్‌లో చదువుకున్న వాళ్ళల్లో కాస్తోకూస్తో సేవా భావం ఏర్పడిందంటే అది చందా వల్లే! ఎవర్నీ వదిలిపెట్టేవాడు కాదు. అందరూ ఏదో రకంగా తలో చెయ్యా వెయ్యాల్సిందే.. పైగా అందర్నీ అలా కూడ గడుతూ...

"సముద్రంలో ఉప్పు, చెట్టు మీద కాయ ఉన్నాయ్. రెంటినీ దగ్గరకు చేర్చేవాళ్ళు ఎవరో ఒకరు కావాలి కదా... ఆ ఒక్కళ్ళే మనం" అనేవాడు. అందుకే అప్పట్లో అంతా చంద్రని పేరు పెట్టి ఎవరూ పిలిచేవాళ్ళు కాదు. అంతా చందా అనో, చందా అనో పిలిచేవాళ్ళు. అదంతా గుర్తొచ్చి...

"నాయనా....! ఆ చందాల విషయంలో ఎప్పటికీ ఇలా సాధిస్తూనే ఉంటావ్..." నాటకీయంగా అన్నాను. "అంతేనంటావా? అయితే ఇక నేనేం చెయ్యకపోయినా పర్లేదా?" అదే నవ్వు.

"అంతే అంతే...! గివింగ్ నేర్చేదా? నేర్చినా నిలిచేదా? నీలాంటి వాళ్ళు ఏటికి ఎదురీదైనా సరే మునిగిపోయే వాణ్ణి మునగనిస్తారా? ఒడ్డుకుతెచ్చి పడెయ్యరూ..? ఇంతకీ చెయ్యకపోయినా ఫర్వాలేదంటే ఏం చేస్తున్నావేం..?" అన్నాను ఒకింత సంభ్రమంగా చంద్రవైపు చూస్తూ.... నవ్వాడు. వినలేదేమో? మళ్ళీ అడగనా వద్దా అనుకుంటుండగా తనే అన్నాడు.

"ఈ ప్రశ్నకి జవాబు వినేదికాదు. చూసేది. ఆసక్తుంటే చూపిస్తా....!"

"నో ప్రాబ్లం....! ఆసక్తి ఎందుకు లేదు..?' ఉత్సుకతగా అన్నాను.

"అయితే వచ్చే ఆదివారం, ఉదయం సరిగ్గా పదింటికి ఎర్రగడ్డ బస్టాప్ వద్ద నిల్చో... గుర్తు చెయ్యటం ఉండదు మాకు. బాధ్యతకి మరపు ఉండదని మా నమ్మకం.." అన్నాడు.

"సరే..."నని బై చెప్పి కమలాలవైపు కదిలాను. నా గురించి అతను అడగనూ లేదు, నేను చెప్పనూ లేదు.

ప్రశ్నలూ, సందేహాలూ కొన్ని కొన్ని సందర్భాల్లో గాయాల్ని మాన్పే మందుల్లా కూడా పనిచేస్తాయేమో...! చిత్రంగా.. అదే అనిపించింది నాకు. చేసేదేంటో చెప్పడా? చూపిస్తాడా? ఏం చూపించ బోతున్నాడు? ఆ ముఖంలో అంతటి ప్రశాంతత, ఆ మాటల్లో, నవ్వే నవ్వులో ఇదివరకెప్పుడూ లేని ఆత్మ విశ్వాసం.. ఇప్పుడెలా సాధ్యమైంది? ఇంతకీ చందా చేసేదేంటో..?" అంటూ తడుముతున్న ప్రశ్నలు కొద్దిగానే అయినా కృష్ణ జ్ఞాపకాలను కాజేస్తుంటే.... బైటికి, లోపలికి తేడా స్పష్టమవుతూ వస్తోంది నాకు.

నిజమే...! కలసి బ్రతకటం నిజం. విడిపోవటమూ నిజమే..! అది ఎలాగైనా కానీ...!

మిన్ను మధ్యకి పగిలి తునాతునకలై ధబాల్న భూమ్మీద పడిపోతుందా అన్నట్టు ఉన్నట్టుండి భయంకరంగా, చెవులు చిల్లులుపడేలా ఉరిమే ఉరుమూ, కళ్ళు మిరుమిట్లు గొలిపేలా... కళ్ళ ముందు కనురెప్పపాటు కదలాడే మెరుపూ, సునామీలా ఊళ్ళకి ఊళ్ళు ముంచెత్తే వరదలూ, బీభత్సాన్ని తలపించే గాలిదుమారం... ఇవేకాదు ప్రకృతి వైపరీత్యాలు, సహచరుల్ని కోల్పోవటం కూడా కదా...!

ఏదీ మన చేతుల్లో లేనప్పుడు... లోపలికీ, బైటికీ తేడా ఎందుకు వద్దు?

గాయన్ని మాన్చుకోకపోవటం అంటే చేరాల్సిన తీరాలింకా ఉన్నా, ఉన్నచోటనే ఆగే ప్రయాణమా?

ఆదివారం ఉదయం సరిగ్గా పదింటికి ఎర్రగడ్డ బస్టాప్‌లో నిలబడ్డాను.

అకస్మాత్తుగా నా ముందు ఆగిన ట్రాలీని చూసి కంగారు పడుతూ వెనక్కి జరగబోయి... ముందు సీట్లో డ్రైవర్ పక్కన కూర్చున్న చంద్రనిచూసి హమ్మయ్య అనుకున్నాను. ట్రాలీ ఇంజన్ ఆన్‌లోనే ఉంది. కిందకి దిగకుండా నా వైపు చూస్తూ.

"ఇక్కడికి నాలుగడుగుల దూరంలో ఎర్రగడ్డ పిచ్చాసుపత్రి మెయిన్‌గేటు ఉంటుంది... తెలుసు గదా..? గేట్లోంచి తిన్నగా లోపలికి వచ్చేయ్" అన్నాడు మరోమాట లేకుండా ట్రాలీని పోనిమ్మంటూ. అతని సైగతో చూస్తుండగానే ముందుకి కదిలిపోయింది ట్రాలీ. ఆ ముఖంలో కర్తవ్యం తప్ప మరోభావం లేదు.

పిచ్చాసుపత్రి గేట్లోంచి లోపలికెళ్ళేసరికి ఎదురుగా కనిపించాడు చంద్ర. ట్రాలీలోంచి ఏవో పెట్టెలు కిందకి దించుతుంటే, వేటిని ఎక్కడెక్కడికి తీసుకెళ్ళాలో డైరెక్ట్ చేస్తున్నాడు. అతనిచుట్టూ ఎవరెవరో ఆడా, మగా చాలామందే నిలబడున్నారు.

నన్ను చూడగానే దగ్గరకు రమ్మని అందరికీ పరిచయం చేసి, వాళ్ళల్లో ఒకామెను పిలిచి 'విశాల

# హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో
## హార్మోన్ సమస్యలకు సరైన పరిష్కారం



డా. శ్రీకాంత్ మోర్లావర్
CMD
హోమియోకేర్ ఇంటర్‌నేషనల్

ప్రస్తుత కాలంలో చాలామంది థైరాయిడ్, పీసిఓడి, సంతానలేమి మరియు డయాబెటిస్ వంటి దీర్ఘకాలిక ఆరోగ్య సమస్యలతో బాధపడటం జరుగుతోంది. ఇలాంటి అసమతుల్యతలు తలెత్తటానికి చిన్న కారణం చాలు – ఇది తీవ్రమైన దీర్ఘకాలిక వ్యాధులకు దారితీస్తోంది కాబట్టి అలాంటి కారణం పట్ల అవగాహన పెంచుకోవడం వలన హార్మోన్ సంబంధిత వ్యాధుల బారిన పడకుండా మనల్ని మనం కాపాడుకోవచ్చు. హార్మోన్‌లు అనేవి శరీరంలోని ఎండోక్రైన్ గ్రంథుల నుండి ఉత్పత్తి అయ్యే రసాయన వాహకాలు. ఇవి శరీరంలో ఒక ప్రాంతపు కణజాలం అవయవాల నుండి ఉత్పత్తి అయి, రక్తప్రసరణ ద్వారా వివిధ శరీర భాగాలకు చేరుకుని, నిర్దిష్ట అవయవాలను ప్రభావితం చేస్తూ శరీర జీవక్రియల సమతుల్యతకు తోడ్పడతాయి. ఇవి శరీరంలో సూక్ష్మమోతాదులో ఉత్పత్తి అయినప్పటికీ, శరీర సాధారణ జీవక్రియలైన "జీర్ణక్రియ మొదలుకొని శారీరక, మానసిక ఎదుగుదల ప్రక్రియలు, ప్రత్యుత్పత్తి వ్యవస్థ, మానసిక సమతుల్యత వంటి అన్ని ప్రధాన జీవక్రియలపై" వీటి ప్రభావం ఖచ్చితంగా ఉంటుంది. ఏ కారణం వల్లనైనా ఈ హార్మోన్‌లు అసమతుల్యతకు గురి అయితే, అది తీవ్రమైన దీర్ఘకాలిక ఆరోగ్య సమస్యలకు దారితీస్తుంది.




**వివిధ హార్మోన్‌లు - వాటి అసమతుల్యత వలన కలిగే వ్యాధులు:** థైరాయిడ్ హార్మోన్‌లు (T3, T4): థైరాయిడ్ గ్రంథి ద్వారా ఉత్పత్తి అయ్యే వీటి ప్రభావం 90% మేర మానవ జీవనక్రియలపై ఉంటుంది. ఈ హార్మోన్‌ల అసమతుల్యత వలన హైపోథైరాయిడ్, హైపర్‌థైరాయిడ్, గాయిటర్ మొ॥ దీర్ఘకాలిక వ్యాధులు వస్తాయి.
**హైపర్‌థైరాయిడిజం:** శరీరంలో థైరాయిడ్ హార్మోన్‌లు ఎక్కువ మోతాదులో ఉత్పత్తి కావటం వలన ఈ సమస్య ఏర్పడుతుంది. **లక్షణాలు:** బరువు తగ్గడం, నీరసం, గుండెదడ, కాళ్ళు–చేతులు వణకడం మొ॥వి.
**హైపోథైరాయిడిజం:** థైరాయిడ్ హార్మోన్‌లు తక్కువ మోతాదులో ఉత్పత్తి కావటం వలన ఈ సమస్య ఉత్పన్నమవుతుంది. **లక్షణాలు:** బరువు పెరగటం, జుట్టు రాలటం, నీరసం, మతిమరుపు, ఋతుచక్ర సమస్యలు మొ॥ లక్షణాలు కనిపిస్తాయి.
**గాయిటర్:** గొంతు కింద ఉండే థైరాయిడ్ గ్రంథి వాపునకు గురి కావటాన్ని గాయిటర్ అంటారు. ఇది ముఖ్యంగా అయోడిన్ అనే మూలకం లోపం వలన కలుగుతుంది. ఇది హైపోథైరాయిడ్ లేదా హైపర్‌థైరాయిడ్ సమస్యలతో కూడుకుని ఉండవచ్చు.

**హోమియోకేర్ చికిత్స:** ప్రస్తుత పరిస్థితులలో మానవుడి ప్రకృతి విరుద్ధమైన జీవన విధానం, అధిక ఒత్తిడికి గురికావటం, వ్యాయామ లోపం వలన ఎక్కువ శాతం థైరాయిడ్ వ్యాధుల బారిన పడటం మనం గమనిస్తున్నాము. థైరాయిడ్ సమస్యలకు జీవితకాలం మందులు వాడే అవసరం లేకుండా, వీటికి గల మూలకారణాన్ని గుర్తించి, థైరాయిడ్ సమస్యకు గురి కాబడిన వారి శారీరక, మానసిక తత్వానికి అనుగుణంగా సరైన హోమియో వైద్యం అందించడం ద్వారా థైరాయిడ్ హార్మోన్ సమస్యను సంపూర్ణంగా నయం చేయవచ్చు.

**స్త్రీలలో ఉండే హార్మోన్‌లు:** ఈస్ట్రోజెన్, ప్రొజెస్టిరాన్, ప్రొలాక్టిన్, ఆక్సిటోసిన్ హార్మోన్‌లు స్త్రీలలో రజస్వల, ఋతుచక్రం, ద్వితీయ లైంగిక లక్షణాలు, సంతానోత్పత్తి మరియు ప్రసవంలో ఉపకరిస్తాయి. ఈ హార్మోన్‌ల అసమతుల్యత వలన స్త్రీలలో ఋతుచక్ర సమస్యలు (పీసిఓడి), హిర్సుటిజం (అవాంఛిత రోమాలు) మరియు సంతానలేమి సమస్యలు ఏర్పడతాయి. స్త్రీలలో మెనోపాజ్ మరియు రజస్వల అయ్యే సమయంలో హార్మోన్‌ల ప్రభావం ఎక్కువగా ఉంటుంది. మెనోపాజ్‌లో హార్మోన్‌ల హెచ్చుతగ్గుల వలన Hot Flushes, మానసిక అశాంతి, నీరసం, కీళ్ళ నొప్పులు మరియు కండరాల నొప్పులు ఉత్పన్నమవుతాయి.
**పురుషులలో ఉండే హార్మోన్‌లు:** TSH, LH మరియు టెస్టోస్టిరాన్ హార్మోన్‌లు పురుషులలో శుక్రకణాల ఉత్పత్తికి తోడ్పడతాయి. టెస్టోస్టిరాన్ హార్మోన్‌ల అసమతుల్యత వలన శ్రీఘ్రస్కలనం, అంగస్థంభన సమస్యలు, శుక్రకణాల సమస్యలు ఏర్పడటం, తద్వారా అవి సంతానలేమికి దారితీయటం జరుగుతుంది.

**హోమియోకేర్ చికిత్స:** హార్మోన్ సమస్యలు ఒకదానితో మరొకటి అనుసంధానమై ఉంటాయి. హోమియోకేర్ వైద్యప్రక్రియలో భాగంగా ఎలాంటి హార్మోన్‌లను బయట నుండి ఇచ్చే అవసరం లేకుండానే హార్మోన్‌ల అసమతుల్యతలను సరిచేయటం ద్వారా ఎలాంటి దుష్ప్రభావాలు లేకుండా – ఋతుచక్ర సమస్యలు, పీసిఓడి, సంతానలేమి మరియు శుక్రకణాల సమస్యలను సంపూర్ణంగా నయం చేయవచ్చు.

**డయాబెటిస్ - హార్మోన్ సమస్యలు: డయాబెటిస్ ఇన్‌సెపిడిస్:** ADH (యాంటీ డైయూరెటిక్ హార్మోన్) లోపం వలన తలెత్తే ఈ సమస్యను అతిమూత్ర వ్యాధి అని కూడా అంటారు. **డయాబెటిస్ మెల్లిటస్:** ఇది క్లోమ గ్రంథి ఉత్పత్తి చేసే ఇన్సులిన్ లోపం వలన లేదా తక్కువ మోతాదులో ఇన్సులిన్ ఉత్పత్తి కావడం వలన కలుగుతుంది. ఇది 2 రకాలు. **టైప్-1 డయాబెటిస్:** ఇది ఇన్సులిన్ ఉత్పత్తి కాకపోవటం వలన ఏర్పడుతుంది. దీనిని జువెనైల్ డయాబెటిస్ అని అంటారు. ఈ వ్యాధిగ్రస్తులు పూర్తిగా ఇన్సులిన్ ఇంజెక్షన్లపై ఆధారపడవలసి వస్తుంది. **టైప్-2 డయాబెటిస్:** ఇది ఇన్సులిన్ ఉత్పత్తి తగ్గటం వలన వస్తుంది. ఇది ఎక్కువగా 30 సం॥లు పైబడిన వారిలో వచ్చే అవకాశం ఉంటుంది. కానీ ఈ మధ్యకాలంలో యుక్తవయస్కులు కూడా ఈ వ్యాధికి గురికావటం జరుగుతోంది. డయాబెటిస్‌తో బాధపడే వారి రక్తంలోని చక్కెర శాతాన్ని సరిగ్గా నియంత్రణ చేయక పోవడం వలన దీర్ఘకాలంలో డయాబెటిక్ నెఫ్రోపతి, డయాబెటిక్ న్యూరోపతి, రెటినోపతి, గుండె సమస్యలు, అంగస్థంభన సమస్యలు మొ॥గు కాంప్లికేషన్స్ వస్తాయి.

**హోమియోకేర్ చికిత్స:** డయాబెటిస్‌ను తొలిదశలోనే గుర్తించి, హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ వారి ప్రత్యేక 'హార్మోన్ సెల్' మరియు కాన్‌స్టిట్యూషనల్ విధానం ద్వారా డయాబెటిస్ బాధితులలో – దీర్ఘకాలం పాటు ఎలాంటి దుష్ఫలితాలు లేకుండా వ్యాధిని అదుపులో ఉంచటంతో పాటు అన్ని డయాబెటిక్ కాంప్లికేషన్‌లను నివారించవచ్చు.

**అన్ని విధాలైన హార్మోన్ సమస్యలకు హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ వైద్యం:** హోమియోకేర్ సొంతమైన ప్రత్యేక 'హార్మోన్ సెల్' మరియు జెనెటిక్ కాన్‌స్టిట్యూషనల్ సిమిలిమం పద్ధతుల ద్వారా అన్ని హార్మోన్ సమస్యలకు ఖచ్చితమైన మరియు ఎటువంటి దుష్ఫలితాలు లేని వైద్యం అందించబడుతుంది. తద్వారా ఇక మరోసారి తిరగబెట్టకుండా హార్మోన్ సమస్యలను సంపూర్ణంగా నయం చేసే అవకాశం ఉంది.

**టోల్ ఫ్రీ 1800 108 1212** | **కన్సల్టేషన్ ఉచితం 955 000 1199** | **www.homeocare.in**

గార్ని మీ కూడా తీసుకెళ్ళండి' అన్నాడు. రమ్మన్నట్టు ముందుకు నడిచిందామె.

అనుసరించాను. కొంతదూరం వెళ్ళాక, అక్కడంతా కోలాహలంగా ఉంది. ఆసక్తిగా చూశాను, ఏమిటా అని. మానసిక రోగులకి బిస్కెట్ ప్యాకెట్లు పంచుతున్నారేమో.. వాటిని పట్టించుకోకుండా ఆ పంచేవాళ్ళ చుట్టూ తిరుగుతూ, వాళ్ళ కొంగులు పట్టుకు లాగుతూ, వాళ్ళని గిల్లుతూ... వీపుమీద చరుస్తూ ఒకటే గోలగోల చేస్తున్నారు వాళ్ళంతా. చింపిరి చింపిరి జుట్లతో పిచ్చిపిచ్చిగా ఉన్నారంతా. ఒక్కళ్ళ తలకీ నూనెలేదు. వాళ్ళ బట్టల్నిండా, ఒంటి నిండా రోజుల తరబడి స్నానం లేకపోవటం వల్ల అనుకుంటా.. ఒకటే మురికి. దాంతో అక్కడంతా వ్యాపించిన భయంకరమైన దుర్గంధం.

వాళ్ళనలా చూస్తుంటే కడుపులో దేవినట్టయ్యింది నాకు. అంతేకాదు వాళ్ళల్లో వాళ్ళే గిల్లుకోవటాలు, కొట్టుకోవటాలు, మీదపడి రక్కుకోవటాలు, అంతలోనే నవ్వులు... ఉన్నట్టుండి ఏడుస్తూ కిందపడి దొర్లటాలు. ఇంకోపక్క తీసుకున్న బిస్కట్లని దూరంగా విసిరేసేవాళ్ళు కొందరైతే, వాటిని నలిపి నలిపి సుద్దపొడిలాచేసి పక్కనున్నాళ్ళ కళ్ళల్లోకి చిమ్మేసే వాళ్ళు మరికొందరు.

మీద కూర్చోబెట్టి, చక్కగా షాంపూతో తలంటి, సబ్బుతో ముఖమంతా రుద్ది.. తర్వాత మెల్లగా ఆ అమ్మాయి బట్టలన్నీ విప్పి ఒళ్ళంతా రుద్దిరుద్ది స్నానం చేయించారు, అంతా కలిసి. అలా స్నానం చేయిస్తున్నంత సేపూ ఆ పిల్ల కోరిన ప్రతి గొంతెమ్మకోర్కెనీ మాటల్లో తీరుస్తూనే ఉన్నారంతా. ఉన్నట్టుండి కూర్చున్న స్టూలు మీద నుంచి పక్కకి జారిపోతుంది ఆవిడ. అంతా పట్టుకుని పైకి లేవదీసి స్టూలుమీద కూర్చోబెట్టి తమ పని కానిస్తున్నారు. అయినా వాళ్ళని సరిగ్గా చేయించనిస్తేనా.. మధ్యమధ్యలో లేచి వెళ్ళిపోబోతుంటే "నా బంగారు కదా.. కూర్చోమ్మా.. చెప్పినమాట విని, చక్కగా స్నానం చేయించుకుని మంచిగా పౌడరు రాసుకుంటే త్వరగా తగ్గిపోతుంది. తగ్గిపోతే ఇంటికెళ్ళిపోవచ్చు... అక్కడ అమ్మా, నాన్నా, అన్నయ్యా, అక్కా ఎంతమంది ఎదురు చూస్తున్నారో నీకోసం.. తెలుసా...."

ఆ మాటల్లో ఎంత లాలిత్యం...! ఎంత బుజ్జగింపు...! వాళ్ళపట్ల ఎంతటి ప్రేమ, వాత్సల్యం..!

'వ్వా... అమ్మ చెప్పిందా? నాకిలా చెయ్యిచ్చమని.."

"అవునమ్మా.. అమ్మే చెప్పింది. నీకు తలంటి, నిన్ను అందంగా తయారు చెయ్యమంది".




అబ్బో చూస్తుంటేనే పిచ్చెక్కేటట్టు ఉంది.

ప్యాకెట్లు పంచుతూ అలా చెయ్యొద్దని ఎంత ఓపిగ్గా చెబుతున్నా, వినటం లేదు వాళ్ళు. వాళ్ళ లోకం వాళ్ళదే. వీళ్ళంతా వాళ్ళని బుజ్జగిస్తున్నారు. బ్రతిమాలుతున్నారు. ఆ క్రమంలో వాళ్ళతో దెబ్బలు తింటున్నారు. చూస్తున్న నాకు కూడా కోపం వచ్చేస్తోంది. కానీ వీళ్ళు మాత్రం వాళ్ళ అల్లరిని ఓపిగ్గా భరిస్తున్నారు. "బహుశా అదే తేడా ఏమో... వాళ్ళకీ నాకూ..." ఇలా అనుకోగానే నవ్వొచ్చింది నాకు.

ఈలోపు... ఆశ్చర్యం కలిగించేలా... అందులో ఒకావిడ వాళ్ళల్లో ఒకమ్మాయితో అంటోంది.

"నేను చెప్పినమాట వింటే రిబ్బన్లు ఇస్తా.. సరేనా".

"రంగురంగుల రిబ్బన్లా...." అమాయకంగా అడిగింది అవతలి అమ్మాయి...

"అవును... రిబ్బన్లే కాదు జడపిన్నులూ, చెవులకి జూకాలూ... మరి నా మాట వింటావా...?" అంటూ ఇద్దరు ముగ్గురు ఆ అమ్మాయిని మాటల్లో పెట్టి, కానుకలిస్తానని మభ్యపెట్టి మాయచేసి మెల్లగా బాత్‌రూములోకి తీసుకెళ్తూ నన్ను రమ్మన్నారు. అలా వెళ్ళిన నేను అక్కడ జరుగుతున్న సేవ చూసి నోరెళ్ళబెట్టాను.

వాళ్ళకి మెల్లగా కబుర్లు చెబుతూ... నవ్విస్తుంటే, ఇంకొకావిడ మెల్లగా ఆ అమ్మాయిని ఒక స్టూలు

"అయితే చెయ్యొచ్చు.." అంటూనే మగ్గుని నీళ్ళల్లో ముంచి విసురుగా చిలకరించింది అందరి మీద.

ఎవరూ పట్టించుకోలేదు.

అలవాటైన పనిలా చెంగుతో ముఖం తుడిచేసుకుని, వాళ్ళతో కబుర్లు చెబుతూనే వాళ్ళ ఒంటి మురికిని శుభ్రం చేసేస్తున్నారు, ఒకరికొకరు సహకరించుకుంటూ... ఈ ప్రక్రియలో విశాలకి అత్యంత ఆశ్చర్యం కలిగించిన విషయం.. ఏమంటే..

పాపం ఆ మానసిక రోగులు ఎంతటి శాపగ్రస్తులైనా, నెలవారీగా స్త్రీలకొచ్చే సమస్య శాపగ్రస్తులని వీళ్ళని వదిలి పెడుతుందా? సరిగదా అసల దేంటో కూడా తెలియని ఆ నాల్రోజులూ జరిగే రుతుస్రావ ప్రభావంతో.. అట్టలు కట్టిన ఆ ప్రదేశాన్ని ఏ మాత్రం అసహ్యించుకోకుండా, ఎంత ఓపికతో రుద్ది రుద్ది కడిగి మరీ శుభ్రం చేస్తున్న సేవ... ఒక్క వీళ్ళు తప్ప మరెవ్వరూ చెయ్యలేరేమో...!

అలా స్నానం పూర్తైన వాళ్ళని, టవల్తో అక్కడ రెడీగా నిలబడ్డ వాళ్ళకి అప్పగించి మళ్ళీ ఇంకో అమ్మాయిని లోపలికి తీసుకెళ్ళిపోతున్నారు. ఇవతల వీళ్ళు పొడిగుడ్డతో ఒళ్ళంతా తుడిచేసి, పౌడరు రాసి తమతో తెచ్చిన కొత్తలంగా, నైటీ తొడిగి, వాళ్ళ తల తుడిచి, సాంబ్రాణి పొగవేసి పౌడరద్ది, బొట్టు పెడుతున్నారు.

ఏమాత్రం అసహ్యించుకోకుండా క్రమశిక్షణ గల సైనికుల్లా ఎవరి పని వాళ్ళు చేసుకుపోతున్న ఆ సేవా కార్యకర్తల్ని చూసి మనసులోనే దండం పెట్టాను. బహుశా ఆ పక్క చంద్రావాళ్ళు కూడా మగరోగులకి ఇదే సేవ చేస్తూ ఉండి ఉండవచ్చు.

అంతా అయ్యాక బయలుదేరుతుంటే చంద్ర అన్నాడు.

"చూశావుగా... ఎలా అనిపించింది...?" అని.

నాకు మాటలు రాలేదు. కాసేపటికి గొంతు పెగల్చుకుని.." ఇవన్నీ హాస్పిటల్ వాళ్ళు చేస్తారు కదా... మీరెందుకు చేస్తున్నారు?"

"వాళ్ళు చేసినప్పుడు వాళ్ళూ చేస్తారు. కానీ కొన్నికొన్నిసార్లు ఆలస్యం కూడా కావచ్చు. దానికి సవాలక్ష కారణాలు. వీళ్ళు అసలే మానసిక రోగులు.. పైగా ఒంటినిండా ఒకటే మురికి.. పాపం వాళ్ళకేం తెలియదు కదా! తెలిస్తే ఈ ఖర్మ వాళ్ళకేమి? వాళ్ల మనసు కూడా వాళ్లది కాని స్థితి. నేనేమంటానంటే ప్రపంచంలో క్రైం ఇంతగా ఎందుకు పెరిగిపోతుందంటే.. అపరిశుభ్రత, సరిపడా నీళ్ళు అందుబాటులో లేక.. అంటాను. ఇంట్లో అయినా, మనమే చూడు.. స్నానం చెయ్యటానికి ముందూ, తర్వాత పరిస్థితుల్లో చాలా తేడా ఉంటుంది. చిన్నచిన్న గల్లీల్లో ఉంటూ గాలీ వెలుతురూ సరిగ్గా లేని చిన్న చిన్న గదుల్లో లెక్కకు మించిన సంఖ్యలో నివసిస్తూ.. నీటి సదుపాయం లేక నిత్యం అనేక సమస్యలతో వేగిపోతూ... అక్కడే మలమూత్ర విసర్జన చేస్తూ, అక్కడే నివసిస్తే నేరాల సంఖ్య పెరగమంటే ఎందుకు పెరగదు...?

ఇవన్నీ ఆలోచించే ఏదో ఉడతాసాయంగా నెలలో రెండుసార్లు ఇలా వచ్చి చేయించిపోతూ ఉంటాం. ఇలా ఇక్కడ ఒక్కచోటే కాదు. ఉస్మానియాకి వెళతాం. గాంధీకి వెళతాం. కొంతమందైతే మమ్మల్ని గుర్తుపడతారు... గంతులేస్తారు... టాటా చెప్తారు... హాయిగా నవ్వుతారు.

మేమిలా చెయ్యటం మొదలెట్టి ఇది పదిహేనవ సంవత్సరం. మేముచేసే సేవ వల్ల వాళ్ళల్లో చాలా తేడా వచ్చిందని స్వయంగా సూపరింటెండెంటే అన్నారంటే, అది చాలదా మాకు.."

"వీళ్లే కాదు. అనాథ శవాలు, రోజుల తరబడి స్నానం చెయ్యని బెగ్గర్లు... వీళ్ళంతా కూడా మావాళ్ళే. అక్కడికక్కడ క్షవరం చేయించేసి ట్యాంకుల్లో తీసుకెళ్ళిన నీళ్ళతో... రోడ్డు మీదే తలస్నానం చేయించేసి... కూడా తీసుకెళ్ళిన ప్యాంటూచొక్కా తొడిగి... కడుపునిండా తినేదాకా పెట్టి వదిలేస్తాం. చాలు.. ఒక్కరోజైనా హాయిగా నిద్రపోతాడు వాడు".

"మరి ఇందుకు మీ కుటుంబం సహకరిస్తుందా?" అడిగాక నాలుక్కరుచుకుంటుంటే అతనన్నాడు.

"ఈ కుటుంబాన్ని చూశావుగా...! ఇంతకంటే పెద్ద కుటుంబం ఉంటుందా ఎక్కడైనా? ఇంట్లో పిల్లాడు స్నానం చెయ్యకపోతే వెంటపడమా? ఇదీ అంతే.." నవ్వుతూ అన్నాడు.

నిజమే...! వసుధైక కుటుంబం...!

నేనెంచుకోవాల్సిన దారేకాదు... నేర్చుకోవాల్సిందీ, నేను చేరాల్సిందీ ఇదేతీరమని స్పష్టంగా అనిపిస్తోంటే... ఎక్కణ్ణించో ఒకటే నవ్వు... అది కృష్ణ నవ్వే!

అప్పుడప్పుడూ తనిచ్చిన పజిల్‌కి నేను ఆన్సర్ కనుక్కోవటంలో దరిదాపుల్లోకి వెళ్ళినప్పుడల్లా 'దగ్గరకొచ్చావ్... దగ్గరకొచ్చేశావ్' అంటూ నవ్వే నవ్వు..

తీరం చేరబోతున్నాననా...?

**సెల్: 92465 41249**



# గోదావరి

దాట్ల దేవదానంరాజు

**ఓం కేశవాయ స్వాహా...ఓం హరే శ్రీకృష్ణాయ నమః...శిఖాం బధ్వా.. దేహం ప్రక్షాళ్య... ఆచమించి, శిఖ ముడేసుకుని ప్రవాహానికి సూర్యునికి ఎదురుగా నిలబడి శరీరం తడిసేలా స్నానం చేస్తూ...చిదంబరశాస్త్రి,**

**గోవింద గోవింద...వైవస్వత మన్వంతరే కలియుగే ప్రథమ పాదే జంబూద్వీపే, భరతవర్షే, భరతఖండే...అస్మిన్ వర్తమాన వ్యవహారిక చాంద్రమానేన స్వస్తిశ్రీ- అంటూ ఆ సంవత్సర, ఋతువు, మాస, పక్ష, తిథి, వారాల్ని చెప్పుకుని చివరకు... జ్ఞానతః అజ్ఞానతః కాయిక వాచిక మానసిక సాంసర్గిక సకలపాప క్షయార్ధం ప్రాతః స్నానమహం కరిష్యే- సంకల్పం పూర్తయింది.**

అర్థం చేసుకుంటే అహంకార విమోచనం కోసమే సంకల్పం! నేల మీద పరమాణువు లాంటి నువ్వేమిటో, నీ ఉనికి ఏపాటిదో చెబుతుంది సంకల్పం. తర్వాత దోసిట్లో నీరు నింపుకుని మూడుసార్లు మంత్రం చదువుతూ అర్ఘ్యం వదిలాడు చిదంబరశాస్త్రి.

చిదంబర శాస్త్రి దబ్బపండు ఛాయ. ఉదయ సంధ్యలో లేలేత కిరణాల్లో అతని దేహచ్ఛాయ చమక్కుమని మెరుస్తోంది. నున్నగా గుండు..చెవులకు మకర కుండలాలు...మెడలో రుద్రాక్షలు... నడుముకు బిగించిన ఉత్తరీయం...నిలువెత్తు పవిత్రతకూ భక్తి భావానికీ దర్పణంలా ఉన్నాడు.

నెమ్మదిగా ఒక్కో అడుగు వేసుకుంటూ గోదావరిలోకి దిగాడు. అత్యంత శ్రద్ధగా మూడు మునకలు మునిగాడు, ముక్కు మూసుకుని. శాస్త్రి చుట్టూ వలయాలుగా స్వచ్ఛ గోదావరి తరంగాలు.

సరిగ్గా అదే సమయంలో ఒడ్డున ఉన్న నలుగురు బ్రాహ్మణులు మాట్లాడుకుంటున్నారు. చిదంబర శాస్త్రికి వీళ్ళ మాటలు వినబడవు. మాటలు అందనంత దూరం.

'చదువు ఒంటబట్టక సగంలో వదిలేసినవాడు... వేదమంత్రాలు ఎంత స్పష్టంగా పలుకుతున్నాడో... గొప్ప ఘనాపాఠిలా!'

'ఎవరైనా ఊహించారా?... ఎలా మారిపోయాడో.... అంతా భగవంతుని రాత'

'వీణ్ణి మరో నిగమశర్మ అనుకున్నాం'

'పదేళ్ళక్రితం వాడి అలవాట్లూ, చేష్టలూ... బ్రాహ్మణ పుట్టుకకే తలవంపులు...అపచారం...అగ్రహారం చూస్తూ ఊరుకుంటూ భరించాలా, దేవుడా... అని బ్రాహ్మణ్యం మథనపడింది కదా...'

'ఊరి నుంచి పారిపోవడమే మేలైంది. ఏ మహానుభావుడు చేరదీశాడో...మనిషిని చేశాడు. ముఖ్యంగా పరిపూర్ణ బ్రాహ్మణుడిలా మలిచాడు.'

'అవ్వ... ఆరోజుల్లో చిదంబరశాస్త్రి చేసిన పనులు అన్నీ ఇన్నీనా? చీట్లపేక, సిగరెట్టు దమ్ములు, ఒట్టిదో నిజమో చెడు తిరుగుళ్ళు... అన్నట్టు వటువుగా వేసుకున్న జందెం తెంపి పారేసినప్పుడే కదా ఇంట్లో రభస... ఆ మర్నాడే అతీగతీ లేకుండా పరారయ్యాడు. ధర్మానుష్ఠాన పథంలోకి తిరిగి రావడం ఎవరైనా ఊహించారా?'

గోదావరి పుష్కరాలు మునుపెన్నడూ లేనంత ఘనంగా జరిగేట్టున్నాయి. ప్రభుత్వం

## రెజీనా తెరమరుగు కానుందా?



చాలామంది నిజమే అంటున్నారు. రెజీనా ఎంత గొప్ప నటి అయినా ఆమెకు ఇంతవరకూ స్టార్ హీరోలతో చేసే అవకాశం రాలేదు. ఇకపై రాదని ఫిక్స్ అయినట్టుంది అందుకే లేడీ ఓరియెంటెడ్ సినిమాలు చేయడానికి రెడీ అంటోంది. ఒక్క అనుష్క తప్ప మిగతా హీరోయిన్లు సెకండ్ ఇన్నింగ్స్‌లోనే వీటి మీద దృష్టి పెట్టారు. అలాంటిది రెజీనా ఇపుడే వాటి మీద మనసు పారేసుకుందంటే ఆమె త్వరలోనే తెర మరుగవుతుందేమో అన్న అనుమానాన్ని చాలా మంది వ్యక్తం చేస్తున్నారు. రెజీనా తొందరపడి ఇలాంటి స్టేట్‌మెంట్ ఇచ్చి తన అవకాశాలను తానే పోగొట్టుకుంటోందని ఆమె అభిమానులు సైతం ఆవేదన వ్యక్తం చేస్తున్నారు.

రంగంలోకి దిగింది. ప్రజల మనోభావాలకనుగుణంగా పెద్దమొత్తంలో సొమ్ము కేటాయించింది. పైగా నూటనలభై నాలుగేళ్ళకొకసారి వచ్చే పుష్కరాలుగా ప్రచారం చేస్తున్నారు. గోదావరి ఒడ్డున ఉన్న యానాం కూడా హడావిడి చేస్తున్నది.

చిదంబరశాస్త్రి పుష్కరాలకు రెండు నెలలు ముందుగానే యానాం వచ్చేశాడు. అతని రాక అందర్నీ ఆశ్చర్యపరిచింది. సంప్రదాయబద్ధమైన వేషధారణ, ఆహార్యం, సంభాషణ తీరు, లయబద్ధమైన మంత్రోచ్చాటన, ఖంగున మోగే కంఠస్వరం... అతనిలోని గాంభీర్యానికి అందరూ విస్తుపోతున్నారు.

రోజూ ఉదయాన్నే గోదావరిలో స్నానమాచరించడం, శివాలయంలో దైవ సన్నిధిలో గడపడం, వైదిక ధర్మాల్ని నిష్ఠగా పాటించడంతో పదేళ్ళుగా అతని మీదఉన్న దురభిప్రాయాలన్నీ తుడిచిపెట్టుకు పోయాయి.

ఊళ్ళో వారందరికీ చిదంబర శాస్త్రి పట్ల గౌరవభావం అంతకంతకూ పెరిగిపోతూంది. ఆయన చేత పెట్టించుకున్న ముహూర్తాలు శుభప్రదంగా ముగుస్తున్నాయి. ఆయన ఆధ్వర్యంలో జరిగే పూజలు, వ్రతాలు భక్తుల్ని కట్టిపడేస్తున్నాయి.

పుష్కరాల్లో నాలుగు డబ్బులు వెనకేసుకుందామని ఆశపడుతున్న సోదర బ్రాహ్మణులు ఒకింత ఇబ్బందిగా పరిస్థితులు గమనిస్తున్నారు. మామూలు రోజుల్లో దినదినగండంగా బతుకీడుస్తున్న వారందరూ పుష్కరాల వంటి పవిత్ర దినాల్లోనే కాసిన్ని డబ్బులు సంపాదించుకుంటున్నారు.

ఇన్నాళ్ళూ పత్తాలేని చిదంబరశాస్త్రి ఊళ్లోకి దిగబడటం అందరి మెప్పూ పొందడం భరించరానిదిగా ఉంది. అన్నీ ఆలోచించుకుని కొంతమంది శాస్త్రి పంచకు చేరిపోయారు, సహాయకుడిగా ఉంటే తృణమో ఫణమో రాలుస్తాడని.

పుష్కరాల సమయం ఆసన్నమైంది. చిదంబర శాస్త్రి ప్రాబల్యం మరింత పెరిగింది. స్థానిక ఆలయ సముదాయ కమిటీ సభ్యులు ఆయనకు ప్రాధాన్యం ఇవ్వడం మొదలెట్టారు. చిదంబర శాస్త్రి సలహా సంప్రదింపులతో జరగబోయే కార్యక్రమాలకు రూపకల్పన చేస్తున్నారు.

గోదావరి తీరంలో వేదిక ఏర్పాటైంది. ప్రవచనాలు మొదలయ్యాయి. అత్యధిక సమయం చిదంబర శాస్త్రికే ఇస్తున్నారు. జనం ఆయన ప్రవచనాలు వినడానికి ఆసక్తి చూపుతున్నారు. లౌకిక విషయాల్ని జతచేసి పౌరాణిక గాథలు చెబుతుండటంతో మంత్రముగ్ధులౌతున్నారు. స్థానీయ పవిత్రతను తెలియజేస్తున్నారు. జేజేలు పలుకుతున్నారు.

"రాజరాజేశ్వరీ సహిత రాజలింగేశ్వరుడు... దేవేరీ దేవేశులకు ఒకే పేరు అరుదైన సంగతి. సాగర సంగమం తుల్యభాగ ప్రాంతం యానాం సమీపంలో ఉండటం ఈ ప్రాంతం చేసుకున్న పుణ్యం. తండ్రి సముద్రుడు. తల్లి గోదావరి. అమ్మా అయ్యా కలసి ఉంటూ మానవులకు శ్రేయస్సును, ఆయుస్సును కలుగజేయు పవిత్ర స్థలం యానాం.

పరమ పవిత్రమూ పుణ్యప్రదమూ అయిన యానాం గోదావరి నదీతీరంలో తీర్థవిధులు, స్నానాదులు చేయడంవల్ల ఏడుతరాల వారు తరించి ఉత్తమ లోకాలకు చేరుకుంటారు." ఇలా సాగిపోతూ ఉంటుంది చిదంబర శాస్త్రి ఆధ్యాత్మిక ప్రవచనం. ఫలితంగా ఇక్కడి గోదావరిలో స్నానం చేయడానికి ఉవ్విళ్ళూరుతున్నారు జనం. వారి మీద ప్రచారం బాగా పనిచేసింది.

గోదావరి తీరం భక్తజన సందోహంతో కిక్కిరిసిపోయింది. ఇసకేస్తే రాలనంత జనం. సాయంత్రం ఏడుగంటల వరకు స్నానాదికాలు జరుగుతూనే ఉన్నాయి.

చిదంబర శాస్త్రి పుష్కరాల ప్రారంభం రోజు వరకు మాత్రమే ప్రవచనాలు చేశారు. ఒక ప్రత్యేకమైన చోటు ఎంచుకున్నారు. ముగ్గురు సహాయకుల్ని నియమించుకున్నారు. పిండ ప్రదానాలు, స్నానాలు, దానాలతో బిజీ అయిపోయారు. అందరి తపన ఒకటే. ఆయనచేతే చేయించుకోవాలని పోటీ పడుతున్నారు. విరివిగా పెద్ద మొత్తంలో దానాలు, కానుకలు ఇస్తున్నారు. అలా ఇచ్చేవాళ్ళకే మొదటి ప్రాధాన్యం.

మూడోరోజున ఎవరూ ఊహించని సంఘటన జరిగింది. డబ్బులు జాగ్రత్త చేసే సంచి గల్లంతైంది. చిదంబర శాస్త్రి కంగారుపడలేదు. ముఖంలో మందహాసం చెరగలేదు. ప్రాప్తం అంతే అన్నట్టున్నాడు. ఆరోజు పోయిన సొమ్ము ఎంతో ఎవరికీ తెలీదు. రకరకాల అంచనాలు.. ఊహాగానాలు. కొంతమంది లక్ష రూపాయల వరకు ఉండొచ్చన్నారు.

శాస్త్రోక్తంగా సుమధుర కంఠస్వరంతో చిదంబరశాస్త్రి మంత్రాలు వల్లిస్తుంటే అంతా తన్మయులవుతున్నారు. పితృదేవతల సుగతికి శాస్త్రే తగినవాడని కీర్తిస్తున్నారు. లోకోద్ధరణకు కంకణం కట్టుకున్న మహానుభావుడిగా ఏక కంఠంతో కొనియాడుతున్నారు. అటువంటి వ్యక్తి సొమ్ము పోవడం అందరికీ బాధ కలిగించింది.

దేవస్థానం కమిటీవారు తమలో తాము చర్చించుకున్నారు. ఏదైనా చేయాలని తీర్మానించుకున్నారు. ఊరికి అప్రతిష్టే కాక కీడు అని తలచారు. వదాన్యుల నుంచి లక్ష రూపాయలు సేకరించి, ఆయన చేతిలో పెట్టి కాళ్ళకు నమస్కరించారు. చిదంబరశాస్త్రి ముందు అంగీకరించలేదు. ఇదంతా దైవ నిర్ణయమని, ఎవరూ ఏవిధంగానూ బాధపడవద్దని కొన్ని పురాణ కథలు అన్వయించి చెప్పారు.

**అగ్రహారంలో చెడబుట్టాడన్నారతన్ని. లేని అలవాటులేదు. ఊరొదిలి పారిపోయాడోరోజు. ఏ మహానుభావుడు జేరదీశాడోగానీ పరిపూర్ణ బ్రాహ్మణుడై తిరిగొచ్చాడు. అంతలోనే పుష్కరాలు వచ్చాయి. మెల్లిగా అతడి ప్రతిష్ట ఇనుమడించింది. భక్తకోటి అతడికి లక్షలాది రూపాయలు సమర్పించుకుంది. ఓ కలకత్తా వ్యాపారి వచ్చి గోదానం కూడా చేసుకున్నాడు. కానీ ఆ తర్వాతే నడిచింది అసలు కథంతా!**

ఊరి జనం ఊరుకోలేదు.

"మీరేం చెప్పినా వినం. మా సంతృప్తి కోసం తీసుకుని తీరాల్సిందే" అని అందరూ ప్రాధేయపడ్డారు.

చిదంబరశాస్త్రి మౌనంగా స్వీకరించారు. అందరి మనస్సులు ఊరడిల్లాయి. పెద్ద భారం దిగినట్లుగా ఊపిరి పీల్చుకున్నారు.

రాజమండ్రిలో తొక్కిసలాట వల్ల ప్రాణనష్టం జరగడంతో అందరూ యానాం రావడం మొదలెట్టారు. టీవీ, కరపత్రాల ద్వారా ప్రాశస్త్యం బాగా పెరిగింది. అంతేగాక యానాంలో కనీవినీ ఎరుగని రీతిలో, సౌకర్యవంతంగా చేసిన స్నానవాటికల ఏర్పాట్లు కూడా జనాన్ని ఆకర్షించాయి.

పుష్కరాలు మరో రెండురోజుల్లో ముగుస్తాయనగా జరిగిన సంఘటన గురించి ఇప్పటికీ చెప్పుకుంటారు.

కలకత్తా నుంచి సురేంద్ర అనే ఆయన

వచ్చాడు. కోటీశ్వరుడు. భక్తి విశ్వాసాలు మెండుగా గలవాడు. కోరింగ నదిలో స్నానమాచరించడానికి ప్రత్యేకంగా వచ్చాడు. గోదావరి ఒక పాయను కోరింగ నది అంటారు. తూర్పు దిక్కున ఉంది. దక్షిణం నుంచి ఉత్తరం దిక్కుకు ప్రవహిస్తుంది. దేశంలో ఎక్కడా ఈ మాదిరిగా ఏ నదీ ప్రవహించదట. అంతదూరం నుంచి ఇక్కడి విశేషం తెలుసుకుని వచ్చాడు సురేంద్ర.

చిదంబరశాస్త్రి గురించి విన్నాడు. కోరింగ నది దగ్గర పిండప్రదానాలు ఇస్తానని, దయచేయండని శాస్త్రిని కోరాడు. రాజరాజేశ్వరి ఆలయం దగ్గర పడవలరేవుకు రావాల్సిందిగా అభ్యర్థించాడు.

చిదంబర శాస్త్రి గోదావరితీరం వదిలి రావడానికి ససేమిరా వీలుకాదన్నాడు. ఇక్కడ అందరికీ అందుబాటులో ఉండాలన్నాడు. తన అవసరం తీరంలోనే ఎక్కువగా ఉందన్నాడు. ఎవరినైనా తీసుకెళ్ళి చేయించుకోమని సలహా ఇచ్చాడు. సురేంద్ర వినలేదు.

"తమ చేతుల మీదుగా జరగాల్సిందే. మీ గురించి వినే వచ్చాను. స్వయంగా మీరే సమస్తం నిర్వహించాలి. అదే నాకు తృప్తి" అని బతిమాలాడు. ప్రాధేయపడ్డాడు. పాదాలు పట్టుకున్నాడు. పెద్దలందరూ సురేంద్ర గురించి మరీ మరీ కోరడంతో ఎట్టకేలకు చిదంబరశాస్త్రి ఒప్పుకున్నాడు. సురేంద్ర ఆనందపడ్డాడు.

పుష్కరాల రోజుల్లో మంచి రోజులకు మరింత డిమాండు ఉంది. చాలామంది నిరీక్షిస్తుంటారు.

ఆరోజు ముఖ్యమైన తిథి. ప్రచారం బాగా జరిగింది. భక్తులు రెండింతలు వచ్చారు. ఊరంతా నిండిపోయారు. సురేంద్ర కూడా ఆ రోజు కోసమే తయారై వచ్చాడు.

దానం ఇవ్వడం కోసం ఎనభై వేలు వెచ్చించి మంచి ఆవును తెప్పించాడు. తెల్లగా మల్లె పూవులా ఉంది. బలంగా కండలు తేరి అందంగా ఉంది. పొదుగు నిండుగా ఉంది.

ఆవు మెడలో మూడు కాసులతో బంగారు గొలుసు వేలాడదీశారు. వెండి తీగ కూడా చుట్టారు. కాళ్ళకు పట్టీలు వంటివి వెండితో తయారుచేసినవి తొడిగారు. స్వర్గలోకం నుంచి దిగివచ్చినట్లుగా ఉంది. కామధేనువులా ఉంది.

అర్ధరాత్రి గోదావరి ఒడ్డున నిలిపారు, పగలు తీసుకురావడం కష్టమని.

పద్ధతి ప్రకారం చేయవలసిన దానాలు అన్నీ సురేంద్ర చదివించుకున్నాడు. ఆఖరుగా ఆవును ధారపోశాడు. చిదంబరశాస్త్రికి చాలా పెద్ద మొత్తంలో సంభావన ముట్టజెప్పాడు.

ముందుగా చిదంబరశాస్త్రి ఆవుమీద ఉన్న విలువైన బంగారుగొలుసు, వెండి తీగలు, పట్టీలు జాగ్రత్త చేసుకున్నాడు. ఆవును దూరంగా కొబ్బరి చెట్టుకు కట్టేయించాడు.

ప్రతినెల ఆవుకు అవసరమయ్యే సమస్త గ్రాసం పంపుతానని సురేంద్ర తెలియజేశాడు. అంతేకాదు, చిదంబర శాస్త్రి కుటుంబానికి సరిపడా నాణ్యమైన సన్నరకం బియ్యం పంపుతానన్నాడు.

"నేను బియ్యం వ్యాపారిని. తమ ఆశీస్సులు కావాలి. తమకు అవసరమైంది ఏదైనా సరే సమకూర్చగలను. మొహమాటపడకుండా అడగండి" అని కోరాడు. సురేంద్ర దంపతులు శాస్త్రికి సాష్టాంగ ప్రణామంచేసి సెలవు తీసుకున్నారు.

సాయంత్రమైంది. జరగకూడనిది జరిగిపోయింది. ఎవరు బాధ్యత తీసుకుంటారు?

మనోభావాలు దెబ్బతినే సంఘటన ఎవరికైనా బాధే. మనస్సు చివుక్కుమంటుంది. నివారణగా ఏం చేయాలో తోచనప్పుడు మరీ కష్టంగా ఉంటుంది.

కొబ్బరిచెట్టుకు కట్టిన ఆవు మాయమైంది.

గాలించారు. వీధి వీధీ వెతికారు. కనిపించలేదు. చుట్టుపక్కల ఊళ్ళకు కూడా మనుషుల్ని పంపించి ఆరా తీయించారు. ఫలితం శూన్యం.

లెక్కకు మించిన జనం. బెదిరిపోయింది ఆవు. అంతే...

తాడు తెంపుకుని అడ్డదిడ్డంగా పరుగు లంకించుకుంది. దాని దూకుడుకు కళ్ళెం వేసే వారెవ్వరూలేరు. చాలామందికి గాయాలయ్యాయి. ఒక కుర్రాడికి విపరీతమైన దెబ్బలు తగిలాయి. వెంటనే హాస్పిటల్‌కి తీసుకెళ్ళడంతో ప్రాణాపాయం తప్పింది.

సురేంద్ర మధ్యాహ్నమే వెళ్ళిపోయాడు. అతనికి ఆవు అదృశ్యమైన సంగతి తెలీదు. ఈ సంగతి చెప్పగలిగేవారు లేరు. గోవు దారి కనుక్కుని, ఆచూకీ కనిపెట్టడం ఎవరి తరమూ కాలేదు ఇప్పటికీ.

చిదంబర శాస్త్రి కంగారుపడలేదు. గంభీరంగా ఉండిపోయాడు.

"దీని ఫలితం ఏమిటి?" అని ప్రశ్నించిన ఔత్సాహికుడికి చిరునవ్వే సమాధానం. యథాప్రకారం కార్యక్రమాలు నిర్వర్తించడంలో మునిగిపోయాడు.

పుష్కరాలరోజులు గడిచాయి. ఏవో చిన్న చిన్న సంఘటనలు మినహా ప్రశాంతంగా ముగిశాయి.

మరోవిచిత్రం జరిగింది. ఇది మాత్రం అందర్నీ అయోమయానికి గురిచేసింది. గందరగోళంలో పడేసింది. అన్నింటికీ విధి వైపరీత్యం అని సరిపెట్టుకోలేం కదా...




అదే జరిగింది. పుష్కరాలు పూర్తైన మర్నాటి నుంచీ చిదంబరశాస్త్రి కనిపించడం లేదు. ఎక్కడకు వెళ్ళాడో తెలియలేదు. ఇంటి దగ్గర, గుడి దగ్గర... ఎక్కడా కనిపించలేదు. అసలు ఎక్కణ్ణించి వచ్చాడో, ఎక్కడకు వెళ్ళిపోయాడో ఎవరూ ఊహించలేకపోతున్నారు.

చిదంబరశాస్త్రి సహాయకులుగా పనిచేసిన వారు కూడా నోరిప్పడం లేదు.

"గురువుగారు మాకేమీ చెప్పలేదు. మాకేమీ తెలీదు. మమ్మల్ని పదేపదే అడిగి విసిగించకండి" వినయంగా చేతులు జోడించి తప్పుకుంటున్నారు.

రెండు రోజులు గడిచేటప్పటికి సహాయకుల్లో ఒకడైన సదాశివం మాత్రం ఒకమాట చెప్పాడు.

"మా గురువుగారు పుష్కరాల మూడోరోజున పోగొట్టుకున్న సొమ్ము అబద్ధం. లక్షరూపాయలు కాదు కదా అయిదు పైసలు కూడా పోలేదు. ఇది నిజం. నా కళ్ళారా చూసిందే చెబుతున్నాను. డబ్బులు పోకుండా గురువుగారు ఎందుకలా చేశారో నాకిప్పటికీ అర్థం కాదు". ఈ మాటల ద్వారా చిదంబరశాస్త్రి అసలు నైజం తెలుసుకోగలమా?

మరొక విషయం కూడా రహస్యంగానే ఉండిపోయింది. దీని ప్రస్తావన ఎవరూ చేయడం లేదు.

ముక్కూమొహం తెలీని ఆడా, మగా ఒకరికి తెలియకుండా మరొకరు ఒకే నూతిలో పడి శవాలై తేలినప్పుడు ఊహించుకునే పుకారు కథనం వంటిదేనా ఇది కూడా. ఏమో...!

ఇంక సంగతి ఏమిటంటే...

అదే రాత్రి చిదంబర శాస్త్రి పక్కింటి సుదర్శన రావు కూతురు అదృశ్యమైంది.

మతలబు ఏమిటో తెలియక ఊళ్ళోవాళ్ళు తలలు బద్దలు కొట్టుకుంటున్నారు.

సురేంద్రనుంచి శాస్త్రి కుటుంబానికి బియ్యం... ఆవు మేతకు చిట్టు, తవుడు, ఎండుగడ్డి లారీల్లో వస్తూనే ఉన్నాయి. గోవు మాత్రం అప్పటికే కొన్ని కడుపుల్లో జీర్ణమైన విషయం ఎవరికీ తెలియదు.

**సెల్: 94401 05987**




**'నెమ్మది... నెమ్మదిగా అరవండి సారు... ఊరంతా వినిపించేటట్టు గొంతు చించుకోకండి' ఉన్నట్టుండి రంకెలు పెడుతున్న మనిషిని హెచ్చరించాడు అతని అనుచరుల్లో ఒకతను.**

**'అరేయ్... ఎవడ్రా నువ్వు? ఏమంటున్నావ్? నేను గొంతు చించుకుంటున్నానా? నువ్వెంత? నీ బతుకెంత?' భయంకరంగా అరుస్తూ, అతని చెంపమీద చాలా బలంగా కొట్టబోతూ, చటుక్కున ఆగిపోయాడతను.**

'ఎనిమిది వేలు తీసుకున్నాడు ఈ ఏరియాని కంట్రోల్ చేసే స్టేషనోడు. అందులో పనిచేసే వాళ్ళందరికీ మరో మూడు ఇప్పించాడు. తీసుకున్న మాట, డబ్బులు ఇప్పించిన విషయం మర్చిపోయాడంటారా?' చిన్న కంఠంతో అడిగాడు అందరినీ.

వాళ్ళల్లో ఎవరూ నోళ్ళు తెరిచి సమాధానం ఇవ్వలేదు. అందరిచూపులూ ఆ సందు మొదట్లోకి వచ్చి ఆగిన పోలీస్ వ్యాన్ మీదనే కేంద్రీకరించి ఉన్నాయి.

'దాచేయండి... కత్తులు, కర్రలు కనిపించకుండా అవతలికి విసిరేయండి' గబగబా హెచ్చరించాడు నాయకుడు.

పదే పది క్షణాల్లో పోయి, ముక్కులు బద్దలు చేస్తున్న మురుగుగుంటలోకి విసిరేశారు. వారందరి దగ్గర ఉన్న ఆయుధాలు.

ముందుగా వ్యాన్‌లోనుంచి దిగాడు ఆ ఏరియాని కవర్ చేసే ఇన్‌స్పెక్టర్. అతను ఒక్కడే తమ దగ్గరికి వచ్చినట్లయితే, ముందుగానే తాము చేసుకున్న ఒప్పందం గుర్తుచేసి, అప్పటికప్పుడు పెద్దగొడవ పెట్టుకుని ఉండేవాడు ఆ వీరాధివీరులందరినీ కంట్రోల్ చేస్తున్న పెద్దమనిషి. ఆ ఇన్‌స్పెక్టర్ వెనుకే వ్యాన్‌లో నుంచి దిగిన మరో అధికారిని చూసేసరికి మతిపోయినంత పనైంది కాబోలు, 'మాట్లాడబోకండి ఎవరూ... ఎంత రెచ్చగొట్టినా ఎవరూ నోళ్ళు తెరవకూడదు' అంటూ స్ట్రిక్ట్ వార్నింగ్ ఇచ్చాడు.

'ఈ జిల్లాకి సూపర్నెంటు... మహా మొండి! మన లాంటివాళ్ళని ఫుట్‌బాల్ ఆడేస్తాడట' తల వంచుకుంటూ చిన్న కంఠంతో కామెంట్ చేశాడు ఒక దృఢకాయుడు.

'నోరు మూయమని చెప్పానా?' కరకరమంది నాయకుడి కంఠం.

'హలో... ఎక్కడో ఉండాల్సిన వాళ్ళంతా ఇక్కడ గుమిగూడారేమిటి?' మీ కార్యక్రమాలు ఈ ఊళ్ళో కూడా ప్రారంభించారా?' చక్‌చక్‌మని అడుగులు వేస్తూ వచ్చి, సూటిగా అడిగేశాడు సూపరింటెండెంట్.

'అబ్బెబ్బే... అదేం లేదు సారూ! తెలిసినవాళ్ళు ఈ సందులో ఉన్నారని వచ్చాం' వినయంగా సమాధానం ఇచ్చాడు దృఢకాయుల నాయకుడు.

'మురుగునీటి చెరువు దగ్గర మీటింగ్ పెట్టారేంటి? ఎవరినైనా తరుముకుంటూ వచ్చారా?' చుట్టూ చూస్తూ అడిగాడు సూపరింటెండెంట్, అతని సమాధానం తనకు వినబడనట్టు.

'చతుర్లు వద్దు సారూ, తెలిసిన వాళ్ళకోసం వచ్చామని చెపుతుంటిని కదా..' మరోసారి చెప్పాడు నాయకుడు.

'మరి కలుసుకున్నారా?' అడిగాడు సూపరింటెండెంట్. ఆయన చూపులు తన అనుచరులందర్నీ సునిశితంగా గమనిస్తున్నట్లు గమనించి గబగబా తల అడ్డం తిప్పాడు నాయకుడు.

'ఈ మురుగ్గుంట దగ్గరికి వచ్చిన తర్వాత తెలిసింది, మేము దారి తప్పాం. రావాల్సింది ఈ సందులోకి కాదు..' అన్నాడు.

'భద్రయ్య కిళ్ళీకొట్టు దగ్గర ఎవరో బాంబులు విసురుకున్నార్ట. ఇంజనీరింగ్ కాలేజీలో చదువుకునే కుర్రాడిని నరికి పోగులు పెట్టటానికి నెంబర్ కనిపించకుండా కాయితాలు అంటించిన జీపుకారులో



## జరిగిన కథ

*గూండా ముఠాలకు కనిపించకుండా తప్పించుకు తిరుగుతూ ఉంటాడు వెట్టి. నాగదేవతగా చెప్పుకుంటున్న ఒక అమ్మి వెట్టికి పరిచయమవుతుంది. వెట్టిని తన ఇంటికి తీసుకెళ్ళి ఆశ్రయమిస్తుంది. కదిరి ఎస్టేటుకు బయలుదేరివెళ్ళిన ఆమె కూతురు ప్రణవి వెంట సెక్యూరిటీగా వెళతాడు వెట్టి. అతన్ని ఎక్కడోచూసినట్టనిపిస్తుంది బాజిరెడ్డికి. కానీ గుర్తు రాదు. వెట్టి అసలుపేరు విఠల్‌రెడ్డి. ఇంజనీరింగ్ ఫైనలియర్ స్టూడెంట్. కాలేజీలో ఆడపిల్లను అల్లరి చేయబోయిన బాజిరెడ్డి కొడుడు పఠాన్‌కు దేహశుద్ధి చేస్తాడు. అతడి మనుషులు మరోరోజు బాంబులతో దాడి చేస్తారు. తెలివిగా తప్పించుకుని పారిపోతాడు విఠల్‌రెడ్డి.*

*ఆ తర్వాత......*

వచ్చార్ట. మీరు కాదు గదా..' ఉన్నట్లుండి సీరియస్‌గా అడిగాడు సూపరింటెండెంట్.

పోలీస్ వ్యాన్ చూడగానే అందులో వచ్చింది ఎవరో తెలియకపోయినా, ముందు జాగ్రత్తకోసం తమ ఆయుధాలను మురుగ్గుంటలోకి విసిరేయటం ఎంతమంచిదైందో అందరికీ అర్థమైంది.

'వాడు... ఆ కిళ్ళీషాపులో ఉన్న చవట కంగారుపడి ఈయనకి ఫోనుచేసి ఉంటాడు. పదోపరకో వాడి ముఖంమీద పడేసిఉంటే కుక్కినపేనులా పడి ఉండేవాడు. తప్పయిపోయింది' తనలో తను అనుకున్నాడు, వారి నాయకుడు. బైటికి మాత్రం వినకూడని మాటలు వినవలసి వస్తున్నట్టు చాలా ఆందోళనగా చూశాడు. 'పట్టపగలు బాంబులా? ఇంజనీరింగ్ చదువు చదివే కుర్రాడి మీదా? అదేంటి సారూ? అలా ఎలా జరిగింది? ఎవరా ఎదవ పని చేసిందీ?' అని అడిగాడు.

'ఆ పని చేసింది మీరు కాదు. అంతేనా?' అడిగాడు సూపరింటెండెంట్.

'అంతేసారూ.. మేము కాదు. అసలు ఆళ్ళెవరో మాకు తెలియదు. మేము వచ్చింది గొడవలు పడటానికి కాదు, తెలిసినోళ్ళని కలుసుకోవటానికి' మరోసారి తమ అమాయకత్వాన్ని గట్టిగా వివరించాడు నాయకుడు.

'ఓకే. వచ్చిన పనైపోయింది కదా! ఇంకా ఇక్కడ నిలబడటం దేనికి? వెళ్ళిపొండి.. మూవ్..' ఖంగుమంది అతడి కంఠం.

ఇష్టం లేకపోయినా ఆ మాట బయటికి చెప్పే ధైర్యం లేకపోవటం వల్ల, ఒకరి వెనుక ఒకరు కదిలి సందు మొగదలకు బయలుదేరారు అందరూ.

తల వంచుకుని శిలావిగ్రహం మాదిరి కూర్చుని ఉన్న వెట్టికి గుండెల మీదినుంచి కొండంత బరువు దిగిపోయినట్టైంది. ఆ పోలీసు అధికారి అక్కడ ఉండగానే తను ఆయన దగ్గరికి పోయి జరిగిందంతా చెప్పటం చాలా బాగుంటుందని అతనికి అనిపించింది. కూర్చున్న చోటు నుంచి లేవబోయాడు.

కాలికి తగిలిన గాయం తన శరీరంలోని శక్తినంతా హరించి వేసిందన్న సంగతి అప్పుడుగాని అతనికి తెలియలేదు. పూర్తిగా లేచి నిలబడక ముందే గిర్రున కళ్ళు తిరిగాయి . ఎదుట ఉన్న ప్రపంచం అంతా తలకిందులైపోతున్న అనుభూతి కలిగింది. ముఖం పగిలిపోకుండా చేతులు అడ్డం పెట్టుకుంటూ ముందుకు తూలటం వరకే తెలిసింది అతనికి. ఆ తర్వాత ఏం జరిగిందో తెలియక ముందే తెలివి తప్పిపోయింది.

●●●

'అయ్యయ్యో... ఎంత పని జరిగింది అబ్బయ్య! శనిదేవత నీ నెత్తిమీదికి ఎక్కి చిందులు తొక్కుతున్నట్టే ఉంది. సరైన సమయంలో కళ్ళు తిరిగి పడిపోవటం నిజంగా శనిదేవుని మహత్యమే' సానుభూతి సూచకంగా అన్నాడు, శ్రద్ధగా వింటున్న శంకరయ్య.

'నీకు మళ్ళీ తెలివి ఎప్పుడు వచ్చింది?' అడిగింది ప్రణవి.

'చీకటి పడిపోయింది. దోమలు అదేపనిగా ముఖం చుట్టూ మూగుతూ ఉండగా వచ్చింది' అన్నాడు వెట్టి.

'సరేసరే. తర్వాత ఏం జరిగిందో చెప్పు..' అసహనంగా అడిగింది శివారెడ్డి భార్య.

వెట్టికి దగ్గర్లోనే ఉన్నది టీపాయ్. దానిమీద ఉన్న వాటర్ జగ్‌లో నుంచి నీళ్ళు ఒక



గ్లాసులోకి వంపి, అతని చేతికి అందించింది ప్రత్యూష.

ఎదుటివారికి ఏయే సమయాల్లో ఎటువంటి అవసరాలు వస్తాయో చిటికెలో అర్థం చేసుకోగల ఆమె చురుకుదనానికి ఆశ్చర్యపడుతూ, నీళ్ళు తాగాడతను.

'థాంక్యూ..' అంటు గ్లాసు కింద పెట్టబోతుండగా, మళ్ళీ తనే అందుకుని, టీపాయ్‌మీద పెట్టింది ఆమె.

'థాంక్సులు... గీంక్సులు తర్వాత.. ముందు నీ కథ చెప్పు' మరోసారి అతన్ని హెచ్చరించింది శివారెడ్డి భార్య.

'చెప్పటానికి ఏముంది తల్లీ! దోమల్నయితే తోలుకోగలిగాను కాని, లేచి నిలబడటానికి మాత్రం ఓపిక లేక అక్కడే ఉండిపోయాను. అర్ధరాత్రి సమయంలో ఎవరో నన్ను పిలుస్తున్నట్టు అనిపించి తల ఎత్తి చూశాను. మా కిళ్ళీకొట్టు భద్రయ్య చిన్న టార్చిలైటు పట్టుకుని కనిపించాడు' అంటూ మొదలు పెట్టాడు వెట్టి.

•••

'పందెపు పుంజు మాదిరి చెంగుచెంగున కదిలేవోడివి! ఎటువంటి గతిపట్టింది విఠల్‌బాబు మీకు... ఏంటి ఈ కర్మ?' భుజాలు పట్టుకుని చిన్నగా పైకి లేపుతూ వాపోయాడు భద్రయ్య.

'నా కర్మ సంగతి తర్వాత... నాతో నీకు సంబంధం ఉందని తెలిస్తే నీ కర్మ కాలిపోతుంది. జాగ్రత్త సుమా..' తడి ఆరిపోయిన కంఠంతో అస్పష్టంగా అన్నాడు వెట్టి.

'అంత తేలికగా నేను ఆళ్ళకి దొరకను. బాంబులు పడిన వెంటనే దుకాణం మూసేసి ఇంటికెళ్ళిపోయాను. ఇప్పటివరకూ ఎవరూ నా గురించి మాట్లాడలేదు. ఒకవేళ మాట్లాడితే నాకేమీ తెలియదంటాను. అంతే' సందులోకి తీసుకుపోతూ చెప్పాడు భద్రయ్య.

'పోలీస్ సూపర్నెంట్ సారుకి ఫోన్‌చేశావా?' అడిగాడు వెట్టి.

కనురెప్పలెత్తి ఒకసారి అతని ముఖంలోకి చూసి, వెంటనే ముఖం పక్కకి తిప్పుకున్నాడు భద్రయ్య. 'చేశాను బాబూ. భయం వేసింది. బాంబుల్ని తప్పించుకున్నా, నువ్వు వాళ్ళ కొడవళ్ళకి దొరికిపోతావని అనిపించి ఇంటికిపోతూ పోతూ దారిలో నుంచి ఫోను చేశాను. నా పేరు అడిగాడు సూపర్నెంటు. చెప్పలేదు. పేరు అనవసరమన్నాను. అర్థం అయింది కాబోలు ఒత్తిడి పెట్టలేదు' జరిగింది చిన్నగా చెప్పాడు.

'మంచిపని చేశావు భద్రయ్య. నాకు బాగా నచ్చింది. అది సరేగాని, నన్ను తరిమినోళ్ళని తీసుకు వచ్చింది ఎవరు? గంగాళంలా నోరు తెరిచి అదేపనిగా కేకలు పెడుతున్నాడు. ఎవరతను?' అడిగాడు వెట్టి.

'అదేమో తెలియదు. ఒకటి మాత్రం నిజం. ఆళ్ళందరూ ఆ పఠాన్‌కి వత్తాసుగా వచ్చినోళ్ళు...' అన్నాడు భద్రయ్య.

•••

'గంగాళంలా నోరుతెరిచి అరిచేది మన వీరభోజుడే.. సందేహం ఎంతమాత్రం లేదు. తన కొడుక్కు జరిగిన అవమానానికి ప్రతీకారం తీర్చుకోవటం కోసం స్వయంగా వచ్చి ఉంటాడు' ఉన్నట్లుండి వెట్టి మాటలకు అడ్డు తగిలింది ప్రణవి.

'ప్రణవమ్మా, నువ్వు కొంచెం తమాయించుకో తల్లీ. అతన్ని చెప్పనీ.' బతిమాలుకుంటున్నట్టు అన్నాడు శంకరయ్య.

'నువ్వు చెప్పు విఠల్‌బాబూ... వాళ్ళు నిమిషానికో సారి అడ్డం తగులుతూనే ఉంటారు. నువ్వుకానీ..' అన్నది శివారెడ్డి భార్య.

'భద్రయ్య నన్ను తన దుకాణంలో కూర్చోబెట్టి, కాలికి తగిలిన గాయం శుభ్రంచేసి కట్టుకట్టాడు..' అంటూ మొదలుపెట్టాడు వెట్టి.

అందరూ సైలెంట్ అయిపోయారు. చెవులు రిక్కించి శ్రద్ధగా వినటం మొదలు పెట్టారు.

•••

'నెత్తురు కారటం ఆగిపోయింది గాని, ఆ దరిద్రపు నీళ్ళలో తడవటంవల్ల చీముపట్టి గాయం పెద్దది కావొచ్చు. ఎవరైనా డాక్టరు దగ్గరికిపోయి ఇంజక్షన్ చేయించుకోవడం చాలా బాగుంటుంది' మురికి వాసన వస్తున్న అతని దుస్తులు చూస్తూ చెప్పాడు భద్రయ్య.

'నిజం చెప్పావు. ముందు అర్జంటుగా స్నానం చెయ్యాలి. డెట్టాల్ సీసా ఏదైనా ఉందా నీ దగ్గర?' అడిగాడు వెట్టి.

కరెంట్ కనెక్షన్ ఉంది భద్రయ్య కిళ్ళీకొట్టుకి. అయినా సరే లైటు వేయడానికి భయపడ్డాడు అతను. తన దగ్గర ఉన్న టార్చిలైటు వెలుగులోనే అరలన్నీ గాలించి, ఒక అర అట్టడుగున ఉన్న చిన్న సీసా తీసి అతనికి అందించాడు.

'ఇక సిగరెట్టు కూడా ఇవ్వు..' అన్నాడు వెట్టి. అతను అందించిన సిగరెట్టు వెలిగించుకుని, గుండెల నిండా పొగ పీల్చి గట్టిగా నిట్టూర్చాడు.

'నువ్వు నీ గదికి పోవటం మంచిది కాదు బాబూ.. దొంగనాబిడ్డలు కాపుకాసి ఉంటే, నీ పని అయిపోతుంది' అన్నాడు భద్రయ్య.

'స్నానం చెయ్యాలి కదా... డ్రెస్ చేంజ్ చేసుకోవాలి. ఇంకో నిమిషం ఈ అవతారంలోనే ఉంటే, ఊపిరితిత్తులకు ఇన్‌ఫెక్షన్ వచ్చి గుటుక్కుమంటాను'

**భద్రయ్య సహాయంతో బాజిరెడ్డి మనుషుల బారి నుంచి తాత్కాలికంగా తప్పించుకోగలిగాడు విఠల్‌రెడ్డి. భద్రయ్య ఇచ్చిన తెల్లపంచె, చిరుగుల చొక్కా వేసుకుని కర్నూలు వెళ్ళేందుకు బయలుదేరాడు. కాలు నొప్పి భరించలేక ఒక అరుగుమీద కూర్చున్నాడు. అంతలో ఆ చీకట్లో ఒక జీపు కారు బర్రున దూసుకొచ్చింది. ముందుకెళ్ళి మళ్ళీ వెనక్కు వచ్చి అతడిముందాగింది. అప్పుడేం జరిగింది? ఈ జీపుకారులో ఎవరున్నారు?**

తన రూపాన్ని తనే అసహ్యించుకుంటూ అన్నాడు వెట్టి.

'నా షాపు వెనకాల నీళ్ళతొట్టి ఉంది. ముందు స్నానం చెయ్యి' అంటూ ఆ తొట్టిని అతనికి చూపించాడు భద్రయ్య.

మూడొంతులు నిండుగా ఉన్న తొట్టిని చూసి సంతోషంగా తల ఊపాడు వెట్టి. అంతలోనే ఏదో అనుమానం వచ్చింది.

'ఏంటి నీ అనుమానం?' అడిగాడు భద్రయ్య.

'స్నానం చేస్తాను. డెట్టాల్ సీసా ఇచ్చావు కాబట్టి హ్యాపీగానే ఉంటుంది. మరి ఆ తర్వాత? మళ్ళీ ఈ ప్యాంటు, షర్టు..' అంటూ మాటలు ఆపాడు వెట్టి.

'ముందు మొదటిపని చెయ్యి. రెండో పని గురించి తర్వాత మాట్లాడదాం' అంటూ తాను షాపులోకి దూరాడు భద్రయ్య.

ప్యాంటుషర్టు వదిలేశాడు వెట్టి. వట్టి అండర్‌వేర్‌తో తొట్టిలో కూర్చొని, డెట్టాల్ సీసాలోని సగం ద్రవాన్ని నీటిలోకి వంపేశాడు.

'అయిపోయిందా?' షాపులో నుంచి బయటికి వస్తూ అడిగాడు భద్రయ్య, నాలుగు నిమిషాల తర్వాత.

ముడతలు పడిన పాత పంచె ఒకటి ఉన్నది అతని చేతుల్లో. భుజాల దగ్గర చినుగులు కనిపించే షర్టు కూడా ఉంది.

'సీసాలు తుడుచుకోవటానికి మూడు రోజుల క్రితం ఇంటి దగ్గర్నించి తీసుకువచ్చాను. తీసుకు రావటం చాలా మంచిదైంది' అంటూ అతనికి అందించాడు.

అండర్‌వేర్ కూడా వదిలేసి, ఆ పంచె కట్టుకుని, పాత షర్టును వేసుకున్నాడు వెట్టి. 'తెల్లవారుజామున కర్నూలు పోయే ఎక్స్‌ప్రెస్ బస్సు ఇటునుంచే పోతుంది. చెయ్యెత్తితే ఆపుతాడు డ్రైవర్. అక్కడికి పోయిన తర్వాత మంచి డ్రెస్ కొనుక్కుని వేసుకోవచ్చు' అంటూ తన జేబులో నుంచి కొన్ని కరెన్సీ నోట్లను బయటికి తీశాడు భద్రయ్య.

బాంబులు పడినా, కొడవళ్ళు పట్టుకుని జనం తూములోళ్ళ మాదిరి ఎనకాల పడినా, గాజుపెంకు దెబ్బకి కాలు తీవ్రంగా గాయపడినా లెక్కచేయని కళ్ళల్లో వెంటనే ప్రత్యక్షం అయ్యాయి నీళ్ళు.

'తడవకి ఒకేఒక్క సిగరెట్‌తప్ప నీ దగ్గర ఇంకేమీ తీసుకోలేదు నేను. నీకు నాకు చుట్టరికం కూడా లేదు. ఇంత సాయం చేస్తున్నావ్...' అంటూ ఆపైన మాటలు రాకపోవటంతో ఆగిపోయాడు.

"అయ్యయ్యో... అవేం మాటలు బాబు. ఎప్పుడు చూసినా నవ్వుతూ ఉండే నువ్వు కళ్ళ నీళ్ళు పెట్టుకోవటం ఏమిటి? ఊరుకో... ఈ గొడవ చల్లబడగానే తీసుకొచ్చి వడ్డీతో సహా నా రుణం తీర్చేయ



వచ్చు. మరేం ఫరవాలేదు తీసుకో' అంటూ బలవంతంగా ఇవ్వబోయాడు భద్రయ్య.

తడి కళ్ళను చొక్కాభుజాలకు అద్దుకుని, తల అడ్డం తిప్పాడు వెట్టి. 'డబ్బులు అవసరం లేదు భద్రయ్యా. నా జేబులో ఉన్నాయి' అంటూ తను వదిలేసిన షర్టు జేబులో నుంచి కరెన్సీ నోట్లు, చిల్లర నాణేలు తీసుకున్నాడు.

ముందుకు వంగి అతని కాలుకు కట్టిన కట్టును మరోసారి సరిచూశాడు భద్రయ్య. 'కర్నూలు వెళ్ళగానే డాక్టరు దగ్గరికి పో, మర్చిపోకు. స్నానం చేసేటప్పుడు తడవనీయొద్దని చెప్పటం మర్చిపోయాను' అన్నాడు.

'అది సరేగాని, నన్ను వదిలినవాళ్ళు ఏమైపోయారో నీకేమైనా తెలుసా?' అడిగాడు వెట్టి.

తెలియదు బాబు. బురదమీద రాయి వేస్తే తిరిగి మన ముఖంమీదే చిందుతుంది. ఆళ్ళు ఏమైపోతే నీకెందుకు? నువ్వు ముందు కర్నూలు బస్సులో కూర్చో...' ఖచ్చితమైన కంఠంతో చెప్పాడు భద్రయ్య.

మరో సిగరెట్టు తీసుకుని వెలిగించుకున్నాడు వెట్టి. దుకాణం పక్కన నీడలో ఉన్న ఒక చిన్న చెక్కబల్లమీద కూర్చున్నాడు. తన దుకాణం మూసేసి తలుపులకు తాళం పెట్టేశాడు భద్రయ్య.

'నేను ఇంటికెళ్ళిపోతున్నా. నువ్వు బస్సెక్కు. వేరే ఆలోచన చేయకు' అని మరోసారి చెప్పి పెద్దపెద్ద అడుగులతో ఆ వీధి చివరికి వెళ్ళిపోయాడు.

మరో అర నిమిషం ఆగి, నెమ్మదిగా చెక్కబల్ల మీదినుంచి లేచాడు వెట్టి. చివరికంటా కాలిన సిగరెట్ అవతలకి విసిరికొట్టాడు. చకచకా అడుగులు వేస్తూ, ఊరి మధ్యలో నుంచి పోయే నేషనల్ హైవే దగ్గరికి వెళ్ళాలని అతని ఉద్దేశం.

మొదటి రెండు అడుగులు వేస్తూ ఉండగానే తెలిసి వచ్చింది అతనికి. చకాచకా అడుగులు వేయటం కాదు గదా.. నిమిషానికి పది పదిహేను అడుగులు కూడా వేయటం కుదరని పని అని.

దెబ్బ తగిలిన కొద్దిసేపటిలోనే బరువు చేసింది గాయం. కాలు కదలటం చాలా కష్టమైపోతోంది.

'కర్నూలు వెళ్ళటం కూడా సాధ్యపడే పనికాదు. ముందుగా దాని సంగతి తేల్చుకోకపోతే చాలా ప్రమాదం' తనలో తను అనుకుంటూ, అలాగే ప్రయత్నం మీద నడవటం మొదలు పెట్టాడు.

అవతలి వీధిలోనే ఉంటాడు ఒక డాక్టరు. పగలంతా ఏదో హాస్పిటల్లో పనిచేసి సాయంత్రం వేళల్లో ఇంటి దగ్గర ప్రాక్టీసు చేసుకుంటూ ఉంటాడు.

చెమటలు ప్రత్యక్షం అయ్యాయి వెట్టి ముఖం మీద, ఆ డాక్టరు ఉండే వీధి దగ్గరికి పోయేసరికి.

వీధి మొదట్లోనే, ఒక పాతకాలపు ఇంటి ముందున్న అరుగుమీద కూర్చోవలసిన పరిస్థితి వచ్చేసింది.

భద్రయ్య దుకాణంలో నుంచి ఇంకా కొన్ని సిగరెట్లు తీసుకుని ఉంటే చాలా బాగుండేదని అనుకుంటూ, అరుగు మీదనే, గోడకు చేరగిలబడ్డాడు. తెలివి తప్పలేదు గాని, మాగన్నుగా చిన్నకునుకు వచ్చేసింది.

సరిగ్గా ఇరవై రెండు నిమిషాల తర్వాత చటుక్కున వచ్చేసింది మెలకువ. చేయాలని అనుకున్న పని వదిలేసి, నిద్రలోకి జారిపోయినందుకు తనను తనే నిందించుకుంటూ పైకి లేవబోతుండగా, బర్రుమని మోతలు చేస్తూ దూసుకు వచ్చింది ఒక కారు.

అరుగు మీదినుంచి కిందకిదిగే ఆలోచనను వెంటనే వదిలేసి, అలాగే శిలావిగ్రహం మాదిరి కూర్చుండిపోయాడు అతను.

దుమ్ము తెరలు రేపుతూ అతన్ని దాటి మూడు అడుగుల దూరం పోయి, ఉన్నట్లుండి ఆగిపోయింది కారు. రివర్స్ గేరులో స్పీడుగా వెనక్కి వచ్చింది.

'ఎవడ్రా నువ్వు? ఏం చేస్తున్నావిక్కడ?' విండోలో నుంచి తలను బయటికి పెడుతూ కరుకుగా అడిగింది ఒక కంఠం.

ఎండుకుపోయినట్లు తయారయ్యింది వెట్టి గొంతు. నోరు తెరిస్తే మాట బైటికి వస్తుందో రాదో తెలియలేదు అతనికి.

భద్రయ్య దుకాణం దగ్గరే ఉండకుండా పెద్ద పోటుగాడి మాదిరి అక్కడికి వచ్చి, అడ్డంగా దొరికిపోయానేమోనన్న బాధ అతని గుండెల్ని పిండేసింది.

తన కోసమే వెతుకుతున్నట్లున్నారు వాళ్ళు. పట్టిన పట్టు వదలకుండా వీధుల వెంట చెక్కర్లు కొడుతున్నట్టున్నారు.

'ఎవడివిరా నువ్వు? మాట్లాడవేంటి? మాటలు రావా?' మరింత కరుకుగా అడుగుతూ, కార్లో నుంచి దిగకుండానే, ఒక టార్చిలైటు అతనికేసి ఫోకస్ చేశాడు, విండోలో నుంచి తల బయటికి పెట్టిన మనిషి.

భద్రయ్య ఇచ్చిన పాతపంచె మీద పడింది ఫోకస్, మొట్టమొదటిసారిగా. అక్కడినుంచి భుజాల మీద ఉన్న చినుగుల మీదికి ప్రసరించి, చటుక్కున ఆఫ్ అయిపోయింది.

'ఎవడో అడుక్కు తినేవాడన్నా... పగలంతా ఊరెమ్మట తిరిగి తిరిగి ఇక్కడ అరుగుమీద మకాం పెట్టినట్టున్నాడు' ముందు సీట్లో ఉన్న ఎవరికో రిపోర్టు చేశాడు ఆ మనిషి.

గుబగుబలాడుతున్న గుండెల్ని చిక్కబట్టుకుంటూ నిలబడి ఉన్న వెట్టికి మనిషి కనిపించలేదు గాని, మాట మాత్రం వినిపించింది.

'లాభం లేదురా.. వాడు మనకు దొరకడు. నిద్ర చెడగొట్టుకుని తిరగటం దండగ..'

అదే కంఠం.. బాంబులు విసిరించిన కంఠం... నరికి పోగులు పెట్టమని అరిచి కేకలు పెట్టిన కంఠం...

ఎర్రకారం రాసినట్టు ఒక్కసారిగా భగ్గుమంది వెట్టి శరీరం. ఒక్క దుముకులో కారు దగ్గరికిపోయి, ముందు సీట్లో ఉన్న ఆ మనిషిని బర్రున కిందకి లాగి, మెడమీద కాలువేసి తొక్కేయాలన్న కసి మొదలైంది.

అడుగు తీసి అడుగు వేయటానికి ఎంత సమయం పడుతుందో గుర్తుకు వచ్చేసరికి చిటుక్కున మాయమైపోయిందా ఆవేశం.

అతని దగ్గరికిపోయి కారులో నుంచి కిందకి లాగటం సంగతి దేవుడికెరుక. రెండో అడుగు వేయక ముందే కళ్ళు తిరిగి కింద పడిపోకుండా ఉంటే అంతే చాలు.

'అయితే వాడిని వదిలి పెట్టేసినట్టేనా?' అంటూ స్టీరింగ్ దగ్గర ఉన్న మనిషి మాట్లాడటంతో, తన ఆలోచనల్ని తనలోనే అదుముకుని చెవులు రిక్కించాడు.

'వదిలి పెట్టేయటమా? వాడినా? పొరపాటున కూడా జరగదు ఆ పని. వాడి కాళ్ళు చేతులు నరికి పోగులు పెట్టకపోతే ఎలా?' అన్నాడు ముందున్న మనిషి.

'తెల్లవారితే వాడు జలగ మాదిరి జారిపోతాడు. మనకి ఇక కనిపించడు' అన్నాడు స్టీరింగ్ ముందున్న మనిషి.

'మరేం ఫరవాలేదు. వాడు ఎక్కడికీ పోలేడు. ఒకవేళ పోయినా కూడా తప్పించుకోలేడు. బసవప్పకి ఫోన్ చేశాను. తెల్లారేసరికి తన జనాన్ని వెంట బెట్టుకుని వచ్చేస్తానన్నాడు' అన్నాడు ముందు కూర్చున్న మనిషి.

'అయ్యబాబోయ్... బసవప్ప వస్తానన్నాడా? అయితే ఈ ఎదవపని అయిపోయినట్టే.. ఈడు పాతాళలోకంలో దాక్కున్నా బసవప్ప వదిలిపెట్టడు. కాని...' అంటూ మాటల్ని ఆపాడు వెనుక ఉన్న వారిలో ఒకతను.

## అభిమానానికి పరాకాష్ఠ

*తమ అభిమాన హీరోయిన్‌ని చూడడానికి అభిమానులు సహజంగానే పోటీపడతారు. ఈ సందర్భంలో చిన్న చిన్న తోపులాటలూ సహజమే! అయితే ఆ అభిమానం పరాకాష్ఠకి చేరి అభిమాన నటిమీద చేయి వేయడానికి ప్రయత్నిస్తే ఏం జరుగుతుంది? పాపం ఆ నటి అక్కడి నుంచి పారిపోవడం తప్పించి మరో మార్గం ఉండదు కదా! సరిగ్గా ఇదే జరిగింది బాలీవుడ్ హీరోయిన్ పరిణీతి చోప్రా విషయంలో. మొన్నామధ్య గోవా ఎయిర్‌పోర్టులో అభిమానుల వికృత చేష్టలకు భయపడిపోయి దగ్గర్లో ఉన్న రెస్టారెంటులోకి పరిగెత్తి ఓ చోట ఎవరికీ కనపడకుండా దాక్కుందట! ఆ తరువాత సెక్యూరిటీ వారి సహాయంతో అక్కడనుంచి బతుకుజీవుడా అనుకుంటూ బయటపడిందట! ఆ సంఘటన తలుచుకుంటూంటే ఇప్పటికీ భయం వేస్తోంది అంటూ ఓ ఇంటర్వ్యూలో చెప్పుకొచ్చింది పరిణీతి.*



## కథ కూడా అడగడట!



ఒక్కో హీరోకి ఒక్కో దర్శకుడి మీద నమ్మకమే కాదు ప్రేమ కూడా ఎక్కువగానే ఉంటుంది. అలాంటి ప్రేమ, నమ్మకం తనకు పూరీ మీద ఉన్నాయి అంటున్నాడు జగపతి బాబు. రెండో ఇన్నింగ్స్‌లో విలన్ పాత్రలతో మంచి గుర్తింపు తెచ్చుకున్న జగపతిబాబుకు పూరీ జగన్నాథ్ మీద బోలెడంత నమ్మకమట! తన సినిమాలో నటించమంటే కథ కూడా అడగకుండా వెంటనే ఓకే చెప్పేస్తానంటున్నాడు.

'ఏంటిరా నీ అనుమానం?' విసుగునిండిన కంఠంతో అడిగాడు ముందు కూర్చున్న మనిషి.

'గ్రానైట్ మైన్స్‌లో పనిచేసేవోళ్ళని ఎక్కువ డబ్బులు ఇస్తామని చెప్పి వెంటబెట్టుకు వెళ్ళటం బసవప్ప ఉద్యోగం. తనతో వెళ్ళినవాళ్ళు, తిరిగి ఇళ్ళకి వచ్చిన వైనాలు ఏమీ లేవు. మందుపాతరలు పెట్టి బండల్ని పగలగొట్టేటప్పుడు దెబ్బలు తగిలి గుటుక్కుమన్నారో లేక వాళ్ళు పెట్టే తిండి సరిపోక, ఆకలిచావులు చచ్చారో ఎవరికీ తెలియదు' అన్నాడు వెనుక ఉన్న మనిషి.

'ఎట్టా చస్తే మనకెందుకురా? తీసుకుతీసుకు చావటం మనకి కావాలి. సర్వనాశనం అయిపోవటం కావాలి. ఆడు చచ్చి శవమైపోయాడన్న మాట వింటే గాని నా కచ్చతీరదు' పళ్ళు పటపటలాడిస్తూ చెప్పాడు ముందు కూర్చున్న మనిషి.

'మనం డైరెక్టుగా చూశాము కాబట్టి గుర్తుపట్టగలం. మరి బసవప్ప ఎలా గుర్తుపడతాడు?' అడిగాడు వెనక ఉన్న మనిషి.

'అదంతా మనకి అనవసరం. అవన్నీ తాను చూసుకుంటాడు. మనం చేయవలసింది చేసేశాం. ఇక్కడ ఉన్న అతని ఏజెంటుకి డబ్బు ఇచ్చి, పేరు చెప్పాం కదా! అది చాలు. పదండిపోదాం' అన్నాడు ముందు కూర్చున్న మనిషి.

అన్నిమాటలు మాట్లాడిన ఆ మనిషి ముఖాన్ని మాత్రం చూడలేక పోతున్నందుకు తనమీద తనే చిరాకుపడ్డాడు వెట్టి.

అతను చూస్తూ ఉండగానే కదిలి వేగంగా వెళ్ళిపోయింది కారు.

నిజమైన యాచకుడి మాదిరి చేతులు కట్టుకుని నిలబడి ఉన్న వెట్టి, పాదాల్లో శక్తి నశించిపోయినట్టు అరుగుమీద చతికిలపడ్డాడు.

●●●

'వచ్చేశాడా? ఆ బసవప్ప నిజంగానే నీ కోసం వచ్చేశాడా?' సస్పెన్స్ భరించలేక పోతున్నట్లు ఆత్రుతగా అడిగింది ప్రణవి.

'ఈసారి వెట్టి కంటే ముందుగానే అతని అవసరం గమనించి ఇంకో గ్లాసుతో మంచినీళ్ళు అందించింది ప్రత్యూష.

గ్లాసు తిరిగి ఆమెకి అందించి, తడి పెదవుల్ని అరచేత్తో అద్దుకున్నాడు అతను. 'తెల్లవారేవరకు నేను అరుగు మీదినుంచి కదలలేకపోయాను. కాలు విపరీతమైన పోటు ప్రారంభించింది. ఉదయం ఐదుగంటలకే డాక్టరు దగ్గరికి పోయి ఆయన్ని బలవంతంగా నిద్రలేపాను. పోటు తగ్గటానికి ఏదో ఇంజక్షన్ చేసి, తను పనిచేసే హాస్పిటల్‌కి రమ్మని చెప్పాడు. తొమ్మిది అయ్యింది ఆయన హాస్పిటల్‌కి వచ్చేసరికి' అంటూ ఆగాడు వెట్టి.

'అడుక్కు తినేవాడి వేషంలో ఉన్న నిన్ను బసవప్ప గుర్తుపట్టటం చాలా కష్టం. అసలు వాడికి నీపేరు తప్ప మిగిలిన వివరాలు తెలియవు. తెలిసే అవకాశాలు ఏమీలేవు' నిమ్మళంగా అంది ప్రణవి.

బరువుగా నవ్వి తల అడ్డం తిప్పాడు వెట్టి. 'సరాసరి నా గదికి పోయాట్ట బసవప్ప. అక్కడి నుంచి భద్రయ్య...' అన్నాడు.

'వాడి ఎంక్వైరీ అక్కడితో ఆగిపోయి ఉంటుంది. భద్రయ్య నీ ఫ్రెండు. నీ మేలు కోరేవాడు. ఖచ్చితంగా వాళ్ళని తప్పుదోవ పట్టించి ఉంటాడు' మళ్ళీ తన అభిప్రాయం వెల్లడించింది ప్రణవి.

ఇంకోసారి తల అడ్డం తిప్పాడు వెట్టి.

'వాళ్ళని తప్పుదోవ పట్టించే అవకాశం భద్రయ్యకి లభించలేదు. దుకాణం వెనకాల చూసిన బసవప్ప మనుషులకి నేను వదిలివేసిన మురికిదుస్తులు కనిపించాయి. భద్రయ్య ఇచ్చిన డెట్టాల్ సీసా కూడా అక్కడే పడేశాను. దాన్ని చూడగానే వాళ్ళకి తెలిసిపోయింది, మనకి బలమైన దెబ్బ తగిలినట్టు...' ముఖాన్ని అరచేత్తో రుద్దుకుంటూ అన్నాడు అతను.

'పాపం భద్రయ్య... సమాధానం చెప్పుకోవటానికి చాలా బాధలు పడి ఉంటాడు' అన్నది అప్పటి వరకూ మౌనంగా ఉన్న శివారెడ్డి భార్య.

'నిజం చెపితే ఇబ్బంది పెట్టటం జరగదని చెప్పి ఉంటారు. దాంతో తన దుకాణం దగ్గర జరిగింది మొత్తం బయటపెట్టేశాడు అతను. ఆ మాటల్ని పట్టుకుని వాళ్ళు పక్కవీధిలో డాక్టర్‌ను ట్రేస్ చేశారు. అతనితోపాటు అతని కారులోనే హాస్పిటల్‌కి వచ్చేశారు. కన్నంలో తేలుకుట్టిన దొంగ మాదిరి దొరికిపోయాను నేను' చెప్పాడు వెట్టి.

'అంత తేలికగా ఎలా దొరికిపోయావు? ఏం అధికారం ఉంది వాళ్ళకి పట్టపగలు నిన్ను పట్టుకోవటానికి? చంపుకోవటం నరుక్కోవటం అయితే చిటుక్కున పని పూర్తి చేసుకుని పారిపోవచ్చు. కానీ పదిమంది చూస్తుండగా ఒక మనిషిని, అందులోను నీవంటివాడిని కిడ్నాప్ చేయటం సాధ్యపడే పనేనా?' ఆవేశంగా అడిగింది ప్రణవి.

'వాళ్ళు నన్ను మీరు అనుకుంటున్న పద్ధతిలో కిడ్నాప్ చేయలేదు. చాలా నేర్పుగా తెలివిగా వల విసిరారు' అన్నాడు వెట్టి.

'చెప్పు... ఎలా జరిగింది అది? ఏ విధంగా జరిగింది?' కుతూహలం అధికం అయిపోతూ ఉండగా ముందుకు వంగుతూ అడిగింది ప్రణవి.

●●●

'ఏమయ్యా, ఎంతసేపైంది వచ్చి? ఎలా ఉంది నొప్పి?' తనను చూడగానే విజిటర్స్ హాల్లో కూర్చుని ఉన్న వెట్టి లేచి నిలబడుతుంటే సాదరంగా అడిగాడు డాక్టరు.

ఇంజక్షన్ చేసిన అరగంటకు తగ్గుముఖం పట్టిన నొప్పి, తిరిగి స్టార్ట్ అవుతున్న లక్షణాలు కనిపిస్తున్నట్టు చెప్పబోయాడు వెట్టి.

'నో ప్రాబ్లమ్... ఒక్క పది నిమిషాలు వెయిట్ చేయి.. డ్రెస్సింగ్ మార్చి ఇంకో మెడిసిన్ ఇస్తాను. సాయంత్రానికి తగ్గిపోతుంది' అతని భుజం మీద చెయ్యివేస్తూ అన్నాడు డాక్టరు.

మాటలు తనకు చెప్పినా అతని చూపు మాత్రం హాస్పిటల్ ముఖద్వారంవైపు ఉండటం కొంచెం ఆశ్చర్యం అనిపించింది వెట్టికి.

డాక్టరు లోపలికి పోయిన వెంటనే తను అప్పటి వరకు కూర్చుని ఉన్న ప్రదేశాన్ని వెకేట్ చేసేశాడు అతను. ముఖద్వారం కనిపించని మూలకి పోయి నిలుచున్నాడు.

అతనికి మాట ఇచ్చినట్టే పది నిమిషాల తర్వాత అతని రూమ్‌లోంచి బైటికి వచ్చింది ఒక నర్సు. అంతకుముందు వరకూ అతను కూర్చుని ఉన్న కుర్చీ దగ్గరికి వచ్చి చుట్టూ చూడటం మొదలు పెట్టింది.

ఎందుకో తెలియలేదుగాని, అర్జంటుగా ఆ హాస్పిటల్లో నుంచి బైటికి వెళ్ళిపోవటం చాలా మంచిదని అనిపించింది వెట్టికి.

కాలు సహకరించక పోవటంవల్ల ఆగిపోయాడు. తాను ఎంచుకున్న ప్రదేశంలో నుంచి, అటూ ఇటూ చూస్తున్న నర్సు దగ్గరికి పోయాడు.

'కాలికి దెబ్బ తగిలించుకున్నది నువ్వేనా? ఎక్కడికి పోయావు? అరగంటనించీ వెతుకుతున్నా నీకోసం' తీవ్రంగా చూస్తూ అరిచినంత పని చేసింది ఆ నర్సు.

సూది కిందపడినా పెద్దగా వినిపించేటంత నిశ్శబ్దంతో నిండి ఉన్న ఆ ప్రదేశంలో ఆమె అంత బిగ్గరగా మాట్లాడటం నచ్చలేదు వెట్టికి.

'నేను చూస్తూనే ఉన్నాను తల్లీ. నువ్వు వచ్చి రెండు నిమిషాలు కూడా కాలేదు' అన్నాడు సీరియస్‌గా.

"సరేలే... మాటలు బాగానే చెపుతున్నావు.. పద పద" అంటూ డాక్టర్ గదివైపు నడిచింది ఆమె.

భుజం మీదినుంచి ముఖద్వారంవైపు చూశాడు వెట్టి. ఎవరో ఇద్దరు పేషంట్లుతప్ప వేరేవిధంగా ఉన్న వారెవరూ కనిపించలేదు.

తను అనవసరంగా కంగారు పడటం జరుగుతున్నదేమోనన్న అనుమానం కూడా కలిగింది అతనికి.

'రావయ్యా బాబూ... పెళ్ళికొడుకు మాదిరి అడుగులు లెక్కబెట్టుకుంటూ వస్తున్నావ్.. నేను ఇంకా పాతికమంది పేషంట్లను చూడాలి.' విసుగ్గా అంటూ అతన్ని ఎగ్జామినేషన్ టేబిల్ మీద పడుకోబెట్టాడు డాక్టరు.

పక్కనే ఉన్న ఒక స్టాండుమీద లోడ్ చేసి సిద్ధంగా ఉన్నది ఒక సిరంజి. అదేమిటని అడిగే అవకాశం వెట్టికి లభించలేదు. అతని చినుగుల పంచెను పక్కకు కూడా తొలగించకుండా గబుక్కున పొడిచేశాడు డాక్టరు.

(ఇంకా వుంది)




## బామ్మల రెస్టారెంట్

ఎంతైనా ఇంట్లో పెద్దవాళ్ళ చేతిరుచే వేరు. వాళ్ళు వంట చేస్తున్నారంటే లొట్టలేసుకుంటూ ఆరగించాల్సిందే! ఇదే కాన్సెప్ట్‌ని తన వ్యాపారంగా మార్చుకున్నాడు జోడీ స్కారావెల్లా. ఏకంగా గ్రాండ్‌మాస్ రెస్టారెంట్ ప్రారంభించేశాడు.

న్యూయార్క్‌కి చెందిన జోడీ స్కారావెల్లా ఎనోటెకా మారియా పేరిట రెస్టారెంట్ ప్రారంభించాడు. దీని ప్రత్యేకత ఏమిటంటారా? ఇందులో వంటచేసే చెఫ్‌లందరూ బామ్మలే మరి! జోడీ అమ్మమ్మ, తల్లి, చెల్లి ఓ ప్రమాదంలో చనిపోవడంతో, వారు లేనిలోటు తీర్చుకోవడానికే ఈ రెస్టారెంట్ ఆలోచన చేశాడు జోడీ! ఆలోచన వచ్చిందే తడవుగా, ఓ న్యూస్ పేపర్లో 'ప్రాంతీయ వంటకాలు తయారు చేయడానికి మహిళలు కావలెను' అని ప్రకటన వేయించాడు. తర్వాత ఇతర దేశాలకు చెందిన బామ్మలకు చెఫ్‌లుగా అవకాశం కల్పించాడు. ఇప్పుడు ఈ రెస్టారెంట్‌కి న్యూయార్క్ లోనే కాదు ప్రపంచవ్యాప్తంగా అభిమానులు ఉన్నారు. బామ్మల రెస్టారెంట్ బహుపసందుగా ఉంది కదూ!



## కూర్చునే క్యూ

రైల్వేస్టేషన్లో టికెట్ కొనాలంటే క్యూ, హాస్పిటల్లో డాక్టర్ని కలవాలంటే క్యూ, సినిమాహాల్లోకి ఎంటరవ్వాలన్నా క్యూ....అక్కడే కాదు మార్కెట్లలో, షాపుల్లో, కార్యాలయాల్లో ఎక్కడచూసినా చాంతాడంత క్యూ. ఆ క్యూలో నిల్చొని నిల్చొని విసుగు, కోపం వస్తుంది. తద్వారా కీళ్ళనొప్పులు, ఒళ్ళునొప్పులు... అయితే క్యూలో నిలబడాల్సిన పనిలేకుండా జపాన్ కంపెనీ ఓ సరికొత్త టెక్నాలజీ రూపొందించింది.

గంటలతరబడి క్యూలో నిల్చొనేవారి కోసం జపాన్ ఆటోమొబైల్ కంపెనీ నిస్సాన్, సెల్ఫ్ డ్రైవింగ్ కుర్చీలు రూపొందించింది. దీంతో క్యూలో నిలబడాల్సిన పనిలేదు. ఓ కుర్చీలో కూర్చుంటే చాలు, అదే మిమ్మల్ని గమ్యస్థానానికి చేరుస్తుంది. ఈ కుర్చీల్లో కూర్చోగానే క్యూలైన్లలో వరుసగా వాటంతటవే కదులుతూ మనల్ని ముందుకు తీసుకెళ్తాయి. మనం చేరాల్సిన ప్రాంతానికి చేరుకుని, అందులోంచి లేవగానే, ఆ ఖాళీ కుర్చీ దానంతటదే వరుసలో చివరికి వెళ్తుంది. అటానమస్ టెక్నాలజీతో వీటిని రూపొందించారు. జపాన్‌లో ఎంపిక చేసిన రెస్టారెంట్ల వద్ద వీటిని పరీక్షించనున్నట్లు కంపెనీ వెల్లడించింది. ఈ కొత్త టెక్నాలజీతో ఇక క్యూల్లో వేచిఉండే వారి బాధలు తొలగనున్నాయి.



## గాలివాటం ఇల్లు

చెట్లపై ఇళ్ళు, తిరగబడిన ఇళ్ళు, గుహల్లో ఇళ్ళు, క్యారవాన్‌లు... ఇలాంటి కాన్సెప్ట్‌లన్నీ తెలిసినవే! కానీ గాలి ఎటువీస్తే అటువైపు తిరిగే ఇంటిని ఎప్పుడైనా చూశారా? కనీసం విన్నారా? లేకపోతే ఈ రియాక్టర్ గురించి తెలుసుకోవాల్సిందే!

అలెక్స్ షెవెదర్, వార్డ్‌షెల్లీ ఇద్దరూ కలిసి గాలి ఎటువస్తే అటువైపే తిరిగే ఒక అద్భుతమైన ఇంటిని రూపొందించారు. గృహనిర్మాణాలు చేయడంలో సిద్ధహస్తులైన వీరిద్దరూ ఇప్పటివరకు విభిన్న రకాల నిర్మాణాలను ఆవిష్కరించారు.



అంతరిక్షంలో భారరహిత స్థితిలో తేలియాడే వస్తువుపై ఉంటే ఎలాంటి ప్రభావం ఉంటుంది? అనే ఆలోచనే ఈ ఇంటి నిర్మాణానికి స్ఫూర్తినిచ్చింది. ఈ ఇంటికి ముద్దుగా రియాక్టర్ అని పేరు పెట్టుకున్నారు. న్యూయార్క్‌లోని గెంట్‌లో ఉన్న ఓమి ఇంటర్నేషనల్ ఆర్ట్స్ సెంటర్‌లో ఒక పెద్ద గుండ్రటి సిమెంట్ పిల్లర్‌పై ఎనిమిది అడుగుల ఎత్తులో ఈ ఇల్లు నిర్మించారు. అలెక్స్ షెవెదర్, వార్డ్‌షెల్లీ ఇద్దరూ ఆ ఇంట్లో ఐదు రోజులు గడిపి అందరినీ ఆశ్చర్యచకితుల్ని చేశారు. ఇది కేవలం గాలికి తిరగడమే కాదు... నడుస్తున్నప్పుడు, సందర్భాన్ని బట్టి వారి బరువుకు తగినట్టుగా వంగిపోవడం కూడా జరుగుతోంది. తిరిగే ఇంటిని మీరు కూడా చూడాలనుకుంటున్నారా? అయితే అమెరికా వెళ్ళాల్సిందే!

## యోగాతో అల్లరికి చెక్

స్కూల్లో పిల్లలు అల్లరి చేస్తే తిట్టడమో, కొట్టడమో చేస్తారు. మరీ శృతిమించితే పేరెంట్స్ మీటింగ్ ఏర్పాటు చేస్తారు. కానీ అమెరికాలోని ఓ స్కూల్లో మాత్రం అల్లరి చేసే పిల్లలను ఓ ప్రత్యేకగది లోకి పంపిస్తారు. ఆ గదిలో ఏం చేస్తారు? పిల్లల్ని వీరబాదుడు బాదేస్తారనుకుంటున్నారేమో! కాదండీ. ఆ గదిలో చక్కగా వారి చేత యోగా చేయిస్తారు. ఆశ్చర్యపోతున్నారా!

అమెరికా, మేరీల్యాండ్‌లోని బాల్టిమోర్‌లో రాబర్ట్ డబ్ల్యూ కోలెమాన్ ఎలిమెంటరీ స్కూల్లో అల్లరి చేసే విద్యార్థుల కోసం ప్రత్యేకంగా ఓ గది ఏర్పాటు చేశారు. ఆ గదిలోకి వెళ్ళగానే మెత్తటి మ్యాట్‌లు స్వాగతం పలుకుతాయి. అల్లరి చేసేవారిని, టీచర్ల మాట విననివారిని, ఇచ్చిన పని చేయనివారిని ఆ గదిలోకి పంపించి యోగా చేయిస్తున్నారు. దీనిద్వారా విద్యార్థులు ఒత్తిడి అధిగమించడంతో పాటు, అల్లరి తగ్గుతుందని చెబుతోంది పాఠశాల యాజమాన్యం.



విద్యార్థుల్లో చాలావరకు మార్పు కనిపిస్తోందని నిర్వాహకులు చెబుతున్నారు. అల్లరి చేసేవారే కాదు... ఒత్తిడికి గురైన విద్యార్థులకు కూడా యోగా చేసుకునే అవకాశం కల్పిస్తున్నారు. భలేఉంది కదూ యోగా గది!

-నర్మద వాసిరెడ్డి



# గేమ్ ఆఫ్ లైఫ్

-కంఠంనేని రాధాకృష్ణమూర్తి 18

**జీవితంలో మనిషి రకరకాల క్లిష్టమైన, ఇబ్బందికరమైన పరిస్థితులనుంచి ప్రయాణం సాగించాల్సివస్తుంది. అలాంటి సందర్భాల్లో మనిషి వ్యక్తిత్వంలోని 'స్థితప్రజ్ఞత' ఎంతో ఉపకరిస్తుంది.**

**స్థితప్రజ్ఞత అంటే నిబ్బరంతో కూడుకున్న హుందా ప్రవర్తన. ధీరగుణం. ఆంగ్లంలో Assertiveness అంటారు.**

ఎలాంటి పరిస్థితులు ఎదురైనా, మనం ఎలా ఫీలవుతున్నామో, ఫలితం ఎలా ఉండాలని కోరుకుంటున్నామో ఎదుటివాళ్లకు స్పష్టంగా తెలియజేయటం Assertiveness.

## స్థితప్రజ్ఞత

అలా తెలియజేయాలంటే ముందు మన గురించి మనకు స్పష్టమైన అవగాహన ఉండాలి. మనం ఏమి ఫీలవు తున్నామో, ఏమి జరగాలని కోరుకుంటు న్నామో మనకు స్పష్టంగా తెలిసి ఉండాలి.

అలాగే అవతలివాళ్ళు ఏమి ఫీలవుతున్నారో, ఏమి జరగాలని కోరుకుంటున్నారో తెలియజేసే అవకాశం వాళ్ళకు కూడా ఇవ్వటం అసెర్టివ్‌నెస్.

వాళ్ళ అభిప్రాయం అర్థం చేసుకున్నామని తెలియజెపుతూనే మన అభిప్రాయం స్పష్టంగా, నిర్మొహమాటంగా తెలియజెప్పటమే అసెర్టివ్‌నెస్.

ఇలాంటి హుందాతోకూడిన ప్రవర్తన సమాజంలో రాణింపు, విజయసాధనకు ఉత్తమోత్తమ మార్గం.

ఏ మనిషిలోనైనా స్థితప్రజ్ఞత నాలుగు మూల స్తంభాలపై నిలబడి ఉంటుంది. అవి:

1. మన మీద మనకు ఉన్నత అభిప్రాయం ఉండాలి. అంటే సెల్ఫ్-ఎస్టీమ్ పటిష్టంగా ఉండాలి.
2. ఏ సిచ్యుయేషన్‌లో ఉన్నప్పటికీ, మన ఫీలింగ్స్ ఏమిటో, ఏం చేయాలనుకుంటున్నామో స్పష్టంగా తెలిసి ఉండాలి. Self Knowledge.
3. ఎదుటివారి అభిప్రాయాల్ని మన్నించగల సౌహార్ద్రత ఉండాలి. అంటే అవతలివాళ్ళ అనుభూతులు, అవసరాలు, వాళ్ళు చెప్పేదీ జాగ్రత్తగా వినాలి.
4. అరమరికలు లేని కమ్యూనికేషన్ చేయగలిగి ఉండాలి. అవతల మనిషి ఫీలింగ్స్, కోరికలు మనం అర్థంచేసుకున్నట్టు వారికి తెలిసేట్టు చేస్తూనే, మనం ఏమనుకుంటున్నామో కూడా ఎదుటివారికి స్పష్టంగా చెప్పాలి.

ఈ నాలుగు స్తంభాలమీద 'అసెర్టివ్‌నెస్' అనబడే ప్రవర్తనా కట్టడం లేక 'స్థితప్రజ్ఞత' అనబడే మనో నిబ్బరం స్థిరంగా నిలబడి ఉంటుంది.

### ఉపయోగాలు

స్థితప్రజ్ఞత వల్ల ఈ కింది ప్రయోజనాలు కలుగుతాయి.



- ఇబ్బందికర పరిస్థితులు, తిక్కమనుషుల్ని (Diffcult People) సమర్థంగా హ్యాండిల్ చేయగలుగుతాం.
- మరింత సెల్ఫ్-కాన్ఫిడెన్స్‌తో ఉండగలుగుతాం.
- మన అవసరాలు, హక్కులు మనకు స్పష్టంగా తెలిసి ఉంటాయి.
- ఇతరులు చెప్పినదానికి గంగిరెద్దులా తల ఊపకుండా మనం ఏం జరగాలని కోరుకుంటున్నామో వాళ్ళకు స్పష్టంగా తెలియజెప్పగలుగుతాం.
- మన ఫీలింగ్స్ అవతలివాళ్ళకు చెబుతాం కాబట్టి రిలాక్స్‌డ్‌గా ఉండగలం.
- ఇతరులకు మనం ఇచ్చే స్థానం ఏమిటో, వాళ్ళ స్థానం ఏమిటో, ఎక్కడో తెలియటంవల్ల వాళ్ళు మర్యాదగా మెలుగుతారు.
- మన అవసరాలు ఇతరుల అవసరాలమధ్య ఘర్షణ లేకుండా బ్యాలెన్స్ పాటించగలుగుతాం. దాని వల్ల మనపట్ల గౌరవభావం ఏర్పడుతుంది.

ఏతావాతా మన ప్రవర్తన హుందాగా ఉంటుంది.

అసెర్టివ్‌నెస్‌ని సందర్భోచిత ప్రవర్తన అని కూడా చెప్పవచ్చు. అంటే,

కోపం తెచ్చుకోవాల్సిన సందర్భంలో కోపంగా ప్రవర్తించటం, లేని సమయంలో సౌమ్యంగా ప్రవర్తించటం తెలిసి ఉండటమే స్థితప్రజ్ఞత.

మనుషులలో ముఖ్యంగా మూడు రకాల ప్రవర్తనలు కనిపిస్తాయి.

1. దుడుకు ప్రవర్తన. Agressive Behaviour. ప్రతి సందర్భంలోను కయ్యానికి కాలు దువ్వే ప్రవర్తన.
2. మెతక ప్రవర్తన. Passive Behaviour. పారిపోయే ప్రవర్తన. 'ఎవరి పాపానికి వాళ్ళే పోతారు, ఎలాగోలా చావనీ..' అనే ధోరణి. ప్రతి విషయంలో రాజీపడే ప్రవర్తన.
3. పైన చెప్పిన రెండింటికీ మధ్యేమార్గం ఈ స్థిత ప్రజ్ఞత Assertive Behaviour. సమయోచితంగా సందర్భోచితంగా ఉంటూ హుందాతనం ఉట్టిపడే ప్రవర్తనన్నమాట. వీటికి ఒక ఉదాహరణ:

రష్‌గా ఉన్న రెస్టారెంట్‌లో మన ఎదురుగా కూర్చున్న ఇద్దరువ్యక్తులు వాదోపవాదాల్లో ఉంటారు. కొంతసేపటికి కాలర్లు పుచ్చుకుని కొట్టుకునే స్థితికి వస్తారు.

వాళ్ళ సంభాషణ వింటున్నప్పుడు వాళ్ళలో ఒక వ్యక్తి అన్యాయంగా ప్రవర్తిస్తున్నాడనిపిస్తుంది. అప్పుడు మీరేం చేస్తారు?

1. అన్యాయంగా ప్రవర్తించే వ్యక్తితో అతనిది తప్పని చెబుతూ జగడంలో పాలుపంచుకోవడం 'అగ్రెసివ్ ప్రవర్తన'.
2. మనకెందుకొచ్చిందిలే అని అక్కడినుంచి వెళ్ళిపోవడం 'పాసివ్ ప్రవర్తన'.
3. అలాకాకుండా, ఇద్దరికీ సర్దిచెప్పి వాళ్ళను చెరో

వైపు పంపే ప్రయత్నం చేయడం 'అసెర్టివ్ ప్రవర్తన'.

ఈ మూడు రకాల ప్రవర్తనల్నీ మరింత వివరంగా పరిశీలిద్దాం.

## దుడుకు ప్రవర్తన

మన అభిప్రాయాలు, అనుభూతులను ఎదుటి వారికి మొహం మీద గుద్దినట్టు చెప్పటం అగ్రెసివ్ ప్రవర్తన. అంటే, బెదిరించినట్టు, శిక్షిస్తున్నట్టు, కిందపడేసి గొంతుమీద కూర్చున్నట్టుగా ఉంటుందీ ప్రవర్తన.

కావాలనుకున్నదాన్ని ఏ రకంగానైనాసరే పొందటానికి చేసే ప్రయత్నమిది.

ఒకళ్ళ గురించి వ్యంగ్యంగా, చులకనగా మాట్లాడటం, పుకార్లు వ్యాప్తి చేయటం, కులపరంగానో, జాతిపరంగానో ఇన్సల్ట్‌చేసి మాట్లాడటం...ఇవన్నీ అగ్రెసివ్ ప్రవర్తనలోని మూడు రూపాలు.

ఈ విధంగా ఎదుటివాళ్ళనుంచి మనం పొందాలనుకున్నది పొందామనుకోండి, అవతలివారిలో మనపట్ల ఓటమి భావన, చెడు ఫీలింగ్ ఏర్పడుతుంది. అప్పటినుంచీ వాళ్ళిక మనతో ఎడంగా ఉండే ప్రయత్నం చేస్తారు. ఒకోసారి మనమే గిల్టీగా ఫీలవుతాం.

అగ్రెసివ్‌గా ఉండేవాళ్ళ బాడీలాంగ్వేజ్ ఇలా ఉంటుంది.

- ఇతరులకు మరీ దగ్గరగా నిలబడతారు.
- అవతలివాళ్ళు కూర్చుంటే వాళ్ళు నిలబడి మాట్లాడతారు.
- వేలు చూపించి బిగ్గరగా మాట్లాడతారు.
- మధ్యమధ్యలో ఎదుటివారి భుజాలు తడుతూనూ ఉండవచ్చు.

వాళ్ళ మాటల ధోరణి ఎలా ఉంటుందంటే?

"ఈ పని చేయి!"

'చేయమన్నానా లేదా?"

"నీకు. మరీ పొగరెక్కింది..."

"చెప్పాక కూడా ఎందుకు చేయలేదు?"

ఈ రకంగా ఉంటుంది.

పొలిటీషియన్లలో అగ్రెసివ్ ప్రవర్తన ఎక్కువ. అలాంటివాళ్ళే ఎక్కువ సందర్భాల్లో మాట మీద నిలబడకుండా, ఇతరుల మీద నెపం నెట్టే ప్రయత్నం చేస్తారు. ఆత్మగౌరవం ఉన్నవాళ్ళకు ఈ ప్రవర్తన కొంత ఇబ్బందికరం.

అగ్రెసివ్‌గా ఉండటం అంటే ఆ మనిషి జీవితంలో ఎక్కడో ఏదో లోపం ఉందనేందుకు సూచన.

జీవితంలో అనుకున్నది అనుకున్నట్లు జరగకపోవటం, ఓటమిలాంటి నిరాశా నిస్పృహల అనుభూతులతో కొట్టుమిట్టాడేవాళ్ళే ఎక్కువగా చిరాకు, కోపతాపాలతో అగ్రెసివ్‌గా ప్రవర్తిస్తారు.

ఒకవేళ మీరు అగ్రెసివ్‌గా ఉన్నట్టు మీకు అనిపిస్తే, మీలోని ఏ చెడుఫీలింగ్స్‌ని ఇతరులమీద ఎందుకు ప్రొజెక్ట్ చేస్తున్నారో, మీ జీవితంలో ఎక్కడ ఏ లోటు జరిగిందో విశ్లేషించుకోవటానికి ప్రయత్నించండి.

## మెతక ప్రవర్తన

ఇన్‌ఫీరియారిటీ ఫీలయ్యేవాళ్ళలో ఎక్కువ మెతక ప్రవర్తన ఉంటుంది. వాళ్ళలో సెల్ఫ్-ఎస్టీమ్, సెల్ఫ్ కాన్ఫిడెన్స్, రెండూ తక్కువగానే ఉంటాయి. తమ గురించి తక్కువ అంచనా వేసుకుంటారు. ఇతరులదృష్టిలో పడేంత Worth తమలో లేదనట్టు ఫీలవుతారు. ఇలాంటివారు తమకు కావాలనుకున్న దాని గురించి ఇతరులకు చెప్పరు. అడక్కుండానే ఇతరులు తమ అవసరాలు తీర్చాలని కోరుకుంటారు.

వాళ్ళ అవసరాలేమిటో తెలియకపోవటంవల్ల ఇతరులు కూడా (అంటే ఆత్మీయులు, అయిన వాళ్ళు) వాళ్ళను పట్టించుకోరు.

దానితో అవసరాలు తీరక వాళ్ళు కోపంతో లోలోపల కుతకుతలాడిపోతుంటారు.

**వాళ్ళ బాడీ లాంగ్వేజ్ ఎలా ఉంటుందంటే-**

- కూర్చోవాలావద్దా, నిలబడాలావద్దా అన్నట్లు సందేహంగా ప్రవర్తించటం.
- తల వంగిపోయి గాని, పక్కకు ఒరిగి గానీ ఉంటుంది.
- ఒక కాలిమీంచి మరో కాలిమీదికి శరీరం బరువు మాటిమాటికీ మారుస్తూ ఉంటారు.
- ఎదుటివాళ్ళ కళ్ళలోకి సూటిగా చూడలేరు.
- నెర్వస్‌గా దగ్గటం లేక గుటకలు మింగుతారు.
- మాటిమాటికీ చూపులు పక్కకు తప్పిస్తారు.

వాళ్ళ మాట ధోరణి ఎలా ఉంటుందంటే,

"కొంచెం ఈ పని చేసి పెడతావా?"

"సారీ..."

"అసలేం జరిగిందంటే.."

"పొరపాటైపోయింది. ఏమీ అనుకోకు"

ఇలాంటి ప్రవర్తన గలవాళ్ళు ఇతరులకు ఏమీ చెప్పకపోవటంవల్ల వాళ్ళ అవసరాలు తీరకుండానే మిగిలిపోతుంటాయి. దాంతో వాళ్ళు పైకి ఎంతమర్యాదగా, అణకువగా ప్రవర్తిస్తున్నప్పటికీ, దిగమింగుకున్న ఆ కోపమంతా ఒక్కసారిగా పెల్లుబికి ఏ క్షణానో వాళ్ళు ఇతరుల మీద గావుకేకలు పెట్టే అవకాశం ఉంది.

అయితే ఇక్కడొక సంగతి చెప్పుకోవాలి.

ఏ మనిషీ అన్ని సందర్భాల్లోనూ అగ్రెసివ్‌గానో అన్ని సందర్భాలలోనూ పాసివ్‌గానో ఉండడు, ఉండలేడు. ఎక్కువ సందర్భాల్లో అతనుండే తీరును బట్టే ఆ వ్యక్తి ప్రవర్తనను అగ్రెసివ్‌గానో పాసివ్‌గానో చెప్పుకోవాలి.

ఇప్పుడు వీటికంటే ఉత్తమోత్తమ ప్రవర్తన - 'స్థితప్రజ్ఞత' గురించి మళ్ళీ చూద్దాం.



**దుడుకు స్వభావం, మనకు ఎందుకులే అనే భావన, స్థిత ప్రజ్ఞత.. ఇవన్నీ వ్యక్తిత్వాన్ని ప్రతిబింబించే రకరకాల మనుషుల ప్రవర్తనలే. ఈ ప్రవర్తనే ఆ మనిషిని ఉత్తమోత్తముడిగానో, అధముడిగానో తీర్చిదిద్దుతుంది. ఈ మూడు ప్రవర్తనలలో స్థితప్రజ్ఞతే ఉత్తమోత్తమమైనది. ఇలాంటి ప్రవర్తనను మనం అలవర్చుకోవాలంటే ఏం చేయాలి? అసలు ఈ మూడు ప్రవర్తనలలో ఉండే లోటుపాట్లు ఏమిటి?**

## స్థితప్రజ్ఞత

స్థితప్రజ్ఞత (Assertive Behaviour) వల్ల మనకు కావాల్సిన వాటిని కావాల్సిన విధంగా జరిగేట్లు చూస్తాం. దీనివల్ల మనలో ఆటోమాటిక్‌గా కాన్ఫిడెన్స్, మానసిక ఆరోగ్యం మెరుగవుతుంది.

స్థితప్రజ్ఞత అంటే పాజిటివ్ ప్రవర్తన.

పాజిటివ్ ప్రవర్తనవల్ల ఎక్కువ సందర్భాలలో ఫలితాలు మనకు అనుకూలంగా ఉంటాయి. మన Self Worthమీద మనకు నమ్మకం పెరుగుతుంది. దానితో ఆందోళన, డిప్రెషన్‌లాంటి వాటికి దూరంగా ఉండగలుగుతాం.

ఎంత స్థిత ప్రజ్ఞతగా ప్రవర్తించగలిగితే అంతగా దుడుకు (Aggressive) ప్రవర్తనకు దూరంగా ఉండగలుగుతాం.

నిస్పృహలోంచి పుట్టుకొచ్చేది అగ్రెసివ్ ప్రవర్తన. కాబట్టి దానికి దూరంగా ఉన్నామంటే నిస్పృహకు కూడా దూరంగా ఉన్నట్టే.

స్థితప్రజ్ఞతవల్ల మనుషులతో మనం స్వేచ్ఛగా మాట్లాడగలుగుతాం.

దాంతో వాళ్ళుకూడా మనపై నమ్మకంతో, గౌరవం ఇచ్చి మాట్లాడతారు. ఇవన్నీ లాభదాయకమైన అంశాలే.

స్థితప్రజ్ఞతవల్ల కొన్ని అసౌకర్యాలు కూడా లేకపోలేదు. ఉదాహరణకు:

ఎదుటివాళ్ళ ఫీలింగ్స్, అభిప్రాయాలు పరిగణనలోకి తీసుకోవటంవల్ల ఒకోసారి మన అవసరాలు త్యజించి అవతలివాళ్ళ అవసరాలకు తలవొగ్గాల్సి వస్తుంది.

తాత్కాలికంగా అది మనకు నష్టం కలిగించినట్టు కనిపించినా ఎదుటివాళ్ళలో మనపట్ల గౌరవభావాన్ని ప్రవేశ పెడుతుంది. కాబట్టి దీర్ఘకాలంలో స్థితప్రజ్ఞత మనకు మేలు చేకూర్చే అంశమే అవుతుంది!

**(ఇంకా వుంది)**



# నింద

పెద్దింటి అశోక్ కుమార్

**ఉక్కిరిబిక్కిరి చేసే ఆలోచనలు... లేచి కూర్చుంది. కాసేపు అటూఇటూ తిరిగింది. బాటిల్ అందుకొని గటగటా నీళ్ళు తాగింది. టైం చూస్తే రాత్రి ఒకటి దాటింది.**

**"ఏమిటి... ఇలా జరిగింది? తను ఏదైతే జరక్కూడదనుకున్నదో అదే జరిగింది? ఇప్పుడేమిటి దారి? పేపర్లో ఆ వార్త రావడమేమిటీ? వీడు అక్కడికి వెళ్ళడమేమిటీ? వెళ్ళాడు సరే...తిరిగి రాకుండా అక్కడే ఉండిపోవడమేమిటి? అంతా విచిత్రంగా లేదు?" తనను తాను ప్రశ్నించుకుంది.**

ప్రదీప్ తిరిగి వస్తాడన్న ఆశలేదిప్పుడు. అతడిని ఎలా రప్పించాలనే ఆలోచనే తప్ప! నెల రోజులుగా రోజూ ఫోన్ చేస్తూనే ఉన్నాడు. ఎప్పుడొస్తున్నావని మొదట్లో అడిగేది. అతడి నిర్ణయం విన్నాక అడగటం మానేసింది.

"రెండు వారాలుగా నేను మాట్లాడలేదు కదా... వాడి నిర్ణయంలో ఏమైనా మార్పు వచ్చిందా..." కమలలో చిన్న ఆశ.

ఈ ఆలోచన రాగానే వెంటనే ఫోన్ అందుకుంది. కాల్ లాగ్‌లో ప్రదీప్ నుంచి వందకు పైగా మిస్డ్‌కాల్స్. డెబ్భయ్ ఆరు వాట్సప్ మెసేజెస్. డాటా కనెక్ట్ అయి వాట్సప్ ఓపెన్ చేసింది. కొన్ని టెక్ట్స్ మెసేజెస్, కొన్ని లోడ్ చేసిన ఫోటోలు... గబగబ మెసేజెస్ చదివింది.

"అమ్మా... ఇది వస చెట్టు. గుట్టల నడుమ నిన్ననే దొరికింది. ఎంత ఆనందంగా ఉందో తెలుసా? మాటలు రాని పిల్లలకు నాలుగు రోజులు నాలుక మీద రాస్తే చాలు. వసపిట్టలా వాగుతారని చెప్పావు చూడూ... అదే!"

కింద ఫోటో లోడైంది.

స్క్రీన్ డ్రాగ్ చేసింది కమల.

"అమ్మా, ఇది సర్పగంధి. నాకు తెలిసి మన ఏరియాలో ఈ మొక్కను ఎక్కడా చూడలేదు. నాలుగు రోజులు వెతికితే కాని నా కంట పడలేదు. బీపీకి రెండాకులు తింటే చాలు. అటెన్‌డి అటెనాల్ మాత్రలు వాడాల్సిన పనే లేదు."

ఫొటో లోడైంది.

"ఇది పిల్లి తీగ... మొన్నటి సీజన్ జ్వరాలకు గొప్పగా పనిచేసింది. నేనే ఆశ్చర్యపోయాననుకో! దగ్గు, జ్వరం, అతిసారలను వెంటనే అరికట్టింది. నిజంగా ఇక్కడి ప్రజలు ఎంత అమాయకులమ్మా! పక్కనే ఇంత గొప్ప మందు మొక్కను పెట్టుకొని ప్రభుత్వమే రావాలి, మందులే ఇవ్వాలని ఎదురు చూస్తున్నారు. ఈ తీగ కోసం వెతుకుతుంటే నేల వాము దొరికిందమ్మా! ఈ మొక్క గుండెజబ్బుకు బాగా పనిచేస్తుందని నాన్న కూడా గొప్పగా రాశాడు."

ఫొటో లోడవుతోంది. అనాసక్తిగా లోడింగ్ స్టాప్ చేసి, డ్రాగ్ చేసింది కమల. ఎందుకు మాట్లాడ్డం లేదన్న ప్రశ్న లేదు. తిరిగి వస్తున్నానన్న సందేశం లేదు. అన్నీ చెట్లగురించిన మెసేజ్‌లే! విసుగొస్తోంది కమలకు.

"ఇది పొడపొత్రం! నేనెప్పుడూ చూడలేదు. ఆనవాళ్ళు చూసి గుర్తుపట్టాను. వారం రోజులుగా దీని పని తీరు చూస్తున్నాను. నాలుగు ఆకులు తింటే చాలు...షుగర్ రోగం మాయం.." నీరుగారి పోయింది కమల. ఏదో మూలన ఉన్న కొద్దిపాటి ఆశ కూడా అడుగంటిపోయింది.

"వీడికి పిచ్చి ముదిరింది. నేను చెప్పిన పాఠాలు నాకే చెబుతున్నాడు." అనుకుంటూ నిరాసక్తిగా స్క్రీన్‌ని పైకీ కిందికీ డ్రాగ్ చేస్తోంది. రెండు మూడు చోట్ల మొక్కలమధ్య ఫొటో దిగి పోస్ట్ చేశాడు ప్రదీప్. కొడుకును చూడటానికైనా వాటిని లోడ్

చేసింది కమల.

కొడుకు చిక్కిపోయినట్టుగా కనిపించాడు. పరీక్షగా చూస్తుంటే మరో మెసేజ్...

"అమ్మా, ఇది శతావరి! నువ్వు పీరియడ్స్‌కే పనిచేస్తుందని చెప్పావు. రెండాకులతో నాలుగు రోజుల్లో ఓ అద్భుతం చేశాను. ఆపరేషన్ అవసరం లేకుండా యుటెరస్ నొప్పిని తగ్గించగలిగాను" పూర్తిగా చదవలేదు కమల. విసుగ్గా స్క్రీన్ ఆఫ్ చెయ్యబోతూ ఆగిపోయింది.

"అమ్మా, నీకో ఆసక్తికర విషయం చెప్పనా! ఈ అడవుల్లో ఈశ్వరి మొక్కను చూశాను. నీకు తెలుసుగదా, పాముకాటుకు అదెంత గొప్ప మందో! కొన్ని పేర్లు బాగా అతికినట్టుగా ఉంటాయి. ఈశ్వరి.. పార్వతి పేరు.. పాముకు మందు...భలే ఉంది కదూ!"

చదవడం ఆపింది కమల. ఏదో గుర్తుకొచ్చింది. గుండెదడ హెచ్చింది. నుదుటి మీద చెమట పట్టింది.

'ఈశ్వరి...ఈశ్వరి...ఈశ్వరి...'

భయంతో వణుకు పుట్టింది.

నురగలు కక్కుతూ, భయంతో పరిగెత్తుకు వచ్చిన భర్త...!

కళ్ళ ముందే తుది శ్వాస విడిచిన భర్త...!

ఆరోజు జరిగింది హఠాత్తుగా గుర్తుకు వచ్చింది.

సెల్ పక్కన పెట్టి కళ్ళు మూసుకుంది కమల. భయం గొలిపే ఏవేవో జ్ఞాపకాలు. పావుగంటకు కాని మామూలు మనిషి కాలేదు. తర్వాత కోపంగా సెల్ అందుకుని టైప్ చేసింది.

"ప్రదీప్...మాట తప్పావురా! వారంలో వస్తానన్నావు. ఇప్పుడు నన్నే రమ్మంటున్నావు. ఒప్పించడానికి ప్రయత్నిస్తున్నావు. ఆ ఊరు నాకిచ్చిన బ్యాడ్‌గిఫ్ట్ నీకు తెలియదు. యు ఆర్ ఎ చీటర్..."

సెండ్ చేయాలా? వద్దా? అని కొన్ని క్షణాలు ఆలోచించింది. ఇది తప్పకుండా చెప్పాల్సిన సమయమే అనిపించింది. ఎక్కడ తన నిర్ణయం మారుతుందో అనిపించి వెంటనే పోస్ట్ చేసింది.

సెకన్ల వ్యవధిలోనే రైట్ సింబల్... వెంటనే డబుల్ రైట్! సింబల్ నీలిరంగులోకి మారింది. ఆశ్చర్యంగా చూసింది కమల. ఒకసారి టైం చూసి

**పట్నం నుంచి ఆ మారుమూల తండా గ్రామానికి చేరుకున్నాడా యువకుడు. తండ్రి వారసత్వం స్వీకరించి ప్రజలకు వైద్యం చేయడం ప్రారంభించాడు. ఊళ్ళో ఉండాల్సింది మెడికల్ షాపు కాదు, ప్రతి ఇంట్లోనూ నాలుగు ఔషధమొక్కలుండాలనీ, ప్రతి మనిషీ ప్రకృతిలో మమేకం కావాలనేదే ఆ యువకుడి ఆకాంక్ష. కానీ అతడి తల్లి గతం తల్చుకుని భయపడుతోంది. ఏమిటా గతం? ఆమె ఊహ సరైనదేనా?**

నమ్మలేక తను పంపిన మెసేజ్‌ను సెలెక్ట్ చేసి ఇన్‌ఫో ఐకాన్ చూసింది. డెలివర్ టైంతోపాటు రీడ్ టైం కూడా ఉంది.

అప్పుడు చూసింది కమల. ప్రదీప్ ఆన్‌లైన్లోనే ఉన్నాడు. గ్రీన్ కలర్‌లో టైపింగ్ అన్న అక్షరాలు కనిపించాయి.

ఏం రాస్తాడోనని ఆసక్తిగా చూసింది. క్షణాల మీద మెసేజ్ ప్రత్యక్షమైంది.

"అమ్మా, ఇప్పటికైనా నామీద కోపం పోయిందా?"

ఆ మెసేజ్ పట్టించుకోకుండానే 'ప్రదీ, నువ్వింకా నిద్రపోలేదా...వాటీజ్ దిస్' టైప్ చేసింది.

"లేదమ్మా, నువ్విచ్చిన డైరీలు చదువుతున్నాను. ఎంత గొప్ప ఇన్ఫర్మేషన్ అమ్మా! నా ఆలోచనలనే మార్చేసింది. ఇన్నాళ్ళు ఆ డైరీలు నాకెందుకు చూపించలేదు...'

"ఇప్పుడు చూపించి తప్పు చేశానురా!"

"అదేంటమ్మా... సమస్త కళలూ, శాస్త్రాలూ, వికాసమూ మానవ కల్యాణం కోసమే అన్నావు కదా! మన ట్రస్ట్ నిర్వహణలో నేనేమైనా తప్పు చేశానా?"

"అవును. మద్దిమల్లకు వెళ్ళి మొదటి తప్పు చేశావు. అక్కడే ఉంటానని రెండో తప్పు చేశావు. ఇంత రాత్రిపూట మెలకువగా ఉండి మూడో తప్పు చేస్తున్నావు. వెంటనే పడుకోకుంటే నామీదొట్టే.." కోపంగా పోస్ట్ చేసింది.

"సరేనమ్మా, అలానే. అన్నట్టు ఏదో బ్యాడ్‌గిఫ్ట్ అన్నావు. ఏంటమ్మా?"

"అది రేపు మాట్లాడతా. ముందు పడుకో"

'గుడ్‌నైట్...' ఆన్‌లైన్ కట్టయ్యింది. లాస్ట్ సీన్ అంటూ టైం స్క్రోలైంది.

సెల్‌ఫోన్ పక్కనపెట్టి కళ్ళు మూసుకుంది కమల. నిద్ర ఎప్పుడో ఎగిరిపోయింది. గడియారం రెండు కొట్టింది.

"తండ్రిలాగే వీడు కూడా మొండి. విషయం తెలిశాకైనా మారతాడన్న నమ్మకం లేదు. ఊరికి చేసిన ఉపకారం పీనుగకు చేసిన సింగారం రెండూ గుర్తింపు లేనివే! భగవంతుడా, నా బిడ్డను రక్షించు. వాడే ప్రాణంగా బతుకుతున్నాను." మనసులోనే మొక్కుకుంది.

ఆ రాత్రంతా నిద్రపట్టలేదు. ఎప్పుడో ఓసారి నిద్రపట్టినా అన్నీ పీడకలలే. ఏం చెయ్యాలా అని ఆలోచించి చివరకి ఓ నిర్ణయానికి వచ్చింది కమల.

పొద్దున్నే లేచి బ్యాగు సర్దుకుంది. బయట చూస్తే దట్టంగా మేఘాలు. బోరున విలపించేందుకు సిద్ధంగా, బరువుగా కదులుతున్న ఆకాశం. అంతే బరువుతో బస్టాండుకు వచ్చింది కమల.

ఇరవై రెండేళ్ళ తర్వాత మొదటిసారిగా మద్దిమల్ల బస్సెక్కింది. మనోస్మృతుల నుంచి ఆ ఊరు ఎప్పుడో జారిపోయింది. బస్సు కదులుతుంటే అప్పటి జ్ఞాపకాలిప్పుడు లీలగా కదులుతున్నాయి.

చాలా వసతులకు దూరంగా, చాలా వసతులకు దగ్గరగా రోడ్డు లేక, చదువు రాక, వైద్యం అందక తల్లడిల్లిన ఓ గిరిజన తండా మద్దిమల్ల!

అప్పట్లో అభివృద్ధికి రోడ్డు ఒక మార్గమనుకుంది. భర్తతో వాదించింది కూడా! తర్వాత కాలంలో రోడ్డు వచ్చి ఎంత విధ్వంసం సృష్టించిందో పేపర్లలో చదివింది. అభివృద్ధికి చదువు కూడా ఒక మార్గమనుకుంది. తర్వాత కాలంలో చదువుకుని ఎదిగినవారు ఊరిని ఎలా ఉపయోగించుకున్నారో తెలుసుకుంది.

ఎంత వద్దనుకున్నా మళ్ళీ మళ్ళీ భర్త మరణమే గుర్తుకు వస్తోంది. బస్సుతో పాటు ఆలోచనలు పరిగెత్తుతున్నాయి. తను ఆ ఊర్లో ఎన్ని రోజులుందని? కేవలం నాలుగేళ్ళు, అంతే! కొత్తగా

## అన్నీ చూపించను



*ఇటీవలి కాలంలో ఇలియానా ఫొటోలు చాలా అందంగా, సెక్సీగానూ వస్తున్నాయి. దీనికి కారణం ఆమె లవర్ ఆండ్రూ నీబోస్ అన్న సంగతి అందరికీ తెలిసిందే! ఈ విషయాన్ని ఇల్లీబేబీనే చాలాసార్లు తన ఇంటర్వ్యూల్లో చెప్పింది కూడా! అయితే మీ లవర్‌కి మీ సినిమాలన్నీ చూపించారా? అని ఇటీవల ఓ ఇంటర్వ్యూలో అడిగారట! దానికి ఇలియానా గడుసుగా 'నేను నటించిన సినిమాలన్నీ ఆండ్రూకి చూపించను. అందులో కొన్ని మంచి సినిమాలు మాత్రమే చూపించాను' అంటూ చెప్పిందట! బాలీవుడ్‌లో ఇల్లి చేసిన సినిమాలెన్ని? అందులో ప్రియుడికి చూపించిన సినిమాలు ఎన్ని? అని బాలీవుడ్ జనాలు సెటైర్లు వేస్తున్నారు.*

పెళ్ళై ఆనందంగా ఉండాల్సిన ఆ నాలుగేళ్ళే భయం భయంగా... దిగులు దిగులుగా..!

అందరూ తనవైపు భయంగా చూస్తుంటే అది గౌరవమనుకుంది!

అందరూ తనవైపు అదోలా చూస్తుంటే అది ఆసక్తి అనుకుంది!

ఎదురైతే చూసి, పక్కకి తప్పుకుంటే పలుకుబడి అనుకుంది!

అసలు రహస్యం తెలిసేనాటికి ఒంటరిగా మిగిలిపోయింది.

కిటికీ పక్కన కూర్చుని బయటకు చూస్తోంది కమల. అప్పటి ఊర్లు కావు. అప్పటి అడవి లేదు. అంతా మారింది. రోడ్లు...స్కూళ్ళు... రకరకాల వాహనాలు. చూస్తోంటే పోల్చుకోలేకుండా ఉంది.

మూడున్నర గంటలు పట్టే యాభై కిలోమీటర్ల ప్రయాణం గంటలోనే పూర్తయింది. కమల ఆలోచనల్లోంచి తేరుకోనే లేదు, బస్సు ఊరిలో ఆగింది. కండక్టర్ కేకతో ఉలిక్కిపడి బస్సు దిగింది. ఆకాశం తనతోనే వచ్చినట్టు నిండుగా కదులుతోంది. పువ్వు రాల్చిన పుప్పొడిలా వాన తుంపర.

దారిలో చూసిన ఊర్లలా కాకపోయినా ఊరు కొంత మారింది. బస్టాండ్ షెడ్డు, దాన్ని ఆనుకుని చిన్న హోటల్, పక్కనే ఓ దుకాణం, చుట్టూ చిన్న చిన్న బంగళాలు... అడవిలా చిన్న కాలిబాటతో

ఉండే ఆ ప్రాంతం ఇప్పుడు విశాలంగా ఉంది. ఎత్తైన చెట్లు, దట్టమైన పొదలు అన్నీ మాయం. గుట్టలు కూడా మట్టిదిబ్బల్లా, రాళ్ళకుప్పల్లా ఉన్నాయి.

అక్కడున్న ఇద్దరు ముగ్గురు కమలను ఆసక్తిగా చూశారు. పక్కనే క్రికెట్ ఆడుతున్న పిల్లలు ఆట ఆపి మరీ చూశారు. తననెవరైనా గుర్తుపడతారా లేక తను ఎవరినైనా గుర్తుపడుతుందా అని చుట్టూ చూసింది.

అంతా కొత్త. వారి వేషభాష కూడా మారింది. తను అడిగేలోపే ఎవరింటికని ఓ వ్యక్తి అడిగాడు. చెప్పేలోపే 'డాక్టరు గారింటికా...' అన్నాడు మరో వ్యక్తి.

'అరే, నీకెలా తెలుసు' వారిలో వారే మాట్లాడుకుంటున్నారు.

"అమ్మను చూస్తే అలా అనిపించిందిరా. ఇంత గొప్పోళ్ళు డాక్టరు గారింటికితప్ప ఇంకెవరింటికి వస్తారని...'

నవ్వొచ్చింది కమలకు. ఊర్లోకి మొదటిసారి నాన్నతో అడుగుపెట్టినప్పుడు కూడా సరిగ్గా ఇవే మాటలు... వద్దన్నా వినకుండా ఇంటి దగ్గర దింపి వచ్చారు.

'అవును, డాక్టర్ గారింటికే..' ఎటు పోవాలో తెలియక అటు ఇటు చూస్తూ చెప్పింది.




'డాక్టరుగారు దేవుడమ్మా. ఆపదలో ఉన్న మా ఊరిని ఆదుకున్నాడు. ఆయనే లేకుంటే ఈ పాటికి ఊరు సగం ఖాళీ అయ్యేదే..' ఓ వ్యక్తి అన్నాడు.

ఒకడు సెల్‌ఫోన్ తీసి 'హలో డాక్టర్ సాబ్, మీకోసం అమ్మగారచ్చింద్రు. బస్టాండులో ఉన్నరు. రండి...' అన్నాడు. అతడివంక విచిత్రంగా చూస్తూ, అప్పటికి ఇప్పటికి తేడా ఇదా అనుకుంది కమల.

అప్పుడే పిల్లల కేరింతలు. బంతి గాల్లోకి లేచింది. సూటిగా వచ్చి కమల కాలికి తాకింది.

'అమ్మా..' అంటూ మూలిగింది కమల. జనం చుట్టూ మూగారు. పిల్లవాడు పరార్. దెబ్బేమీ తాకలేదు కాని జనమే గాబరా పడ్డారు. పది నిమిషాల్లో ప్రదీప్ పరుగు పరుగున వచ్చాడు.

దగ్గరికి చేరుకుని, తల్లిని గట్టిగా హత్తుకున్నాడు.

ఏడుపు ముంచుకొచ్చింది కమలకు.

కొడుకును హత్తుకుని పెయ్యంతా నిమిరింది. ఆపుకుందామనుకున్నా ఆగని దుఃఖం. తల్లడిల్లి తల్లడిల్లి ఆకాశం గుండె పగిలింది. బోరున వాన. ఇద్దరూ ఇల్లు చేరుకున్నారు.

"ఏరా, అమ్మను మరచిపోయేంతగా ఈ ఊర్లో నీకు ఏం కనిపించిందిరా?' బాధగా అడిగింది కమల.

అమ్మను చూసిన ఆనందంలో హుషారుగా ఉన్నాడు ప్రదీప్. 'నీ ఆశయమే కనిపించిందమ్మా! చుట్టూ ఆరేడు తండాలున్నాయి. ఎటూ నలభై కిలోమీటర్ల దూరంలో డాక్టర్లు లేరు. ఆసుపత్రులు లేవు. మొన్న న్యూస్ పేపర్లో వచ్చింది కదా 'మంచం పట్టిన మద్దిమల్ల' అని. అసలే వర్షాలు... ప్రభుత్వ సహాయం కోసం ఎదురుచూస్తే ప్రాణాలెన్నో పోతాయి. అందుకని నా దగ్గరున్న కొద్దిపాటి మందులతోనే వచ్చేశాను. ఇక్కడికొచ్చాక తెలిసింది ఈ అడవుల్లోనే ఎన్నో ఔషధ మొక్కలున్నాయని! అప్పుడు నాన్నగారి డైరీలు, నువ్వు చెప్పిన చెట్లు నాకు కొత్త దారిని చూపాయి' అన్నాడు.

ఇన్నిరోజులుగా అతను చెప్పిన సమాధానమే! ఇదే ఇంకో సందర్భమైతే కొడుకు ఆలోచనను ఆకాశానికెత్తేదే. ఇప్పుడు మాత్రం కోపమొచ్చింది కమలకు.

'సేవలు అందించాలనుకున్నాం కాని ప్రయోగాలు కాదు ప్రదీప్. అయినా ఇది అనుకూలమైన చోటు కాదు' అన్నది.

అతడు వినలేదు. 'చోట్లు ఎప్పుడూ అనుకూలంగా ఉండవమ్మా. మనం అనుకూలంగా మార్చుకోవడమే! మనిషి ప్రకృతికి చాలా దూరం వచ్చాడు. అందుకే ఈ విపరీత రోగాలు. నెలల బిడ్డకే షుగర్, ఏడాది బిడ్డకే గుండెజబ్బు, పన్ను రాకముందే పిప్పళ్ళు, కన్ను తెరవకముందే అద్దాలు... ఇప్పుడు నేను మనిషికి ప్రకృతి మర్మాన్ని పరిచయం చేసే పనిలో ఉన్నాను. తరువాత నువ్వే అంటావు, ఇది అద్భుతమైన ప్రయోగమని...' అన్నాడు.

కమల భయపడుతోంది. అసలు విషయం చెప్పాలా వద్దా అని ఆలోచిస్తోంది. ఆ ఆలోచనలతోనే పొద్దు గూకింది. ప్రదీప్ ఏవో మొక్కలు తెస్తున్నాడు. ఎవరికో మందులిస్తున్నాడు. ఏదో రాసుకుంటున్నాడు. ఇంట్లో జాతర. పొద్దంతా బిజీగానే ఉన్నాడు.

అసలు విషయం చెబితేనైనా కొడుకు ఆలోచనల్లో మార్పు వస్తుందేమోనని కమలకు చిన్న ఆశ. రాత్రికి చెప్పాలని చూసింది. ఎవరో వచ్చారు. పడుకునే ముందు చెప్పాలని చూసింది. ఎక్కడికో వెళ్ళాడు.

అర్ధరాత్రి పూట స్థిమితంగా దొరికాడు ప్రదీప్. చెప్పాలనుకుంటుండగా బయట తలుపు చప్పుడైంది. వెళ్ళి తలుపు తెరిచాడు.

ఎవరో పాముకాటుకు గురైన వ్యక్తి. చూడగానే భయపడింది కమల.

"ప్రదీప్, ఏదైనా హాస్పిటల్‌కు పంపించరా.. నీ దగ్గర యాంటీ వైరస్ లేదు గదా' హెచ్చరించింది కమల.

'అమ్మా, ఇంత రాత్రిపూట ఎక్కడికని వెళ్తారు? ఇంట్లో ఈశ్వరి ఉంది కదా! అయినా పాములన్నీ ప్రమాదకరం కాదు. కరిచిందన్న భావనే ప్రమాదకరం. వాళ్ళకు కొంత నమ్మకం కలిగిస్తే చాలు. బతికిపోతారు. అందుకని నేను వారికి నమ్మకం కలిగించే పద్ధతిలోనే వైద్యం చేస్తున్నాను. మందు ఎంత మంచిదైనా ముందు నమ్మకముండాలి గదా...' అంటూ వారిని ఇంట్లోకి పిలిచాడు.

ఏమిటా వైద్యం అని ఆసక్తిగా చూసింది కమల.

ప్రదీప్ గాయం తుడిచి కట్టు కట్టాడు. వేపాకులు నమిలించాడు. మిరపకాయలు నమిలించాడు. మిరియాలు తినిపించాడు. అన్నీ తియ్యగానే ఉన్నాయంటున్నాడు పేషంట్.

అసలు వైద్యం అప్పుడు మొదలైంది. పాత చెప్పుతో రుద్ది మంత్రం వేశాడు. సర్పదోషి అని యంత్రం కట్టాడు. అరగంటలో పేషంట్ మామూలు స్థితికి వచ్చాడు.

వాళ్ళను పంపించి తల్లి వద్దకు వచ్చాడు ప్రదీప్.

అంతదాకా భయంతో వణుకుతూ కూర్చుంది కమల. ఆమె భయాన్ని మరోలా అర్థం చేసుకున్న ప్రదీప్ 'భయపడాల్సిన పనేమీ లేదమ్మా, అతను బాగానే ఉన్నాడు. ఇది వీళ్ళ బలహీనత! మందు ఎంత మంచిదైనా, నమ్మకం కుదరాలంటే ఇలా చేయక తప్పదు మరి. ఇప్పుడు చూడు. అది ప్రమాదకరమైన పాము కాదుకాని మనం కాదన్నా లేక మందిచ్చి ఊరుకున్నా ఓ నిండు ప్రాణం పోయేదే...' అన్నాడు.

కొడుకు ప్రమాదం అంచున ఉన్నాడని అర్థమైపోయింది కమలకు. వీడిని ఆపాల్సిందే అనుకుంటూ "వాట్ నాన్సెన్స్ ప్రదీ? రోజూ నువ్వు చేస్తున్న వైద్యం ఇదేనా?" అడిగింది కోపంగా.

ప్రదీప్ ఉత్సాహంగా "ఇక్కడ అన్ని రోగాలకు మందులు దొరుకుతున్నాయి. వాళ్ళకు నమ్మకం కలిగించడానికి మంత్రాలు, పొగ మందులని అబద్ధాలు చెప్పాల్సి వస్తోందంతే! అన్నాడు.

"అదెంత ప్రమాదకరమో తెలుసా?"

ఆశ్చర్యంగా "ప్రమాదమేముందమ్మా! కడుపులోకి మందు పోతుంది. మనసులోకి మంత్రం పోతుంది. ఏమైతేనేం, జబ్బు నయమవుతుంది. మొన్నటి వైరల్ ఫీవర్స్‌కి చెట్ల మందు పోస్తే ఒక్కళ్ళకు కూడా తగ్గలేదు. మా ఇంటి ముందు చెట్లే గదా అన్నారు. మందు పేరు చెప్పకుండా మంత్రం పేరు చెపితే రోగం నయమైపోయింది.' నవ్వుతూ అన్నాడు.

కమలకు కోపం నషాళానికంటింది. ఆవేశంగా "ఈ ప్రయోగాలు చేసే మీ నాన్న ప్రాణం మీదికి తెచ్చుకున్నాడు. అదీ ఇక్కడేరా...ఇక్కడే! ఆయన్ను మంత్రగాడన్నారు. నన్ను మంత్రగాని భార్యన్నారు. ఆయన్ని కొట్టి చంపారు. నన్ను తరిమి కొట్టారు. ఊర్లో అందరికీ ప్రాణదానం చేస్తున్నాననుకున్నాడు గాని తనకు తానే ఉరిపోసుకుంటున్నాననుకోలేదు" బాధతో గొంతు జీరబోయింది. మాట పెగల్లేదు. ఆయాసంతో రొప్పుతూ కూలబడిపోయింది.

తల్లిని ఎప్పుడూ అంత కోపంగా చూడలేదు ప్రదీప్. భయమేసింది. కూర్చోబెట్టి మంచినీళ్ళిచ్చాడు. ఆమె తేరుకోవడానికి చాలా సమయం పట్టింది.

కొడుకు కదిలించలేదు. తల్లి మాట్లాడ లేదు. ఎవరి ఆలోచనల్లో వారు నిద్రపోయారు. ప్రదీప్‌కి తండ్రి ఓ నాటు వైద్యుడని, ఉచితంగా సేవ చేసే వాడని... కొన్ని విషయాలు మాత్రమే తెలుసు. తల్లిని అడగాలని ఎప్పుడూ అనిపించలేదు. తల్లి కూడా ఎప్పుడూ చెప్పలేదు. చదువు పూర్తయ్యాక తండ్రి పేరుమీద ట్రస్ట్ పెడుతున్నప్పుడు మాత్రం డైరీలు ఇచ్చి అతడి ఆశయం పేదలకు వైద్యం అందించడం అని చెప్పింది.

ఏడ్చి ఏడ్చి ఆకాశం తెప్పరిల్లింది. కమల గంభీరంగా ఉంది. ఆ రోజు పనులేవి పెట్టుకోలేదు ప్రదీప్. తల్లిని కదిలించాలంటే భయమేసింది. మొత్తం మీద తనకేదో ముఖ్యమైన వార్త చెప్పాలను కుంటుందని మాత్రం తెలిసిపోతోంది.

వాన తర్వాత వచ్చిన ఎండ వెచ్చగా ఉంది. పగటి పూట భోజనం చేసేప్పుడు మెల్లగా కదిలిస్తూ 'అమ్మా, ఏదో బ్యాడ్‌గిఫ్ట్ అన్నావు. ఏమిటమ్మా అది?' అడిగాడు ప్రదీప్.

ఆ అవకాశం కోసమే ఎదురు చూస్తున్నట్లు, "నా పెళ్ళయ్యే నాటికే మీ నాన్న ఇక్కడ వైద్యుడు. వాళ్ళకు నమ్మకం కలగాలంటూ జనంలో భూత వైద్యుడయ్యాడు. రాత్రిపూట ఓ తండాలో వైద్యం చేసి వస్తూ పాముకాటుకు గురయ్యాడు. తన మంత్రమే తనమీదికి తిరగబడిందని మందు దంచి పొయ్యడానిక్కూడా ఎవరూ ముందుకు రాలేదు. తర్వాత ఇంట్లో బొక్కల రాట్నం ఉందని, క్షుద్ర దేవతలున్నారని నన్నూ, నానమ్మనూ తరిమికొట్టి ఇంటికి నిప్పు పెట్టారు." తడుముకుంటూ తన నాలుగేళ్ళ కాపురాన్ని చెప్పింది కమల.

తల్లి ఎక్కువగా ఊహించుకుని భయపడు తోందని గ్రహించాడు. అదే విషయం మెల్లగా నచ్చచెపుతూ, "అల్లోపతి రాకముందు ఆయుర్వేదమేనమ్మా, ఈ దేశాన్ని బతికించింది. మన దురదృష్టమేంటంటే ఒకనాడు ఇంటింటా ఉన్న ఆ వైద్యం, ఒక తరంనుంచి మరో తరానికి అందించకుండా గోప్యంగా ఉంచబడింది. అందుకే ఈ మూఢ నమ్మకాలు! నాకూ అలాగే జరుగుతుందని ఎలా అనుకుంటావు?" అన్నం తింటూ అడిగాడు.

చాలా రోజుల తర్వాత కొడుక్కి ప్రేమగా వడ్డిస్తోంది కమల. తను కూడా వడ్డించుకుంటూ 'ఓ పంచాయతీలో ఎవరో మీ నాన్నకు ఎదురు మాట్లాడారట. తెల్లవారేసరికి అతనికి జ్వరం వచ్చింది. ఓ సొరకాయ అడిగితే లేదన్నదట. వారంలో ఆ చెట్టు ఎండిపోయింది. ఓనాడెవరో చేబదులు ఇవ్వలేదట. అతని చేతికి వాపు వచ్చింది. ఒకటి గాదు రెండు గాదు... ఇలా ఎన్నో. ఆ రోగాలకు కారణాలు వేరు. కాని జనం నమ్మిందేమిటంటే మీ నాన్నతో పెట్టుకుంటే అంతే అని. కొత్తలో ఊరంతా చుట్టాలు గానే అనిపిస్తారు. కొన్ని రోజులయ్యాక మనం ఎంత మంచి పని చేస్తున్నా అనుకూలురు, వ్యతిరేకులు ఏర్పడతారు' కొద్దిసేపు ఆగింది.

తర్వాత నెమ్మదిగా "ఇప్పటికే మంత్రగాని భార్యగా నింద మోసి బొంద చూశాను. ఇప్పుడు మంత్రగాని తల్లిగా నింద మోయడానికి సిద్ధంగా లేను' అన్నం కెలుకుతూ చెప్పింది.

ఎలా చెప్పాలా అని ఆలోచిస్తున్నాడు ప్రదీప్. మనసు మార్చుకున్నాడేమోనని సంతోషపడింది కమల. ఎవరి ఆలోచనల్లో వారు భోజనం పూర్తి చేశారు.

తీరిగ్గా కూర్చున్నాక తల్లి పక్కన చేరి "అమ్మా, జనం ముందటిలా మూఢంగా లేరు. మంచి చెడు తెలుసుకుంటున్నారు. వ్యాపారంగా మారుస్తారనో, లేక తమ ప్రాబల్యం తగ్గుతుందనో తమకు తెలిసిన చెట్ల వైద్యాన్ని మన తాతలు తర్వాత తరానికి చెప్పలేదు. అలా ఓ గొప్ప శాస్త్రం అంతరించిపోయింది. దాన్ని తవ్వి తీసి ఊరూరా ప్రచారం చేయాలనుకుంటున్నాను" దృఢంగా చెప్పాడు ప్రదీప్.

కొడుకు నిర్ణయం మారదని కమలకు అర్థమైంది. అతని ఆశయం వెనుక ఉన్న అంతరార్థం కొద్దికొద్దిగా బోధపడుతోంది.

"ప్రకృతి వైపు నడవడమంటే పాదయాత్ర చేయడం కాదురా... పరిణతి పెరగడం" తల్లి మెత్తబడింది. కొడుక్కి కొండంత బలం వచ్చింది. "అవునమ్మా, అది నేనూ నమ్ముతాను. గుప్పిట పట్టుకున్నంత వరకే రహస్యం...విప్పి చెపితే అది శాస్త్రం! ఇప్పుడు నేను అదే చేస్తున్నాను. ఒకటికి పదిసార్లు చెట్ల మర్మం విప్పి చెబుతున్నాను." అంటూ తల్లి వైపు చూశాడు.

కమల కొడుకు తల నిమిరింది.

ప్రదీప్ ఉద్వేగంగా "ప్రతీ మనిషి ప్రకృతిలో మమేకమైపోవాలి. తన వైద్యం తనే చేసుకోవాలి. ఊరిలో మెడికల్ షాపు కాదు, ఇంటికి నాలుగు ఔషధ మొక్కలుండాలి. నా ఈ ప్రయత్నం ఇక్కడి నుంచే మొదలుపెడుతున్నాను. నన్ను దీవించమ్మా! వైద్యం అందక ఏ వ్యక్తీ మరణించ కూడదు." తల్లి కాళ్ళకు నమస్కరించాడు ప్రదీప్.

కమల కళ్ళల్లో నీళ్ళు...

భర్త సమాధి ఉన్నచోటే కొడుకు పునాది వేస్తున్నాడు. మనసులో ఎంత భయమున్నా కాదనలేక పోతోంది కమల.

మరునాడు తగు జాగ్రత్తలు చెప్పి బయలుదేరింది. ఆమెకు కూడా జనం మారిపోయారని, కొడుకు కల ఫలిస్తుందని ఎంతో నమ్మకం. బస్సు కోసం బస్టాండులో కూర్చుంది. పక్క హోటల్లోంచి మాటలు...

"నారిగాడేడిరా...రాలేదు" ఓ వ్యక్తి మాటలు...

"వాడి కొడుక్కి బాగలేదురా..." మరొకరు..

"అరే ఏమైంది?"

"డాక్టరుగారి అమ్మగారిని బాల్‌తో కొట్టిండట! ఆయన ఊకుంటాడురా... ఏం మంత్రం చేసిండో!"

కమల గుండె ఝల్లుమంది. నిలువు నిత్తారం కూలబడిపోయింది.

సెల్: 94416 72428




## మనసులో సౌరశక్తి

*కాల్చని మంట గురించి*
*కాల్చే మంచు గురించి*
*అలుపెరగకుండా ఆయన మాట్లాడేవాడు!*
*'నిరంతర కృషి'*
*అనే ఏకైక అర్థానికి*
*సుదీర్ఘ వివరణలు ఆయన ప్రసంగాలన్నీ!*
*సముద్ర తీర మట్టిలోంచి*
*మొలుచుకొచ్చాడు!*
*భూమినంతటినీ సమతలం*
*చేయాలని పరితపించేవాడు*



*ఏ ప్రాంతానికి వెడితే*
*ఆ భాషే ఆయనకు కొట్టిన పిండి!*
*ఎందుకంటే ఆయన*
*హృదయాలతో నేరుగా మాట్లాడేవాడు!*
*సౌరశక్తి వంటి ఉత్సాహ కాంతితో*
*మనసులను ఉత్తేజితం చేసేవాడు*
*వేళ్ళతో హృదయాలను మీటి*
*రాగాలు పలికించేవాడు!*

*కష్టపడే చేతులకు*
*చేతిరేఖలనే కాదు*
*దేశ భవిష్యత్తును కూడా*
*మార్చేశక్తి ఉంటుందని*
*నిరూపించిన అపూర్వకర్మయోగి!*
*బాలబాలికలలో విజయదీక్షను*
*లోతుగా నాటేవాడు!*
*అతడి మాటలలోని విద్యుత్తును*
*ఆలింగనం చేసుకునేవారు యువతీ యువకులు!*
*'అనవరత శ్రమ' అనే చైతన్యాన్ని*
*హృదయంలో*
*మనస్సులో*
*బుద్ధిలో*
*అంచెలంచెలుగా నింపేవాడు*
*కలల్ని కనమనేవాడు*
*కాని, మామూలు కలలు కాదు*
*నిద్రని దూరం చేసే కలలు!*
*దేశ భవిష్యత్తును స్వర్ణార్ణవం చేసే*
*ఆశాకల నికషోపలాలు!*

***(కలల యోధుడు కలాంకు నివాళి)***

**-శశికాంత్ శాతకర్ణి**
**సెల్: 98858 89759**

ఇంటర్వ్యూ

# అక్క, వదిన పాత్రలు డీగ్లామర్ కాదు

-రేవతి

**భారతీయ, పాశ్చాత్య భాషా చిత్రాల నటి, దర్శకురాలు, అపురూప సౌందర్యరాశి రేవతి. జాతీయ, అంతర్జాతీయ స్థాయి అవార్డుల అభినయ కళామూర్తి. 'అంకురం' చిత్రం ఆమె నట జీవితంలో ఒక మైలురాయి. 'నటులు పాత్రలో జీవించారో లేదో ప్రేక్షకులు ఇట్టే పసిగట్టేస్తున్నారు, పాత్ర ఏదైనా దానికి ప్రాణం పోయడమే నటులకు ముఖ్యం. అక్క, వదిన, అమ్మ పాత్రలు చేసినంత మాత్రాన డీగ్లామరైనట్టు కాదు' అంటున్న రేవతి ఇంటర్వ్యూ...**

మాది కేరళ. నేను కొచ్చిలో పుట్టాను. మా నాన్నగారి పేరు కిలున్ని. అమ్మ లలిత. నా చెల్లెలు పేరు బిందు. నాన్నగారు ఆర్మీలో పనిచేయడం వల్ల ఇంటర్మీడియట్ వరకు దేశంలోని మహానగరాల్లో చదువుకున్నాను. చెన్నైలో బి.ఏ పూర్తిచేశాను.

బాల్యం నుంచీ లలితకళలంటే ఎంతో మక్కువ. ప్రసిద్ధ భారతీయ నాట్య గురువు రంగనాయకీ జయరామన్‌గారి దగ్గర భరతనాట్యం నేర్చుకున్నాను.

### భారతీరాజా పరిచయం

నాట్యప్రదర్శన సమయంలో తీసిన నా ఫొటోను ప్రముఖ దర్శకుడు భారతీరాజా చూసి మా నాన్నగారి దగ్గరకు వచ్చారు. 'మీ అమ్మాయిని మా సినిమాలో నటించడానికి పంపిస్తారా?' అని అడిగారు. ఇంటిల్లపాదీ అంగీకరించాం. 'సినిమాలో నటించాలని ఉంటేనే ఈ రంగంలోకి రామ్మా, లేకపోతే వద్దు' అని నిక్కచ్చిగా చెప్పారు. 'తప్పకుండా సార్! నాకు ఇంట్రెస్ట్ ఉంది, రాణిస్తాననే నమ్మకం ఉంది. నాకు ఎలాంటి అభ్యంతరం లేదు సార్' అన్నాను. అలా ధైర్యంగా మొహమాటం లేకుండా మాట్లాడిన నా వాగ్ధాటి భారతీరాజాగారికి బాగా నచ్చింది. మళ్ళీ వారం రోజులకు మద్రాసు వాణి మహల్‌లో నా భరతనాట్య ప్రదర్శన చూసి నన్ను తన సినిమాలోకి తీసుకోవాలని ఆయన డిసైడైపోయారు.

### మొదటిచిత్రం

భారతీరాజా దర్శకత్వంలో తమిళంలో నిర్మించిన 'మన్‌వాసనై' నా మొదటిచిత్రం. పాండ్యన్, వినుచక్రవర్తి, విజయన్, సేనాపతి, గంతిమతి, వై.విజయ, శ్రీలత తదితరులు నటించారు. 1983లో విడుదలైన నా మొదటి చిత్రానికే ఫిలింఫేర్ అవార్డు రావడం నాకెంతో గర్వంగా ఉంటుంది. నా అసలు పేరు ఆశా కిలున్ని. కానీ భారతీరాజాగారు రేవతిగా మార్చేశారు. ఆ పేరు నాకు బాగా కలిసివచ్చింది. 'మన్‌వాసనై' చిత్రాన్ని తెలుగులో కోడిరామకృష్ణగారి దర్శకత్వంలో 'మంగమ్మగారి మనవడు' గా రీమేక్ చేశారు.

### తెలుగులో తొలి చిత్రం

రేలంగి నరసింతిహారావుగారి దర్శకత్వంలో నిర్మించిన 'మానసవీణ' నా తొలి తెలుగుచిత్రం. 1984లో విడుదలైన ఈ చిత్రంలో ఉత్తమ నటిగా నాకు ఫిలింఫేర్ అవార్డు లభించింది. ఈ చిత్రాన్ని 'తెన్నెల్ తెడున్‌నపూవు' పేరిట మలయాళంలోకి డబ్బింగ్ చేశారు. ఈ రెండు చిత్రాలు విజయవంతంగా ప్రదర్శితమయ్యాయి.

### అక్కినేనితో 'రావుగారిల్లు'

అన్నపూర్ణా స్టూడియోస్ చిత్రం 'రావుగారిల్లు'. తరణి దర్శకత్వం వహించిన కుటుంబ కథాచిత్రం. అక్కినేని నాగేశ్వరరావుగారు, జయసుధ, నేను నటించాం. 1988లో విడుదలైంది. నా కెరీర్ ఆరంభంలోనే అక్కినేనిగారితో నటించడం అదృష్టంగా భావిస్తాను. షూటింగ్ సమయంలో అక్కినేనిగారు నటనలో ఎన్నో మెళకువలు నేర్పించారు. చాలా ఓపిగ్గా అన్నీ వివరించి చెప్పేవారు. అలా ఆయన చెబుతుంటే ఏదో పాఠం చెబుతున్నట్టు ఉండేది.

### నట జీవితంలో మైలురాయి 'అంకురం'

నా కెరీర్‌లో మైలురాయివంటి చిత్రం 'అంకురం'. ఒక మధ్య తరగతి మహిళ, పోషించే స్తోమతులేక కొడుకును తిరిగి అతడి తండ్రివద్దకు చేర్చడానికి చేసే ప్రయత్నం ఈ చిత్రం. సామాజిక సమస్యలను ప్రతిబింబించింది. భూస్వామ్య విధానం, నక్సలిజం, బ్యూరోక్రసీ, మానవ హక్కులు వంటి అనేక అంశాలు కలగలిసిన నేపథ్యంలో నడిచే చిత్రమిది. ఇందులో ముఖ్యపాత్ర ఏ విధంగా పోలీసుల చేతిలో వేధింపులకు గురైందో, అధికారం, పోలీసుల బలం ఏ రకంగా గిరిజనులను నిర్దాక్షిణ్యంగా అణచివేస్తుందో చిత్రీకరించారిందులో. సందేశాత్మక చిత్రం. దర్శకుడు సి.ఉమామహేశ్వరరావు, నిర్మాత కె.వి.సురేష్



కుమార్. 1993 అంతర్జాతీయ చలనచిత్రోత్సవం ప్రధాన విభాగంలో ప్రదర్శితమై జాతీయ అవార్డు కూడా పొందింది.

### సీతమ్మ పెళ్ళి

బాపూ దర్శకత్వంలో ముద్దు ఆర్ట్స్ మూవీస్ చిత్రం 'సీతమ్మ పెళ్ళి'. నిర్మాత జయకృష్ణగారు. నాతో పాటు ఈ చిత్రంలో మోహన్‌బాబు, మురళీమోహన్, నూతన ప్రసాద్, రాళ్ళపల్లి, అరుణ తదితరులు నటించారు. 1984లో విడుదలైన ఈ చిత్రం ఎంతో బాగా ఆడింది.

### కేరళ కేఫ్

మలయాళంలో నా మొదటిచిత్రం 'కాట్రతే కిళ్ళి కూడు'. దీన్నే 'ఊంజలాడుమ్ ఉరవుగళ్'గా తమిళంలో రీమేక్ చేశారు.

అదేవిధంగా ఎక్కువమంది ప్రశంసలు పొందిన మరో మలయాళ చిత్రం కేరళ కేఫ్. పదిమంది దర్శకులు కలిసి 'జెర్నీ' అనే శీర్షికమీద ఈ లఘు చిత్రం నిర్మించారు. ఈ చిత్రం క్లైమాక్స్ రైల్వేస్టేషన్‌లో నిర్మించాం. ఇందులో ఒక భాగానికి దర్శకత్వం నాదే. 2009లో విడుదలైన ఈ చిత్రం 'త్రివేండ్రం'లో జరిగిన ఫెస్టివల్‌లో ప్రతిష్ఠాత్మకమైన 14వ 'నెట్ పాక్' అవార్డు అందుకుంది.

### ఫిర్ మిలేంగే

దక్షిణభారతీయ భాషాచిత్రాలతోపాటు నేను ఎన్నో హిందీ చిత్రాల్లో కూడా నటించాను. దర్శకత్వం వహించాను. నా దర్శకత్వంలో వచ్చిన చిత్రాల్లో 'ఫిర్ మిలేంగే' హిందీ చిత్రం ఒక మైలురాయి. ఎందరో దర్శకులు నా దర్శకత్వాన్ని కొనియాడారు. శిల్పాశెట్టి, సల్మాన్‌ఖాన్, అభిషేక్‌బచ్చన్ ఈ చిత్రంలో నటించారు. హెచ్ఐవి సోకిన వ్యక్తిపట్ల సమాజం అనుసరించే వైఖరిని వ్యతిరేకిస్తూ సదరు వ్యక్తి జరిపిన పోరాటమే ఇతివృత్తంగా నిర్మించిన సందేశాత్మక చిత్రమిది.

### నావన్నీ కుటుంబ కథాచిత్రాలే

కుటుంబ కథా చిత్రాలంటేనే నాకు ఇష్టం. కథ బాగుంటేనే అంగీకరిస్తాను. నచ్చకపోతే సున్నితంగా తిరస్కరిస్తాను. ఇద్దరు ముగ్గురు దర్శకులకు నా తీరు కోపం కూడా రప్పించింది. ముందుగా దర్శకుడు చెప్పింది విన్నతర్వాత ఆ చిత్రంలో నటించాలా? వద్దా? అని నిర్ణయించుకుంటాను. ఈ విధానం వల్లే నా చిత్రాలన్నీ విజయవంతంగా ప్రదర్శితమయ్యాయని భావిస్తాను. కళాకారులకు తృప్తి అనేదే ఉండకూడదు. కనుక నేను చేసిన వాటికంటే, చేయాలి అనుకున్న పాత్రలే ఎక్కువగా ఉన్నాయి. అవకాశం వచ్చిన ప్రతి సారీ నన్ను నేను రుజువు చేసుకుంటూనే ఉన్నాను.



### పలు భాషా చిత్రాల్లో నటించా

తెలుగు, తమిళ, కన్నడ, మలయాళ, హిందీ భాషా చిత్రాలెన్నింటిలోనో నటించాను. అయితే తెలుగులో నటించేటప్పుడు మాత్రం ఎంతో కంఫర్ట్‌గా, హాయిగా అనిపించేది. తెలుగులో నటించడం అంటే నాకెందుకో ప్రత్యేక అభిమానం. కష్టపడే నటులకు భాషా బేధాలు ఉండకూడదు. ఊర్వశి శారదగారు, ఆనాటి సావిత్రిగారు, విజయకుమారి (తమిళనటి) లాంటి వారంతా భాషలకు అతీతంగా ప్రేక్షకుల హృదయాల్లో చిరస్థానం సంపాదించుకున్నారు. ముందు అభినయం ముఖ్యం. ఆ తర్వాతే భాష.

### అవార్డులు అర్హతను సృష్టించవు

జాతీయంగా, అంతర్జాతీయంగా ఎన్నో అవార్డులు పొందాను. కానీ అవి అర్హతను సృష్టించవు. ఉన్న యోగ్యతను మరింత పెంచుతాయి, ఒక పుల్లతో దీపాన్ని ఎగదోసినట్టే. పాత చిత్రాల్లో ఎన్నో గొప్పవి ఉన్నాయి. వాటిలో ఎన్నింటికో పురస్కారాలు రాలేదు. అయినా అవి గొప్ప చిత్రాలే. అలాంటి చిత్రాలన్నీ నేటి ప్రేక్షకులకు సిలబస్ లాంటివే. భాషా భేదాలు ఉండవు ఇలాంటి విషయాల్లో. అమ్మ పాత్రలు, అక్క, వదిన పాత్రలు పోషించడం వల్ల గ్లామర్‌కి ఇబ్బంది అనుకుంటారు కొందరు. కానీ నా ఉద్దేశంలో మాత్రం కథకు ప్రాణప్రదమైన పాత్ర ఏదైనా సరే, అంటే అమ్మ, అమ్మమ్మ, వదిన, అక్క... ఏదైనా కావచ్చు. నటిగా ఆ పాత్రకు జీవం పోస్తే చాలు. ఇప్పటి ప్రేక్షకులు చాలా తెలివైనవారు. నటులు ఆ పాత్రలో జీవించారా లేదా అనే విషయం ఇట్టే పసిగట్టేస్తున్నారు. కనుక పాత్రోచిత నటన, పాత్రకు జీవం పోయటం ముఖ్యం. పాత్ర ఎలాంటిదైనా ఆ నటి లేదా నటుడు రాణిస్తారు.

### ఆంగ్ల చిత్రానికి దర్శకత్వం

నేను దర్శకత్వం వహించిన ఆంగ్ల చిత్రం 'మిత్ర్-మై-ఫ్రెండ్'. దీంతో నేను దర్శకురాలిగా అరంగేట్రం చేశాను. ఈ చిత్రంలో శోభనకు ఉత్తమ నటిగా, బీనా వేణు ఉత్తమ ఎడిటర్‌గా అవార్డులు అందుకున్నారు.

### ఆంగ్లంలో లఘుచిత్రానికి అవార్డు

నా దర్శకత్వంలో వచ్చిన మరో ఆంగ్ల లఘు చిత్రం 'రెడ్ బిల్డింగ్ వేర్ ది సన్ సెట్స్'. ఎడ్యూ మీడియా కోసం తయారు చేశాం. స్త్రీ ప్రధానపాత్రగల కుటుంబ విలువలున్న ఈ ఉత్తమ ఆంగ్ల చిత్రానికి 2012లో జాతీయ అవార్డు లభించింది.

రచయిత చేతన్ దత్తార్ రచించిన 'మాధవబాగ్' నాటకానికి శాంతా గోఖలే ఆంగ్లానువాదం చేశారు. ఇదే నాటకాన్ని ప్రేక్షకులు వీక్షించేందుకు ప్రదర్శన యోగ్యమైన మంచి నాటకంగా, మీదుమిక్కిలి ఒక లఘు చిత్రంగా కూడా మలిచాను. ఈ నిర్మాణంతో ఒక దర్శకురాలిగా నా ప్రతిభను ఎందరో ప్రశంసించారు. దీనికి జాతీయ అవార్డు లభించింది.

### కుటుంబ కథా చిత్రాలు రావాలి

ఇటీవల సినిమాల్లో నిర్మాణవేగం పెరిగింది. నాణ్యత రాబట్టుకోవడం ఒక టెక్నిక్. శ్రమ, అంకితభావంతో దర్శకులు నిర్మిస్తే అది ఏ భాషాచిత్రమైనా తప్పకుండా ప్రజల మెప్పు, ఆదరణ పొందుతాయి. కనుక దర్శకులను నేను కోరుకునేది ఒక్కటే, ఈ రోజుల్లో కుటుంబ కథా చిత్రాలు కరువైపోయాయి. పురాణేతిహాస చిత్రాలు, చారిత్రక, జానపద చిత్రాలు కూడా మళ్ళీ తెరమీదకు రావాలని మనఃస్ఫూర్తిగా కోరుకుంటున్నాను.

### సామాజిక సేవ

నేను కేవలం సినిమారంగానికే పరిమితం కాలేదు. అనేక సామాజిక కార్యక్రమాల్లో చురుగ్గా పాల్గొంటూ దివ్యాంగుల కోసం, మానసిక రుగ్మతలు, మెదడు సంబంధిత వ్యాధులపై ప్రచారానికి 'ఎబిలిటీ ఫౌండేషన్' సంస్థ ట్రస్టీగా వ్యవహరిస్తున్నాను. 'టాంకర్ కిడ్నీ ఫౌండేషన్' ద్వారా 'విద్యాసాగర్ బోర్డు ట్రస్టీ'తో కలిసి రోగగ్రస్థులకు సబ్సిడీపై మెదడు సంబంధిత వ్యాధితో బాధపడే పిల్లల పాఠశాల నడుపుతున్నాను. నాకు వివాహం జరిగింది. డైవోర్స్ తీసుకున్నాను.

ప్రస్తుతం రెండుమూడు డాక్యుమెంటరీ చిత్రాలకు స్క్రిప్ట్ తయారుచేస్తూ దర్శకత్వం వహిస్తున్నాను. తెలుగులో బ్రహ్మోత్సవం తర్వాత మరో రెండు చిత్రాల్లో నటించబోతున్నాను. మరో చిత్రానికి దర్శకత్వం వహిస్తున్నాను.

**కె.హరనాథ్,**
**సెల్: 97035 42598**



# గదిలో అది!

-రాంపా

**అన్ని విషయాల్లో తల దూర్చి, అమ్మో, తలపోటుతో చచ్చిపోతున్నా అనేవాడు అన్నయ్య! తెలియని విషయాల్లో వేలుపెట్టి, నలిగింది నాయనో అనేవాడు తమ్ముడు!**

**అన్నకు తగ్గ తమ్ముడు, తమ్ముడికి సరైన అన్నయ్య అని పేరు తెచ్చుకున్నారు! చిత్రమేంటంటే, ఇద్దరికీ పడదు. ఇద్దరివల్లా ఇంటికి జరిగే శుభలాభం ఇసుమంత కూడా లేకపోగా, నీ తెలివితక్కువ తనంతోనే యింతా జరిగింది, నీ అతితెలివే దీనికంతటికీ కారణం అని ఒకరి మీదొకరు పేల్చే బాణా సంచా రోజూ ఏదో ఓ సందర్భంలో మోగుతూనే ఉంటుంది!**

మేమేం తక్కువ తినలేదు అని పోటీపడే వాళ్ళు వాళ్ళ భార్యలు! ఈ గూట్లో ఉండాల్సిన దానివి నువ్వు కావంటే నువ్వుకావని వాళ్లమోత వాళ్ళది!

అయితే, ఆ ఇద్దరూ, ఆ ఇద్దరి ఇద్దరూ ఒకరి మొహాలొకరు చూసుకుంటూ, చిట్లించుకుంటూ కలిసి ఎందుకుంటున్నారంటే ముసలివాళ్ళైన తల్లి దండ్రులు ఇంకా బతికే ఉన్నారు కాబట్టే.

నా కొడుకులు నా రెండు కళ్ళు! నేనున్నంత కాలం నా కళ్లు నా కళ్ళను చూస్తుంటాయి అనుకున్న తండ్రి రెండిళ్ళు కట్టించి ఉంటే బాగుండేదని ఇప్పుడనుకుంటున్నాడు.

●●●

"మీకు ఏ పని మంచిదని తోస్తే ఆ పని చేయండి. మీకు సలహాచెప్పే తెలివి నా దగ్గర లేదు, చెప్పినా వినే జ్ఞానం మీకు లేదని మీ నాన్న అనుకున్నమాట.. నాతో అన్నమాట మీతో చెబుతున్నాను" అని తల్లి చెప్పింది.

నాన్న అంతమాట అన్నాడా అని ఒకళ్ళకు తెలియకుండా ఒకళ్లు తల్లి ముందు గొంతెత్తారే గాని, తండ్రిని అడిగే ధైర్యం ఇద్దరికీ లేదు. ఎందుకు అన్నాడా అని ఆలోచించే గుణం ఇద్దరిలో లేదు. ఆస్తంతా ఆడపిల్లలకు రాసిపోతాడేమో అని భార్యలు పెట్టిన భయం, సహజాలకు ఎప్పుడో దూరం చేసింది వాళ్ళను!

●●●

కూతుళ్ళిద్దరూ, అల్లుళ్లూ వచ్చారు పండక్కి. పెద్దల్లుడు సివిల్ లాయరు. రెండో అల్లుడు క్రిమినల్ లాయరు. పేరు, పరపతి ఉన్న వాళ్ళు. ముచ్చటైన జంటలు. అల్లుళ్ళే కొడుకులు అన్నంత గౌరవం ఆ తండ్రికి! ఒక్కడే కూర్చుని ఉన్నాడు తండ్రి, పర్వానందంతో, తన గదిలో. కొడుకులిద్దరూ వచ్చి తండ్రికి అటుపక్క ఇటుపక్క నిలుచున్నారు.

"ఏమైందిరా, ఏం చెప్పడానికొచ్చారో చెప్పేడవండి" అన్నాడు తండ్రి.

"నాన్నా, నువ్వెలాగూ పోయేవాడివే కదా" అన్నయ్యన్నాడు.

"ఇప్పుడప్పుడే పోయేట్లు లేను కదరా" కొడుకుల వాలకం గమనిస్తూ అన్నాడు తండ్రి.

"ఎప్పటికైనా పోతావు కదా, నాన్న" తమ్ముడన్నాడు.

"ఏవిటండీ ఇది, పండగ పూట. ఇల్లంతా నిండుగా ఉంటే ఈ మరణ పురాణ ప్రవచనాలేంటండీ" అంది తల్లి, భర్త గదిలో దేవుడికి అగరుబత్తీ వెలిగించడానికి వచ్చి.

"ఆ సంగతి నేను చూసుకుంటాన్లే గాని, నువ్వు ఆ భజగోవిందం శ్లోకాలకు తాత్పర్యాలు చదువుకో" అన్నాడు తండ్రి ధ్యానాలోచనతో.

"ఏ మాట ఎప్పుడు మాట్లాడాలో మీకు వేళా పాళా లేకుండా అయిందేంట్రా" అంటూ వెళ్లిన తల్లిమాటలో నిజమేదో ఉందని అనిపించిందేమో, లేచి వెళ్లారు కొడుకులు.

●●●

హాల్లో సభ తీరినట్లుగా అందరూ సమావేశమయ్యారు.

"మామయ్యగారూ, పండగ పూట మీ అల్లుళ్ళు మీ ఇంటికి వచ్చినట్లు మా అమ్మానాన్నలక్కూడా అనిపిస్తోంది కదండీ" అంది పె.కో.

"నా మాట కూడా అదే" అంది చి.కో.

"కనీసం ఈ విషయంలోనైనా మీమాట ఒకటైంది, సంతోషం తల్లీ! మీకున్న బుద్ధికి మించిన బుద్ధితో మీ మొగుళ్లు ఓ ప్రస్తావన తెచ్చారు. దాని పర్యవసానం ఏంటంటే నిత్యం మాకు మీ ఇళ్ళల్లో పండగే! మీరు వెళ్ళగొట్టినా అక్కడే పడుండే బుద్ధిమంతులమ్మా నా కొడుకులు" అన్నాడు తండ్రి.

"మామయ్యగారూ మీరేం మాట్లాడుతున్నారో నాకు అర్థం కావటం లేదు" అంది పె.కో.

"నాకు అర్థమైంది" అంది చి.కో.

"ఈ విషయంలో మీరు, ఒకరు ఒకటంటే ఇంకొకరు ఇంకోటనడం ఎందుకు? అందరికీ అర్థమయ్యే రీతిలో చెబుతా వినండి" అన్నాడు తండ్రి.

"చేతిలో ఆ కాయితాలేంటి నాన్నా" అడిగారు కూతుళ్ళు.

"ఏ కాశీకో, రామేశ్వరానికో మేం శాశ్వతంగా వెళ్ళడానికి టికెట్లమ్మా"

"టికెట్ల మీద కోర్టు స్టాంపులు కూడా ఉంటాయన్నమాట. నాన్నా! ఈ ఆస్తులూ పంపకాలూ

మీరు.. అన్నయ్యలు చూసుకోండి. భగవంతుడు మాకు ఇచ్చిందాంట్లో మేం సంతోషంగానే ఉంటాం. చిల్లిగవ్వ కూడా మేం పుట్టింటి నుంచి ఆశించడం లేదు. మేం వచ్చింది పండగ సరదా కోసమే" అన్నారు కూతుళ్ళు.

"విన్నావుగా నాన్నా! చెల్లెళ్ళు ఎంత మంచి మాట అన్నారో" అన్నారు కొడుకులు.

"మంచీచెడూ నాకు తెలుసు. అందుకే, మేం పోయింతరువాత మీ బుద్ధులు గడ్డి తినకుండా కాయితాలు సిద్ధం చేయించా. ముందు మనసుకి, ఆ తర్వాత ఆత్మకు శాంతి కావాలిగా" అన్నాడు తండ్రి.

క్షణం ఆలస్యం చేయకుండా తండ్రి చేతిలో కాయితాలు లాక్కున్నాడు అన్నయ్య. అన్నయ్య చేతిలోంచి తమ్ముడు. తమ్ముడి నుంచి పె.కో. పె.కో నుంచి. చి.కో.

పండగపూట ఈ సరదా బాగుందని చెల్లెళ్లు నవ్వారు. అల్లుళ్లు నవ్వుని కళ్ళలోనే దాచిపెట్టారు. తల్లి బెంబేలెత్తిపోయి కళ్ళప్పగించింది. తండ్రి మాత్రం పెద్దగా నవ్వాడు, నవ్వులో నవ్వులేకపోయినా.

"పిచ్చోళ్ళారా! అవి పిచ్చి కాయితాలు! అవి నాకు చాలా మంచిపని చేశాయి. మీ బుద్ధే మీటో చెప్పాయి. చూపించాయి. ఈ ఫలితం నాకెంతో ఆనందదాయకంగా ఉంది కాబట్టి మీకో స్వేచ్ఛ ఇస్తున్నాను. గంతలు, గంతకు తగిన బొంతల్లా ఉన్న మీ నలుగురి విశ్వరూపం చూసి నేను తట్టుకోలేక పోతున్నాను" అన్నాడు తండ్రి.

"ఇదంతా ఎందుకు నాన్నా, ఆ స్వేచ్ఛ ఏంటో చెప్పు" అన్నాడన్నయ్య.

"ఏం లేదురా, మీ నలుగురు ఆ గదిలోకి వెళ్ళండి. బయట గొళ్లెం పెడతాను. మీరు తీయ మన్నప్పుడే తీస్తాను. లోపల మీరు చేయాల్సిన పనేంటంటే పంపకం ఎలా చేయాలో, ఏం చేస్తే మీకు ఆనందంగా ఉంటుందో తేల్చి చెప్పండి" చెప్పాడు తండ్రి.

"నీలో ఇంత మంచితనం ఉందనుకోలేదు, నాన్నా" అన్నాడు తమ్ముడు.

●●●

"అదేంటి నాన్నా, అన్నయ్యలకు ఆ పరీక్ష పెట్టావు?"

"పరీక్ష కాదమ్మా! వాళ్ళేంటో సగం చెప్పారు, చూపించారు. బయటికొచ్చిన తరువాత పూర్తి సినిమా చూస్తాం. బావలున్నారే అన్న ఇంగిత జ్ఞానం కూడా లేదు వాళ్లకి".

"వాళ్ళేంటో, మాకు మా పెళ్ళిరోజే తెలిసిం దిగా" అన్నాడు పెద్దల్లుడు.

"నేను చట్టానికి సంబంధించిన వాణ్ణన్న వెరపు కూడా లేదెందుకో" అన్నాడు చిన్నల్లుడు నవ్వుతూ.

"ఆ మంచితనం మీలో ఉండబట్టే, వాళ్ళ వంకరబుద్ధి సరిగ్గా అయ్యేట్లు లేదు. అదే వేరే వాళ్ళయితే వాళ్ళు చేసిన గొడవలకి ఎప్పుడో జైల్లో రాళ్ళు మోస్తుండేవాళ్లు" అన్నాడు తండ్రి.

"మంచితనం అంటే మీ అమ్మాయిలే".

"అదేంటో, వీళ్ళిలాకాబట్టి వాళ్ళలాగో, వాళ్ళలా కాబట్టి వీళ్ళిలాగో, కానీండి, పరిస్థితి చేతిలో ఉంటుందంటారా?"

"దాటకుండా మేం ఉన్నాంగా".

●●●

రెండు గంటల్లో రెండు జంటలూ బయటి కొచ్చాయి. జుట్టు చెదిరి, బట్టలుచినిగి, జడలూడి, గాజులు పగిలి, గూడలరిగి, గోళ్ళు విరిగి, మోకాళ్ళూ, మోచేతులూ గోక్కోపోయి నడకమారి..

**దీపావళి పండక్కి వచ్చారు కొడుకులూ కోడళ్ళూ. ఆ ముసలి తల్లిదండ్రులకు ఆనందం పంచివ్వడం మానేశారు వాళ్ళు. ఆస్తి సంగతి తేల్చమని పట్టుబట్టారు. అప్పుడా తండ్రి ఆగ్రహం తెచ్చుకోలేదు. తెలివిగా సమస్యను పరిష్కరించాలనుకున్నాడు. ఒక గదిలోకి వాళ్ళను పంపించాడు. నలుగుర్నీ మాట్లాడుకుని రమ్మన్నాడు. బైట గొళ్ళెం పెట్టాడు. రెండు గంటలు గడిచిన తర్వాత ఆ ఇంట్లో ఏం జరిగింది?**

తండ్రి ఆనందంగా చప్పట్లు కొట్టాడు! చెల్లెళ్ళు ఆందోళనగా చూశారు!

తల్లి కన్నీళ్లు తుడుచుకుంది! అల్లుళ్ళు ఆశ్చర్య పోయారు.

రెండు జంటలూ తలల వాలి, వాళ్ళ వాళ్ళ గదుల్లోకి వెళ్లాయి.

●●●

తండ్రి పిలుపు మేర క్షణాల్లో వచ్చిన వియ్యాం కులకు, ఆహ్వానం పలికారు కూతుళ్ళు, అల్లుళ్ళు!

"మా కూతుళ్ళు, అల్లుళ్ళు కనిపించరేం? ఎక్కడ దాచిపెట్టారు" నవ్వుతూ అడిగారు వియ్యంకులు.

"వాళ్ళను గదుల్లోంచి బయటికి రప్పించడానికే మిమ్మల్ని పిలిచింది" అన్నాడు తండ్రి నవ్వుతూ.

●●●

"ఇదీ పరిస్థితి! పెద్దలం చక్కదిద్ది పిల్లల్ని సంతోషంగా ఉంచాల్సిన సమయం వచ్చింది కాబట్టే మిమ్మల్ని పిలిచాను" చెప్పాడు తండ్రి.

"తండ్రిగా మీరు ఏ నిర్ణయం తీసుకున్నా సవినయంగా ఒప్పుకోవాల్సింది పిల్లలు" అన్నారు వియ్యంకులు.

"అదే జరిగితే లేందేముంది" అన్నాడు తండ్రి. తండ్రి మనసులో ఏదో తెలియని అశాం తిని చూసి "ఏమయిందండీ! బావగారూ!" అన్నారు వియ్యంకులు.

"నేనేం దాచిపెట్టలేదుగా, జరిగింది చెప్పాను. దాచి పెట్టింది ఒకటే. అది వీడియో" అన్నాడు తండ్రి.

"వీడియో ఏంటి, మామయ్యగారూ!" ఆశ్చ ర్యంతో కూడిన భయంతో అడిగారు కోడళ్ళు.

"మీలో ఏ స్పందనా లేదేంట్రా" అని తండ్రి అనడంతో, కొడుకులు, తండ్రి పాదాలపై తలలు ఉంచారు.

"బావగార్లూ, ఇప్పుడు మీరే న్యాయనిర్ణేతలు! నాకున్న ఆస్తి ఇది. ఎవరికి ఎంత చెందాలని మీరేది చెబితే అది ఆచరిస్తాం. కాయితాలూ, సంతకాలు కూడా ఇవ్వాళే అయిపోవాలి, ఇంటి లాయర్లు ఉండగానే" అన్నాడు తండ్రి.

"బావగారూ, ఇది అన్యాయం" అన్నారు వియ్యంకులు నవ్వు చెదరని వినయంతో.

"న్యాయం కోరడం అన్యాయం అంటే ఎలా గండీ" అన్నాడు తండ్రి.

"బావగారూ, క్షమించండి!" వియ్యంకులూ తండ్రికి పాదాభివందనం చేశారు.

"ఇదేం బాగోలేదు, న్యాయనిర్ణేతలు అన్యాయం చేయడం" వాళ్లను ఆప్యాయంగా లేవదీస్తూ అన్నాడు తండ్రి.

"మళ్ళీ ఆమాట దయచేసి వాడకండి. తప్పు మా అమ్మాయిలది. ఇక్కడ వాళ్ల ప్రవర్తనవేరు. అక్కడ మాకు ప్రవచించింది వేరు. ఇటువంటి ఆడపిల్లల్ని కన్నందుకు మేం సిగ్గుపడుతున్నాం" అన్నారు వియ్యంకులు.

"ఇటువంటి కొడుకుల్ని కన్నందుకు మేమూ సిగ్గుపడుతున్నాం. అందుకే మనం సిగ్గు విడి చేద్దాం" అన్నాడు తండ్రి నవ్వుతూ.

"అందరూ నవ్వారు!"

"ఇక ఆలస్యమెందుకు! అమ్మాయిలూ దీపాలు వెలిగించండి" అన్నారు అల్లుళ్ళు.

సెల్: +91 98498 63672






**మరణంతో శత్రుత్వం సరి. రావణునికి అంత్యసంస్కారాలు నిర్వర్తించమని విభీషణుణ్ణి ఆజ్ఞాపించాడు రాముడు. అతని ఆజ్ఞ శిరసావహించి రావణుణ్ణి దహనం చేశాడు విభీషణుడు. దహనానంతరం రాముడు ప్రసాదించిన రాజ్యాన్ని స్వీకరించాడు. పట్టాభిషిక్తుడయ్యాడు. అప్పుడు హనుమను చేరపిలిచాడు రాముడు. విభీషణుని అనుమతి తీసుకుని, అశోక వనంలో ఉన్న సీతను కలవమన్నాడతన్ని. తన క్షేమసమాచారాలూ, సందేశాన్నీ సీతకు వినిపించమన్నాడు. తన సమక్షానికి తీసుకుని వచ్చేందుకు త్వరలోనే ఆమెను విభీషణుడు కలుస్తాడని కూడా చెప్పమన్నాడు. సీతను కలసి హనుమ చెప్పాడలాగే! ఆమె సంతోషించింది. ఆ సంతోషంలో మాట్లాడలేకపోయింది. కాసేపటికి తేరుకున్నది. అన్నదిలా.**

# సీతకు శ్రీరాముని ఆహ్వానం:ఆగ్రహావేశాలు

"హనుమా! రాముని విజయవార్తలు విని, ఆనందం పట్టలేకపోయానయ్యా! అందుకే క్షణకాలం మూగనయ్యాను. మాట్లాడలేకపోయాను. నేను మాట్లాడకపోవడానికి మరోకారణం కూడా ఉంది. ఇంత గొప్ప సందేశాన్ని తెచ్చిన నీకు బహుమతిగా ఏం ఇవ్వాలో ఆలోచించడంలో కూడా నాకు మాటలు కరువయ్యాయి. నీకు బహుమతిగా ఇచ్చేందుకు ఈ భూమండలంలోనే ఏ వస్తువూ నాకు కనిపించలేదయ్యా! మణి మాణిక్యాలూ, రత్నరాసులూ, స్వర్ణసింహాసనాలూ ఇచ్చినా...ఆఖరికి ఈ భూమండలంపై సర్వాధిపత్యాన్ని నీకిచ్చినా అది కూడా తక్కువనే నాకు అనిపిస్తోంది." అన్నది సీత. హనుమకు నమస్కరించేందుకు చేతులు జోడించి, అంతలోనే అది తప్పని గ్రహించి వాటిని విడదీసింది. సీత మాటలూ, చేష్టలూ గమనించి పొంగిపోయాడు హనుమ. అన్నాడిలా.

"తల్లీ! నాకు బహుమతిగా ఇవ్వదగిన వస్తువు ఈ భూమండలంలోనే లేదన్న మాట చాలమ్మా! అదే నాకు పెద్ద బహుమతి. నీతో పట్టాభిషిక్తుడై రేపు జగతిని పాలించే రాముణ్ణి సేవించే భాగ్యం కంటే నాకు గొప్ప బహుమతి లేదు. అది చాలు."

హనుమ సంస్కారానికీ, మాటతీరుకీ ఆనంద బాష్పాలు రాల్చింది సీత.

"మాటలంటే నీవేనయ్యా! అర్థవంతంగా, మధురంగా మాట్లాడడం నీకే చెల్లింది. పరమధార్మికుడివి. బల తేజో ధైర్య వినయాది సద్గుణాల సంపన్నుడివి. నిన్ను ఎలా అభినందించాలో కూడా తెలియడం లేదు." అన్నది సీత.

ధన్యుణ్ణి అన్నట్టుగా చూశాడు హనుమ. చేతులు జోడించి నమస్కరించాడామెకి. ఆ తర్వాత సీత చుట్టూ ఉన్న రాక్షసస్త్రీలను చూశాడు. గతంలో వారు సీతను పెట్టిన హింసలు గుర్తొచ్చాయతనికి. కోపంగా కళ్ళు పెద్దవి చేసి చూశాడు. గుండెలదిరేలా అరిచాడు. ఆ అరుపునకు రాక్షసస్త్రీలంతా కళ్ళు మూసుకుని గుప్పెట ప్రాణాలు దాచుకున్నారు. ఒక్కొక్కరినీ ముద్ద చేసి విసిరేయాలన్నంత కోపంతో ఉన్నాడు హనుమ. అడిగాడిలా.

"తల్లీ! ఈ కాపలాస్త్రీలు నీ స్థితికి జాలిపడలేదు సరికదా, నిన్ను అనుక్షణం నానాయాతనలూ పెట్టారు. అన్నీ నాకు గుర్తున్నాయి. నువ్వు 'ఊఁ' అను! వీళ్ళందరినీ చిటికెలో చిత్రవధ చేస్తాను."

తప్పు! అలా మాట్లాడకూడదన్నట్టుగా సన్నగా నవ్వుతూ తలూపింది సీత.

"రాజుకి ఊడిగెం చేస్తూ జీవించేవాళ్ళు, రాజాజ్ఞను అనుసరించి బాధించేవాళ్ళు. వారిపై కోపగించుకోవడం ధర్మం కాదు. ఆ రాజేపోయాడు. ఇక వీళ్ళేం చేస్తారు?" అన్నది సీత.

ఆ మాటలకు ధైర్యం కలిగింది రాక్షసస్త్రీలకు. తమకు ఎలాంటి హానీ జరగదని నమ్మకం కలిగింది. కళ్ళిప్పి సీతను చూశారు.

"అయినా వీరిని ఆడిపోసుకోవడం ఎందుకు? నా పాపఫలితంగానే నేను బాధలు అనుభవించాను. కర్మఫలం తప్పించుకోలేమయ్యా. హింసకు హింస సమాధానం కాదు. విజ్ఞులు అందుకు ఒప్పుకోరు. ఓ కథ చెబుతాను విను." అన్నది సీత. చెప్పసాగిందిలా.

"తనని తరుముతున్న పులి నుండి తప్పించుకునేందుకు పరుగున వచ్చి చెట్టెక్కాడు ఓ వేటగాడు. అప్పటికే ఆ చెట్టుమీద ఎలుగుబంటి ఒకటి ఉన్నది. దానిని చూసింది పులి. అన్నదిలా.

"నేస్తమా! నా నుండి తప్పించుకుని నీ దగ్గరకు వచ్చిన ఆ వేటగాణ్ణి కిందకు తోసేయ్. వాడు నీకూ నాకూ ఇద్దరికీ శత్రువే! శత్రువు మీద జాలి పడకు."

తనని కిందకు తోసేస్తుందేమోనని వణకిపోతున్న వేటగాణ్ణి చూసి జాలి చెందింది ఎలుగుబంటి.

"నా ఇంటికి వచ్చిన అతిథి ఈ వేటగాడు. అతన్ని కిందకు తోసేయడం సబబు కాదు. సంస్కారం కాదు. నేను ఆ పని చెయ్యను." అన్నది ఎలుగుబంటి. చీకటిపడడంతో నిద్రపోయిందక్కడే!

నీ తెలివి తెల్లారినట్టే ఉంది అనుకున్నది పులి. కూర్చున్న చోటు నుంచి కదల్లేదు. ఎలుగుబంటునీ, వేటగాణ్ణీ చూస్తూ ఉన్నదలాగే! కాసేపటికి వేటగాడితో అన్నదిలా.

"ఇదిగో! నేను ఇక్కణ్ణుంచి తప్పుకున్న వెంటనే నిన్ను ఆ ఎలుగుబంటి తినేస్తుంది. అందులో అనుమానం లేదు. కాబట్టి నా మాట విను. నిన్ను నువ్వు కాపాడుకో! ఆ ఎలుగుబంటిని కిందకు తోసేయ్." అన్నది పులి.

పులి చెప్పింది. వినడమే తక్షణకర్తవ్యం అనుకున్నాడు వేటగాడు. బలం అంతా ఉపయోగించి నిద్రపోతున్న ఎలుగుబంటిని కిందకు తోసేశాడు. అయితే మాగన్నుగా ఉన్న ఎలుగుబంటి వెంటనే తేరుకుని, చెట్టుకొమ్మనొకదాన్ని పట్టుకుని ప్రాణాలు కాపాడుకుంది. కింద పడలేదు. జాగ్రత్తగా ఎక్కి కొమ్మ మీద కూర్చుంది. పులి నవ్విందప్పుడు. ఎలుగుబంటితో అన్నదిలా.

"తెలిసింది కదా, ఆ వేటగాడు ఎంతటి క్రూరుడో! ఇప్పటికైనా మించిపోయింది లేదు. కిందకు తోసేయ్ వాణ్ణి. నీ కసీ, నా కసీ తీరేట్టుగా వాణ్ణి చీల్చి చీల్చి తింటాను."

భయంతో వణకిపోతున్న వేటగాణ్ణి చూసింది ఎలుగుబంటి. జాలి చెందింది.

"ఎదుటివాడు తప్పు చేశాడని సజ్జనుడు తప్పు చెయ్యకూడదు. చేస్తే అంతకు మించిన పాపం మరొకటి లేదు. పైగా సజ్జనులకు శీలమే అలం

**రాముని ఆజ్ఞతో విభీషణుడు అంతఃపుర మహిళలూ, భార్యసహా సీతను సమీపించి రామ సందేశం వినిపించాడు. అది విని సరేనన్నది సీత. మహిళలు ఆమెకు అభ్యంగనం చేయించి, రాజోచితాలైన వస్త్రాలు ధరింపజేశారు. ఆభరణాలతో అలంకరించి, మేలిముసుగు సరిజేసి, పల్లకీ ఎక్కించి మోసుకుంటూ భటులు సహా రాముణ్ణి సమీపించాడు విభీషణుడు. అప్పుడు రాముడేమన్నాడు?**



కారం. అందుకని నేను ఈ వేటగాణ్ణి కిందకు తోసి, నీకు ఆహారంగా సమర్పించలేను.” అన్నది ఎలుగుబంటి.

కథ ముగించింది సీత.

“శిక్షార్హుడైన పాపినైనా సజ్జనుడు క్షమించాలి హనుమా! హింసకు ప్రతిహింస తగదు. పైగా ఈ స్త్రీలందరినీ రక్షిస్తానని నేను అభయం ఇచ్చాను. కాబట్టి నీ కోపాన్ని తగ్గించుకో! ఈ రాక్షసస్త్రీలను కనికరించు” అన్నది సీత.

“నువ్వు భర్తకు తగిన భార్యవమ్మా. సీతంటే రాముడికి ఎందుకింత ప్రేమో ఇప్పుడు అర్థమైంది. సరే! స్వామికి నీ మాటగా ఏం చెబుతావో చెప్పు. వెళ్ళి వారికి విన్నవిస్తాను” అన్నాడు హనుమ.

“ఏం చెప్పను. ఒకటే మాట. స్వామిని తక్షణం చూడాలని ఉన్నది. ఆ మాట చెప్పు, చాలు.”

“తప్పకుండా తల్లీ” అన్నాడు హనుమ. సీతకు ప్రదక్షిణ నమస్కారాలు చేసి అక్కణ్ణుంచి బయల్దేరాడు. రాముణ్ణి సమీపించాడు. తల్లి చెప్పిన మాట వినిపించాడతనికి.

సీతను చూసేందుకు తానెంతగా త్వరపడుతున్నాడో ఆమె కూడా అలాగే తనని చూసేందుకు త్వరపడుతున్నదని తెలుసుకుని కళ్ళు చెమర్చుకున్నాడు రాముడు. బాగా ఆలోచించాడు. విభీషణుణ్ణి చేరపిలిచాడు. చెప్పాడిలా.

“మిత్రమా! నా దేవేరికి అభ్యంగనం చేయించి, చందన వస్త్రాభరణభూషితను చేసి, ఇక్కడకి తోడుకుని రా.”

“తప్పకుండా స్వామి” అన్నాడు విభీషణుడు. అక్కణ్ణుంచి బయల్దేరాడు. అంతఃపురమహిళలూ, భార్యసహా సీతను సమీపించాడు.

“తల్లీ! రాముడు నిన్ను తోడుకుని రమ్మన్నాడు.” చెప్పాడు విభీషణుడు.

“పదండి” అంటూ ఒక్క ఉదుటున లేచింది సీత.

“ఉన్నపళాన కాదమ్మా! నీకు అభ్యంగనం చేసి, చందన వస్త్రాభరణభూషితను చేసి మరీ తోడుకుని రమ్మన్నాడు.” చెప్పాడు విభీషణుడు.

అవునా? అని ఆశ్చర్యపోయింది సీత.

“అవునమ్మా! నీకు అభ్యంతరం లేకపోతే ఈ మహిళలు నిన్ను అలంకరిస్తారు.”

సరేనన్నది సీత. మహిళలు ఆమెకు తలస్నానం చేయించారు. రాజోచితాలైన వస్త్రాలు ధరింపచేశారు. ఆభరణాలతో అలంకరించారు. మేలి ముసుగు సరిచేసి, పల్లకీ ఎక్కించారు. తెరమరుగు లేదు సీతకి. అందరికీ కనిపిస్తోందామె. నవ్వుతూ కూర్చున్న సీతను మోసుకుంటూ విభీషణుడు భటులసహా రాముణ్ణి సమీపించాడు.

అటు తిరిగి ఉన్నాడు రాముడు. తీవ్రంగా ఆలోచిస్తూ నిల్చున్నాడు. సుమారుగా సంవత్సర కాలం బందీగా ఉన్నది సీత. ఆ బందీకి విముక్తి కలిగించాడతను. రమ్మని ఆహ్వానించాడు. వస్తున్నది. ఆమెను ఎలా ఆదరించాలి? ఒక పక్క దైన్య సంతాపాలు, మరోపక్క ఆగ్రహావేశాలు, ఇంకో పక్క ఆనందసంతోషాలు ముప్పిరిగొంటుంటే మాటలేక మాటరాక మౌనం వహించాడు రాముడు. మరింత చేరువుగా రాముణ్ణి సమీపించాడు విభీషణుడు. విన్నవించాడిలా.

“స్వామీ! తల్లిని తీసుకుని వచ్చాను.”

“నా దగ్గరకు తీసుకుని రా”

పల్లకీని రామునికి చేరువుగా తీసుకుని రమ్మని కేకేశాడు విభీషణుడు. భటులు తీసుకుని రాసాగారు. సీతను పల్లకీలో తీసుకుని వస్తోంటే వేలాదిగా వానరులు ఆమెను చూసేందుకు తొక్కిసలాడసాగారు. ప్రాణాలకు తెగించి తాము ఎవరి కోసం పోరాడేమో ఆమెను చూసేందుకు తహతహలాడారు. పల్లకీచుట్టూ మూగసాగారు. ముందుకు వెళ్ళేందుకు వీలులేకుండా పల్లకీని అడ్డగించసాగారు. తప్పుకోండి తప్పుకోండి అని ఎంతగా హెచ్చరించినా వినలేదెవరూ. దాంతో అడ్డు తొలగించేందుకు చేతికర్రలతో వానరులను వెనక్కినెట్టారు భటులు. కర్రలతో బలంగా నెట్టడంతో వానరులంతా ఒకరిపై ఒకరు పడి కల్లోలమయ్యారు. పెద్దగా అరవసాగారు. చూశాడది రాముడు. కోపించాడు. విభీషణుణ్ణి చూశాడు. అన్నాడిలా.

“విభీషణా! వానరులను ఎందుకు వెనక్కినెట్టారు? నీకు తెలీదా వాళ్ళెవరో? వారంతా నావారు. అయినా స్త్రీని రక్షించేది శీలమేగాని రాచమర్యాదలూ, అంతఃపురాలూ కావు. దుఃఖంలోనూ, యుద్ధంవేళా, యజ్ఞ, స్వయంవర సమయాల్లోనూ స్త్రీలు పదిమందిమధ్యకూ రావచ్చును. అందులో తప్పులేదు.”

అవాక్కయి నిల్చున్నాడు విభీషణుడు.

“యుద్ధం ముగిసి, నేను పిలిస్తే నన్ను చూసేందుకు వస్తోంది సీత. ఈ సమయంలో సీతను చూడవచ్చిన వానరులది ఎంతమాత్రమూ తప్పు కాదు. అందులో దోషం కూడా లేదు. పల్లకీలో కాదు, సీతను నడచి నా దగ్గరకు రమ్మను.” ఆజ్ఞాపించాడు రాముడు. ముఖాన్ని ఇటు తిప్పలేదు. అటు తిరిగి ఉండే సంభాషించాడంతా. రాముడి ప్రవర్తన లక్ష్మణ, సుగ్రీవాదులకు విస్మయం కలిగించింది. రాముడు ఎందుకో కల్లోలపడుతున్నాడని గ్రహించారు. కలవరపడ్డారు. రాముడి ప్రవర్తన అర్థం కాక విభీషణుడు దిక్కులు చూశాడు. తర్వాత తేరుకున్నాడు. మెల్లగా సీతను సమీపించాడు.

“తల్లీ! రాముడిదగ్గరకు నువ్వు నడచి రావాలట! అది ప్రభువు ఆజ్ఞ.” చెప్పాడు విభీషణుడు. నవ్వి, రాముణ్ణి చేరేందుకు ముందుకు నడచింది సీత. వియోగదుఃఖం, ఉపవాసాలతో శుష్కిం చిన శరీరం, తూలుతోందామె. సరిగా నడవలేకపోతోంది. అయినా భర్త ఆజ్ఞను కాదనరాదని ఆదరంగా, ఆదుర్దాగా రాముణ్ణి చేరింది సీత.

“నాథా” అన్నది. తలెత్తి రాముణ్ణి చూసింది. ఉదయిస్తోన్న చంద్రబింబంలా ఎర్రగా ఉన్నాడు రాముడు. ఆగ్రహావేశాలు వెళ్ళగక్కుతూ ఉన్నాడు. భయం గొలుపుతున్నాడు. ఆ ముఖాన్ని చూడలేకపోయింది సీత. చేతుల్లో ముఖాన్ని దాచుకుంది. సీతేకాదు, అక్కడ ఉన్న లక్ష్మణ, సుగ్రీవ, హనుమాదులు కూడా రాముని ముఖాన్ని చూసేందుకు భయపడ్డారు. లేశమాత్రం కూడా కరుణ లేని ఆ ముఖాన్ని వీక్షించలేమని వెనక్కి తగ్గారు.

**-అరణి**



# చిన్న ఉదాహరణ

-బాలి

**ఉదయం తొమ్మిది గంటలైనట్టుంది. గది తాళం తీసి చేతిలో సంచి టేబుల్‌పైనపెట్టి షాపు వాడిచ్చిన బిల్ చెక్ చేస్తున్నాను. సంచిలో సామాన్లు కొద్దిగానే ఉన్నాయి. పోయిన ట్రిప్‌లో అంతే వస్తువుల ధర మూడు వందల రూపాయలుంటే ఇప్పుడు మూడువందల ఎనభై రూపాయలు అయ్యింది.**

ధరలు పెరుగుతున్నాయంటే ఇదే!

అనుకోకుండా నా భృకుటి ముడిపడింది. ఇంతలో టేబుల్ చివరనున్న ఫోన్ మోగింది. నా ఆలోచనలు పక్కకు జారిపోయాయి.

"బాగున్నావురా! నేనీ ఊరు వచ్చేశాను. మధురానగర్‌లో నాకు సొంత ఇల్లుందని నీకు తెలుసుకదా! కొంచెం ప్రశాంతంగా ఉన్న తరువాత నీకు ఫోన్ చేద్దామనుకున్నాను. ఇప్పుడు ఫరవాలేదు. అన్నట్టు మనం కలుసుకుని ఐదేళ్ళ పైన కాలేదూ" అని.

నాకు ఫోన్‌లో మాట్లాడుతున్నదెవరో తెలియలేదు. మొదట ఆ గొంతు గుర్తుపట్టలేకపోయాను. నాకు బాగా పరిచయమున్న వ్యక్తే అయ్యుంటాడు. అయితే ఆ చివరిమాట "ఐదేళ్ళపైన కాలేదూ" అంటే రంగరాజే అలా మాట్లాడతాడు. నెగెటివ్ థింకింగ్ మాటలు వాడి నోటినుండే వస్తాయి. అంతావిని "మంచిది.. మనం కలుసుకుందాం" అని ఫోన్ పెట్టేశాను.

•••

రంగరాజు సుమారుఎత్తులో తెల్లగా ఉంటాడు. ముందు పళ్ళు కొంచెం ఎత్తు - ముఖమంతా వయస్సు ఇచ్చిన పుష్టివల్ల అతను నవ్వినప్పుడే ఆ విషయం తెలుస్తుంది. అసిస్టెంట్ ఇంజనీర్‌గా సాగర్‌లో పనిచేసేవాడు. ప్రస్తుతం ఇటు ట్రాన్స్‌ఫరై వచ్చాడన్న మాట.

మరో నాలుగురోజుల తరువాత రంగరాజు నుండే ఫోను...

"ఒరేయ్, రేపు సోమవారం మంచిరోజట. ఉదయం ఎనిమిది గంటలకు ఇంట్లో సత్యనారాయణవ్రతం పెట్టుకున్నాను. భోజనాలు కూడా! మన మిత్రులందరూ వస్తున్నారు. నీవూ తప్పక రావాలి సుమా! ఇదిగో మీ చెల్లెలు ఇక్కడే ఉంది. నీతో మాట్లాడుతుందట".

ఫోన్ ఆమెకిచ్చినట్లున్నాడు-

ఆమె ఆప్యాయంగా పలకరిస్తూ, 'అన్నయ్య, మీరు తప్పక రావాలి. భోజనాలు ఇక్కడే' అంది మరోమారు.

"శారదమ్మా! బాగున్నావా!" అని పలకరిస్తూ "తప్పక వస్తాను. మీ ఫ్యామిలీని చూసి చాలా సంవత్సరాలైంది" అన్నాను నవ్వుతూ.

ఆమె ఇంకా మురిసిపోయింది.

మరోసారి నన్ను ఆహ్వానిస్తూ సరదాగా నవ్వింది.

ఫోన్ దింపేశాను.

సోమవారం మధురానగర్‌లోని రంగరాజు ఇంటికెళ్ళాను. ఇంటికి చిన్నచిన్న రిపేర్లు చేయించి సున్నాలు వేయించినట్టున్నాడు. ఇంటిముందు షామియానా, మామిడాకుల తోరణాలతో, వచ్చేపోయే బంధుమిత్రులతో గొప్పసందడిగా ఉంది.

ఆ భార్యాభర్తలిద్దరూ చక్కగా పలకరిస్తూ అందర్నీ ఆహ్వానించారు. తన కొడుకుని పరిచయం చేశారు. వాణ్ణి చిన్నప్పుడెప్పుడో చూశాను.

గీతంలో చదువైపోయిందట. ఉద్యోగ ప్రయత్నంలో ఉన్నాడని తెలుస్తోంది. హాలులో వ్రతం పెట్టుకున్నారు. మోకాళ్ళ నొప్పులూ, కింద కూర్చోలేం అన్న వారందరూ గోడపక్కనున్న కుర్చీల్లో కూర్చుంటే, కిందపరచిన జంబుఖానాలపై మిగిలినవారు కూర్చున్నారు. అందులో నేనొకణ్ణి. రంగ రాజులో ఏ మార్పు లేదు. ఒంటికున్న తెలుపూ, ఆ నవ్వూ, కొంచెం ఎత్తైన పళ్ళూ అన్నీమామూలే! అయితే కొంచెం బొజ్జ వచ్చినట్లుంది. అయినా రంగరాజుని తెలుసుకోవాలంటే-

వ్రతం మొదలైంది. ఆ పక్కనే కొంచెం దూరంలో పళ్ళు, పూలు, పత్రాలు ఇంకా ఇతర పూజాసామగ్రి ఉన్నాయి. పురోహితుడు పూజ చేయిస్తూ మధ్యమధ్య ఏదేదో అడుగుతున్నాడు. విధానం చెబుతున్నాడు.

"అమ్మా! అగరొత్తులు వెలిగించండి."

"అగరొత్తులు ఉన్నాయా!" రంగరాజు ప్రశ్న.

"ఆc ఉన్నాయి. ఆ పక్కనున్న పళ్ళెంలో ఉన్నాయి" శారదమ్మ చెప్పింది.

అగరొత్తులు వెలిగించి పసుపుతో చేసిన వినాయకుడి చుట్టూ ముమ్మారు తిప్పి భార్య శారదవైపు చూశాడు.

"అరటిపళ్ళు లేవా" అన్నాడు.

"ఎందుకూ?"

"అగరొత్తులు గుచ్చడానికి-"

"ఆ పక్కపళ్ళెంలో చూడండి. అగరొత్తుల స్టాండ్ ఉంది" అన్నది.

"వినాయకుడికి చందనం అద్ది నమస్కరించండి" అన్నాడు పురోహితుడు.

"చందనం లేదూ" అన్నాడు రంగరాజు.

"ఆ తమలపాకులో చందనం అరగతీసి పెట్టాను చూడండి" అంది శారద.

**అగ్గిపెట్టె లేదూ? పాలవాడు రాలేదూ? అంటూ నెగెటివ్ భావాలు ప్రదర్శిస్తాడు ఈ కథలో రంగరాజు. ప్రతిమాటలోనూ అలా నెగెటివ్ భావాల్ని పలికించకపోతే అతగాడు రంగరాజే కాదు. చాలా సంవత్సరాల తర్వాత ఫోన్‌లో పాతస్నేహితుణ్ణి ఇంట్లో ఫంక్షన్‌కి పిలిచాడతడు. అతడి నెగెటివ్ డైలాగుతోనే రంగరాజుని పోల్చుకున్నాడా పాత స్నేహితుడు. తన మాటతీరువల్ల రంగరాజుకి ఏ కష్టాలూ రాలేదా? అతడి జీవితం సాఫీగా సాగిపోయిందా?**

రంగరాజు కొంచెం చందనం వేలితో వినాయకుడికి అద్దాడు.

"నూతన వస్త్రం లేదూ" రంగరాజు ప్రశ్న.

శారద పళ్ళెంలో ఉన్న పసుపు అద్దిన దూది ఉండలు ఇచ్చింది. రంగరాజు భక్తిగా ఆ నూతన వస్త్రాలను గణపతికి చూపి పక్కగా అమర్చాడు. చేతులు రెండూ జోడించాడు.

వ్రతం నడుస్తూనే ఉంది.

పురోహితుడు అడిగిన వాటికి "అవిలేవూ - ఇవిలేవా? అని అంటూనే ఉన్నాడు రంగరాజు, శారదవైపు చూస్తూ. దగ్గర్లో ఉన్న పళ్ళెంలో అవి ఎక్కడ ఉన్నాయో ఆమె చెప్తూనే ఉంది. దగ్గర్లో లేకపోతే తనకు సాయంగా పెట్టుకున్న రంగమ్మ గారనే ముసలమ్మకు చెప్పి, వాటిని మంటపానికి తెప్పిస్తోంది. నాకు ఈ పూజావ్రతానికన్నా రంగరాజు "అవిలేవా? ఇవిలేవా? అనే నెగెటివ్ ప్రశ్నలతో శారదమ్మగారి ముఖంవైపు చూడ్డమే ఆకర్షణీయంగా ఉంది. అతన్ని ఈ మధ్య మరచిపోయిన నాకు అతడి వ్యక్తిత్వం స్పష్టంగా కనపడుతూ, ఇంకా బాగా అర్థమవుతున్నాడు.

పూజ అయిపోయింది. పక్కనున్న వరండాలో భోజనాలు మొదలయ్యాయి. అక్కడా అంతే! మాతో కబుర్లు చెబుతూ, నవ్విస్తూ వడ్డన చేస్తున్న వారిని పులుసు లేదా? మజ్జిగ లేదా? కూరలు లేవా? అంటూ, వారితో ఉన్నాయి అనిపించుకుంటూ, మాకు వడ్డింపులు చేయిస్తూ హడావుడిగా తిరుగుతున్నాడు.

"రంగరాజు వంటకాలు అవిలేవా? ఇవిలేవా? అని వారిని అడుగుతున్నావు. చివరకు నువ్వు భోజనానికి కూర్చున్నప్పుడు ఇవన్నీ లేకపోవచ్చు చూసుకో అన్నాను." విరగబడి నవ్వాడు.

అటేవస్తూ మా మాటలు విన్న శారదమ్మ, "ఆయన మాటలు అంతే అన్నయ్యగారూ! ముందు రోజు డజను అగ్గిపెట్టెలు ఆయన స్వయంగా కొని తెచ్చినా సరే - రెండోరోజు వాటి అవసరం అయినప్పుడు, అగ్గిపెట్టె ఇలా తెచ్చిపెట్టు అనే బదులు 'అగ్గిపెట్టె లేదా?' అనే మాటే ఆయన నోటివెంట వస్తుంది. నాకూ అలవాటైపోయిందిలెండి" అంది. అలవాటు కాకుండా ఉంటుందా? సగం జీవితాలు అయిపోయిన తరువాత-

ఆ తరువాత రోజుల్లో రంగరాజుని ఒకటి రెండుసార్లు కన్నా ఎక్కువ కలుసుకోలేక పోయాను.

అతను సివిల్ ఇంజనీర్ కావడంతో ఎవరో మిత్రుని రియల్ఎస్టేట్ పనులకోసం హైదరాబాద్ మకాం మార్చాడని, అక్కడినుండి కొడుక్కి బెంగుళూరులో ఉద్యోగం దొరకడంతో తిరిగి బెంగుళూరు వెళ్ళిపోయాడని విన్నాను. ఈ మధ్యలో ఎన్ని సంవత్సరాలు గడిచాయో తెలియదు.

నిన్న ఉదయం చేతిలో దినపత్రికను రెండో చేతిలో కొడుతూ మా పక్కనున్న అపార్ట్‌మెంట్ వాచ్‌మెన్‌ని అడుగుతున్నాడు నా పేరు చెబుతూ.

"ఈ వీధేనూ-సన్నగా పొడవుగా ఉంటాడు. పేరు ఆదినారాయణ. కొత్తకొత్త ఇళ్ళు వచ్చాయి. పోల్చుకోలేక పోతున్నాను. అయితే అతని ఇంటి ముందు గేటుకి పక్కగా కొబ్బరిచెట్టు ఉంటుంది."

ఆ వాచ్‌మెన్ కొత్త కుర్రాడు.

మెట్లమీద ఉదయపు చల్లదనాన్ని అనుభవిస్తూ వేడి 'టీ'ని ఆ పక్కనేపెట్టి ఆ రోజు పేపర్ తిరగేయబోతున్న నా చెవిలో ఆ మాటలు పడ్డాయి. తలఎత్తి ముందుకు చూశాను. నాకూ ఆ మనిషెవరో తెలియడం లేదు. పేపరు పక్కన పడేసి వీధిగేటు తీసి రెండడుగులు వేసి చూశాను.

ఇంకెవరూ - రంగరాజు-

"రంగరాజు... ఇలారా!"

రంగరాజు ఇటు చూశాడు. మనిషిలో చాలా మార్పు వచ్చింది. ఫకాలుమని నవ్వాడు. ఎత్తయిన అతని ముందు పళ్ళు లేవు. బట్టతల వచ్చేసింది. నడుం కూడా వంగిపోయింది.

"నువ్వేనా! ఈ వీధిలో చాలా మార్పు వచ్చింది సుమా! ఇక్కడ కొబ్బరిచెట్టు ఉండాలి కదరా"-

"అవును... ఉండేది. తుఫానుకి పడిపోయింది"

## వర్మ కామెంట్లకు అర్థం ఇది!

గతంలో 'ఫెయిర్ అండ్ లవ్లీ గర్ల్' యామీ అందం మీద బోలెడు కామెంట్లు చేసి అందరి దృష్టి ఒక్కసారిగా యామీ మీదకు మళ్ళించాడు వర్మ. వర్మ ఇంతలా యామీ మీద పగ ఎందుకు పెంచుకున్నాడో అప్పట్లో కొందరికి అస్సలు అర్థం కాలేదు. అయితే వర్మ అలా ఎందుకు కామెంట్ చేశాడో ఇప్పుడు అర్థం అయింది అంటున్నారు సినీజనాలు. వర్మ సినిమాలో యామీ ఓ కీలక పాత్ర చేస్తోంది. అస్సలు సోదిలోనే లేని యామీతో సినిమా చేస్తే ఫలితం ఉండదనుకున్నాడో ఏమో... ఆమె అందం మీద కామెంట్లు చేసి, ఆమె పేరు బాగా పాపులర్ అయ్యేలా చేశాడు. ఇప్పుడు వర్మ సినిమాలో యామీ నటిస్తోంది అని తెలిసే టీజర్లు బయటకి రావడంతో జనాలకు అసలు విషయం అర్థమైంది.



అతని చేతులు నా చేతుల్లోకి తీసుకున్నాను. మెట్లమీద కూర్చోపెట్టాను- "వేడి 'టీ'ని వన్ బై టూగా మరో గ్లాసులో పోసి అతనికి అందించాను. తాగాడు. ఆ మెట్లమీదే కూర్చున్నాం.

నవ్వుతున్నాడు కానీ అందులో జీవం లేదు.

అదొక వెర్రినవ్వు. మధురానగర్‌లోని ఇల్లు అమ్మేశాడట. అది అమ్మి డబ్బు ఇచ్చిందాకా కొడుకు కన్నా కోడలే చాలా గొడవ చేసిందట. దానికి కొన్ని రోజుల ముందు శారద చనిపోయిందట. అత్తగారు పోయాక మీరొక్కరూ ఏం ఉంటారక్కడ? ఇల్లు అమ్మేసి రావడమే మంచిదన్నది కోడలు చెప్పే బలమైన కారణం! అందువల్లనే హైదరాబాద్ వెళ్ళిపోయాడట. ఎవరో బంధువుల ఇంట్లో పెళ్ళికని నిన్ననే ఈ ఊరు వచ్చాడట. రాత్రి పెళ్ళై పోయింది. ఈ మధ్యాహ్నమే తిరుగు ప్రయాణం.

"పెళ్ళికి అని పేరేగానీ నిన్ను కలుసుకోవడమే నాకు ముఖ్యం" అన్నాడు.

"ఉదయం పూట చల్లగా ఉంటుందని ఈ మెట్లమీదే కాసేపు కూర్చుంటాను. పద, లోపలికి వెళదాం".

"అలాగా" అన్నాడు.

ఇద్దరం లోపలికి అడుగుపెట్టాం. ఇల్లంతా కలియ తిరిగాడు.

"ఇప్పుడు పనిమనిషి రాదా" అన్నాడు.

నాకు నవ్వు వచ్చింది - అలాంటి కామెంట్ చెయ్యకపోతే రంగరాజే కాడు.

"వచ్చింది. వెళ్ళిపోయింది కూడా" ఆ తరువాతే 'టీ' పెట్టుకొని బయట మెట్లమీద కూర్చున్నాను, పేపర్ చదువుదామని. ఇంతలో నువ్వు వచ్చావు."

హాలులో ఉన్న కుర్చీల్లో ఒకటి రంగరాజుకి చూపించి దానికి ఎదురుగా ఉన్న కుర్చీలో కూర్చున్నాను.

"అగ్గిపెట్టె లేదూ! ఇంకా పాలవాడు రాలేదా? ఇంకా వంట కాలేదా? ఇలాంటి నెగెటివ్ ప్రశ్నలు నీనుండే వస్తాయి రంగరాజు" అన్నాను నవ్వుతూ.

"అవును, నాకు మొదట్నించీ అలవాటైపోయింది. శారద అవన్నీ భరించి సర్దుకుపోయేది. ఇక ఆవిడా పోయింది. సర్దుకుని కూర్చున్నాను. రంగరాజు తిరిగి అన్నాడు. "మన ఊరినీ, నిన్నూ చూడాలనే వచ్చాను. ఇప్పుడు మనస్సు హాయిగా ఉంది. నా ఒంటినిండా ముసలితనంలో వచ్చే రోగాలన్నీ ఉన్నాయి. నా పెన్షన్ డబ్బులు వాటి మందులకే సరిపోతాయి. కొంచెం తిండి కోసం కొడుకు, కోడలు దగ్గర ఒదిగి ఉండవలసి వస్తోంది. ఉదయాన్నే ఓ కప్పు కాఫీ కోసం ప్రాణం అల్లల్లాడిపోతుంది. నా అలవాటుగా "పాలవాడు ఇంకా రాలేదా! అన్నాను కోడలితో ఓ రోజు.

"రాలేదు" అంది కోడలు.

"పాలవాడు వచ్చినట్టున్నాడు" అని నేనంటే ఆమె సమాధానం ఎలా ఉండేదో! నేను చొక్కా వేసుకొని పాలకోసం వెళ్ళాను. "ఉదయాన్నే ఆరు గంటలకే మీ గుమ్మంలో పాల ప్యాకెట్ పెట్టాను కదండీ" అన్నాడు వాడు.

"ఇదొక చిన్న ఉదాహరణ మాత్రమే!" రంగరాజు మౌనం వహించాడు. అతనికళ్ళల్లో సన్నటి కన్నీటి తెర. సమాధానం ఏం చెప్పాలో తెలియక అతని చేతిని నా చేతుల్లోకి తీసుకొని మృదువుగా నొక్కాను.

**సెల్: 91 9849963082**




## నిశ్శబ్ద సంపుటి

నువ్వు - నేను
ఒకానొక శబ్దమై... శబ్దానికొక నిశ్శబ్దమై...
శబ్దానికి నిశ్శబ్దమంతటి అనుభవమై...
నిశ్శబ్దానికి శబ్దమంతటి ప్రాభవమై...

నీకూ నాకు మాత్రమే వినిపించేలా -
సితారు తంత్రుల్లోంచి మువ్వల్లోకి జారి
షెహనాయిల మీదుగా ఒలికిన శబ్దసాగరమే కదూ,
ఇప్పుడు దండ గుచ్చుకున్న ఈ నిశ్శబ్దం

ఇన్నేళ్ళూ పెదవి తాకని వెదురులో సోలిపోయిన
ఈ శబ్ద నిశ్శబ్ద శబ్దవనాల్ని ఇప్పుడు తట్టిలేపిందెవరు...
మొన్న కళ్ళలో సీతాకోకచిలుకల్ని ఎగరేయించిన
మాయాజాలపు రాత్రులా?
రాత్రిళ్ళు రహస్యాల్ని పేనుకుంటుంటే
నిన్న ఒక్కటొక్కటిగా ఎదురుగాలులు చీరేసిన
మొగలిరేకుల దొంతరలా?
రెక్క ముడుచుకున్న వెన్నెలల్ని లాక్కొచ్చి
ఎదుట కుదేయాలనుకున్న నిర్బంధ క్షణాలా?

ఎండమావుల్ని తాగి తాగి
నేనే ఎండమావినైపోతున్నపుడు
చిరుఊటగా నువ్వు తాకిన నిశ్శబ్దంలో
గుండెకు నిదురే లేకపోయాక -
చుక్కలన్నీ హారతులు పట్టిన చిత్తడిశాలలో
కాలానికి ఆనకట్ట కట్టుకుని
రేపుకున్న తియ్యని గాయాల మీద
ఇంకోసారి పుప్పొడి పూతలు పూద్దామా...

గదిలో తిష్ట వేసుకున్న శూన్యాన్ని ఊడ్చేసి,
ఊదుపొగలేసి
ఎక్కడెక్కడి శబ్దనిశ్శబ్ద సానువుల్లోంచో
కోసుకొచ్చిన ఆకాశాల్ని
కందెనలుగా వేళ్ళాడదీసుకున్నాక -
సద్దుమణగని సందిళ్ళపందిళ్ళ పచ్చివాసనలో
మరోసారి దారి తప్పిపోదామా...

అలసిన ఓటముల మీద గలగలలాడే
పరావర్తనాల్ని లెక్కబెట్టుకోవడానికి
చిటికెడు తీరికను అరువు తెచ్చుకుందామా...

సందర్భమేంటని నిశ్శబ్దమూ అడగలేదు
సమయం ఇది కాదని శబ్దమూ చెప్పలేదు
ఆ నడుమ ఊపిరి కొరుక్కుతిన్న
క్షణాల కొండసంపెంగల జాతర - అప్పుడు
నీ చుక్కలపందిరిలోకి ఎగిరిపోతున్నానన్నప్పుడు
కలువగుట్టల్లా పోగుపడిన శబ్దమూ అడ్డుపడలేదు
వలలోని బిక్కతనం
ఏ ఆకాశం వైపు చూడాలో నిశ్శబ్దమూ చెప్పలేదు
ఇకనంతా, వంపులు తిరిగిన గులకరాళ్ళ పుంతల నిండా
కలిసి దిద్దుకున్న సంతకాల్ని
ఏరుకుంటున్న ఊపిరుల సంత - ఇప్పుడు

•••

రేవు పాటైన ఆ క్షణమూ, అల నవ్వని ఈ క్షణమూ -
రెప్పల మధ్య కలల్ని పేనటమూ తెలుసు
పేనుకున్న కలల్లోనే గాయపడటమూ తెలుసు
గాయాలకింద అడపాదడపా నెలవంకల్ని
పొదుక్కోవడమూ తెలుసు
ఎటొచ్చీ, నిదురలో కలతకు ఆహ్వానమెవ్వరిదో
కలల్ని గాయాలుగా మారుస్తున్న గారడీ విద్య ఎవరిదో
ఇప్పటికీ అర్థం కాని మర్మం

అయినా సరే... మళ్ళీ నీటిరాతయినా సరే
మసకవెన్నెలలకు కొత్తకొత్త నవ్వుల్ని కోసిచ్చి



నన్నంతా చెరిపేసి
నా మీద ఇంత తపస్సును చల్లి
అలలలల ప్రశ్నలకు చాటుగా
సుడిగంధాల్ని తొడిగే ఉరవడి నీవైతే చాలు..
గుండె తడిపే గుమ్మపాల పొంగువై
నన్ను -
చిటారు కొమ్మన ఊయలలూగే
గూడు గడప మీద నిలబడి
వానమంచు తెమ్మెరలో తడిసి తబ్బిబ్బవుతున్న
తెలితెలిపొద్దుల్ని చిత్రంగా చూస్తున్న
చికిలింత పిట్టను చేస్తే చాలు..

**- *యార్లగడ్డ రాఘవేంద్రరావు***
*సెల్: 99854 11099*




## బిపి మందులతో డిప్రెషన్?



రక్తపోటును నియంత్రించే కొన్ని రకాల మందులు వాడడం వలన డిప్రెషన్‌కి లోనయ్యే ప్రమాదం పొంచి ఉందని ఇంగ్లాండ్‌కి చెందిన యూనివర్సిటీ పరిశోధకులు నిర్వహించిన ఓ అధ్యయనంలో వెల్లడైంది. నలభై నుంచి ఎనభై సంవత్సరాల వయస్సు కలిగిన సుమారు ఐదు లక్షల మంది రక్తపోటు వ్యాధిగ్రస్థులమీద వీరు ఐదు సంవత్సరాల పాటు అధ్యయనం నిర్వహించారు. రక్తపోటును అదుపు చేసే అన్ని మందులు డిప్రెషన్‌కు గురిచేయకపోయినా కొన్ని రకాల మందులు మాత్రం తీవ్రమైన డిప్రెషన్‌కి గురి చేస్తాయన్న విషయం వీరి అధ్యయనంలో వెల్లడైంది. ఈ మందులను తొంభైరోజుల పాటు క్రమం తప్పకుండా తీసుకుంటే డిప్రెషన్‌కి లోనుకావడం ఖాయమని స్పష్టం చేస్తున్నారు. రక్తపోటు మందులు వాడే విషయంలో జాగ్రత్తగా ఉండాలని వీరు హెచ్చరిస్తున్నారు. ఈ మందులు వాడే సమయంలో కలిగే శారీరక మానసిక మార్పులను వైద్యులకు తప్పనిసరిగా తెలియజేయాలని వారు సూచిస్తున్నారు.

## నీరు ఎక్కువైనా ప్రమాదమే!



అందరూ నీరు తాగమంటూంటే నీరు ఎక్కువైతే ప్రమాదం ఏమిటి? అన్న అనుమానం వస్తోందా? ఇది నిజమే అంటున్నారు ఆస్ట్రేలియాలోని మోనాష్ యూనివర్సిటీ పరిశోధకులు. రోజుకు ఎనిమిది గ్లాసుల కన్నా ఎక్కువ నీరు తాగితే అది ఆరోగ్యానికి హాని చేస్తుందని చెబుతున్నారు. నీరు ఎక్కువ తాగితే హైపోనెట్రిమియా అనే ఆరోగ్య సమస్య వస్తుందని వారు వివరిస్తున్నారు. ఈ సమస్య బారిన పడిన వారి శరీరంలో ఫ్లూయిడ్స్ పలుచనైపోయి సోడియం ప్రమాణాలు పడిపోతాయి. ఫలితంగా కణాలు వాస్తాయి అంటున్నారు. పరిస్థితి విషమిస్తే స్పృహ తప్పి పడిపోవడం లేదా కోమాలోకి వెళ్ళడం జరుగుతుందని, అందువలన నీరు ఎక్కువగా తాగకుండా ఉండడమే మంచిదని సూచిస్తున్నారు. నిజానికి ఎంత నీరు తాగాలో సూచించే వ్యవస్థ మన శరీరంలో ఉంటుందనీ దాని మాట వినకుండా అవసరానికి మించి నీరు తాగడం అనర్థదాయకమనీ వారు స్పష్టం చేస్తున్నారు.

## రోజుకో చాక్లెట్



పిల్లల నుంచి పెద్దల వరకూ చాక్లెట్లను ఇష్టపడని వారంటూ ఉండరు అంటే అతిశయోక్తి కాదేమో! చాక్లెట్లు ఎక్కువగా తింటే ఆరోగ్య సమస్యలు తప్పవన్న అభిప్రాయం చాలామందిలో ఉంది. అయితే ఈ అభిప్రాయం సరికాదు అంటున్నారు పరిశోధకులు. ప్రతిరోజూ ఒక చాక్లెట్ తినడం వలన గుండెజబ్బులు వచ్చే ప్రమాదం నుంచి 25 శాతం వరకూ తప్పించుకోవచ్చన్న విషయం వీరు నిర్వహించిన పరిశోధనల్లో వెల్లడైంది. రక్తపోటును అదుపులో ఉంచడంతో పాటు వ్యాధి నిరోధక శక్తిని చాక్లెట్ పెంచుతుందని వీరు స్పష్టం చేస్తున్నారు. రోజుకో చాక్లెట్ తినడం వలన 45 శాతం వరకూ అకాల మరణాలు తగ్గుతాయని అంటున్నారు అందువలన నిరభ్యంతరంగా రోజుకో చాక్లెట్ తినొచ్చని వీరు సూచిస్తున్నారు.

## బిడ్డ కోసం బరువు తగ్గాల్సిందే!



ఊబకాయురాలైన స్త్రీకి పుట్టే పిల్లలు జీవిత కాలం పలు ఆరోగ్యసమస్యలతో బాధపడవలసి వస్తుందన్న విషయం ఇటీవల నిర్వహించిన పరిశోధనల్లో వెల్లడైంది. ఊబకాయం తల్లికే కాదు పుట్టబోయే బిడ్డకు కూడా ప్రమాదమని పరిశోధకులు హెచ్చరిస్తున్నారు. అధికబరువుతో ఉన్న స్త్రీకి పుట్టబోయే పిల్లలు భవిష్యత్తులో ఊబకాయులవుతారని వారు చెబుతున్నారు. ఈ పిల్లలు ఊబకాయంతో బాధపడడమే కాకుండా ఆస్తమా నుంచి కేన్సర్ వరకూ పలు ఆరోగ్యసమస్యలకు లోను కావచ్చని వారు హెచ్చరిస్తున్నారు. ప్రతి స్త్రీ గర్భం ధరించే ముందు తమ బరువును అదుపులో ఉంచుకోవడం అన్ని విధాలా మంచిదని వారు సూచిస్తున్నారు.

## చేతి వేళ్ళు చెప్పే రహస్యాలు



అరచేతిలోని రేఖలే కాదు, మన చేతి వేళ్ళు కూడా మన శక్తి సామర్థ్యాల్ని తెలియజేస్తాయి అంటున్నారు నార్వే నిపుణులు. ఉంగరపు వేలు కన్నా చూపుడు వేలు పొడవుగా ఉన్నవారు ఎక్కువ జ్ఞాపకశక్తి కలిగి ఉంటారట! ఉంగరపు వేలి కన్నా చూపుడు వేలు చిన్నదిగా ఉన్న వారిలో హార్మోన్లు ఎక్కువగా ఉంటాయని చెబుతున్నారు. ఉంగరపు వేలు పొడవుగా ఉన్న వారిలో ఎదుటి వారిని మోసం చేసే తెలివితేటలు ఉంటాయని అంటున్నారు. రెండు వేళ్ళు సమానంగా ఉండేవారు విశ్వాసపాత్రులుగా ఉంటారని చెబుతున్నారు. సుమారు ఆరువేల మందిని వీరు అధ్యయనం చేసిన అనంతరం ఈ విషయాలు వెల్లడించారు.

-అవినాష్



# మహానంది

④

-వక్కంతం సూర్యనారాయణరావ్, సెల్:98662 67287

**భజరంగి ఇల్లు పట్టణానికి ఇటువైపే ఉంది. దీపాల వేళకి ముందే అశ్వ శకటాన్ని తన ఇంటి ఆవరణలో ఆపాడు భజరంగి. నంది అతనికి చేయూతను అందించాడు. భజరంగి గుర్రాన్ని విప్పి, దానిని బంధించే చోటకి తీసుకెళ్ళాడు. నంది చుట్టూ చూశాడు. వంటచెరకు మేట కనిపించలేదు. బండిలో ఉన్న కట్టెల మోపును ఎక్కడ ఉంచాలి? తన వైపు వస్తున్న భజరంగి వైపు తిరిగాడు నంది.**

"మోపుల్ని అలాగే వదిలేద్దాం. ఉదయం పూట వీధుల్లోకి తీసుకెళ్ళాలిగా!" భజరంగి అన్నాడు. "రా నాయనా, ఇంట్లోకెళ్దాం."

నంది మౌనంగా భజరంగిని వెంబడించాడు. ఆవరణకు ఒకవైపు పశువుల పాక ఉంది. ఆ పాకలో గేదెలూ, ఆవులూ ఉన్నాయి. ఎవరో ఒక స్త్రీ ఒక ఆవు వద్ద కూచుని పాలు పితుకుతోంది. భజరంగి వెంట నంది ఆవరణలో మలుపు తిరిగాడు. ఎదురుగా ఇల్లు కనిపిస్తోంది. కుడివైపు గొడుగులాగా కొమ్మల్ని చాచిన చెట్టుంది. చెట్టు కింద వెడల్పాటి అరుగు. అరుగు మీది దృశ్యం నంది దృష్టిని ఆకర్షించింది.

ఎత్తుగా, లావుగా, బలంగా ఉన్న యువకుడు పిడికిళ్ళు బిగించిన చేతుల్ని కదిలిస్తూ, కూచుంటూ లేస్తూ వ్యాయామం చేస్తున్నాడు. అతని శరీరం నుండి కారుతున్న చెమట, పాదాల చుట్టూ చిన్న మడుగు కట్టింది. నంది ఆగి, మెలికలు తిరిగిన అతని కండల్నే చూస్తున్నాడు.

"ఈ ఇంటి అల్లుడు.." నంది చూపుల్ని గమనించిన భజరంగి అన్నాడు, నంది చేతిని పట్టుకుని ఇంటి వైపు నడిపిస్తూ.

"ఓ...మీ పెద్దల్లుడుగారా? ఏం చేస్తుంటాడాయన?" నంది కుతూహలంగా ప్రశ్నించాడు.

"నా కష్టాన్ని కరగదీస్తూ కండలు పెంచుకుంటూ ఉంటాడు" భజరంగి నిర్లక్ష్యంగా అన్నాడు. "పెంచుతున్న ఆ కండరాలనీ, ఆ కండరాలకి పంచుతున్న బలాన్నీ ఏం చేయాలనుకుంటున్నాడో ఆ భగవంతుడికే తెలియాలి!"

"అంటే..."

"అంతే నాయనా...వెనకటికి ఎవరో రాజుగారు మల్లయోధుణ్ణి మేపినట్టు ఈయనగార్ని మేపుతున్నాను. తినడం, తిరగడం. రేపటి వేళా, మాపటి వేళా ఇలా చెమటలు కక్కడం!"

భజరంగి గుమ్మానికి రెండువైపులా పొడవుగా ఉన్న అరుగు ముందు ఆగాడు. పెద్ద మట్టి పాత్రలో ఉన్న నీటిని ఇత్తడి చెంబుతో తీసి కాళ్ళూ, చేతులూ, ముఖమూ కడుక్కున్నాడు.





మళ్ళీ చెంబుతో నీళ్ళు తీసి నందికి అందించాడు. నంది కాళ్ళూ చేతులూ కడుక్కున్నాడు. ఇద్దరూ అరుగు మీదికి ఎక్కారు. ఈలోగా ఇంట్లోంచీ ఒక యువతి వచ్చింది. ఆమె చేతుల్లో రెండు వెలుగుతున్న జ్యోతులున్నాయి. ద్వారానికి రెండు వైపులా ఉన్న గూళ్ళలో దీపాలు ఉంచి, ఆమె నెమ్మదిగా నడుస్తూ ఇంట్లోకి వెళ్తోంది. చూడగానే ఆమె నిండు గర్భిణి అని తెలుస్తోంది.

"నాకు ఇద్దరమ్మాయిలు నాయనా. కుమారులు లేరు. ఇది పెద్దమ్మాయి లక్ష్మి. లక్ష్మీదేవి పుట్టిందంది నా ఇల్లాలు. లక్ష్మి అని పేరు పెట్టాను. ఇల్లరికం అల్లుడు దొరికాడు. రెండోదాన్ని సరస్వతి అన్నాను. చదువుల తల్లి పేరు దానికి!"

"ఆయన ఇల్లరికం అల్లుడా?"

"అందుకేగా 'నా అల్లుడు' అనకుండా, 'ఇంటల్లుడు' అన్నాను!" భజరంగి నవ్వుతూ అన్నాడు. అరుగు మీద కూచుంటూ, కూచోమని నందికి సైగ చేశాడు. నంది అతని దగ్గరగా అరుగు మీద కూర్చుని, కాళ్ళని కిందకి వదిలాడు.

కామరూప రాజ్యంలోంచి మరో రాజ్యంలోకి రాళ్ళమీదా, ముళ్ళమీదా సాగిన నడక సంపాదించి ఇచ్చిన నొప్పులు ఇంకా తన పాదాలనీ, కాళ్ళనీ, శరీరాన్నీ ఆశ్రయించే ఉన్నాయి.

"లక్ష్మీ!" భజరంగి పిలిచాడు.

గర్భవతి అయిన లక్ష్మి గుమ్మం దగ్గరగా వచ్చి, ద్వార బంధానికి ఆనుకుని నిలుచుంది. "ఏం నాన్నా?"

"రెండు ముంతల్లో మజ్జిగ తీసుకురామ్మా!"

లక్ష్మి మౌనంగా ఇంట్లోకి నిష్క్రమించింది. కాసేపట్లో రెండు చేతులతో రెండు ముంతలు తీసుకొని వచ్చింది. భజరంగి ఒక ముంతను అందుకుని నందికి ఇచ్చాడు. రెండో ముంత తీసుకుంటూ లక్ష్మికి నందిని పరిచయం చేశాడు.

"ఈ యువకుడు కామరూప రాజ్యం నుండి వచ్చాడు. పేరు నంది"

లక్ష్మి నందివైపు పలకరింపుగా చూసింది. "బావున్నారా?"

"బావున్నానమ్మా.." నంది చిరునవ్వుతో అన్నాడు.

లక్ష్మి తలాడించి, మెల్లగా వెనుదిరిగింది. "అబ్బాయి నంది మన అతిథి తల్లీ!" భజరంగి హెచ్చరించాడు.

"అలాగే నాన్నా...చెప్పాలా?" లక్ష్మి సౌమ్యంగా అంటూ లోపలికి వెళ్ళిపోయింది.

నంది మజ్జిగ రుచి చూశాడు. ఉప్పు, నిమ్మరసం కలిపిన మజ్జిగ. నోరూరిస్తోంది. కొంచెం దూరంలో పాల పాత్ర పట్టుకుని, రెండో అమ్మాయి వస్తోంది.

"సరసా!" ఇంటల్లుడు బిగ్గరగా పిలిచాడు.

పాల పాత్రతో వస్తున్న యువతి ఆగి, అతని వైపు చూసింది. "ఎన్నిసార్లు చెప్పాలి నీకు? నా పేరు సరస కాదు; సరస్వతి అని!"

ఇంటల్లుడు బిగ్గరగా నవ్వాడు. "సరస్వతి" అంటే మనకు వంటబట్టదు. ఆ దేవత గుర్తొస్తుంది. 'సరసా' అంటే సరసం గుర్తొస్తుంది. బావా మరదళ్ళ సరసం!"

"ఒళ్ళు పెంచడం కాదు; మనిషి బుర్రను కూడా పెంచుకోవాలి!" సరస్వతి చురక అంటిస్తూ అంది.

నంది చిరునవ్వుతో చూస్తున్నాడు.

ఇంటల్లుడు మళ్ళీ బిగ్గరగా గొల్లున నవ్వాడు. "దాన్ని పెంచడం ఆ దేముడి పని. చిన్నప్పుడే పెంచేశాడు. అదలా ఉంచి, ఆ గంగాళం నిండా నీళ్ళు తోడు, స్నానం చేయాలి.."

"నూతిలోంచి నీళ్ళు తోడటం చాలా మంచి వ్యాయామం. తోడుకో!" సరస్వతి నిర్లక్ష్యంగా అంటూ ఇంటివైపు వస్తోంది.

అరుగు దగ్గరగా వచ్చిన సరస్వతికి భజరంగి నందిని పరిచయం చేశాడు. సరస్వతి పలకరింపుగా నవ్వి, లోపలికి వెళ్ళిపోయింది.

"చిన్నది నిప్పు! ఒకటనడం; వంద అనిపించుకోవడం. ఇదీ వాడి పని!" భజరంగి అల్లుడి గురించి అంటూ నవ్వాడు.

నంది మజ్జిగ తాగుతూ ఉండిపోయాడు. పెద్దగా అడుగులు చప్పుడు చేసుకుంటూ ఇంటల్లుడు దగ్గరగా వచ్చాడు. నందివైపు ఎగాదిగా చూశాడు. అతని చేతుల వేళ్ళు పిడికిళ్ళుగా బిగుసుకుంటూ, వదులుతూ ఆపకుండా అంగుళీ వ్యాయామం చేస్తున్నాయి.

"మొహం కొత్తగా ఉంది. ఎవరు?" భజరంగి వైపు చూస్తూ నిర్లక్ష్యంగా ప్రశ్నించాడు ఇంటల్లుడు.

"ఇతను ఈ ఇంటికి పెద్దల్లుడు నాయనా. పేరు దమనకుడు. నాకు కొడుకులు లేని కొరత తీర్చేస్తానంటూ, ఆ మూడుముళ్ళూ వేసిన శుభ ఘడియ నుండీ ఇక్కడే పాతుకుపోయాడు. కండలు పెంచే వ్యాయామం ముఖ్య వృత్తి. ఆరగించింది అరిగే దాకా తిరగడం ఉప వృత్తి..." భజరంగి అల్లుడికి సమాధానం చెప్పకుండా నందితో అన్నాడు. ఆ తరువాత మెల్లగా అల్లుడివైపు తలెత్తి చూశాడు. "ఈ అబ్బాయి పేరు నంది. కామరూప రాజ్యం..?"

**జరిగిన కథ**

కామరూపరాజ్య సర్వసైన్యాధ్యక్షుడు రుద్రాక్షుడు. మహారాజు న్యాయ విచారణ జరిపి అతణ్ణి రాజద్రోహిగా నిర్ధారించి యావజ్జీవ కారాగారశిక్ష విధించాడు. అతడి కుటుంబాన్ని కూడా రాజద్రోహ పరివారంగా ప్రకటించాడు. రుద్రాక్షుని కుమార్తె దీపాంకురకు అంతఃపుర శౌచాలయాలు శుభ్రంచేసే శిక్ష, కొడుకు నందికి రాజ్యబహిష్కారశిక్ష విధించారు. అతణ్ణి తాళ్ళతో బంధించి నదిలోకి నెట్టేశారు భటులు. అలాగే పాములాగా ఈదుకుంటూ పొరుగురాజ్యం ఒడ్డుకుచేరి కట్టెలుకొట్టే వృద్ధుడి ఆశ్రయం పొందాడు నంది. ఆ తర్వాత......

"అపరిచితుల్ని అరుగులెక్కించడం అంత తెలివైన పని కాదు!" దమనకుడు నంది వైపు కొరకొర చూస్తూ అన్నాడు.

"నంది ఇప్పుడు నాకు పరిచితుడే. అతను ఈ ఇంట్లో అతిథిగా ఉంటాడు. వెళ్ళి స్నానం చెయ్యి నాయనా, చెమట కంపు ఘాటుగా వ్యాపిస్తోంది!" భజరంగి అన్నాడు.

"అతిథి ఎవరో నిర్ణయించేది ఈ ఇంటికి ఉత్తరాధికారి అయిన నేను!" దమనకుడు గర్వంగా అని, నంది వైపు సూటిగా చూశాడు. "ఆకలి తీర్చుకుని ఆవరణలోంచి వెళ్ళిపో!"

●●●

నూతి వైపు అడుగులు వేస్తూ వెళ్తున్న దమనకుడిని నంది చిరునవ్వుతో చూస్తూ ఉండిపోయాడు.

"ఆ బలిసిన ఒంట్లో బలం ఉందో లేదో తెలీదు గానీ, ఇంటల్లుడి నాలుక బలమైందే!" భజరంగి నవ్వాడు.

"ఏమిటి నాన్నా?" ముంతల కోసం వచ్చిన లక్ష్మి అడిగింది.

"అన్నం తిని, ఆవరణలోంచి వెళ్ళిపొమ్మన్నాడు మన నందిని నీ పెనిమిటి!"

లక్ష్మి ముఖం మీద నవ్వు ప్రత్యక్షమైంది. "ఏమీ లేని విస్తర్లు అంతే నాన్నా...ఎగిరెగిరి పడుతూ ఉంటాయి! నీ అల్లుడిది అరుపుల ఆర్భాటమే!" ముంతలు తీసుకుని వెళ్తూ లక్ష్మి ఆగి తండ్రివైపు చూసింది. "నీ అల్లుడుగారు మెక్కడం అయ్యాక మీకు వడ్డిస్తా నాన్నా.."

"మంచి ఆలోచనమ్మా...అతిథిని దేవుడు అన్నారు మన పెద్దలు. ఆ దేవుడికి దిష్టి తగలరాదు!" భజరంగి నవ్వాడు.

"మీరు చక్కటి హాస్యప్రియులు పెదనాన్నా!" నంది చిరునవ్వుతో అన్నాడు.

"ఇద్దరు కూతుళ్ళను నా చేతుల్లో పెట్టి స్వర్గానికి వెళ్ళిపోయిన నా ఇంటి దేవత మాణిక్యం నేర్పిన విద్య నాయనా అది. కష్టంలో సుఖాన్నీ, ఏడుపులో నవ్వునీ వెతికి చూసి, వెలికి తీసి సంతోషంగా, తేలి






ఒహోం.... బొహోం... హోం.... బొహోం... బొహోం...
బరువులు భుజాల మీద గూడలు విరిగేలాగ
కూసాలు దిగేదాకా మార్చుకుంటూ-కుదురుకుంటూ
ఒహోం... బొహోం... హోం.... బొహోం... బొహోం...
బరువంటే బరువుకాదు మానవ శరీరం
మెదులుతూ మాట్లాడుతూ చలాకీ శరీరమే
బేరం ఆడిన శరీరం ధర్మాలు వల్లించిన శరీరం

## యజ్ఞం

న్యాయాన్యాయాలు తర్కించిన మాటల యంత్రం
మానవత్వమున్నదంటావా తగాదా ఎందుకు?
కొండలు పర్వతాలు ఎక్కుతూ మరయంత్రంలాగ
అలవాటు చేసుకున్న కాళ్ళు, మామూలు నడక కాదు
ఒక్క అడుగు అటుఅయినా అయిదు ప్రాణాలు హరీ
ఆ ఆలోచనే వుండదు నడక, నడక జీవభృతి సముపార్జన
సాహసం, బలం, కాళ్ళ సత్తువ, అప్రమత్తత
నలుగురి నడకలో వింత సోయగం పోలీస్ కవాతులా
నాలుగు జతల చేతుల కదలికల్లో లయ
ఇళయరాజా సంగీతంలా అయితే పైన
కూర్చున్న శరీరానికి పూర్తి భరోసా!
లయకు లొంగి నిద్ర అల వస్తే అదే ఆఖరి శ్వాస!!
లంకె అంటె పొరబాటు ఒప్పందమంటే సబబు
నా డోలి ఎక్కితే ఐదు అంకెల రూకలు - ప్రియమే
ప్రాణం మరింత ప్రియం అందులో పదిమైళ్ళ నిలువు
ప్రయాణం ఓ యజ్ఞం!!! మేము మోస్తూ ఎక్కడం
గుర్రం మీద స్వారీ చేయడం ఒకటే నంటే నమస్కారం
మనలెక్కల్లో మా మతమేదైనా మాదే నిజమైన యజ్ఞం
లెక్కప్రకారం దేవతానుగ్రహం మా స్వేదంలోనే వుంది



వురకుతున్న మా రక్తంలో వుంది, సడలి వుబ్బుతున్న
మా కాలికండరాలలో ఉంది, ఎగసి జారుతున్న మా
ఊపిరిలో
వుంది, నిజం మాకు వైష్ణోమాత నిత్యదర్శనమిస్తుంది
ప్రతిరోజూ మాకు యజ్ఞఫలం లభిస్తుంది. జై మాతాజీ!
ఒహోం...బొహో...హోం... ఒహోం...బొహోం...జై మాతాజీ

**-రావులపాటి వెంకటరామారావు**
**సెల్:98480 55150**

కగా బతకాలి అనేది! ఎప్పుడైనా నేను కోప్పడితే, కోపాన్ని వ్యక్తం చేసిన మాటల్లో తప్పులు వెతికి, పకపక నవ్వుతూ, ఎగతాళి చేస్తూ నన్ను నవ్వించేది!"

"ఓహ్! అమ్మగారిది గొప్ప వేదాంతం!" నంది అన్నాడు.

"అవున్నాయనా, బతుకు పట్ల భక్తి ఉండాలనేది మాణిక్యం!"

"మాణిక్యంలాంటి ఆ అత్తయ్యే ఉండి ఉంటే నా బతుకు ఇలా ఉండేది కాదు!" స్నానం ముగించి, ఒళ్ళు తుడుచుకుంటూ వస్తున్న దమనకుడు మెట్ల వద్ద ఆగి అన్నాడు.

"అది నిజమేనయ్యా! ఆమె ఉండి ఉంటే, నిన్ను చూసి ఉంటే, నువ్వు ఈ ఇంటల్లుడివి అయ్యేవాడివే కావు! మనిషిని చూడగానే, మనసును పట్టేసేది మాణిక్యం! ఆ విషయంలో ఈ భజరంగిది మొద్దు బుర్ర. నల్లనివన్నీ నీళ్ళు, తెల్లనివన్నీ పాలు!" భజరంగి అన్నాడు.

దమనకుడు మామగారి వెటకారాన్ని వినిపించుకోనట్టు అన్నాడు "ఇతగాడి ఆకలి తీరిందా?"

"ముందు 'జామాతాదేవోభవ!' తరువాత 'అతిథి దేవోభవ' అంటే ముందు అల్లుడుగారు; అనంతరం అతిథి! నువ్వెళ్ళు నాయనా. విస్తరి ఎదురు చూస్తోంది" భజరంగి అన్నాడు.

దమనకుడు చిన్నగా హుంకారం చేసి, దబదబమంటూ అడుగుల చప్పుడు చేసుకుంటూ ఇంట్లోకి వెళ్ళిపోయాడు.

భజరంగి బరువుగా నిట్టూర్చాడు. "మనిషి తనకు బుద్ధిమంతుడైన పుత్రుడు పుట్టాలని కోరుకుంటాడు. బుద్ధిమంతుడైన అల్లుడు దొరకాలని కోరుకోవాలి! స్వానుభవంతో చెబుతున్నా!"

"ఎవరి దగ్గరైనా ఉద్యోగంలో పెట్టక పోయారా?" నంది అన్నాడు.

"సామంతరాజుగారి దివాణంలో కొలువులో కుదిర్చాను. అప్పట్లో పట్టణంలో చోర భయం ఎక్కువగా ఉండేది. రాత్రుళ్ళు సంచరిస్తూ దొంగల్ని పట్టే ఉద్యోగంలో నియమించారు. పగలే పనిచేయనివాడు రాత్రుళ్ళేం చేస్తాడు? మానేశాడు. నగరం వదిలి ఈ శివగిరికి వచ్చేశాడు!"

నంది మౌనంగా తలాడించాడు. భజరంగి నిట్టూర్చాడు. "నేనున్నంత కాలం మేపుతాను. నా అనంతరం అమ్మాయి ఏం చేస్తుందో?"

"ఆందోళన పడకండి. జీవితం నేర్పుతుంది లెండి!" నంది ఓదార్పుగా అన్నాడు.

•••

"మనుషుల్ని మచ్చిక చేసుకున్నావ్. ఇంక జంతువుల పని పట్టావా?"

దమనకుడి కంఠస్వరం విని, గుర్రాన్ని నిమురుతున్న నంది, తల తిప్పి చూశాడు. దమనకుడు ఉక్రోషంగా చూస్తూ నిలుచున్నాడు. నంది అతని మాటలు పట్టించుకోకుండా తన దృష్టిని గుర్రం మీదికి మళ్ళించాడు.

"నిన్నే!" దమనకుడు బిగ్గరగా అరిచాడు.

నంది తిరిగి చూశాడు. ఎర్రగా చూస్తున్న దమనకుడి ముఖంలోకి సూటిగా చూశాడు. "ఏమిటి?"

"ఆకలి తీర్చుకుని ఆవరణ వదిలి వెళ్ళమన్నాను, రాత్రే. అర్థం కాలేదా?"

"ఆకలి ఒక్క పూటలో, ఒక్క దినంలో తీరదుగా! అది దైనందిన లక్షణం! అనుదినమూ ఆకలే, మనిషికి! నీకు ఏ పూటకాపూట ఆకలి వేయదా బావా?" నంది అమాయకత్వం నటిస్తూ అన్నాడు.

దమనకుడు ఆగ్రహంతో బుస కొట్టాడు. "మర్యాదగా వెళ్తావా, వెళ్ళగొట్టమంటావా? వరస కలిపితే నరికిపారేస్తా!"

నంది చేతుల్ని రొమ్ము మీద ముడుచుకుంటూ దమనకుడిని తదేకంగా చూశాడు. "ఇంటి యజమానిగారు రమ్మంటే వచ్చాను. ఆయన వెళ్ళమంటే వెళ్తాను. నేను అధికారి మాటను గౌరవిస్తాను. ఉత్తరాధికారి మాటల్ని పట్టించుకోను!"

దమనకుడు ఉరిమి చూశాడు. "అంతేనా?"

"అంతే. నన్ను వెళ్ళగొట్టడానికి చిన్న ఉపాయం చెప్తాను. నీ కోరిక నీ మామగారికి చెప్పి, ఆయన చేత నాకు చెప్పించు! ఆయన వెళ్ళమన్న మరుక్షణం వెళ్ళిపోతాను" నంది వెనక్కి తిరిగి అశ్వాన్ని అరచేతుల్తో రుద్దసాగాడు.

దబదబమంటూ అడుగుల చప్పుడు వినిపించింది. నంది తలతిప్పి చూశాడు. దమనకుడు చరచరా వెళ్ళిపోతున్నాడు వీధి వైపు! నంది కళ్ళు దమనకుడి వెడల్పాటి వీపు మీదే ఉన్నాయి. విధి తనకి ఇక్కడ ఒక విరోధిని సిద్ధం చేసింది. దమనకుడికి తన ఉనికి నచ్చడం లేదు. ఎందుకు? ఏ విషయంలోనూ తాను అతనికి పోటీకాడు. అతడిని అవమానించడానికి గానీ, కష్టపెట్టడానికి గానీ తానిక్కడికి రాలేదు. ఎవ్వరూ లేని వాడికి ఎదుట పడిన మనిషే తోడు! నా అన్నవాళ్ళు లేనివాడికి పలకరించినవాడే బంధువు. తాను వర్షంలో తడుస్తూ నడుస్తున్నాడు. భజరంగి అనే పెద్దమనిషి తన ఛత్రం కిందకి రమ్మన్నాడు. తను తిరస్కరించలేకపోయాడు!

"దమనకుడి మాటలు పట్టించుకోకు నాయనా! అతనంతే! గుడ్డి బిచ్చగాణ్ణి చూసినా కుళ్ళిపోతాడు!" నంది దగ్గరగా వస్తూ అన్నాడు భజరంగి. నంది అతనివైపు తిరిగాడు. "కొన్ని మానవజన్మలు అంతే! అకారణంగా అసూయ! నిష్కారణంగా ద్వేషం" భజరంగి మళ్ళీ అన్నాడు. "నీ సమాధానం నాకు నచ్చింది. నువ్వు మా అతిథిగా ఉండాలో, ఉండకూడదో నిర్ణయించాల్సింది యజమాని అయిన నేను!

**నందికి తన ఇంట్లో ఆశ్రయం ఇచ్చాడు భజరంగి. అడవికివెళ్ళి కట్టెలు కొట్టి తీసుకురావడంలో సహాయం చేస్తూ అతడి కుటుంబరుణం తీర్చుకుంటున్నాడు నంది. ఒకరోజు భజరంగిని అతడి పెద్దకూతురును పొరుగూరులో బంధువుల ఇంట్లో దించివచ్చాడు నంది. అప్పుడు భజరంగి ఇంట్లో ఆర్తనాదం వినిపించింది. ఎవరిదా ఆర్తనాదం? లోపల ఏం జరిగింది?**

మామగారి పాలిట పదో గ్రహంగా మారిన ఇంటి అల్లుడు కాదు!"

"నిన్న మీరు ఆదరంగా ఆహ్వానించినప్పుడు రాత్రి ఇక్కడ తల దాచుకుని తెల్లారగానే వెళ్ళిపోదామనుకున్నాను. దమనకుడు ఆకలి తీర్చుకుని ఆవరణ లోంచి వెళ్ళిపో అన్నాడు నన్ను చూడగానే. బిచ్చగాడిని హెచ్చరించినట్టు హెచ్చరించాడు. అతని ప్రవర్తనా, మాటతీరూ నా అహాన్ని కెలికాయి. వెంటనే

వెళ్ళిపోయే ఆలోచన విరమించుకున్నాను...."

"నీ తత్వం నాకు నచ్చింది! నీకు నచ్చినంత కాలం ఇక్కడే ఉండొచ్చు నాయనా!" భజరంగి అన్నాడు.

"మీరు వయోవృద్ధులు. అనుభవజ్ఞులు. ముఖ్యంగా పిల్లనిచ్చి పెళ్ళిచేసిన మామగారు. మిమ్మల్ని నిర్లక్ష్యం చేస్తూ ప్రవర్తించడం అతని అహంకారానికి నిదర్శనం. ఇంకా ఒకటి రెండు రోజులు మీ పంచలో ఉండాలనుకోవడానికి అది కూడా ఒక కారణం.

"ఒకటి, రెండు రోజులా!" భజరంగి నిరుత్సాహంగా అన్నాడు.

"అంతే పెదనాన్న గారూ....కండబలముంది. గుండెబలముంది. కష్టపడి పనిచేసే చేవ ఉంది. పశువులూ, పక్షులూ, తమ బతుకు తాము బతుకుతున్నాయి. మనిషి వాటిని ఆదర్శంగా తీసుకుని, స్వయం పోషణ చేసుకోవాలి కదా?" నంది నవ్వాడు.

భజరంగి తల పంకించాడు; మౌనంగా.

"నా స్థితిలో మీరే ఉంటే ఏం చేస్తారో ఒక్క క్షణం ఆలోచించండి..."

భజరంగి నంది ముఖంలోకి చూశాడు. అతని పెదవులు చిరునవ్వుతో విచ్చుకున్నాయి. "చక్కగా అడిగావు. ఈనాడు, ఈ ఆవరణంలో, ఈ ఇంటి యజమానిగా ఉన్న ఈ భజరంగి నాలుగున్నర దశాబ్దాల క్రితం నీలాగే కట్టుబట్టలతో ఈ శివగిరికి వచ్చాడు, కూడూ, నీడా వెతుక్కుంటూ! కథ వినగానే, నిన్ను నిస్సహాయ స్థితిలో చూడగానే నిన్ను నా ఇంటికి ఆహ్వానించిన కారణం అదే! నా గతమే! నా అనుభవమే!"

"అలాగా!"

"అవున్నాయనా! చెమటలు చిందించే చేవ ఉన్నవాడికి బతుకు ఏనాటికీ భారం కాదు. నీ స్వతంత్ర జీవనాధారం కోసం నేనూ ప్రయత్నిస్తాను. నీలాంటి యువకుడితో అవసరం ఉన్నవాళ్ళు చాలా మంది ఉంటారు. నీ ఆత్మ గౌరవానికి భంగం కలిగించని పని దొరికేదాకా నువ్వు నా అతిథివి!"

"అలాగే పెదనాన్నగారూ...మీ మేలు మరిచిపోలేను!"

"వంటచెరకు విక్రయించి వస్తాను" భజరంగి అన్నాడు.

"నేనూ వస్తాను.."

"అవసరం లేదు నాయనా...విశ్రాంతి తీసుకో!"

"కాయకష్టం చేయకుండా కడుపు నింపుకోవడం మంచిది కాదు!"

"నిజమే...పద వెళ్దాం"

"వంట చెరకు విక్రయించడానికే కాదు; సేకరించడానికి కూడా వస్తాను. మీరు సరే అంటే సేకరించడం నా పని; విక్రయించడం మీ పని..."

భజరంగి చిరునవ్వు నవ్వాడు..."ఇద్దరం కలిసి రెండు పనులూ చేద్దాం."

●●●

నంది వంట చెరకుతో నిండిన బండిని, అశ్వాన్ని కట్టి నాగలి మీద కూర్చున్నాడు. గుర్రం మహా ఉత్సాహంతో ఇంటిదారి పట్టింది. భజరంగి ఇంట తాను అతిథిగా చేరి వారం పైగా అయ్యింది. వంట చెరకు వ్యాపారంలో కృషి చేస్తూ తను ఆ కుటుంబ రుణం తీర్చుకుంటున్నాడు. అక్కాచెల్లెళ్ళు లక్ష్మీ, సరస్వతీ తమ తండ్రిలాగే తనను అభిమానంగా చూసుకుంటున్నారు.

ఆ ముగ్గురూ తనకు దగ్గరయ్యే కొద్దీ, దమనకుడు రెట్టింపు దూరం అవుతున్నాడు. వాళ్ళ ఆప్యాయత తన పట్ల ఒకింత పెరిగే కొద్దీ, దమనకుడి అసూయ వంద రెట్లు పెరుగుతోంది. తనంటే అతను వ్యక్తం చేస్తున్న అయిష్టాన్ని అతని ఇల్లాలు లక్ష్మి ఏ మాత్రమూ పట్టించుకోవడం లేదు. మొండిగా ఉండాలని అనుకున్నా కూడా, దమనకుడి ప్రవర్తన తనకు పొగ పెట్టినట్టు అవుతోంది. సాధ్యమైనంత త్వరలో తను భజరంగి ప్రాపకం నుంచి తప్పుకోవాలి.

దూరంలో ఊరు కనిపిస్తోంది. వంట చెరకు మోపుల్ని ఆవరణలో దింపేసి, పట్టణం లోపలికి వెళ్ళాలి. అశ్వశకటంలో ఉదయం భజరంగినీ, లక్ష్మినీ ఆమె పిన్నిగారింట్లో దిగబెట్టి వచ్చాడు. తనను కూడా అక్కడే ఉండమనీ, అడవికి వెళ్ళవద్దనీ బలవంతం చేశాడు భజరంగి. ఆయనకు సర్ది చెప్పి, తను వంట చెరకు సేకరించడానికి వెళ్ళాడు.

కాసేపట్లో బండిని ఆవరణలో ఆపి, కిందకి

## మనమీదేనర్రోయ్!

సరసి





దిగి, గుర్రాన్ని తప్పించాడు నంది. బండిలోని కట్టెల మోపుల్ని బంధించిన తాడును విప్పబోతూ ఒక్క సారిగా ఉలిక్కిపడ్డాడు.

ఎవరో కీచుగా అరిచారు. భయంతో అరిచిన అరుపు అది. నంది చెవులు రిక్కించాడు. 'అమ్మో!' అంటూ బిగ్గరగా అరిచింది స్త్రీ కంఠం. భయాన్ని వ్యక్తం చేస్తున్న స్త్రీ కేకలు ఇంటి వైపు నుండి విన వస్తున్నాయి. ఎవరు? ఎందుకు గావుకేకలు పెడుతు న్నారు? ఏం జరిగింది? సరస్వతి ఒక్కత్తే ఉన్నట్టు గుర్తొచ్చింది నందికి.

నంది తాడును వదిలేసి ఇంటి వైపు పరిగెట్టాడు. ప్రధాన గృహానికి కుడివైపున ఉన్న చిన్న ఉప గృహంలోంచీ కేకలూ, మూలుగులూ వినిపిస్తు న్నాయి. నంది ఉపగృహం తలుపు ముందు ఆగాడు.

"ఎవరు లోపల?" నంది బిగ్గరగా అరిచాడు.

స్త్రీ మూలుగు మధ్యలో ఆగిపోయింది. ఏదో అవాంఛనీయమైనది జరగకపోతే ఎవ్వరూ భయంతో కేకలు పెట్టరు. నంది తలుపు తోశాడు. తలుపు కదలలేదు. లోపల గొళ్ళెం పెట్టినట్టుంది. నంది వెనక్కి జరిగాడు. అతని కుడి కాలు తలుపుని ఇనుప సుత్తిలా తాకింది. తలుపు చెక్క విరిగి కన్నం ఏర్పడింది. నంది ముందుకు గెంతి, కన్నం గుండా చేతిని పోనిచ్చి, గొళ్ళేన్ని తొలగించాడు. తలుపును బలంగా తోశాడు. ఒక్క అంగలో గడప దాటి, లోపలికి వెళ్ళాడు. పొడవుగా ఉన్న గదిలో నిశ్శబ్దం తాండవిస్తోంది! మసక చీకటిగా ఉన్న గదిని కలియ జూశాడు నంది. పడమర వైపున ఎత్తుగా నిలుచున్న రెండు గాదెలు అతని చూపులకి అడ్డం వచ్చాయి. గాదెల వైపు అడుగులు వేస్తూ, నంది తటాలున ఆగాడు. అతని చూపులు నేలమీదికి వాలాయి. నీలాకాశ వర్ణం చీర పొడవుగా, తాడులాగా అతని పాదాల వద్ద నుండీ గాదెల దాకా పడి ఉంది!




నంది వేగంగా గాదెల వైపు వెళ్ళాడు. గాదెలకీ, గోడకీ మధ్య ప్రత్యక్షమైన దృశ్యం అతన్ని నివ్వెర పాటుకి గురిచేస్తూ, తాను విన్న అరుపులకు కారణం ఏమిటో చెప్తోంది.

సరస్వతి శరీరం గోడకి తాపడం చేయబడి నట్టుగా అతుక్కుపోయి ఉంది. నీలిరంగు పావడా, నీలిరంగు రవిక ఆమె శరీరానికి ఆచ్ఛాదనగా ఉన్నాయి. ఆమె పెద్దపెద్ద కళ్ళు విచ్చుకుని వాలుగా తనవైపు చూస్తున్నాయి. ఆ కళ్ళలో ఎనలేని భయం, ఎర్రగా ప్రత్యక్షమవుతోంది. ముఖం చెమటతో పూర్తిగా తడిసిపోయి ఉంది.

ఆమె శరీరాన్ని గోడకి తాపడం చేస్తూ మరో శరీరం ఉంది. అది నడుము నుంచీ పైకి నగ్నంగా ఉన్న శరీరం. అది పురుష శరీరం. ఆ పురుష శరీరం దమనకుడిది! వెడల్పుగా బలిష్ఠంగా ఉన్న అతని వీపు చెమటతో మెరుస్తోంది. అతని ఎడమ చెయ్యి సరస్వతి కుడి భుజం మీద ఉంది. కుడి చెయ్యి ఆమె నోటిని బలమైన, పటిష్టమైన మూతలా మూసి ఉంది. దమనకుడి తల పక్కకి తిరిగి ఉంది. అతని మెడ బలిసిన ఆబోతు అర్రులా పొంది ఉంది. కళ్ళు ఎర్రగా నందిని చూస్తున్నాయి.

"ఆమె మీద నుంచీ చేతులు తీసెయ్!" నంది ముందుకు నడుస్తూ అన్నాడు.

"నరికేస్తా! పోరా అవతలకి!" దమనకుడు పళ్ళు కొరుకుతూ అన్నాడు.

"చేతులు తీస్తావా? చేతుల్ని తీసేయమంటావా?" నంది దమనకుడి కళ్ళల్లోకి చూస్తూ, ముందుకు అడుగులు వేస్తూ అన్నాడు.

దమనకుడి బుస, అతని ఆగ్రహాన్ని నందికి తెలియజేసింది. అతని ఆగ్రహాన్నీ, ఆవేశాన్నీ, నంది కళ్ళకు కట్టుతున్నట్టు సరస్వతి భుజాన్ని కర్కశంగా నొక్కి ఉంచిన అతని ఎడమ చేతి కండరాలు, కుబుసం లోపల దాగిన పాముల్లా కదులుతూ పైకి ఉబ్బాయి. అతని పెదవులూ, దవడలూ అదురు తున్నాయి. నంది తన దగ్గరకు రాగానే దమనకుడి ఎడమ చెయ్యి మెరుపులా కదిలింది. తన కణత వైపు దూసుకొస్తున్న దమనకుడి చేతిని చూస్తూ నంది కొద్దిగా ముందుకు జరిగాడు. బాగా బలిసిన గోధుమరంగు త్రాచుపాము పడగలాగా తన వైపు వస్తున్న దమనకుడి చేతిని తన కుడిచేత్తో పట్టుకు న్నాడు నంది.

నంది వేళ్ళు దమనకుడి మణికట్టు చుట్టూ ఇనుప చువ్వల్లా చుట్టుకుంటూ, బిగుసుకున్నాయి. మెటికలు విరుగుతున్నట్టు చప్పుడైంది. దమనకుడు ఎడమ చేతిని విడిపించుకునే ప్రయత్నం చేస్తూ, సరస్వతి నోటిని కప్పిన కుడిచేతిని చివాలున చాపి నంది గొంతుకను పట్టుకున్నాడు. నంది ఎడమ చెయ్యి కదిలింది. దమనకుడి కుడిచేతి మణికట్టును పట్టు కుంది. పట్టు బిగిసింది. కరకర శబ్దం వినిపించింది. నంది రెప్పవేయకుండా దమనకుడి ముఖంలోకి చూస్తున్నాడు. అతని ముఖం మీద చెప్పలేని బాధ ప్రత్యక్షమవుతోంది. నంది వేళ్ళు బిగిసేకొద్దీ దమన కుడి ముఖం వంకర్లు పోతోంది. భరించలేని బాధతో లోపలి నుండి తన్నుకొస్తున్న మూలుగును పళ్ళ బిగువున ఆపుకుంటున్నాడు దమనకుడు.

నంది తన చూపులను సరస్వతి వైపు మళ్ళిం చాడు. భయంతో ఎగిరెగిరి పడుతున్న ఎద మీద చేతులు పెట్టుకుని వగరుస్తోందామె.

"భయం లేదు! వెళ్ళి చీర కట్టుకోమ్మా!" నంది ఆమెను హెచ్చరించాడు.

సరస్వతి వణుకుతూ, తడబడే అడుగులతో గాదెల పక్కనుండీ వెళ్ళింది. నంది రెండు చేతుల్తో పట్టు ఇంకా బిగిస్తూ దమనకుడి చేతుల్ని కిందకి వంచాడు.

"ఆఆఆ!" అంటూ మూలుగుతూ కాలు పైకె త్తాడు దమనకుడు. నంది కాలు గునపంలా అతని మోకాలి మీద ఆనింది. నంది ఒక్కసారి మళ్ళీ పట్టును కర్కశంగా బిగించి, దమనకుడి చేతుల్ని వదిలేశాడు. దమనకుడి చేతులు వాడిపో యిన తోటకూర కాడల్లా కిందకి వేళ్ళాడుతు న్నాయి. కొద్దిగా ముందుకు వంగి, నోరు తెరిచి నోటితో బుస కొడుతున్నాడు దమనకుడు. నంది అతని చేతివేళ్ళను చూశాడు. అవిప్పుడు వ్యాయామం చేయడం లేదు. దమనకుడు నిప్పులు కక్కుతున్న కళ్ళతో నందిని మింగేసేలా చూస్తున్నాడు. అతని మెడ నరాలు పురెక్కించిన నులకల్లా అవుతున్నాయి.

నంది రెండుచేతులూ రెండు మెరుపు తీగల్లా కదిలాయి. రెప్పపాటులో దమనకుడి మెడను పట్టు కున్నాయి. నందిలో నిక్షిప్తంగా ఉన్న శక్తి ఒక్క సారిగా అతని చేతుల్లోకి ప్రవేశించింది. ఒక్కసారిగా దమనకుడి శరీరాన్ని గాదెల చాటు నుండి అవతల వైపు తడి గుడ్డను విసిరినట్టు విసిరాడు నంది. దమనకుడి శరీరం ఎగురుతూ వెళ్ళి గోడను తాకి, నేల మీద కుప్పలా పడింది.

తన దగ్గరగా వస్తున్న నంది వైపు గుడ్లు పెళ్ళ గించుకుని చూస్తున్నాడతను. అతని ముఖంలో, చూపుల్లో ఇప్పుడు ఆగ్రహం లేదు. ఆగ్రహం స్థానంలో అంతులేని ఆశ్చర్యం కనిపిస్తోంది! తను చేసిన వ్యాయామమంతా ఏమైపోయింది! తన బలం ఎక్కడికి పోయింది? తన కండరాలు ఏం చేశాయి? తనకు అంతులేని అహంకారాన్నీ, కళ్ళను కప్పినంత గర్వాన్నీ అందించిన తన భుజబలం ఏమైంది? ప్రశ్నలు దమనకుడి హృదయాన్ని కందిరీగల్లా కాట్లు వేస్తు న్నాయి.

గోడకు నిస్సహాయంగా జార్లబడి, చేతుల్ని అలా వదిలేసి, కాళ్ళు కొద్దిగా ముందుకు చాపుకున్న దమన కుడిని, పొంగి ధారలు కడుతున్న చెమటతో స్నానం చేస్తున్న దమనకుడిని నంది చిరునవ్వుతో చూశాడు. అతని కాలు కదిలింది. దమనకుడి పాదం మీద పాదం పెట్టి బలంగా నొక్కాడు నంది. దమనకుడు ఊపిరి బిగపట్టాడు. మెటిక విరిగింది.

"నీ నిరంతర వ్యాయామం నీ బలాన్ని పెంచ లేదు. మదాన్ని పెంచింది! తెలుసుకో! మనిషి మర దల్ని చెల్లిలాగా చూసుకోవాలి. నిండు గర్భిణి అయిన నీ ఇల్లాలు నా చేతులకు అదృశ్యరూపంలో అడ్డు వస్తోంది. తనే కీళ్ళు ఊడిపోకుండా కాపాడుతోంది! లే! తోకముడుచుకుని బైటికెళ్ళు! నంది గద్దించాడు.

***(ఇంకావుంది)***

# సౌభాగ్య చక్రం

అక్టోబర్ 26 నుంచి నవంబర్ 1 వరకు

శ్రీ బిజుమళ్ళ బిందుమాధవశర్మ



## మేషం (మార్చి 21 - ఏప్రిల్ 20 మధ్య పుట్టినవారు)

ఆరోగ్యం, ఆర్థిక సంస్థలతో పనులు, బృందకార్యక్రమాలకు ఈ వారం ప్రాధాన్యం ఇస్తారు. బుధ, గురువారాల్లో వృత్తి, వ్యాపారాల్లో గత అనుభవంతో లక్ష్యాలు సాధిస్తారు. ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపాలి. సహోద్యోగుల ఆంతరంగిక విషయాల్లో జోక్యం చేసుకోవాల్సి రావచ్చు. 28,29 తేదీల్లో బహుమతులు ఇచ్చిపుచ్చుకుంటారు. స్పెక్యులేషన్లలో నష్టం సంభవం. భాగస్వామి కోసం ఖర్చులు అంచనాలు మించుతాయి. ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపించాలి. 30,31,1 తేదీల్లో వేడుకలు, సంస్మరణల్లో పాల్గొంటారు. ఆరోగ్యం పట్ల శ్రద్ధ అవసరం. పెట్టుబడులను సమీక్షించుకుంటారు.



## వృషభం (ఏప్రిల్ 21 - మే 21 మధ్య పుట్టినవారు)

వేడుకలు, శుభకార్యాలు, సినీ, రాజకీయ విషయాలు, ఆరోగ్య అంశాలకు ఈ వారం అనుకూలం. బుధ, గురువారాల్లో ప్రేమానుబంధాలు బలపడతాయి. స్పెక్యులేషన్లకు దూరంగా ఉండాలి. ఖర్చులు అంచనాలు మించుతాయి. 28,29 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో ప్రోత్సాహకరం. ప్రియతముల ఆరోగ్యం మందగిస్తుంది. లక్ష్యసాధనలో ఆటంకాలు ఎదురవుతాయి. 30,31,1 తేదీల్లో స్పెక్యులేషన్లు లాభిస్తాయి. శ్రీవారు, శ్రీమతి వ్యవహారాల్లో శుభపరిణామాలు సంభవం. బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. పందాలు, పోటీల్లో నిదానం అవసరం.



## మిథునం (మే 22 - జూన్ 21 మధ్య పుట్టినవారు)

వృత్తి, వ్యాపారాలు, ఆరోగ్యం, స్పెక్యులేషన్లు, వేడుకలు, ప్రేమానుబంధాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో రియల్ ఎస్టేట్, నిర్మాణ రంగాలవారు లక్ష్యాలు సాధిస్తారు. బదిలీల కోసం చేసే ప్రయత్నాలు ఫలించకపోవచ్చు. 28,29 తేదీల్లో అడ్వర్టైజ్‌మెంట్లు, విద్యారంగాల వారు లక్ష్యాలు సాధిస్తారు. విద్యార్థులకు లక్ష్య సాధనలో ఆటంకాలు ఎదురయ్యే అవకాశం ఉంది. 30,31,1 తేదీల్లో విందుల్లో పాల్గొంటారు. ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపాలి. వైద్యం, హోటల్, వ్యవసాయం, పరిశ్రమల రంగాల వారికి శుభప్రదం. ఉద్యోగ ప్రయత్నాలు ఫలిస్తాయి.



## కర్కాటకం (జూన్ 22 - జులై 22 మధ్య పుట్టినవారు)

ప్రేమానుబంధాలు, పెట్టుబడులు, వృత్తిపరమైన నిర్ణయాలు, ఆరోగ్యంపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో విద్యార్థులకు శుభప్రదం. చర్చలు, పర్యటనలు లాభిస్తాయి. కాంట్రాక్టులు, అగ్రిమెంట్ల విషయంలో పొరపాట్లు దొర్లే అవకాశం ఉంది. 28,29 తేదీల్లో బంధుమిత్రుల రాక ఆనందం కలిగిస్తుంది. బదిలీలు, మార్పులు అసౌకర్యం కలిగిస్తాయి. ప్రియతముల వైఖరి ఆవేదన కలిగిస్తుంది. 30,31,1 తేదీల్లో చిన్నారులు, ప్రియతముల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది సృజనాత్మకంగా వ్యవహరించి వృత్తి, వ్యాపారాల్లో లక్ష్యాలు సాధిస్తారు. ప్రేమానుబంధాలు బలపడతాయి.



## సింహం (జులై 23 - ఆగస్టు 23 మధ్య పుట్టినవారు)

వేడుకలు, గృహోపకరణాల సేకరణ, ప్రేమానుబంధాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. పెట్టుబడుల విషయంలో ఆచితూచి వ్యవహరించాలి. డబ్బు విషయంలో మీ వైఖరిని సమీక్షించుకుంటారు. 28,29 తేదీల్లో సోదరీసోదరుల విషయాల్లో ప్రోత్సాహకరం. కాంట్రాక్టులు, అగ్రిమెంట్ల విషయంలో ఆచితూచి వ్యవహరించాలి. చర్చలు, ప్రయాణాల్లో నిదానం అవసరం. 30,31,1 తేదీల్లో వేడుకల్లో పాల్గొంటారు. కుటుంబ విషయాల కారణంగా అశాంతికి లోనవుతారు. రియల్ ఎస్టేట్, గృహనిర్మాణ రంగాల వారికి శుభప్రదం. ఇల్లు, కార్యాలయంలో మార్పులు, చేర్పుల కోసం ప్రయత్నిస్తారు.



## కన్య (ఆగస్టు 24 - సెప్టెంబర్ 22 మధ్య పుట్టినవారు)

విద్యా విషయాలు, వృత్తిపరమైన సమావేశాలు, బదిలీలు, వేడుకలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో సోదరీసోదరుల వ్యవహారాలపై దృష్టి పెడతారు. ఇంటర్వ్యూలలో నిరాశ తప్పకపోవచ్చు. ప్రయాణాల్లో నిదానం అవసరం. 28,29 తేదీల్లో విలువైన పత్రాలు అందుకుంటారు. ఆర్థిక విషయాల్లో తొందరపాటు కారణంగా నష్టపోయే అవకాశం ఉంది. 30,31,1 తేదీల్లో ప్రయాణాలు, చర్చల్లో నిదానం అవసరం. సోదరీసోదరుల విషయాల్లో శుభపరిణామాలు సంభవం. కాంట్రాక్టులు, అగ్రిమెంట్లు లాభిస్తాయి. బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు.



## తుల (సెప్టెంబర్ 23 - అక్టోబర్ 23 మధ్య పుట్టినవారు)

పెట్టుబడులు, ఇంక్రిమెంట్లు, విద్యా విషయాలు, స్థిర చరాస్తి విషయాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలకు అవసరమైన నిధులు సర్దుబాటు అవుతాయి. రాజకీయ, సినీరంగాలవారికి నిరుత్సాహకరంగా ఉంటుంది. 28,29 తేదీల్లో కొత్త ఆదాయమార్గాల అన్వేషణ ఫలిస్తుంది. ఆర్థిక విషయాల్లో కీలక నిర్ణయాలకు తగిన సమయం కాదు. విలువైన వస్తువులు భద్రం. 30,31,1 తేదీల్లో బృందకార్యక్రమాల కోసం ఖర్చు చేస్తారు. పెట్టుబడుల్లో ఆచితూచి వ్యవహరించాలి. బహుమతులు ఇచ్చిపుచ్చుకుంటారు. విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు.



## వృశ్చికం (అక్టోబర్ 24 - నవంబర్ 22 మధ్య పుట్టినవారు)

కొత్త ప్రాజెక్టులు, పెట్టుబడులు విద్యా విషయాలు, సమావేశాలకు ఈ వారం ప్రాధాన్యం ఇస్తారు. బుధ, గురువారాల్లో సమావేశాలు, బృంద కార్యక్రమాల్లో కీలకపాత్ర పోషిస్తారు. ఆర్థిక విషయాల్లో కీలక నిర్ణయాలకు ఇది సమయం కాదు. 28,29 తేదీల్లో ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలకు అనుకూలం. మనశ్శాంతి లోపిస్తుంది. రాజకీయ, సినీరంగాల వారు తొందరపాటు కారణంగా నష్టపోయే అవకాశం ఉంది. 30,31,1 తేదీల్లో కొత్త పనుల ప్రారంభానికి తగిన సమయం కాదు. మీ మనసు మార్పు కోరుకుంటుంది. గౌరవ, మన్ననలు అందుకుంటారు.



## ధనుస్సు (నవంబర్ 23 - డిసెంబర్ 21 మధ్య పుట్టినవారు)

ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలు, ప్రయాణాలు, ఆధ్యాత్మిక కార్యక్రమాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో ప్రముఖులను కలుసుకుంటారు. సినీ, రాజకీయ రంగాల వారికి అనుకోని ఆటంకాలు ఎదురయ్యే అవకాశం ఉంది. 28,29 తేదీల్లో సమావేశాలు, వేడుకల్లో పాల్గొంటారు. ఆర్థిక విషయాల్లో కొంత అసౌకర్యం కలుగుతుంది. సన్నిహితులకు సంబంధించిన సమాచారం కలవరం కలిగిస్తుంది. 30,31,1 తేదీల్లో బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. సినిమా, రాజకీయాలు, ఫొటోగ్రఫీ, గ్రాఫిక్స్, ఆధ్యాత్మిక రంగాల వారికి ప్రోత్సాహకరంగా ఉంటుంది.



## మకరం (డిసెంబర్ 22 - జనవరి 20 మధ్య పుట్టినవారు)

పెట్టుబడులు, వేడుకలు, విద్యా విషయాలు, సమావేశాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలకు అనుకూలం. ఆర్థిక విషయాల్లో మీ అంచనాలు ఫలించకపోవచ్చు. 28,29 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో ఆర్థికంగా లాభిస్తుంది. ప్రముఖుల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. ఉన్నత పదవుల విషయంలో ఆశాభంగం తప్పకపోవచ్చు. 30,31,1 తేదీల్లో ఖర్చులు అధికం. బృందకార్యక్రమాలు, వేడుకలు ఉల్లాసం కలిగిస్తాయి. సహకార సంఘాలు, యూనియన్ కార్యకలాపాల్లో విజయం సాధిస్తారు. సమావేశాల్లో కీలకపాత్ర పోషిస్తారు.



## కుంభం (జనవరి 21 - ఫిబ్రవరి 18 మధ్య పుట్టినవారు)

కీలక నిర్ణయాలు, ఇంక్రిమెంట్లు, వృత్తిపరమైన సమావేశాలు, వేడుకలకు ఈ వారం అనుకూలం. బుధ, గురువారాల్లో ఆర్థిక విషయాల్లో ప్రముఖుల సహకారం అందుకుంటారు. ఉద్యోగ, వ్యాపారాల్లో లక్ష్యసాధనకు గత అనుభవం తోడ్పడుతుంది. పెద్దల ఆరోగ్యం కలవరపెడుతుంది. 28,29 తేదీల్లో ప్రణాళికాబద్ధంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. సమావేశాలు, ప్రయాణాల్లో అసౌకర్యం కలిగే అవకాశం ఉంది. పెద్దల కారణంగా మనస్తాపం కలుగుతుంది. 30,31,1 తేదీల్లో ఉన్నత పదవులు అందుకుంటారు. పెద్దలు, ప్రముఖులను కలుసుకుంటారు. పట్టుదలతో లక్ష్యాలు సాధిస్తారు.



## మీనం (ఫిబ్రవరి 19 - మార్చి 20 మధ్య పుట్టినవారు)

ఉన్నత విద్య, దూరప్రయాణాలు, వృత్తి, వ్యాపారాలు, బృందకార్యక్రమాలకు ఈ వారం ప్రోత్సాహకరం. బుధ, గురువారాల్లో శ్రీవారు, శ్రీమతి విషయాల్లో శుభపరిణామాలు సంభవం. స్పెక్యులేషన్లు, ఆర్థిక లావాదేవీల్లో అంచనాలు ఫలించకపోవచ్చు. 28,29 తేదీల్లో ఆర్థికపరమైన సమావేశాలకు అనుకూలం. రుణప్రయత్నాలు ఫలించకపోవచ్చు. డిపాజిట్లు, పొదుపు పథకాల్లో నిరాశ ఎదురయ్యే అవకాశం ఉంది. 30,31,1 తేదీల్లో బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. న్యాయ, బోధన, రవాణా రంగాల వారికి శుభప్రదం. ప్రణాళికాబద్ధంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు.




# స్వరాజ్యం

సింహప్రసాద్

**వార్తాపత్రికలోని ఒక వార్త చూసి ఉలిక్కిపడింది. మళ్ళీ చదివింది. చలించిపోయింది. మళ్ళీ మళ్ళీ చదివింది. కన్నీళ్ళు పొంగివచ్చాయి.**

**ప్రోగ్రామ్ ఎగ్జిక్యూటివ్ క్యాబిన్లోకి దూసుకెళ్ళి "దీనిమీద ప్రోగ్రాం చేస్తాను సార్" అంది టీవీ రిపోర్టర్ మంజరి.**

"దీనిమీదా? నీకేమైనా మతిపోయిందా?"

"ఒక గ్రామం కథ సార్...."

"ష్... గ్రామాలు సినిమా తెరమీద గ్లామరస్‌గా కనిపిస్తాయి. పల్లెకథల సినిమాల్ని జనం ఎగబడి చూస్తారు. కాని పల్లెటూరి వారి బాధల్ని గాథల్ని టీవీలో చూపిస్తే టక్కున ఛానల్ మార్చేస్తారు. రేటింగ్ ఢామ్మని పడిపోతుంది."

"మనకీ కొద్దో గొప్పో సామాజిక బాధ్యత ఉంది కదా సార్. ఇది చాలా దారుణమైన వార్త. మనం సిగ్గుపడాల్సిన సంగతి..."

"పేపర్లో దాని ప్లేసేంటి?"

"జిల్లా ఎడిషన్ ఆరో పేజీలో లెఫ్ట్‌సైడ్ కార్నర్లో!"

"ఆ పత్రిక దానికెంత ఇంపార్టెన్స్ ఇచ్చిందో అర్థమైందిగా! డోంట్ వేస్ట్ మై టైమ్. ఇంకేదైనా సెన్సేషనల్ న్యూస్ పట్టుకో లేదా సేఫ్‌గా సినిమా బేస్డ్ ప్రోగ్రాం చెయ్, టీఆర్పీ పెరుగుద్ది..."

"సారీ సర్. మీరిలా మాట్లాడతారనుకోలేదు. ఆ గ్రామస్థులు 'మా ఊరు అమ్మబడును" అంటున్నార్సార్..." దుఃఖోద్విగ్నయై అంది.

"డోంట్ క్రై... అది ప్రాక్టికల్ జోక్ అయినా అవ్వొచ్చు మంజరీ... లీవిట్..." ల్యాప్‌టాప్‌లో తలదూర్చాడు.

"ఇది జోక్ కాదు ఆక్రందన! సభ్య సమాజాన్ని కాలర్ పట్టుకుని మరీ అడుగుతున్న ప్రశ్న. పల్లె అంటే మట్టీ, మట్టి మనుషులూ కాదు సార్, మనిషి ఉనికికి, ఉపాధికి, ఉత్పత్తికి, ఉన్నతికి అన్నిటికీ ఆధారం, ఆదరువు భూమే సార్. ఆ భూమిని నమ్ముకున్న భూమి పుత్రులే సార్...."

ఆమె కళ్ళ నుండి బొటబొటా కన్నీటి బొట్లు రాలిపోతుంటే కించిత్తు సానుభూతిగా చూస్తూ అన్నాడు, "అయితే ఏంటంటావ్?"

"ఇదివరకోసారి శ్రీకాకుళం జిల్లా కొత్తూరు మండలంలోని పెనుగోటివాడ గ్రామస్థులూ ఇలాగే వారి ఊరిని అమ్మేస్తామని ప్రకటించారు..."

"అప్పుడేం జరిగింది?"

"తెలీదు సార్..."

నవ్వాడు. "తెలిసేంతగా ఏమీ జరగలేదన్నమాట. ఇదీ అంతే. నేచురల్ డెత్...డోంట్ బీ ఎమోషనల్..."

"ఒక ఊరు చచ్చిపోతోంది. కాదు కాదు నిలువునా చంపేస్తోంటే మనమూ ఒకరాయి వేద్దామా? మనది ఫోర్త్ ఎస్టేట్. మనం వాచ్‌డాగ్స్‌లా ఉండాలి తప్ప కొందరి పెట్‌డాగ్స్‌గా మారి రేటింగ్ మత్తుకి బానిసలై పోకూడదు. గాంధీజీ మనదేశం గ్రామాల్లోనే జీవిస్తోందన్నారు సార్..." ఆవేశంతో గొంతు చించుకుంది.

"సీ మంజరీ, కోట్ల పెట్టుబడితో ఈ ఛానల్ ప్రారంభించింది దేశసేవ చెయ్యడానికి కాదు. వ్యాపారానికి లాభాలే లక్ష్యం. అంచేత ఆ దృష్టితో ఆలోచించి ఆ దిశగా అడుగులేయడం మనందరికీ మంచిది."

"ప్లీజ్ సర్, ఈ ఒక్కసారికి అనుమతివ్వండి. మంచి ప్రోగ్రాం అవుతుంది...."

ఆమె ముఖంలోకోసారి చూసి అన్నాడు, "ఓకే. బట్‌విత్ వన్ కండీషన్. ట్రాన్స్‌పోర్టు అరేంజ్ చెయ్యలేను."

"థాంక్యూ సార్" పరమానందపడిపోయి అతడి చేయి పట్టుకుని ఊపేసింది మంజరి.

ఇద్దరు ముగ్గురు కెమేరామెన్లని అడిగింది గాని ఎవరూ అంగీకరించలేదు. మారుమూల గ్రామం అనగానే వెనుకంజ వేశారు. ఆమె బ్రతిమాలగా, "ఒక్కరోజులోనే కంప్లీట్ చేసెయ్యాలి మరి " అని షరతు పెట్టి అంగీకరించాడు ప్రకాష్.

ఆ మర్నాడే ఇద్దరూ బయల్దేరారు. తిన్నగా మండల కేంద్రానికెళ్ళి అక్కణ్నుంచి పాతూరు ఎలా

వెళ్ళాలో కనుక్కున్నారు. షేరింగ్ ఆటోలోనూ, ట్రాక్టర్ మీదా, ఆపైన నడిచీ ఆ ఊరెళ్ళారు.

ఊరి మొదట్లో ఉన్న ఇంటిగోడ మీద అమ్మకం ప్రకటన కనిపించింది. "దీన్ని షూట్ చెయ్" అని చెప్పి చదివింది.

**ఆమె ఒక టీవీ రిపోర్టర్. మా ఊరు అమ్మబడును అనే వార్తకు స్పందించి స్టోరీ చెయ్యాలని సంకల్పించింది. ఆ ఊరెళ్ళింది. కనీస సదుపాయాలు కూడా లేని ఆ కుగ్రామంలో ప్రజలు జీవచ్ఛవాల్లా ఉన్నారు. నేతలకు పట్టలేదు. ఊరిని అమ్ముకుపోతాం, కొనుక్కోండి అని మూకుమ్మడిగా ఊరి ప్రజలు అడుగుతున్నారు. ఆమె ఏం చేసింది? ఆమె స్టోరీ ప్రభుత్వాల్ని కదిలించిందా?**

"మా ఊరు అమ్మబడును. మా పాతూరు గ్రామాన్ని ఇళ్ళు, పొలాలు, గొడ్డు గోదా, చెట్లు పుట్టలు, తట్టాబుట్టాతో సహా సమస్తం ఎలా ఉన్నవి అలాగ ప్రాతిపదిక మీద అమ్మబడును. ఏక గుత్తంగా గాని, రెండు మూడు ముక్కలుగా గాని కొనుక్కోవచ్చు. ఆసక్తి గలవారు మా సర్పంచ్‌ని కలవండి - ఇట్లు పాతూరు గ్రామస్థులు"

"భలే చిత్రంగా ఉందే" అన్నాడు ప్రకాష్.

"ఊరికెక్కడా జీవ లక్షణాలు కనిపించడం లేదు చూడు".

అటుగా వెళ్తోన్న జనం వంక చూశారు. దైన్యం రూపుదాల్చినట్టున్నారు. ఉసూరుమంటూ ఉన్నారు. మరి తప్పదన్నట్టు చిన్నాచితకా పనులు చేసుకుంటున్నారు.

ముక్కుమీద వేలేసుకున్నాడు ప్రకాష్.

జాలి ఉప్పెనై ముంచేస్తోంటే దిగ్భ్రమకు లోనై అశ్రునయనాలతో చూస్తూండిపోయింది మంజరి.

సర్పంచ్ ఇంటికెళ్ళారు. వాళ్ళని చూసి ఎదురొచ్చి ఆహ్వానించాడు సర్పంచ్ చంద్రయ్య.

లక్కపిడతల్తో మంచినీళ్ళిచ్చి, "ఏమీ అనుకోమాకండి" అన్నాడు చూపుల్తో తన అశక్తతని తెలియజేస్తూ.

"మేం టీవీ వాళ్ళం. మిమ్మల్ని ఇంటర్వ్యూ చేయడానికొచ్చాం" అంది మంజరి.

అనంతమైన నిరాశ కదలాడిందతడి మోములో. "మా ఊరిని కొనుక్కోడానికి రాలేదా?"

"మీ సమస్యలకి అదే పరిష్కారమార్గం అనుకోవడం సరికాదు. మనది సర్వ స్వతంత్ర ప్రజాస్వామిక దేశం తప్ప బానిసరాజ్యం కాదు. మీరు మేమంతా కలిసి ఎన్నుకున్న కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలున్నాయి. అధికారులున్నారు. రాజ్యాంగం ఉంది."

అతడు వినడం లేదని గ్రహించి ఆపై మాటలు మింగేసింది. ఈలోగా ప్రకాష్ హ్యాండ్ కెమేరాని సెట్ చేసుకున్నాడు.

"ఇంటర్వ్యూ మొదలుపెడదామా?"

మంజరి మాటలకి తలాడించాడు చంద్రయ్య.

"జనని, జన్మభూమి స్వర్గంతో సమానమంటారు. అలాంటిది మీరు మీ ఊరిని ఎందుకు అమ్మాలనుకుంటున్నారు?"

"చిన్నప్పుడు అప్పిచ్చువాడు వైద్యుడు.. అనే పద్యం చదవలేదూ? అప్పిచ్చువాడు, వైద్యుడు, ఏరు, బ్రాహ్మడు లేని ఊరిని గ్రక్కున వదిలెయ్యాలి. ఆ ముక్క ఎప్పుడో చెప్పినా, మాకిప్పుడు సరిగ్గా సరిపోద్ది."

"అంటే మీ ఊళ్ళో కనీస సౌకర్యాలూ, సదుపాయాలూ లేవంటారు?"

"మీ కళ్ళతో మీరే చూసి చెప్పండి. ఇక్కడేం ఉన్నాయి?"

"రోడ్లూ, రవాణా, నీరూ లేవని తెలుస్తోంది. ఉపాధీ లేనట్టుంది. అయితే తిండికీ ఇబ్బందే. ప్రభుత్వం మీకేమీ చెయ్యలేదంటారా?"

"ప్రభుత్వం ఉందో లేదో తెలీదు. మాకెప్పుడూ కనిపించలేదు. నాయకులకు మాతో పనిలేదు. పట్నాల్లో, నగరాల్లో ఉంటారాయె. అధికారులకి జనాభా లెక్కలప్పుడూ, ఓట్ల జాతరప్పుడూ తప్ప మేం ఉన్నామనే తెలీదు."

"మీరంతా కలిసి వాళ్ళని నిలదీయొచ్చుగా? పల్లెల్ని ఉద్ధరించడానికి ప్రభుత్వం ఎన్నో ప్రణాళికలు వేసింది. మరెన్నో పథకాలు ప్రవేశపెట్టింది. ఎన్నో సంస్కరణలు తెచ్చి ఎన్నో కార్యక్రమాలు చేపట్టింది. దేశవిదేశాల నుంచి ప్రపంచబ్యాంకు నుండి వేల లక్షల కోట్లు అప్పు చేసింది మీ అభివృద్ధి కోసమే కదా?"

అతడు వింతగా చూశాడు. ఆమె పెదవి కొరుక్కుంది.

"అవన్నీ మీ ఊళ్ళో చేస్తున్నారేమో నాకు తెలీదు. ఇక్కడ కరెంటు స్తంభాలున్నాయి గాని కరెంటు లేదు. కాలువలున్నాయి గాని నీళ్ళు పొలాల్లోకి రావు. ఒక ఆసుపత్రి, ఒక బడీ, ఒక చౌక దుకాణం లేవు. రోడ్లు లేవు. తాగునీళ్ళు లేవు. పనిలేదు. పాటలేదు. ఇంకెందుకు ఇక్కడ ఉండాలి? ఉండి ఎలా బతకాలి?"

"మీ ఊరు కదా?!"

"మా ఊరు గనుకే అమ్మేస్తున్నాం. మీకెంతయినా పుణ్యం ఉంటుంది గాని కొనుక్కునే వాళ్ళని రమ్మని చెప్పండి చాలు" చేతులు జోడించి అర్థించాడు.

"పరిశ్రమలూ, ఫ్యాక్టరీలూ పెడతాం భూములు ఇమ్మంటే రైతులు ఒంటికాలిమీద లేస్తున్నారు. వారి ఆగ్రహానికి భయపడి ప్రభుత్వాలే మీనమేషాలు లెక్కపెడుతూ కూర్చుంటున్నాయి. అలాంటిది మీరు ఏకంగా ఊరినే స్వచ్ఛందంగా పువ్వుల్లో పెట్టి మరీ ఇచ్చేస్తామంటున్నారేంటి?"

"మమ్మల్నెవరూ కొనుక్కోరుగాని లేకపోతే మేమూ అమ్మకానికి పెట్టేసుకుందుం" నిర్లిప్తంగా అన్నాడు.

మంజరి కదిలిపోయింది. కళ్ళల్లో తడిపొర కదుల్తోంటే అడిగింది, "మీరింత ఎక్స్‌ట్రీమ్ స్టెప్ తీసుకోడానిక్కారణం ఏమిటి?"

"మా ఊరిని పట్టించుకునే నాథుడే లేడు. మా అతీగతీ కనుక్కునేవారూ లేరు. కనీసం తాగునీరు కూడా లేదు. ఇక సాగునీరు సరేసరి. ఇంకెలా బతకాలో నీకేమైనా తెలిస్తే చెప్పు."

"ప్రభుత్వం, పాలకులు మనవాళ్ళే. మనం ఎన్నుకున్నవాళ్ళే. మనవల్లే ఈ ప్రభుత్వం అధికారంలో ఉంది. అంచేత మీ సమస్యల్ని ప్రభుత్వానికి మా ఛానల్ ద్వారా తెలియజేయండి. మీ విజ్ఞప్తిని తప్పకుండా మన నేతలూ, అధికారులూ వింటారు. మన్నిస్తారు. నాదీ భరోసా!"

"వాళ్ళెవరూ చెవిటోళ్ళు కాదు... చక్కగా వింటారంటావు! సరే చెబుతాను, నాదేం పోద్ది. పోయేటందుకు ఏం మిగిలి ఉంది గనుక!" గొంతు సవరించుకుని తిన్నగా నిలబడి చెప్పాడు చంద్రయ్య.

"మీ అందరికీ మా మనవి ఏంటంటే మా బాగూ ఓగూ చూడనన్నా చూడండి లేదా మా ఊరిని తెగనమ్మడానికి సాయమన్నా చేయండి...!"

ఆపైన మాటలు రాక చిన్నపిల్లాడిలా వెక్కివెక్కి ఏడ్చాడు చంద్రయ్య.

"మీకు మంచే జరుగుతుంది" అని చెప్పి ఓదార్చారు.

గ్రామంలోని కొందరు పెద్దల్నీ, పిల్లల్నీ కదిలించారు. అంతా నిరాశానిస్పృహల్లో మునిగి తేలుతున్నారు. దేవుడు కూడా చేయి వదిలేసినట్లు ఫీలవుతున్నారు.

"ప్రభుత్వం బోల్డన్ని పనులు చేయడానికి కోట్ల రూపాయలు ఖర్చు చేస్తోంది. అదంతా ఏమైపోతోందంటారు?"

"మాకేం తెలుసు? కాలువలో పూడికలు తీస్తామనొచ్చారోసారి. కొంచెం గుర్రపుడెక్క తీసి ఫోటోలు దిగి వెళ్ళిపోయారు. ఇంకోసారి కాలువలోతు తవ్వి గట్లు ఎత్తు చేస్తామన్నారు. వర్షాకాలం వచ్చేముందు మొదలెట్టారు. పని మొదలెట్టేసరికి వర్షం రానే వచ్చింది. మళ్ళీ వాళ్ళు రాలేదు. రోడ్లు వేస్తామంటూ కొలతలు తీసుకెళ్ళారు. మళ్ళీ కనిపించలేదు. తాగునీటి కోసం పైపులేస్తామని చెప్పి కొన్ని పైపులు తెచ్చి చెరువు గట్టుమీద వదలి వెళ్ళిపోయారు."

"పనులు చెయ్యకుండానే చేసినట్టు చూపించి సొమ్ము స్వాహా చేశారంటారా?"

"చదువుకున్నోరు... మీకే తెలియాలి!"

## మళ్ళీ నానితోనే...

*నానితో 'జెంటిల్‌మన్' సినిమా చేసిన నివేదా థామస్ తిరిగి నానితోనే మరో సినిమాలో జత కట్టనుంది. 'జెంటిల్‌మన్' తరువాత నివేదాకు చాలా అవకాశాలు వచ్చినా వేటికీ ఓకే చెప్పలేదు. అయితే నాని, తన తరువాత సినిమాలో నివేదానే తీసుకోవాలని నిర్ణయించుకున్నాడట! ఈ మేరకు ఆ సినిమా దర్శకనిర్మాతలు నివేదాను కలిశారట! నివేదా కథ విన్నవెంటనే చాలా బాగా నచ్చి, ఓకే చెప్పేసిందట! అయితే నివేదా నానితో బాగా కనెక్ట్ అయిందని, అందుకే ఆ హీరోతో తప్ప మరో హీరో సినిమాకి ఓకే చెప్పడం లేదని సినీ జనాలు అంటున్నారు.*



ఊరి వీధుల్నీ, నడవడానికి వీల్లేకుండా ఉన్న మట్టిరోడ్లనీ, నీరు లేక ఎండిన పొలాల్నీ, మరమ్మత్తులు లేక పూడుకుపోయిన కాలువల్నీ, ఎక్కడో ఉన్న బావి నుంచి తాగునీరు తెచ్చుకుంటున్న మహిళల్నీ వీడియో తీశారు.

స్థానిక ఎమ్మెల్యే జిల్లాకేంద్రంలో ఉంటారని తెలుసుకుని ఆయన్ని కలవడానికెళ్ళారు మంజరి, ప్రకాష్.

ఆయన భవంతి అక్షరాలా రాజభవనంలా ఉంది.

టీవీ వాళ్ళు ఇంటర్వ్యూ చెయ్యడానికొచ్చారన గానే చక్కగా మేకప్ చేసుకుని వచ్చారాయన.

"పాతూరు గ్రామాన్ని అమ్మకానికి పెట్టిన సంగతి మీకు తెలిసే ఉంటుంది." మంజరి అంది.

"అలాగా! ఓపెన్ ఆక్షనా? టెండర్ సిస్టమా?"

నివ్వెరపోయింది మంజరి. "మీకు తెలీదా? మీ నియోజకవర్గంలోనిదేనండీ" అంది.

"కాదు కాదు. నా నియోజకవర్గంలోని గ్రామాల పేర్లన్నీ నాకు కంఠతా వచ్చు..." అనింకేదో అనబోతోంటే, ఓ అనుచరుడొచ్చి చెవిలో ఏదో చెప్పాడు.

"ఆ విలేజ్ బోర్డర్లో ఉందంటలే. అందుకని గుర్తు లేదు. ఆ ఊరిని అమ్మెయ్యడానికి అంతా రెడీ అయ్యారన్నమాట."

"అవును. ఆ వార్త పేపర్లోనూ వచ్చింది. ఆ ప్రాంత ఎమ్మెల్యేగా మీ ప్రతిస్పందనేంటి? పరిస్థితిని చక్కదిద్దటానికి మీరు చేబట్టే కార్యక్రమం ఏమిటో మా ప్రేక్షకులకు చెబుతారా?"

"ఇవాళే ముఖ్యమంత్రిగారితో మాట్లాడతాను. ఒక బృందాన్ని తీసుకుని ముంబై, ఢిల్లీ, చెన్నైలాంటి మహా నగరాలకి వెళ్తాను. ప్రముఖ పారిశ్రామిక వేత్తల్నీ వ్యాపార దిగ్గజాలనీ కలిసివస్తాం" ఉత్సాహంగా అన్నారు.

"ఎ...ఎందుకు?" అయోమయంగా చూస్తూ అడిగింది మంజరి.

"పిచ్చి ప్రశ్న! మన ప్రధానీ ముఖ్యమంత్రులూ విదేశాలకెళ్ళి అందర్నీ మాదేశం వచ్చి పరిశ్రమలు పెట్టండి, వ్యాపారాలు చేసుకోండి అని అర్థించడం లేదూ? పైగా నామ్‌కే వాస్తే ధరకి భూములిస్తాం, సగం రేటుకే విద్యుత్తు ఇస్తాం, ప్రత్యేకంగా పైపు లేసి నీళ్ళు అందిస్తాం, పన్ను మినహాయింపులిస్తాం... అంటూ తాయిలాలు ఇవ్వటం లేదూ? మా దగ్గర బోల్డన్ని సహజవనరులున్నాయి. చౌకగా లభించే మానవ వనరులున్నాయి అంటూ ఊరించటం లేదూ? వచ్చిన వాళ్ళకి రెడ్ కార్పెట్ పరచి స్వాగత సత్కారాలు చెయ్యట్లేదూ? ఆ తరహాలోనే నేనూ చేస్తానంటున్నాను."

"అంటే విదేశీ సంస్థలు డబ్బు మూటలతో వచ్చి ఇక్కడి వనరుల్తో, తక్కువ ఖర్చుతో, సరుకులు ఉత్పత్తిచేసి, అధిక ధరకి అమ్ముకుని, లాభాలు కొల్లగొట్టి పట్టుకుపోతున్నారని మీ భావమా?"

విసుగ్గా మొహం పెట్టారు. "అహ కానే కాదు..."

"ఇక్కడ ఉత్పత్తి చేసినవి ఆ చేసిన వాళ్ళు సైతం కొనుక్కోలేరనీ, సగం జనాభా దారిద్ర్యరేఖ కిందికెళ్ళిపోతుందనీ విమర్శిస్తున్నారా?"

"అదేం లేదు తల్లీ. నా మాటలకి వక్రభాష్యం చెప్పి నా పదవి కాకులు ఎత్తుకు పోయేట్లు చెయ్యకు. నా ప్రజల కోరిక మన్నించి వారి కష్టాలు కడతేర్చడం నా బాధ్యత గనుక డబ్బున్న మారాజుల్ని బ్రతిమాలి బామాలి అయినా సరే ఆ గ్రామ జనానికి అధిక ధర వచ్చేట్లు చూస్తాను. మధ్యలో ఎలాంటి కిక్‌బాక్స్‌లకీ తావులేకుండా అంతా ట్రాన్స్‌పరెంట్‌గా చేస్తానని హామీ ఇస్తున్నాను. సెలవు. నమస్తే"




మరి ప్రశ్నలకి అవకాశం ఇవ్వకుండా లేచి చక్కాబోయారాయన.

ఆశ్చర్యం నుండి తేరుకుని ముఖాముఖాలు చూసుకున్నారు మంజరి, ప్రకాష్. పిమ్మట జిల్లా కలెక్టర్ని కలిశారు.

విషయమంతా విన్నాక, "ఇంకా అలాంటి కుగ్రామాలున్నాయంటే చిత్రంగా ఉంది. కావలిస్తే స్టాటిస్టిక్స్ చెక్ చేసుకోండి. అలాంటివి ఉండటానికి ఆస్కారమే లేదు. అయినా మీరు ఉందంటున్నారు గనుక మేం ఇంకా ఏం చేయగలమో సూచించమని మండలాధికారులకి రాస్తాను. అయినా వాళ్ళకేం కావాలో వాళ్ళడక్కుండా ఎవరు మాత్రం ఏం చేయగలరు? అడగందే అమ్మయినా పెట్టదంటారు. అడిగే బాధ్యత వాళ్ళు తీసుకోనిదే అధికారులేం చెయ్యగలరు?" అన్నారు.

"జపాన్‌లోని కమీషిరాటకి అనే కుగ్రామానికి చెందిన ఒకేఒక అమ్మాయి బడికెళ్ళి రావటానిగ్గాను ఎంతో వ్యయాన్ని భరిస్తూ ప్రత్యేకంగా ఒక రైలు నడుపుతున్నాదట జపాన్ రైల్వే! అంతటి బాధ్యత, కన్సర్న్ మీరు చూపించలేరా?"

"చూపిస్తాను, ఇండియా జపాన్ అయ్యాక!" నవ్వి లేచారాయన.

"సార్ సార్... వన్ లాస్ట్ క్వశ్చన్. కేంద్ర రాష్ట్ర మంత్రులూ, ఉన్నతాధికారులూ రోజుకో కొత్తకలని ఆవిష్కరిస్తున్నారు. కాని రూట్ లెవెల్లో పరిస్థితి పూర్తిగా భిన్నంగా ఉంది. రెంటికీ లంగరందటమే లేదు. జనం ఆశల్ని ఆ పథకాలేవీ తీర్చలేకపోతున్నాయి. అసలు వారికేం కావాలో, ఎంత కావాలో, వారి ప్రాధాన్యాలేమిటో ఏమీ తెలుసుకోకుండానే ఏసీరూముల్లో కూర్చుని ప్రణాళికలేసేస్తున్నారు. గాంధీజీ గ్రామ స్వరాజ్యాన్ని కోరుకున్నారు. కానీ చూస్తోంటే రాష్ట్రమూ, దేశమూ స్వతంత్రంగా ఉన్నట్టూ ఆలోచిస్తున్నట్టూ అనిపించడమే లేదు. మీరేమంటారు?"

"కూడూ, గూడూ, గుడ్డే ముఖ్యమని ఆలోచిస్తున్న మిమ్మల్ని చూస్తోంటే సిగ్గుగా ఉంది. దేశాభివృద్ధికి కొత్త కొలబద్ధలూ, కొలమానాలూ తెలుసుకుంటే మంచిది. అవి తెలిస్తే మీ ప్రశ్నకి సమాధానం మీకే తెలుస్తుంది."

పెదవి కొరుక్కుంది మంజరి. ఉరకబోతున్న కన్నీటిని బిగబట్టింది.

"అరగంట ప్రోగ్రాంకి సరిపోతుందిలే" బ్యాగ్ సర్దుకుంటూ అన్నాడు ప్రకాష్.

టీవీ స్టూడియోకెళ్ళి ఎడిటర్ పక్కన కూర్చుని అంతా ఒక ఆర్డర్‌లో పెట్టించింది మంజరి. మధ్య మధ్య క్లిప్పింగులూ, ప్రముఖుల స్టేట్‌మెంట్లూ చొప్పించి హృదయం ద్రవించేలా తీర్చిదిద్దింది. ప్రొడక్షన్ వాళ్ళని బతిమాలి చక్కని పబ్లిసిటీ ఇప్పించి మరీ ప్రసారం చేయించింది.

రేటింగ్‌కి అందలేదు. అదే సమయంలో మరో ఛానల్లో ప్రసారమైన ప్రముఖ హీరో సినిమాకి రికార్డు స్థాయిలో రేటింగ్ వచ్చింది.

డీలాపడింది మంజరి. "నీ శ్రమంతా పెంట కుప్ప మీద పోసిన ఆవుపాలు అయ్యిందా!" అని ప్రోగ్రామ్ ఎగ్జిక్యూటివ్ నవ్వేసరికి పౌరుషం పొడుచుకొచ్చింది. 'ఏదో చెయ్యాలి. చేస్తాను' అనుకుంది.

ఒక గ్రామాన్ని దత్తత చేసుకోవాలనుకుంటున్నట్టు ఒక ప్రముఖ నటుడు ప్రకటించాడు. వెంటనే వెళ్ళి అతణ్ణి కలిసింది.

"ముందుగా ఒక గొప్ప నిర్ణయం తీసుకున్న మీకు నా అభినందనలు." అంటూ పాతూరు గురించి చెప్పింది. "ఆ ఊరిని దత్తత తీసుకోండి. ఆ ఊరి జనాన్ని ఉద్ధరించిన మహా పురుషుడిగా చరిత్రలో నిలిచిపోతారు" అందామె ఉద్విగ్నయై ఊగిపోతూ.

"భలేదానివే. మారుమూల పల్లెకెళ్ళడానికి నాకెక్కడ కుదురుతుందీ! సిటీ పక్కన కొంత డెవలప్ అయిన గ్రామం అయితే నా ట్రస్ట్ సారథ్యంలో రెండు మూడు మంచి పనులు చేసినా బోలెడు పేరు ప్రఖ్యాతులొస్తాయి. పబ్లిసిటీ అవసరం లేనివారుండరుగా. అయినా నువ్వు చెప్పినదానిని బట్టి చూస్తే ఆ ఊరి వాళ్ళంతా సోమరిపోతుల్లో, కలేజా లేనివాళ్ళో అనిపిస్తోంది. ఐ పిటీ దెమ్!"

"వాళ్ళు గంగిగోవులు సార్..."

"పాలు ఇవ్వని ఆవులు! పాలు పితకడం మరచిపోయిన జనం! సారీయార్!"

నిరాశతో వెనుతిరిగింది. ఇంకేం చేయాలో, ఎవర్ని అప్రోచ్ అవ్వాలో తెలీలేదు. ఒక రాత్రంతా మదనపడి మర్నాడు యూట్యూబ్, ఫేస్‌బుక్, వాట్సాప్ అన్నిట్లోనూ టీవీలో ప్రసారమైన కార్యక్ర

మానికి లింకు ఇస్తూ కామెంట్లు జతచేసింది. కనీసం ఇంకో పదిమందితో షేర్ చేసుకోమని అర్థించింది.

చాలామంది స్పందించారు. కొందరు చిన్న మొత్తాలు డొనేట్ చేస్తామంటూ ముందుకు వచ్చారు. ఒక సేవాసంస్థవారు "మొత్తం గ్రామ అభివృద్ధికి ఎంత ఖర్చు అవుతుందో బ్లూప్రింట్ తయారుచేసి పంపగలరా? అందులో 25 శాతం ఆ గ్రామస్థులు భరిస్తానంటే మేం పరిశీలించ గలం" అన్నారు.

దిక్కుతోచక దాన్నే అందరికీ పోస్టు చేసింది మంజరి.

చైతన్య అనే అతను పోస్టు చేసిన సమాధానం ఆమె గూబ గుయ్‌మనిపించింది.

"ఎవరి ఊరిని వారు, ఎవరి దేశాన్ని వారు అభివృద్ధి చేసుకోవాలి. లభ్యమైన అన్ని వనరుల్నీ పూర్తి స్థాయిలో వినియోగించుకోవాలి. అందుకు అవసరమైన శిక్షణ యువతకివ్వాలి. అనుకూల పరిస్థితులు కల్పించాలి. వారివారి అవసరాలకు తగ్గట్టు ప్రణాళికలు రూపొందించుకోవాలి. అంతే తప్ప ఎవరో డబ్బు సంచుల్తో రావాలి, మా ప్రాంతాన్ని అభివృద్ధి చెయ్యాలని ఆశించకూడదు. వచ్చినా, వాళ్ళు వాళ్ళ అభివృద్ధి చూసుకుంటారు తప్ప మీ అభివృద్ధి వారికక్కర్లేదు. వాళ్ళకి కావాల్సింది లాభాలుగాని మనమూ మన బాగూ కాదు. ఇక్కడున్న పచ్చదనాన్ని తినేసి చక్కాపోతారు. మిగిలేవి అస్థిపంజరాలూ, ఆకలి కేకలూ మాత్రమే. ఇలాంటి గ్రామం, దేశం కావాలనా నాటి జనం స్వాతంత్ర్యం, స్వరాజ్యం అంటూ బలిదానాలు చేసింది?"

ఆమెలో ఆలోచన రగిలింది. ఒక నిర్ణయానికి వచ్చి పాతూరు వెళ్ళింది.

"ప్రభుత్వాలకీ, పార్టీలకీ, నేతలకీ మీ తరఫున అల్టిమేటం ఇచ్చాను. ఆగస్టు 15 మధ్యాహ్నం 12 గంటలలోపు ఈ గ్రామం తలరాత మారిస్తే సరే సరి. లేకపోతే సామూహిక ఆత్మహత్యలు చేసుకుంటామని బెదిరించాను."

మంజరి వంక భావరహితంగా చూశారు. వారి ధోరణి అర్థంకాక పెదవి కొరుక్కుంది.

దేశమంతా స్వాతంత్ర్య దినోత్సవ వేడుకల్లో తలమునకలై ఉంది. అయినా సరే యావత్ మీడియా పాతూరు కదిలి వచ్చింది. ఢిల్లీ నాయకుల్నుండీ గల్లీ నాయకులదాకా అధికార ప్రతిపక్షాలు రెండింటికీ చెందినవారు వచ్చారు. వారి అనుచరులూ దిగారు.

"ఈ దుస్థితికి కారణం ఢిల్లీ పాలకుల నిర్లక్ష్యం. అవగాహన లేమి. చేతకానితనం. వారిని తోసేసి మమ్మల్ని గద్దెనెక్కించండి. మీ ఊరిని సింగపూర్‌గా మార్చేస్తాం" ప్రతిపక్షనేత చిందులు తొక్కాడు.

"ఇదంతా మీ పాపమే. మీ పాలనే వాళ్ళని దరిద్రులుగా, ఈ ప్రాంతాన్ని మరుభూమిగా మార్చేసింది. మా దగ్గరేం మంత్రదండం లేదు, హాంఫట్ అనెయ్యడానికి. ఎవరి హయాంలో ఎంత అభివృద్ధి జరిగిందో లెక్కలు తిరగేద్దాం. దాని గురించి బహిరంగ చర్చకు రావాల్సిందిగా సవాల్ విసురుతున్నాను" అన్నాడు అధికారపక్ష నాయకుడు.

వాళ్ళ, వీళ్ళ అనుచరగణం నోటియుద్ధానికి దిగింది.




## గన్‌పార్క్

అసెంబ్లీ కండ్ల ముందు
స్లోగన్లను పార్క్ చేసినట్టు
అమరుల స్మృతి గన్‌పార్క్

చుట్టుపట్ల జన ప్రవాహాలు
ఊరేగింపులు హక్కుల వాదాలు
పిడికిళ్ళు ఎత్తిన నినాదాలు

ఆందోళనలకు అరాచకీయాలకు
అన్యాయాలకు అణచివేతలకు
ధిక్కారంగా లేచిన అలలు
గొంతెత్తి నినదించిన కలలు

మీకు చూసే మనసువుంటే
ఇప్పటికీ కనిపిస్తాయి నెత్తుటి మరకలు
మీకు కదిలే హృదయముంటే
ఈనాటికీ వినిపిస్తాయి నేలకొరిగిన ఎరుకలు

మంది నెత్తిమీద కొబ్బరికాయలు కొట్టే
ప్రతి ఒక్కడూ పూలు ఉంచినపుడు
స్తూపం తీరని మనస్తాపం పడుతుంది
అయినోడు కానోడు దండం పెట్టినప్పుడు
కురుక్షేత్ర యుద్ధంలో
'తాతా నిన్ను చంపుతా' దీవించమన్నట్టు
అర్జునుడు భీష్మునికి సంధించిన
నమస్కారబాణం నాకు యాదికి వస్తుంది

ఇక్కడ ఇకమతులతో
వొల్లెన్ని మాటలు చెప్పి మొక్కినోళ్ళే
శాసనసభలో కుర్చీలు ఎక్కిండ్రు

ఎన్నో ప్రతినలు
ఎన్నో ఉపన్యాస విన్యాసాలు
ఎన్నోఉత్తేజ ఉద్యమ గీతాలు
ఇక్కడినుంచి మత్తడి దుంకినై

అప్పుడూ ఇప్పుడూ ఎప్పుడూ
జనం కోరిక మేరకే నిర్ణయం
నోరూరించే శెక్కరిగోళీ



పారుతున్న నదిని ఆపే
ముళ్ళ కంచెలు బారికేడ్లు
లాఠీలు తుపాకితూటాలు

నోరు విప్పదు ఇది రాయమని చెప్పదు
కుర్చీపై ఈగ వాలనివ్వని
నరం లేని నాలిక 'కలంకారీలు'

పట్నంల శాసనసభ ముందు జెన్‌ధ్యానిలా
నిలిచిన గన్‌పార్క్‌కు ఆరాం లేదు
ఇచ్చే స్లోగన్లకు అలుపు లేదు

విధ్వంసాలకు విసిగి ఉగ్గపట్టలేక
నినదించే పిడికిళ్ళు
కదం తొక్కే వేలపాదాలు
బక్కచిక్కిన పానాలు
శాసనసభలు చుట్టుముడతాయి
చాపలా చుట్టి పడేస్తాయి

***-జూకంటి జగన్నాథం, సెల్: 94410 78095***

మీడియాకి పండుగలా ఉంది. లైవ్‌లో అన్నీ అంతా కవర్ చేస్తూ, ఉత్కంఠ పెంచుతూ వ్యాఖ్యానిస్తున్నారు. నగరాల్లో దారినపోయే వాళ్ళని ఆపి "మీరేమంటారు?"అని ప్రశ్నిస్తున్నారు. టీవీ స్టూడియోలో అరిచే సత్తా గలవారిని ఆహ్వానించి కుర్చీ చర్చా కార్యక్రమమూ ప్రారంభించారు.

లంచ్ టైమైంది. నేతల, అనుచరుల గొంతులు ఎండిపోయాయి. వెంట తెచ్చుకున్న మినరల్ వాటర్ బాటిళ్ళు ఖాళీ అయ్యాయి. ఆ ఊళ్ళో నీళ్ళు దొరకవని తెలీడం ఆలస్యం మెల్లగా జారుకున్నారు కొందరు. ఆకలి దంచేస్తూండటంతో మరికొందరు వెళ్ళిపోయారు. మిగతావాళ్ళు మీనమేషాలు లెక్కపెట్టసాగారు.

మీడియా వారంతా గుంపు చింపులు పడి ఒకర్ని మంజరి దగ్గరకు రాయబారం పంపారు. అతడు "మధ్యాహ్నం ఒంటిగంటయింది. గ్రూప్ ఆత్మహత్యల కార్యక్రమం ఉందా రద్దయిందా?" అని తగ్గు స్వరంతో ప్రశ్నించాడు.

ఆమెలో బాధ చివ్వున ఎగజిమ్మింది. అతడి వంక జాలిగా చూస్తూ విషాదంగా నవ్వింది. అతడు తల గోక్కుంటూ వెళ్ళి పెదవి విరిచాడు. మరుక్షణం మీడియా మాయమైంది. గ్రామం, గ్రామస్థులు, మంజరి మిగిలారు. మంజరి దిక్కుతోచక కూలబడిపోయింది.

ఇంతలో చైతన్య ఆధ్వర్యంలో కొందరు యువతీ యువకులొచ్చారు. అంతా వారివంక పరమాశ్చర్యంగా చూస్తోంటే వారు 'ఊరు అమ్మకం' ప్రకటన రాసిన గోడ దగ్గరికెళ్ళారు. దానిమీద సున్నం వేసి మరో ప్రకటన- కాదు ప్రతిజ్ఞ రాశారు.

"ఇది మన ఊరు. ఇది మన జన్మభూమి. మన కర్మభూమి. ఇక్కడివారంతా మన అన్నదమ్ములూ, అక్కచెల్లెళ్ళూ. వీరితో చేతులు కలుపుదాం. అండగా నిలుద్దాం. ఈ భూమిలో కొత్త విత్తనాలు నాటుదాం, రండి. ఈ శ్రమ యజ్ఞంలో గ్రామ పునర్నిర్మాణంలో భాగస్వాములవుదాం."

***సెల్: 98490 61668***



# జీవితమే ఒక ప్రతిఘటన

## (కోట శ్రీనివాసరావు కథాకథనం) 4

**గోవింద్‌చౌదరిగారి దర్శకత్వంలో వేసిన 'పండగొచ్చింది' నాటకంలో మున్సబ్‌గా చేశా. దూరదర్శన్‌లో ప్రదర్శితమైన తొలి తెలుగు నాటిక, హాస్య నాటిక అదే. గట్టిగా మాట్లాడాలంటే హాస్యమంటే అదే. అప్పట్లో చేసిందే. కామెడీ అంటే ఇప్పుడొచ్చేది. నటనకు అప్పట్లో ఒక పద్ధతి ఉండేది. ఇప్పుడేముందండీ... ప్చ్..**

పద్ధతులు తెలియాలి!

ఏదో అంటారే... కుక్కపిల్ల అగ్గిపుల్ల, సబ్బు బిళ్ళ కాదేదీ కవితకు అనర్హం అని. ఇప్పుడున్న నటులకు కూడా ఇది వర్తిస్తుంది. అప్పట్లో నాటిక అంటే ఇలా ఉండాలి, నటన అంటే అలా ఉండాలి అని ప్రాథమికంగా కొన్ని లక్షణాలు ఉండేవి. ఖైదీని మాసిన గడ్డంతో చూపించేవాళ్ళు. ఇప్పుడు గడ్డం లేని మగమనిషి లేడు. నటుడన్నవాడికి ముఖం అంతా జుట్టుంటే మేకప్‌మేన్ ఏం చేస్తాడు? కళ్ళూ, పళ్ళుతప్ప ఇంకేం కనిపిస్తాయి? అంతోసి దానికి ముంబైనుంచి మేకప్ మ్యాన్ ఎందుకు? వాళ్ళకి రోజూ పదివేలు, ఏడువేలు ఇవ్వడం ఎందుకు? గట్టిగట్టిగా డైలాగులు చెప్పి, చేతులూ కాళ్ళూ కదిలించాలి. కానీ సినిమాల్లో పరిస్థితి వేరు. రెండు అంగుళాల కన్నును కూడా 70 ఎంఎం స్క్రీన్ మీద పే..ద్దగా చూపించవచ్చు. ఇక్కడ సెటిల్డ్‌గా చేయడం చాలా కీలకం. ఈ విషయం నాకు సినిమాల్లోకి ఎంటరైనప్పుడు అంతగా అర్థమయ్యేది కాదు. దర్శకులు ఒకట్రెండుసార్లు వివరించాక అర్థమైంది.

### మొదటి సినిమా 'ప్రాణం ఖరీదు'

సినిమా రంగంలో నేను మొదటిసారి కెమేరా ముందు నిలబడింది 'ప్రాణం ఖరీదు' చిత్రం కోసం. సి.యస్.రావుగారు రాసిన 'ప్రాణం ఖరీదు'

# 'అబ్బా ఏం చేశాడ్రా బ్యాంకోడు' అనేవారు

అంతెందుకు? కథక్, కూచిపుడి, భరతనాట్యం వంటివాటికీ నిబంధనలుంటాయి. కానీ ఇప్పుడు సినిమాల్లో వస్తున్న డ్యాన్సులు చూడండి. హీరోయిన్ ముందు హీరో గెంతుతూ ఉంటాడు. కింద పడి కొట్టుకుంటూ ఉంటాడు. అదేంటంటే ఫ్లోర్ డ్యాన్సులంటారు. మామూలుగా మన ఇళ్ళల్లో అమ్మాయిల ముందు అబ్బాయిలు గెంతుతారా? గెంతరు కదా? పద్ధతిగా హుందాగా ఉంటారు. కానీ సినిమాల్లో పరిస్థితి అలా ఉండదు. ప్రతి పాటకీ వెనక ఓ 50 మంది డ్యాన్సర్లు ఉండాల్సిందే. అంతమంది ఎందుకు అన్నది నా ప్రశ్న? ఉంటే తప్పేంటి? అని ఎదుటివారు అడిగితే నా దగ్గర సమాధానం లేదు.

హీరో జైలు పాలైతే ఒకప్పటి సినిమాల్లో ఆ



ఏం చేసినా ఓ కారణం ఉండాలి కదా అంటే 'మీదంతా పిచ్చి' అంటారు. 'సరే పో' అని అనుకుంటా. పూర్వం ఎవరైనా గడ్డం పెంచితే పెద్దవాళ్ళు 'ఏంట్రా గడ్డం గిడ్డం పెంచి పిచ్చోడిలాగా ఉన్నావ్.. నీట్‌గా గడ్డం చేసుకుని మంచి బట్టలు వేసుకో' అని అనేవారు. అప్పుడు పెద్దలు చెబితే పిల్లలు వినేవారు. ఇప్పటి తరానికి ఏమైనా చెప్తే, చెప్పిన వాడు వెధవ అవుతాడు. అలాగని ఇంట్లో బిడ్డలకి మంచీ చెడూ చెప్పకుండా ఉండకూడదు. 'తినగ తినగ వేము తియ్యగ నుండు...' అంటారే అలా మనం చెప్పగా చెప్పగా పిల్లలకి తప్పకుండా మంచీ చెడు మనసుకు ఎక్కుతుంది.

### రంగస్థలమే నటనకు పెద్దబాలశిక్ష

నాటకం గురించి చెప్పాలంటే ఒకటే మాట. భాషకి డిక్షన్ ఎంత గొప్పదో, భాష నేర్చుకోవడానికి పెద్ద బాలశిక్ష ఎలా ఉపయోగపడుతుందో, అలా నటనకి రంగస్థలం ఉపయోగపడుతుంది. నటుడిలో ఆత్మస్థైర్యం పెంచుతుంది నాటకం. ఎదుటివారు ఎంత గొప్ప నటులైనా బెరుకు లేకుండా నటించే తత్వం నేర్పుతుంది. బాగా గడ్డం పెంచుకుని, కళ్ళల్లో గ్లిజరిన్ వేసుకుని రంగస్థలం మీద ఏడుపు సీన్లు చేస్తే ముందు నాలుగు వరుసల్లో కూర్చున్న వారికి బాగా కనిపిస్తుంది. ఆ తర్వాతి వరుసల వాళ్ళకు ఏం తెలుస్తుంది? వాళ్ళను కూడా రంజింపచేయాలంటే

నాటకం ఆధారంగా అదే టైటిల్‌తో ఈ చిత్రాన్ని తెరకు ఎక్కించారు. సినిమాలో రావుగోపాలరావు గారు చేసిన పాత్రను నేను నాటకాల్లో వేసేవాణ్ణి. చూసిన ప్రతి ఒక్కరూ 'అబ్బా ఏం చేశాడ్రా, బ్యాంకోడు' అని మెచ్చుకునేవారు. అవార్డులు కూడా వచ్చాయి. సినిమాలో నేను వేసిన పాత్రను సి.యస్.రావుగారు వేయాల్సింది. కానీ ఆయన అర్జంటుగా ఊరెళ్ళాల్సి రావడంతో నన్ను పిలిపించి 'మన నాటకాన్ని సినిమాగా తీస్తున్నారు. చిన్న పాత్ర ఉంది. సెంటిమెంట్‌గా బావుంటుంది శ్రీనివాసరావు... నువ్వెళ్ళి ఆ పాత్ర చేసి రావయ్యా' అన్నారు. సరేనని వెళ్ళా. రాజమండ్రి దగ్గర వేమగిరిలో రెండు రోజులుండి చేసొచ్చా. మొదటిసారి కెమేరా ముందు నిలుచున్నాననే భావనే నాకు లేదు. చెప్పాను కదా... నాకు సినిమాపట్ల ఎలాంటి ఆసక్తిగానీ, అభిమానంగానీ లేదు. ఇంకా చెప్పాలంటే కోపం! సినిమాల్లో నటించాలంటే ఆరు అడుగుల ఆజానుబాహుడై ఉండాలి, చూడ్డానికి కన్నూ, ముక్కూ అందంగా ఉండాలి. రింగుల జుట్టు ఉండాలి, అద్దంలో అందంగా కనిపించాలి. ఇలా మాట్లాడుకుంటుండేవారు. అలాంటప్పుడు నేను సినిమాల్లో ట్రై చేస్తే, ఒకవేళ పొరపాటున ఎవరైనా 'ఏంటి సినిమాల్లో నటిస్తావా? అద్దంలో ఎప్పుడైనా ముఖం చూసుకున్నావా?' అని అడిగితే తట్టుకోగలనా? అసలు ఈ ఫీలింగే నాకు ఎక్కువగా ఉండేది. అందుకేనేమో.. కోపంగా ఉండేది. కానీ అలాంటి భయం నాకు రంగస్థలం మీద ఉండేది కాదు. ఎందుకంటే నాటకాలంటే నాకున్న

దుగ్ధ అలాంటిది మరి.



## నా రంగస్థల గురువులు తొమ్మిదిమంది

నాకు రంగస్థలం మీద నటన నేర్పినవారు తొమ్మిదిమంది ఉన్నారు. మా అన్నయ్య కోట నరసింహారావు, భావనాచార్య, దేశిరాజు హనుమంతరావు, ఆదివిష్ణు, ఎల్బీ శ్రీరామ్, రామ్‌ప్రసాద్, భానుప్రకాష్, శశాంక్, విద్యాసాగర్. నేను 300 సినిమాలు పూర్తి చేసిన సందర్భంగా వీళ్ళందరికీ రవీంద్రభారతిలో సత్కారం చేశా. వీళ్ళకి స్టేజీ మీద ప్రెజెంటేషన్ ఏమివ్వాలని చాలా రోజులు ఆలోచించి చివరికి ఓ వెండి వెంకటేశ్వరస్వామి ప్రతిమ ఇచ్చా. ప్రతిమ కింద ఓ ప్లేటు చేయించి దానిపై వాళ్ళ పేరు రాసి 'ఈనాటి నా పురోగతికి ఆనాటి పునాది రాయి మీరు. నేను మిమ్మల్ని మర్చిపోకుండా తలచుకుంటూ ఉంటాను అని మీకు గుర్తుండటం కోసమని ఈ మెమెంటో మీ ఇంట్లో పెడుతున్నాను' అని రాసి ఇచ్చాను.

ఆ కార్యక్రమానికి వచ్చిన డా.డి.రామానాయుడుగారు మాట్లాడుతూ "కోట ఖర్చు పెట్టడని అందరూ అంటుంటారు. నాకు తెలిసి ఈ వేడుకకు లక్ష రూపాయలకి పైగా ఖర్చై ఉంటుంది. ఎవరినీ రూపాయి అడగకుండా నటన నేర్పిన వారిని సొంతంగా సత్కరించుకున్నాడు. సినిమా వాళ్ళలో ఇలా చేసిన వారు నాకు తెలిసి లేరు" అని అన్నారు. మా గురువులు మాట్లాడుతూ "కోటకి మేం నేర్పింది తక్కువే. ఏం చెప్పినా వెంటనే అర్థం చేసుకునేవాడు. అతన్ని మేం బాగా ఉపయోగించుకున్నాం" అని చెప్పారు. గిరిబాబుగారు, చంద్రమోహన్‌గారు ఇలా చాలామంది సినీ ప్రముఖులు ఆ కార్యక్రమానికి వచ్చారు.

### ఆరేళ్ల గ్యాప్‌లో...

'ప్రాణంఖరీదు' తర్వాత 'ప్రతిఘటన' సినిమాలో నటించడానికి ముందుగా, ఈ ఆరేళ్ళలో నేను నాటకాలు వేస్తూ, బ్యాంకులో ఉద్యోగం కొనసాగిస్తున్న సమయంలో ఓ సారి జంధ్యాలగారు పిలిచి 'అమరజీవి' సినిమాలో అవకాశం ఇచ్చారు. నేను బెజవాడలో ఉన్నప్పటి నుంచి ఆయనతో మంచి పరిచయం. ఆ పరిచయంతోనే సినిమాల్లో నటించమని పిలిచేవారు. అలా సారథి స్టూడియోలో షూటింగ్‌లకు వెళ్ళి చిన్నాచితకా వేషాలు వేసొచ్చేవాణ్ణి. 'బాబాయ్ అబ్బాయ్'లోనూ అలాగే చేశా. యండమూరిగారి 'కుక్క'లోనూ నటించాను. ప్రసాద్‌గారని సెక్రటేరియట్‌లో చేసేవారు. ఆయన ఆ సినిమాని 63 వేల రూపాయల్లో తీశారు. చాలామంచి పేరు, నంది అవార్డు వచ్చాయి.

### టి.కృష్ణకు నన్ను గుర్తుచేసిన ముత్యాల సుబ్బయ్య

రవీంద్రభారతిలో ఓసారి 'మీరైతే ఏం చేస్తారు' అనే నాటకం ప్రదర్శించాం. అందులో నాది భూస్వామి వేషం. టి.కృష్ణగారు, ముత్యాల సుబ్బయ్యగారు ఆ నాటకం చూశారు. టి. కృష్ణగారి దగ్గర ముత్యాలసుబ్బయ్యగారు కో డైరెక్టర్. వాళ్ళు ఆ నాటకం చూసింది 1982లో. 'వందేమాతరం' సినిమా వాళ్ళు తీయాలనుకున్నది 1985లో. అందులో ఓ పాత్రకు స్టేజ్ ఆర్టిస్టునే ఎంపిక చేయాలన్నది టి.కృష్ణగారి నిర్ణయం. 'ఎవరున్నారు ఎవరున్నారు' అని టి.కృష్ణగారు అడుగుతుంటే అప్పుడు ముత్యాల సుబ్బయ్యగారు 'అప్పుడు మనం చూసిన నాటకంలో పల్లెటూరి విలన్‌గా చేశారే.. ఆయన్ని ట్రై చేస్తే ఎలా ఉంటుంది? సమయం చూసి ఒకసారి గుర్తుచేయమని మీరు కూడా చెప్పారు' అన్నారట. 'భలే గుర్తుచేశావయ్యా. చాలామంచి యాక్టరు. భలే ఉంటాడాయన. కానీ ఆయన్ని పట్టుకోవడం ఎలా?' అని టి.కృష్ణగారు ప్రశ్నించారట. అప్పుడు.. పక్కనే రమణారెడ్డిగారు (హైదరాబాద్‌లో స్టేట్ గవర్నమెంట్‌లో పనిచేసేవారు. మంచి నటుడు. టి.కృష్ణగారి ఊరువాడే అనుకుంటా. సినిమాల్లోనూ నటించేవారు) ఉన్నారట. 'మీరు మాట్లాడేది బ్యాంకు శ్రీనివాసరావు గురించా?' అని అడిగారట. 'అవును, మీకు తెలుసా' అని అడిగితే 'నేను తీసుకొస్తా. నాకు తెలుసు. బ్యాంకులో పనిచేస్తాడు' అనిచెప్పి నా దగ్గరకి వచ్చాడు. 'నీకో తీపి కబురు చెబుతానురా శ్రీనివాసరావు. నాకు మంచి స్వీటు ఇప్పించు' అని అడిగాడు. 'సరేపద' అని మంచి స్వీటు తినిపించా. అప్పుడు చెప్పాడు 'వందేమాతరం' సినిమా గురించి. 'మంచి వేషం. విలేజ్ పాలిటిక్స్ మీద రెండు మెయిన్ కేరక్టర్స్ ఉంటాయి. అందులో ఒక పాత్రకు నిన్ను అనుకుంటున్నారు. సినిమా ఆడితే నీకు మంచి పేరొస్తుంది. వాళ్ళంతటవాళ్ళు పిలుస్తున్నారు. అర్జెంటుగా వెళ్ళు. ఆలోచిస్తూ టైమ్ వేస్ట్ చేసుకోకు' అన్నాడు. సరే అన్నాను. అప్పట్లో ఎస్టీడీలు ఏమీ లేవు. ఎన్‌బీఏ సర్వీసులని ఒక టెలిఫోన్ సర్వీసు ఉండేది. వాళ్ళని అడిగితే వాళ్ళే ఇచ్చేవారు. రమణారెడ్డి ఇచ్చిన నెంబరుకి ఫోన్ చేశా. టి.కృష్ణగారే ఫోన్ ఎత్తారు. 'నేను పలానా అండీ' అని చెప్పగానే 'మీరు అర్జంటుగా రావాలండీ మద్రాసుకి. రేపు బయలుదేరగలరా?' అని అడిగారు టి.కృష్ణగారు. 'రేపు రమ్మంటే కష్టమవుతుందండీ. బ్యాంకులో క్యాష్‌లో ఉన్నాను. ఏమీ అనుకోకండీ. ఇక్కడ ఎవరో ఒకరికి క్యాష్ అప్పగించి రావాలి. ఎల్లుండి రమ్మంటే బయలుదేరుతా' అన్నా. 'సరే, ఎల్లుండి బయలుదేరండీ. నెగ్లెక్ట్ చేయకండి. నేను మళ్ళా వైజాగ్ వెళ్ళాలి' అన్నారు. ఇప్పట్లాగా అప్పట్లో ట్రైన్ రిజర్వేషన్లు పెద్దగా ఉండేవి కాదు. అనుకోని ప్రయాణం! ఎలాగో టిక్కెట్టు తీసుకుని రైలు ఎక్కేశా. మద్రాస్ సెంట్రల్ స్టేషన్‌లో దిగి ఫోన్ చేశా.

**కోట శ్రీనివాసరావుగారి మొదటిచిత్రం 'ప్రాణం ఖరీదు'. ఆ తర్వాత ప్రతిఘటనలో గుర్తింపు నిచ్చిన పాత్ర చేయడానికి ముందు ఆరేళ్ళ కాలంలో అమరజీవి, బాబాయ్ అబ్బాయ్, వందేమాతరం చిత్రాల్లో నటించారు. 'వందే మాతరం' లో ఒక పాత్రకు ఎవరిని ఎంపిక చేయాలని టి.కృష్ణగారు ఆలోచిస్తున్న సమయంలో కోడైరెక్టర్ ముత్యాలసుబ్బయ్య గారు కోట పేరు సూచించారు. మరి ఆయన కోట పేరే ఎందుకు సూచించారు?**

(ఇంకా ఉంది)

- డా.చల్లా భాగ్యలక్ష్మి
సెల్: 88850 55528



# పద్మవ్యూహం

డా॥ యండమూరి సత్యకమలేంద్రనాథ్

**అశ్విక్ మనసు నిండా ఆలోచనలు. రాత్రంతా నిద్రలో కూడా కలలే! అవన్నీ గుర్రపు పందేలకి సంబంధించినవే.**

**ఆదివారం పదకొండు గంటలు కావస్తోంది. పోర్టికోలో ఉన్న కారుని బైటకు తీస్తూ ఉండగా ఇంటిముందు ఆటో ఆగింది. భార్య, ఆరేళ్ళ కొడుకు దిగారు. కొడుకు పరిగెత్తుకుంటూ కారు పక్కకు వచ్చాడు. అశ్విక్ తనవైపు డోరు అద్దం కిందకి దింపాడు.**

"నాన్నా! సాయంత్రం అమ్మని, నన్ను బైటకు తీసుకొని వెళతానన్నావు. మరి ఇప్పుడు నువ్వెళ్ళిపోతున్నావేం? సాయంత్రం వస్తావా?" అడిగాడు కొడుకు.

"కొంచెం అర్జంటు పని ఉందిరా!"

"ప్రతి ఆదివారం ఇలానే అంటావు. ఎప్పుడూ రావు. అంత అర్జంటు పనేమిటో నాకు తెలుసులే"

"నీకేం తెలుసురా!"

"ఆదివారం అయితే నువ్వెళ్ళేది రేసులకేకదా! రాత్రి ఎప్పుడో వస్తావు. అప్పటికి నేను నిద్రపోతాను. సరేలే నువ్వు వెళ్ళు. నేను, అమ్మ సాయంత్రం పార్కుకి వెళ్ళి ఆడుకుంటాం" అని విసురుగా ఇంట్లోకి వెళ్ళిపోయాడు. ఆ సంభాషణ విని నిట్టూరుస్తూ కొడుకుతో కూడా ఇంట్లోకి వెళ్ళింది భార్య రోహిణి.

కారు చాదర్‌ఘాట్ బ్రిడ్జి మీద నుంచి మలక్‌పేట రేస్ కోర్సు వైపు వెళుతోంది.

ఆరోజు డెక్కన్ డెర్బీ రేసు ఉంది. చాలా ప్రతిష్ఠాత్మకమైన రేసు. ట్రైనీస్‌కి, జాకీలకి, గుర్రపు యజమానులకి, ఆ రేస్ నెగ్గాలనే బలీయమైన కోరిక ఉంటుంది. ఆ గెలుపుని గౌరవంగా భావిస్తారు. ప్రత్యేకంగా ఆ రేసుకోసం ఎక్కడెక్కడ నుంచో తమ గుర్రాలతో వస్తారు.

అశ్విక్‌కి గుర్రపు పందేల వ్యసనం ఉంది. ప్రతీ ఆదివారం క్రమం తప్పక హాజరవుతాడు. ఒక్కొక్కసారి పున్నమినాటి చంద్రుడిలా ఇంటికి వస్తే మరోసారి పాడ్యమి చంద్రుడిలా ఇంటికి చేరతాడు.

సుమారు అయిదు సంవత్సరాల నుంచి క్రమం తప్పకుండా రేసులకి వెళుతున్నాడు. వెళ్ళే ముందు పరీక్షకు హాజరయ్యే విద్యార్థిలా రేసుల గురించి చదువుతాడు. గుర్రాల వంశవృక్షాలు క్షుణ్ణంగా ఆకళింపు చేసుకుంటాడు. గుర్రాలకి చరిత్ర ఉంటుందనీ, కోల్ట్ అంటే రెండు సంవత్సరాల మగ గుర్రాలనీ, ఫిల్లీ అంటే రెండు సంవత్సరాల ఆడ గుర్రాలనీ, తండ్రి గుర్రాన్ని 'సైర్' అంటారనీ, తల్లి గుర్రాన్ని 'డామ్' అంటారనీ అప్పుడే అశ్విక్‌కి తెలిసింది.

క్రితం రెండు వారాలు డబ్బులు పోయాయి. ఈ రోజు ఏ విధంగానైనా లోటు భర్తీ చేసుకోవాలనే ఉద్దేశంతో ఉన్నాడు. అతడికి రేసు కోర్సులో పనిచేసే వాళ్ళతో పరిచయాలు ఉన్నాయి. అందులో రాజు ముఖ్యుడు. రాజు ఫెరియర్. అంటే గుర్రాల బరువునిబట్టి వాటికి ఏ మెటల్ నాడాలు వాడాలో, అవి ఎంత బరువు ఉండాలో నిర్ణ

**ప్రతి ఆదివారం అతడు గుర్రపు రేసులకు వెళతాడు. గత రెండు వారాలుగా డబ్బులు పోయాయి. ఈసారి ఎలాగైనా ఆ నష్టం భర్తీచేసుకోవాలనుకున్నాడు. రేస్‌కోర్స్‌లో పనిచేసే ఫెరియర్‌తో అతడికి పరిచయాలున్నాయి. అతడిచ్చిన సమాచారంతో 30 వేలు గెలుచుకున్నాడారోజు. మళ్ళీ ఉప్పు అందించడంతో ఈసారి లక్షాముప్పైవేలు పందెం కాశాడు. మరి అతను గెలిచాడా? లేదా?**

యిస్తాడు. అప్పుడప్పుడు బుకీస్ దగ్గర పందెం కాస్తున్న అశ్విక్ దగ్గరకు వచ్చి ఏ గుర్రం మీద పందెం కాస్తే మంచిదో చెపుతాడు. కొన్నిసార్లు రాకపోయినా, ఎక్కువసార్లే నెగ్గుతాడు. రాజు మీద అశ్విక్‌కి నమ్మకం ఎక్కువ.

అశ్విక్ ముందురోజే రాజుని కలిశాడు. ఏవైనా తెలుస్తాయా అని అడిగితే 'రేసు కోర్సులో చెబుతాను సార్! కొన్ని రేసులు అప్‌సెట్ అవుతాయేమో అంటున్నారు" అన్నాడు.

"అప్‌సెట్" అన్న పదం వినగానే అశ్విక్ ఎగిరి గంతేసినంత పని చేశాడు. అందుకే రాత్రంతా అవే కలలు. ఒకదాని వెంట మరో రేసులో నెగ్గినట్టు, గోనెసంచిలో మొయ్యలేక మోస్తూ డబ్బులు భుజం మీద వేసుకొని పట్టుకొస్తున్నట్టు రాత్రంతా కలలే! కలత నిద్రే! ఎప్పుడు తెలవారుతుందా అని ఎదురుచూశాడు.

రేసు కోర్సు దగ్గర పార్కింగ్‌లో కారుపెట్టి తన దగ్గర ఉన్న మెంబర్స్ పాస్ మెడలో తగిలించుకొని లోపలికి వెళ్ళాడు. అప్పటికే, గుర్రాల్ని స్టార్టింగ్ బాక్స్ దగ్గరకు తీసుకొని వెళుతున్నారు. అన్నిగుర్రాలు హుషారుగానే కనపడుతున్నాయి. వాటిలో నాలుగో నెంబరు గుర్రం మరీ హుషారుగా ఉంది. మధ్యమధ్యలో కాళ్ళెత్తి ముందుకు దూకటానికి ప్రయత్నిస్తోంది. జాకీ వీపుమీద కూర్చొని దానిని నియంత్రించటానికి ప్రయత్నిస్తున్నాడు.

ఆ గుర్రాలవైపు చూస్తూ ఉండగా దూరం నుంచి రాజు రావడం కనపడింది. అశ్విక్ చెయ్యెత్తి ఇక్కడ ఉన్నానంటూ సైగచేశాడు. రాజుకి జనం మధ్యలో ఎత్తిన అశ్విక్ చెయ్యి కనబడలేదు. అటూఇటూ చూస్తూ వెతుకుతున్నాడు. అశ్విక్ ఆగలేక రాజువైపు గబగబ అడుగులు వేసి గాలిలో చెయ్యి ఊపాడు. గుర్తుపట్టినట్లుగా రాజు చెయ్యి ఊపాడు. "అమ్మయ్య! మొత్తానికి దొరికాడు" అనుకున్నాడు.

రాజు అశ్విక్ దగ్గరకు వచ్చి 'సిల్వర్ జెట్' మీద పందెం కట్టండి. ఎక్కువగా వద్దు" అన్నాడు. జేబులో నుంచి రెండు వందలు తీసి రాజుచేతిలో పెట్టాడు అశ్విక్. 'రేసు అయ్యాక ఇక్కడికే వస్తాను. మీరు ఇక్కడే ఉండండి" అని రాజు వెళ్ళిపోయాడు.

అశ్విక్ బుకీస్ బోర్డువైపు చూశాడు. 'సిల్వర్ జెట్' పక్కన ఒకటి అంకెవేసి ఉంది. మిగిలిన గుర్రాలవైపు చూశాడు. 'రెయిన్‌బో' గుర్రం దగ్గర వందకి అరవై వేసి ఉంది. "రెయిన్‌బో" ఫేవరెట్ అన్నమాట! ఒక్కొక్కసారి, ఒక గుర్రాన్ని ఫేవరెట్ చేసి మరో గుర్రాన్ని గెలిపించడం పరిపాటే కదా అనుకున్నాడు మనస్సులో. చూస్తూ ఉండగా సిల్వర్ జెట్ ముందు రెండు అంకె వేశాడు మరో బుకీ. నాలుగువైపులా చూశాడు. ఎవరూ ఒకటిన్నర రెట్లు మించి ఇవ్వడం లేదు. ఈరేటు కూడా తగ్గించేస్తాడేమోనని జనాన్ని తోసుకుంటూ బుకీ దగ్గరకు వెళ్ళాడు. అక్కడ కౌంటర్‌లోని వ్యక్తిని ఎన్నో చేతులు డబ్బుల్తో ముంచేస్తున్నాయి. అందరూ తమకు కావాల్సిన గుర్రాల పేర్లు చెప్పి ఎగిరెగిరి డబ్బులు ఇస్తున్నారు. కౌంటర్‌లోని వ్యక్తి కార్డు తీసి గుర్రం పేరు, ఎంత ఇచ్చింది, నెగ్గితే ఎన్నిరెట్లు ఇచ్చేది రాసి ఇస్తున్నాడు. అర్జునుడు సంధించిన బాణం కంటే వేగంగా కదులుతున్నాయి అతని చేతులు. రేసుకి సమయం గడిచిపోతుందేమోననే కంగారులో పందెం రాయుళ్ళు మరింత తొందర చేస్తున్నారు. ఆ జనం మధ్యలో నుంచి అశ్విక్ చెయ్యెత్తి కొత్త వంద రూపాయల నోట్ల కట్ట పట్టుకున్నాడు. కౌంటర్‌లోని వ్యక్తి నోట్ల కట్ట లాక్కొని "గుర్రం పేరు" అన్నాడు. 'సిల్వర్ జెట్' అన్నాడు అశ్విక్. తనముందు కూర్చున్న వ్యక్తితో 'సిల్వర్‌జెట్, పదివేలు' అని చెప్పగానే, ఆ వ్యక్తి కార్డు రాసి అశ్విక్ చేతికి ఇచ్చాడు. అశ్విక్ కార్డు తీసుకొని చూశాడు. 'ముప్పై వేలు' అని రాసి ఉంది. తను ఇచ్చిన డబ్బుకి రెండు రెట్లు కలిపి ముప్పై వేలు రాశాడు. సరిగ్గానే ఉంది అనుకుంటూ కార్డు జేబులో పెట్టుకొని, మొదటి రేసులోనే ముప్పై వేలు వచ్చినంత ఆనందంతో గ్యాలరీ వైపు నడిచాడు. బెల్ మోగింది. స్టార్టింగ్ బాక్స్‌లో నుంచి గుర్రాలు ముందుకు ఉరికాయి. అది వెయ్యి మీటర్ల పందెం. ఉత్కంఠగా చూస్తూ ఉండగానే గుర్రాలు విన్నింగ్ పోస్ట్ చేరాయి. ఏ గుర్రం నెగ్గింది తెలియలేదు. అశ్విక్ ఎనౌన్స్‌మెంట్ కోసం ఎదురు చూశాడు. బోర్డ్ మీద సిల్వర్ జెట్ నెంబర్ కనబడగానే ఎగిరి గంతేసినంత పనిచేశాడు. గబగబా తను పందెం కాసిన బుకీ దగ్గరకు వెళ్ళాడు. కార్డు చూపించాడు. బుకీలోని వ్యక్తి కార్డు చూసి "ఏదైనా మరో పందెం కాసే ఉద్దేశం ఉంటే కార్డు మీ దగ్గర ఉంచండి. ఆ పందెం డబ్బుల్లో ఈ సొమ్ము కలుపుదాం" అని చిన్న ప్రలోభం పెట్టాడు. వాళ్ళ పనే అది! అశ్విక్ ఆలోచిస్తూ నిలబడ్డాడు.

"చూశారా సర్! ఎలా నెగ్గిందో అని వెనక నుంచి వినపడగానే ఎవరా? అని తిరిగి చూశాడు అశ్విక్. ఎదురుగా రాజు. ఆనందంతో రాజు చేతుల్ని పట్టుకొని ఊపేశాడు. 'చాలా థాంక్స్ రాజూ' అని వెయ్యి రూపాయలు రాజు చేతిలో ఉంచాడు. "సార్! ఈసారి 'ఓ మైమై' గుర్రం మీద పందెం కాయండి" అన్నాడు. ఇప్పుడే కడతాను అన్నాడు అశ్విక్. రాజు వెళ్ళిపోయాడు. అశ్విక్ తను మొదటిసారి పందెం కట్టిన బుకీ దగ్గరకు వెళ్లాడు. 'ఓ మైమై' ఎదురుగా ఎన్ని రెట్లు ఇస్తున్నాడా అని చూశాడు. 'రెండు' అంకె వేసి ఉంది. మిగిలిన బుకీస్ ఎవరూ ఒకటిన్నరకి మించి ఇవ్వడం లేదు. వెంటనే బ్రీఫ్‌కేస్ తెరచి లక్ష రూపాయలు తీశాడు. దాంతోపాటు తను ముందు నెగ్గిన ముప్పై వేల రూపాయల కార్డు తీసి కౌంటర్‌లోని వ్యక్తికి ఇచ్చి 'ఓ మైమై' అన్నాడు. ఆ వ్యక్తి డబ్బు తీసుకొని లక్షా ముప్పై వేలకి రెండు రెట్లు కలిపి కొత్త కార్డు రాసి ఇచ్చాడు. బోర్డు దగ్గర నిలబడి ఉన్న వ్యక్తి 'ఓ మైమై' ఎదురుగా ఉన్న రెండు అంకె తీసి ఒకటి వేశాడు.

"ఏం సార్! ఏదైనా టిప్ వచ్చిందా, అంత పందెం కాస్తున్నారు" పక్కనే ఉన్న వ్యక్తి అడిగాడు.

"ఏమీ లేదండి. ఎందుకో గెలుస్తుందని అని

## నాకు ఇస్తే...నేను ఇస్తా!

తనని పొగరుబోతు అంటారు కానీ, తనది చాలా ఫ్రెండ్లీ నేచర్ అని అంటోంది నయనతార! సినిమా ప్రమోషన్లకు రాకపోవడానికి గల కారణాలు ఇతరులకి చెప్పవలసిన అవసరం లేదనీ, ఆ విషయాలు తన దర్శకనిర్మాతలకు చెప్పుకుంటానని అంటోంది. తనకు మర్యాద ఇస్తే ఎదుటి వారికి మర్యాద ఇస్తాననీ, తనతో వెటకారాలు చేసేవారికి అదే స్థాయిలో జవాబు చెప్తాననీ చెప్పుకొచ్చింది. ఇవి చూసి తనకు పొగరు అనడం మర్యాద కాదనీ స్పష్టం చేసింది.



"పించింది" ఏమీ తెలియనట్టు అన్నాడు అశ్విక్.

అశ్విక్ చుట్టూ చూశాడు. అందరూ 'ఓ మైమై' రేటు తగ్గించేస్తున్నారు. 'ఓ మైమై' ఫేవరెట్ అయిపోతుందన్నమాట అనుకున్నాడు. ఫేవరెట్ మీద తను రెండు రెట్లు రేటుతో ఆడుతున్నందుకు ఆనందపడ్డాడు. ఓ మైమై గుర్రం నెంబర్ ఏడు.

అశ్విక్ నడుచుకుంటూ పొడాక్ దగ్గరకు వచ్చాడు. అక్కడ గుర్రాలని మౌంట్‌చేసి ఒకదాని వెంట ఒకదానిని పొడాక్‌లో గుండ్రంగా నడిపిస్తున్నారు. ప్రతీ గుర్రం మీద, ఆ గుర్రాన్ని స్వారీ చేసే జాకీ కూర్చొని ఉన్నాడు. అన్నింటిలో ఒక గుర్రం పరిగెడుతున్నట్లుగా అడ్డదిడ్డంగా నడుస్తోంది. దానిమీద కూర్చొని ఉన్న జాకీ దానిని నియంత్రించటానికి కష్టపడుతున్నాడు. అశ్విక్ గుర్రాన్ని పరీక్షగా చూశాడు. ఆ గుర్రం నెంబరు ఆరు. వదిలితే పరిగెత్తి పారిపోతుందేమో అనుకున్నాడు. అశ్విక్ బుకీస్ దగ్గర్నించి రెయిలింగ్స్ దగ్గరకు వెళ్ళేసరికి అన్ని గుర్రాలు స్టార్టింగ్ బాక్స్ దగ్గరకు చేరాయి. బైనాక్యులర్స్ తీసి గుర్రాల వైపు చూశాడు. ఏ గుర్రాన్ని ముందు బాక్సులో పెట్టాలి, ఏ నంబర్ బాక్సులో పెట్టాలి అనే సర్టిఫికెట్ రేసు కోర్సు యాజమాన్యం నిర్ణయిస్తుంది. దాని ప్రకారం ఒకొక్క గుర్రాన్ని వాటి బాక్సుల నెంబర్ ప్రకారం లోపలికి పెడుతున్నారు. ఒక గుర్రం బాక్సులో నుంచి వెనుకకు నడిచి బయటకు వచ్చేస్తోంది. దాని నెంబర్ పరీక్షగా చూశాడు. ఆరవ నెంబర్. "తనకు వచ్చిన టిప్ నెంబర్ ఏడు! చూస్తుంటే ఆరవ నెంబరు హుషారుగా ఉన్నట్లుంది. కొంపదీసి గెలవదు కదా" మనసులో అనుకున్నాడు అశ్విక్. ఆఖరికి ఆరవ నంబరు గుర్రాన్నీ బాక్సులో ముందు నుంచి వెనుకకు నడిపించి నిలబెట్టాడు. స్థిరంగా నిలబడింది. రెండు నిమిషాలలో గంట మోగింది. గుర్రాలు పరిగెత్తడం మొదలు పెట్టాయి. చూస్తూ ఉండగానే సర్కిల్ తిరిగి గుర్రాలన్నీ విన్నింగ్ పోస్టు వైపు రాసాగాయి. ఏడవ నెంబరు గుర్రం మిగిలిన గుర్రాల కంటే మూడు నాలుగు లెంగ్స్ ముందుగా పరిగెడుతోంది. అశ్విక్ మనస్సులో ఉత్కంఠ? మనసు కూడా ఆనందంతో గుర్రంలానే ఉరకలు వేస్తోంది. తన దృష్టిలో ఓ మైమైని ఓడించే అవకాశం లేదనుకొని చప్పట్లు కొడుతూ 'కమాన్ ఓ మైమై' అని అరుస్తున్నాడు. మధ్య మధ్యలో గుర్రం లానే గెంతుతున్నాడు. అశ్విక్ పక్కనే ఉన్న వ్యక్తి ప్రశాంతంగా గుర్రాలని చూస్తున్నాడు. అదే వ్యక్తి రెండు రేసుల ముందు నుంచి అశ్విక్‌ని పరిశీలిస్తూనే ఉన్నాడు. రాజు రావడమూ, అశ్విక్‌తో మాట్లాడడమూ, అశ్విక్ లక్ష రూపాయల పందెం కాయడమూ చూశాడు. కానీ రాజు ఎవరో ఆ వ్యక్తికి తెలియదు.

అశ్విక్ ఆనంద డోలికల్లో తేలిపోతూ ఉండగా అకస్మాత్తుగా వెనుకనుండి ఎవరో తరుముకొస్తున్నట్లుగా మరో గుర్రం పరిగెత్తుతూ 'ఓ మైమై' పక్కనే వచ్చి పరిగెట్టడం మొదలయింది. పరీక్షగా చూశాడు అశ్విక్. అది ఆరవ నెంబరు. ఆరు, ఏడు నెంబరు గుర్రాలు సమాంతరంగా విన్నింగ్ పోస్ట్ దాటాయి. అశ్విక్‌కి మాత్రం ఏడవ నంబరు ముందు దాటినట్లుగా కనపడింది. అశ్విక్ తనకు గుర్తువచ్చిన దేవుళ్ళందరికీ మొక్కుతున్నాడు. రిజల్ట్ 'ఫోటోఫినిష్' అని బోర్డు మీద కనపడింది. అది కూడా ఆరు, ఏడు గుర్రాల మధ్య.




రాజు చెప్పాడు కాబట్టి చివరకు ఏడవ నెంబరు గెలుస్తుందనే అనుకున్నా, మరొకవైపు ఓటమి భయం పీడిస్తూనే ఉంది. బుకీస్ దగ్గర నిలబడ్డాడే కానీ, అసహనంతో కాళ్ళు ఒక చోట నిలబడడం లేదు. రిజల్ట్ చెబుతున్నట్టుగా బెల్ మోగింది. స్పీకర్ దగ్గరగా వెళ్ళి నిలబడ్డాడు. నెంబర్ ఎనౌన్స్ చేశారు. ఆ గోలలో వినపడలేదు. "ఫోటో ఫినిష్" ఉండే బోర్డు దగ్గరకు పరిగెత్తాడు. చూడగానే నీరుకారి పోయాడు. ఆరవ నెంబర్ గుర్రం ఆరు అంగుళాల తేడాతో నెగ్గింది. పొడాక్‌లో చూసినపుడు జరిగిన సంఘటన గుర్తుకి వచ్చింది. తనకు రాజు చెప్పాడనే ధీమాతో ఉన్నాడు. లేకపోయి ఉంటే ఆరు మీద పందెం కాసేవాడి నేమో! అనుకున్నాడు. వెంటనే ఆ గుర్రం పొడాక్‌లో చేసిన ఆర్భాటం గుర్తుకు వచ్చి ఆ జాకీ మరెవరికైనా సంకేతం పంపాడా అనే అనుమానం వచ్చింది.

మొదట్నుంచీ అశ్విక్‌తో పాటే తిరుగుతూ, అశ్విక్‌నే పరిశీలిస్తున్న వ్యక్తి తనలో తనే నవ్వుకుంటూ బుకీస్ దగ్గరకు వెళ్ళాడు. చేతిలోని కార్డు బుకీ దగ్గర ఇచ్చాడు.

అశ్విక్ తేరుకోవడానికి సమయం పట్టింది. రాజు వచ్చాడు. "అంత నమ్మకంగా చెప్పావు కదా రాజూ, ఇలా అయిందేవిటి" అడిగాడు అశ్విక్. గొంతు బొంగురుగా ఉంది.

"తప్పకుండా నెగ్గవలసిందే సార్! ఆరవ నెంబర్ గుర్రాన్ని కాస్త నొక్కిపెడదామన్నా ఆగలేదట. జాకీ లోపల చెపుతూంటే విన్నాను. జాకీ కూడా బాధపడుతున్నట్టు ఉన్నాడు. కొంతమంది ట్రైనీలు కూడా ఆ జాకీని తిడుతున్నారు. వాళ్ళు కూడా ఎవరో ఒకరితో ఆడిస్తూ ఉంటారు కదా! ఇప్పుడు జరగబోయేది కోల్డ్‌రేసు! ఈసారి ఎలాగైనా టిప్ పట్టుకొస్తాను. తప్పకుండా వస్తుంది. అందులోను ఇందాక డబ్బులు పోగొట్టుకున్న ట్రైనీలందరూ కుమ్మక్కై ఈ రేసు నడిపిస్తారు. మీరు విచారించకండి. ఎంతైనా సరే, ఈసారి మీ ఇష్టం. పందెం కాయండి. నష్టం భర్తీ చేసుకోండి" అన్నాడు రాజు.

"సరే చూద్దాం, టిప్ తీసుకొనిరా!" అన్నాడు అశ్విక్. అలా అని చెప్పాడే కానీ - తన దగ్గర రెండు వందలు కూడా లేవు. ఎలా సంపాదించాలా అని ఆలోచిస్తూ తెలిసిన వాళ్ళెవరైనా కనపడతారా అని నలువైపులా చూస్తున్నాడు.

అప్పటిదాకా అశ్విక్‌నే గమనిస్తున్న అపరిచయస్థుడు అశ్విక్ దగ్గరకు వచ్చి "ఏం సార్! మొదటి రెండు రేసుల్లో చాలా హుషారుగా ఉన్నారు. ఈ రేసులో ఒక్కసారిగా డల్ అయిపోయారు... అన్నట్లు మీరు ఆర్ అండ్ బి ఇంజనీరు కదా" అన్నాడు.

"ఔను" అన్నాడు అశ్విక్.

"పందెంలో డబ్బు పోయిందా"

మాట్లాడలేదు అశ్విక్.

"జూదంలో జయాపజయాలు వెన్నంటి ఉంటాయి సార్! నేనెవరో మీకు తెలియదు కానీ, రెండు మూడుసార్లు నా కాంట్రాక్టు బిల్లులు పెండింగ్‌లో ఉంటే మీరు ఇప్పించారు. మీకు ఏదైనా సహాయం కావాలంటే అడగండి. అదృష్టం కొద్దీ ఈ రేసులో నేను నెగ్గాను" అన్నాడు పరిచయస్థుడైన అపరిచయస్థుడు, ఇంజనీరుతో రేపు ఎప్పుడైనా అవసరం ఉండకపోతుందా అనే ఉద్దేశంతో.

అశ్విక్ అడగాలా వద్దా అనే మీమాంసలో పడ్డాడు. పరిచయంలేని వ్యక్తి ఎంత సహాయం చేస్తానంటే మాత్రం నోరు తెరిచి అడగాలంటే సిగ్గుగా ఉంది.

మరోవైపు రాజు వచ్చి చెపితే, ఈ రేసులోనే నెగ్గి కాంట్రాక్టరు అప్పు తీర్చేసి తన నష్టం భర్తీ చేసుకోవాలనే ఆశ. కానీ తనని నమ్మి తనకు కావాల్సినంత డబ్బు సర్దుబాటు చెయ్యగలడా? అనే సందిగ్ధం. టైమ్ చూశాడు. తర్వాత రేసుకి ఇంకా అరగంట సమయముంది.

"చూడండి కాంట్రాక్టరు గారూ! ఇంకా అరగంట సమయముంది. నన్ను కాస్త ఆలోచించుకో

నివ్వండి. పది నిమిషాల్లో చెపుతాను. అలా నమ్మకం ఉంచి మీరు సహాయం చేస్తానన్నందుకు థాంక్స్' అన్నాడు అశ్విక్.

"చూడండి ఇంజనీరు గారూ! ఇద్దరమూ జూదగాళ్ళం. ఇద్దరు జూదగాళ్ళ మధ్య సఖ్యత ఎక్కువ ఉంటుందని నా అభిప్రాయం. నేనెవరో తెలియకుండానే నా బిల్లులు ఇప్పించారు. ఆరోజు నామమాత్రంగా డబ్బులు తీసుకున్నారు. మనుష్యులన్న తర్వాత ఆ మాత్రం కృతజ్ఞత లేకపోతే మనకీ, జంతువులకీ తేడా ఏం ఉంటుంది. మీరు సంశయించకండి" అన్నాడు కాంట్రాక్టరు.

"ఇప్పుడు జరగబోయేది కోల్ట్ రేసు. రెండు సంవత్సరాల మగ గుర్రాలలో ఏ గుర్రానికి ఆవేశం వస్తుందో ఎలా పరిగెడుతుందో చెప్పలేం కదా!" అన్నాడు అశ్విక్ మనసులో. తను ఓడిపోయిన రేసు గుర్తుకు వస్తోంది.

"భలేవారే! అందుకే వాటి పీ డిగ్రీ అంతా చూస్తాం. సైర్ (తండ్రి), డామ్ (తల్లి)లని బట్టి వంశానుక్రమం, వాటి లక్షణాలు చూస్తాం. ఇవన్నీ మీకు తెలియనివి కావు. అవన్నీ మీరు గమనించే ఉంటారు. డబ్బు కావాలంటే చెప్పండి. రేసుకి ముందు శ్యామ్‌లాల్ బుకీ దగ్గరకే రండి" అని కాంట్రాక్టరు వెళ్ళిపోయాడు.

జరిగింది చాలు ఇంటికి వెళ్ళిపోవాలా? అప్పు చేసి రేసులో పాల్గొనాలా? అశ్విక్ ఆలోచిస్తున్నాడు. అలా నడుస్తూ వెళ్ళి పొడాక్ దగ్గర నిలబడ్డాడు. రాజు గబగబా నడుస్తూ రావడం కనపడింది. అశ్విక్, రాజుకి ఎదురుగా వెళ్ళాడు.

"గురూగారూ! రాయల్ ప్రిన్స్ తప్పక వస్తుంది. ఎంతైనా పందెం కాసెయ్యండి. నాదీ పూచీ' అని చెప్పి వచ్చినంత వేగంగా వెళ్ళిపోయాడు. అశ్విక్ తిరిగి ఆలోచనలో పడ్డాడు. బయల్దేరిన వేళా విశేషం బావోలేదు. మళ్ళీ ముందు రేసులానే అయితే? కానీ రాజు గొంతులో ధీమా చూస్తుంటే - ఈసారి రాజు చెప్పినట్లు చేసి నష్టం పూడ్చుకుని ఇక రేసులు మానేస్తే మంచిదేమో! మనసు ఊగిసలాడింది. జూద ప్రలోభం. అప్పుతీసుకోవాలనే నిర్ణయం చేసింది. కానీ హామీ లేకుండా లక్ష రూపాయలు తీసుకోవాలంటే అహం అడ్డు వచ్చింది. పైగా ఆయన దగ్గర ఉన్నాయో లేవో అని ఆలోచిస్తూనే శ్యామ్‌లాల్ బుకింగ్ దగ్గరకు వచ్చాడు. కాంట్రాక్టరు అక్కడే నిలబడి ఉన్నాడు.

అశ్విక్‌ని చూడగానే "మొహమాటపడకండి. డబ్బేమైనా కావాలా?" అడిగాడు. "డబ్బు కావాలి, మళ్ళీ వారంలో సర్దుతాను" సంశయిస్తూనే తగ్గు స్వరంలో అన్నాడు అశ్విక్.

"ఎప్పుడైనా ఇవ్వండి సార్, ఫర్వాలేదు. మీరు ఎక్కడికి వెళతారు, నేనెక్కడికి వెళతాను. ఇద్దరం ఒక్కళ్ళకి ఒకళ్ళు కావాల్సిన వాళ్ళమే కదా! ఎంత కావాలి?" అన్నాడు.

"కొంచెం పెద్ద మొత్తమే"

"ఫర్లేదు చెప్పండి"

అశ్విక్ మహాభారతంలో పాచికల దగ్గర శకుని ఎదురుగా కూర్చున్న ధర్మరాజు మదిలో మెదిలాడు. "ఓ పనిచేద్దాం! నా కారు తాళాలు ఇస్తాను. బ్రీఫ్‌లో తెల్లకాగితాలు ఉన్నాయి. ఓ కాగితం మీద కారు మీకిస్తున్నట్టుగా రాసి ఇస్తాను. మీరు వచ్చినా సరే లేదా ఎవరినైనా పంపించినా డబ్బు ఇస్తాను లేదా కారు ట్రాన్స్‌ఫర్ చేసేస్తాను. మీ పేరు మీదనైనా, మీరు కోరిన ఎవరి పేరుమీదైనా సరే! ఒకవేళ ఈ రేసు నెగ్గితే డబ్బు ఇప్పుడే ఇచ్చేస్తాను" అన్నాడు అశ్విక్.

"భలేవారే! కారు తాకట్టు పెట్టవలసిన అవసరం ఏముంది. నోటి మాటగా తీసుకోండి" అన్నాడు కాంట్రాక్టరు.

"వద్దు, డబ్బు విషయంలో మొహమాటం వద్దు".

"సరే చెప్పండి"

"లక్ష"

"అంతా!" ఆశ్చర్యపోయాడు కాంట్రాక్టరు. ఇప్పటి రేసులో ఎలానూ రెండు లక్షలు నెగ్గాను. కారుకి లక్ష ఇచ్చినా ఇంకా లక్ష ఉంటుంది. పైగా లక్ష రూపాయలకే కారు వస్తుంది. మూడు రోజుల సమయంలో తీర్చేయాలి అని అగ్రిమెంటు రాసుకుంటే తీర్చలేకపోవచ్చు. కనీసం లక్షకు మరో లక్ష కారు మీద లాభం వస్తుంది. అదే రేసుల్లో పెట్టుబడి పెడితే దైవాదీనం ఏదైనా జరగొచ్చు అని ఆలోచించాడు.

"ఔను. ఈ రోజుతో అటో ఇటో తేలిపోవాలి" కసిగా అన్నాడు అశ్విక్. సరేనంటూ తన బ్రీఫ్ కేసులో నుంచి వెయ్యి రూపాయల కట్ట తీసి ఇచ్చాడు కాంట్రాక్టరు. డబ్బు అందుకోగానే అన్న మాట ప్రకారం కారు కీస్ జేబులో నుంచి తీసి ఇచ్చి, బ్రీఫ్‌లో నుంచి తెల్లకాగితం తీసి సర్వాధికారాలతో కాంట్రాక్టరు కోరిన విధంగా అప్పుని మూడు రోజుల్లో తీర్చకపోతే కారుని కాంట్రాక్టరు పరం చేస్తున్నట్లు రాసి ఇచ్చాడు అశ్విక్.

ఇంతజరిగినా రాజు తనకు టిప్ ఇచ్చిన విషయం మాత్రం కాంట్రాక్టర్‌కి చెప్పలేదు. డబ్బు చేత బట్టి రాయల్ ప్రిన్స్‌కి ఎవరు ఎక్కువ రేటు ఇస్తున్నారో అని బుకీలవైపు నడిచాడు. రాయల్ ప్రిన్స్ ఎదురుగా రెండు మూడు బుకీల ముందు వందకి అరవై రూపాయలు ఇస్తున్నట్లుగా ఉంది. అశ్విక్ ఆలోచించాడు. పోతే లక్ష పోతుంది. వస్తే అరవై వేలే. పందెం కాయాలా వద్దా అనే మీమాంసలో పడ్డాడు. నిజంగా వస్తుంది కాబోలు అందుకే అంత తక్కువ రేటు ఇస్తున్నారు అని తనని తనే సమర్థించుకున్నాడు. మరో అయిదు నిమిషాలు గడిచేసరికి ప్రిన్స్ చార్లెస్ ఫేవరెట్




## చిత్తు కాగితాలు

*నా సంపాదన గురించి అడిగితే*
*సమాధానమేమని చెపుతాను!?*
*అడగడంలో తప్పేమీ లేదు*
*ఇవ్వడానికే జవాబు లేదు*

*రాసిన పుస్తకాలు సర్దుకోవడానికి*
*గదిలో ఏ మూలన వెల్తురుండదు*
*వచ్చిన అవార్డులు అమర్చడానికి*
*విరిగిన బీరువాలైనా ఉండవు*
*ఏం తింటున్నానో*
*ఏం కట్టుకుంటున్నానో*
*ఇంతగూడా ఖయాలుండదు*

*తెల్లవారితే రోడ్డు మీద పడతాను*
*చీకటిపడితే దీపం కింద చేరుతాను*
*ఎంత ప్రయత్నించినా*
*ఈ ప్రపంచం నిద్ర పోనివ్వదు*

*కళ్ళు బరువెక్కి వెనక్కి ఒరిగితే*
*గట్టిగా వీపుకి గోడ తగులుతుంది*
*విసుగొచ్చి కాళ్ళు చాపుకుంటే*
*ఎత్తైన గడప అడ్డమొస్తుంది*
*గాలి ఆడక నిలబడితే*
*గుమ్మానికి తలకొట్టుకుంటుంది*
*చినుకులు రాలితే*
*పాదాలు తడుస్తాయి*
*మంచుకురిస్తే*
*వేళ్ళు కొంకర్లు పోతాయి*
*అటూ ఇటూ దొర్లే లోపల*
*ఎండొచ్చి లేపేస్తుంది*
*నేను పొడుగ్గా వున్నానో*
*నా గదే ఇరుకుగా ఉందో*
*నాతో వేగలేని రాత్రికే తెలుసు!*

*ఎంత సంపాదించావంటే*
*ఎదుటి వాళ్ళకు ఏమి చూపించాలి!?*



*జేబునిండా చిత్తులో ఉన్న కవిత్వం*
*రెప్పల కింద పట్టని స్వప్నం*
*ఇన్ని గాయాలతో తిరుగుతూ*
*ఇంతకన్నా ఏమి కూడబెడతాను!*

***(ఒక ఉర్దూ కవిత ప్రేరణతో)***

**-ఆశారాజు**
**సెల్:93923 02245**



## మేం మోసపోయాం

ఈ మాటలు అన్నది టాలీవుడ్ జేజమ్మ అనుష్క. గతంలో ఓసారి తనని ఎవరో మోసం చేశారని చెప్పింది అనుష్క. ఈసారి మాత్రం మోసపోయామంటూ వాపోయింది. ఈసారి మాత్రం అనుష్కనూ, ఆమెతో ఉన్నవారిని మోసం చేసింది మనుషులు కాదు ఓ సినిమా! ఆ సినిమా పేరు 'వర్ణ'. ఈ సినిమా కోసం తనతో పాటు యూనిట్ అంతా తెగ కష్టపడిందట! కానీ ఫలితం మాత్రం తీవ్ర నిరాశను మిగిల్చిందట! ఆ సినిమా సక్సెస్ సాధించి ఉంటే విషయం మరోలా ఉండేది కానీ, ఆ సినిమా తమని మోసం చేసిందంటూ ఇటీవల ఓ ఇంటర్వ్యూలో చెప్పుకొచ్చింది.

అయింది. రాయల్ ప్రిన్స్ ఒకటిన్నర రెట్లకి పెరిగింది. రాజు చెప్పింది నిజమైతే సెకండ్ ఫేవరెట్ రాయల్ ప్రిన్స్‌ని నెగ్గిస్తారన్న మాట. అందులోనూ ముందురేసులో ట్రయినీస్ కూడా నష్టపోయారని చెప్పాడు. అయినా కొంచెంసేపు ఆగుదాం ఏం జరుగుతుందో? అని బుకీల దగ్గరే అటుఇటు తిరగసాగాడు. క్రమంగా రాయల్ ప్రిన్స్ మూడో స్థానంలోకి నెట్టబడింది. మళ్ళీ ఒకసారి రాజుతో మాట్లాడి నిర్ధారించుకుంటే మంచిదేమోనని మెంబర్స్ స్టాండ్‌వైపు నడిచాడు. ఇంతలో బెల్ మోగింది. పరిగెత్తుకుంటూ, సెంటిమెంటల్‌గా తను మొదటి గెలిచిన రేసు బుకీ దగ్గరకు చేరాడు. అక్కడ రాయల్ ప్రిన్స్‌కి మూడు రెట్లు ఇస్తున్నారు. లక్ష రూపాయల పందెం కాసి భగవంతుని స్మరిస్తూ గ్యాలరీ వైపు నడిచాడు.

●●●

అప్పటికే మూడు రేసుల్లో పందేలు నెగ్గటం, లక్షకే కారు లభించడంతో ఈరోజు తను పట్టిందల్లా బంగారం అవుతోందని కాంట్రాక్టరు హుషారుగా ఉన్నాడు. డెర్బీ రేసులో తను పందెం కాయబోయే గుర్రం గురించి ఆలోచిస్తూ బుకీస్ దగ్గర తిరుగుతున్నాడు. ఆ గుర్రం ఆ రేసునే అప్‌సెట్ చెయ్యొచ్చని రేసు పుస్తకాల్లో కూడా రాశారు. డెర్బీ రేసుకి ఇంకా 20 నిమిషాల వ్యవధి ఉంది అని వేచి చూస్తూ ఉండగానే సమాచారం ఇచ్చే వ్యక్తి వచ్చి ఆ గుర్రం పేరే చెప్పి వెళ్ళిపోయాడు.

ఆ గుర్రానికి బుకీ దగ్గర ఆరు రెట్లు ఇస్తున్నట్లు కనపడింది. ఆలస్యం చెయ్యకుండా అయిదు లక్షల పందెం కాయాలనే నిర్ణయానికి వచ్చి తన దగ్గర ఉన్న డబ్బులన్నీ లెక్క పెట్టుకోసాగాడు కాంట్రాక్టర్.

●●●

సాయంత్రం అయిదున్నర కావస్తోంది. అశ్విక్ చాదర్‌ఘాట్ బ్రిడ్జి మీద నడుస్తున్నాడు. ఆలోచనల ముసురు మనసునంతా కమ్మేసింది. మొదటిసారి నెగ్గగానే మానేసి మిగిలిన రేసులు చూసివెళ్ళినా, లేదా ఆ రేసులో వచ్చిన లాభంతోనే పందెం కాసినా సరిపోయేదేమో! నష్టం వచ్చేది కాదు. తనది అత్యాశా? అయినా జూదమే అత్యాశ కదా? కష్ట పడకుండా డబ్బు తేలికగా సంపాదించాలనుకోవడం అత్యాశేకదా! అందునా నిమిషాల వ్యవధిలో ఆ కాంట్రాక్టర్ దగ్గరకి అంత డబ్బు ఎలా వచ్చిందో? అడగ్గానే ఇచ్చేశాడు. చేసే పనులు అన్నింటిలో నాణ్యత తగ్గించి, ఇంజనీర్లని చేతిలో పెట్టుకొని, కష్టపడకుండా రెండు చేతులా పది వేళ్ళతో సంపాదిస్తున్నాడు. అతనికి చెల్లింది. కష్టపడింది కాదు అంతా అన్యాయంగా సంపాదించిందే. లేకపోతే అంతడబ్బు రేసులకి తీసుకు వస్తాడా! అయినా అలాంటి వాళ్ళకే డబ్బులు రాలతాయేమో! లేకపోతే అడగ్గానే లక్ష ఇచ్చేస్తాడా!

కారు ఏది అనడిగితే భార్యకు ఏం చెప్పాలి? ఉదయాన్నే తన కొడుకు 'రేసులకే కదా వెళ్ళు' అంటూ చూసిన చూపు మర్చిపోలేకపోతున్నాడు. రేసుల్లో కారు కూడా పోగొట్టు కున్నాడు. ఫ్రెండ్‌కి ఇచ్చానని చెప్పి మూడు రోజుల్లో తీసుకు వచ్చెయ్యాలి. లేదా అమ్మేశానని చెప్పి ఎలాగైనా సంపాదించి కొత్తకారు కొనెయ్యాలి.

నడుస్తూ చాదర్‌ఘాట్ బ్రిడ్జి చివరకు వచ్చేసరికి సిగ్నల్ లైట్ దగ్గర రెడ్ సిగ్నల్ పడింది. కార్లన్నీ ఆగడం మొదలుపెట్టాయి. అశ్విక్ పక్కగా వెళ్ళి కాసింతదూరంలో ఓ కారు ఆగింది. ఆ కారు తనదిలాగే ఉంది. పరీక్షగా నెంబర్ చూశాడు. తనదే! గబగబా కారు డ్రైవర్ సీట్ దగ్గరకు వెళ్ళి చూసి, ఆశ్చర్యపోయాడు. డ్రైవింగ్ సీట్లో కాంట్రాక్టర్ లేడు! నూతన వ్యక్తి కూర్చుని ఉన్నాడు.

అద్దం మీద టకటక శబ్దం చేశాడు. అద్దం దించి 'లిఫ్ట్ కావాలా సార్' అడిగాడు నూతన వ్యక్తి.

'ఈ కారు' నసిగాడు అశ్విక్.

"ఇదా! ఎవరో పెద్దమనిషి... కాంట్రాక్టరట. రేసుల్లో అత్యవసరంగా డబ్బు కావాలంటే - ఈ కారు తాకట్టు పెట్టాడు. ఎవరిదో మాత్రం నాకు తెలియదు".

●●●

రాత్రి పది గంటలవుతోంది. అశ్విక్ ఇంటి బెడ్‌రూమ్‌లో లైటు వెలుగుతోంది. రోహిణి పుస్తకం చదువుకుంటోంది. పక్కనే బాబు నిద్రపోతున్నాడు. ఇంతలో కరెంటు పోయింది. రోహిణి లేచి కిటికీ దగ్గరకు వచ్చేసరికి పోర్టికోలో చిన్నమంట కనబడింది. కంగారుగా తలుపుతీసి పోర్టికోలోకి వచ్చేసరికి అశ్విక్ మంట ఎదురుగా కూర్చొని ఉన్నాడు.

"ఏం చేస్తున్నారు?" అడిగింది.

రేసు పుస్తకాలన్నీ కాల్చేస్తున్నాను.

●●●

వ్యసనం పద్మవ్యూహం లాంటిది బయటకు రావటం తెలిస్తే అర్జునుడిలా విజయుడై బయటకు రావచ్చు లేదా అభిమన్యుడిలా వ్యూహంలో చిక్కుకుని పోవచ్చు.

***ఫోన్: 0884-2348526***



## సరదాగా....

### అద్భుతం

నటరాజ్ పొద్దున్నే వార్తలు చదువుదామని పేపర్ తెరిచాడు. రొటీన్ వార్తలు బోర్ కొట్టడంతో ప్రకటనలు చదవడం ప్రారంభించాడు. అందులో ఒక ప్రకటన నటరాజ్‌ని ఆకర్షించింది. ఆ ప్రకటన ఏంటంటే..

"కొన్ని వందల సంవత్సరాల ముందు కని పెట్టబడిన అద్భుతము

మావద్ద అదృశ్య వీక్షణి కలదు. ఇది ధరించిన వారు ఇతరులను తాము చూడగలరు కానీ ఇత రులకు తాము కనబడరు. ఆలస్యం చేస్తే ఆశా భంగం. వెల కేవలం ఐదువేలు మాత్రమే!"

నటరాజ్ ఉరుకులు పరుగుల మీద ఆ ఐదు వేలు చెల్లించి కొరియర్‌లో ఆ సామాను తెప్పించుకున్నాడు.

దానికి పూజ చేసి, పసుపు, బొట్లు పెట్టి ఒకసారి దానికి నమస్కరించి తీరా తెరిచిచూస్తే..... బురఖా!

### ఒక ప్రశ్న?

విరాజిత్ ఫ్రెండ్ రిసెప్షన్‌కి వెళ్ళాడు. స్నేహి తుణ్ణి కలిసి విష్ చేసిన తరువాత, స్టేజి ముందున్న ఒక కుర్చీలో కూర్చుని చుట్టూ పరికించాడు. ఒక పక్క సంగీత విభావరి జరుగుతోంది. ఇంకోపక్క కొందరు బఫేలో ప్లేట్లలో వడ్డించుకుని లాగించేస్తున్నారు. స్టేజ్ మీద నూతన వధూవరులను కలిసేవారు మరో వైపు... ఎవ్వరిని చూసినా కృత్రిమ నవ్వులు, కృత్రిమ పలకరింపులే కనబడుతున్నాయి. మన సారా వేడు కను ఆస్వాదించేవారు ఎక్కడా కనబడలేదు. చిరాకు అనిపించింది విరాజిత్‌కి. వెంటనే సంగీత కచేరి జరుగుతున్న స్టేజ్ దగ్గరకు వెళ్ళి మైకు తీసుకుని, అటెన్షన్ ప్లీజ్... అన్నాడు. కొంతమంది ఆసక్తిగా అటు నడిచారు. ఏదో సోది మాకెందుకులే అని మరికొంత మంది నిరాసక్తంగా అక్కడే కూలబడ్డారు. స్టేజ్ దగ్గర ఉన్నవాళ్ళతో విరాజిత్, నా దగ్గర ఒక బాటిల్ ఉంది. దీంట్లో ఓ కాయిన్ వేస్తున్నాను. నా దగ్గరున్న కార్క్‌తో సీసాని మూసేశాను. ఇప్పుడు కాయిన్‌ని బయటకు తీయాలి. కార్క్‌ని బయటకు లాగ కూడదు, సీసా పగలకూడదు. కాని కాయిన్ బయ టకు రావాలి. ఎలా తీస్తారు? ఫంక్షన్‌లో ఒక్క సారిగా అందరి లోనూ చలనం వచ్చింది. అందరూ వధూవరుల మాట మరచిపోయి విరాజిత్ ఎదు రుగా వచ్చి నిలబడ్డారు. నిరాసక్తంగా ఉన్నవాళ్ళు సైతం ఆసక్తిగా విరాజిత్ దగ్గరికి వచ్చారు. మేం ప్రయత్నిస్తామంటే మేమంటూ ఒకరితో ఒకరు పోటీ పడ్డారు. అందరూ సీసా పట్టుకుని అటూ ఇటూ తిప్పారు. కానీ ఎవరివల్లా కాలేదు. చివరాఖరికి విరాజితే కాయిన్ బైటకు తీశాడు. అది ఎలా సాధ్యమైంది. మరి మీరూ ప్రయత్నిస్తారా?

**సమాధానం**

ఏంలేదండీ, విరాజిత్ ఒప్పందం ప్రకారం కార్క్ మూతను బైటకు తీయకుండా సీసాకి పెట్టిన కార్క్‌ని లోపలకు నెట్టాడు. దాంతో కార్క్ లోపలికి వెళ్ళేసరికి కాయిన్ బయటకు తీశాడు.














ఎక్కువ రష్‌లేని పబ్లిక్ ఫోన్ నుంచి డీసీపీ మేడమ్‌కి కాల్ చేశాను. ఆమె నాతో, "దిస్ ప్రొడ్యూసర్ ఈజ్ రియల్లీ పవర్‌ఫుల్. రాత్రి వాళ్ళను పోలీస్‌స్టేషన్‌కు తీసుకు రాగానే, హోం మినిస్టర్ పియ్యే ఫోన్ చేశాడు. నేను ఫోన్ ఎత్తకపోయే సరికి ల్యాండ్ లైనుకు హోం మినిస్టర్ ఫోన్ చేశాడు. ఇక తప్పలేదు. పాపం! ఆయన మంచివాడు, బట్ ఆల్సో ఇన్నోసెంట్. ఆయన్ను అందరూ తప్పుడు పనులకు సహాయం చేయమని అడుగుతుంటారు. ఆయన వారిని కాదనలేడు. మమ్మల్ని హెల్ప్ చేయమని గట్టిగా అడగలేడు. 'అమ్మా! వాడు నా చుట్టం. కాపాడు. నువ్వేం చెబితే అది చేద్దాం' అన్నాడు. నాకు ఏం చేయాలో అర్థం కాలేదు. 'అయితే.. ముందుగా ఆ డైరెక్టర్‌కి ప్రొటెక్షన్ కావాలి. అతనికేం హాని జరగకూడదని' అంటే.. ఆయన నవ్వి 'అసలు మా వాడు, అదే ఆ ప్రొడ్యూసర్ వణికిపోతుంటే, వాడేం అటాక్ చేస్తాడమ్మా? ఆ అబ్బాయిని పిలిపించు. అందరికీ న్యాయం జరిగే పద్ధతి ఏదైనా ఆలోచించు తల్లీ! ప్లీజ్!" అన్నాడు.

నా గుండెల మీది నుంచి పెద్ద భారం తొలగినట్టయ్యింది. ఒక్క రాత్రికే అజ్ఞాత వాసం భయంకరంగా తోచింది. అఫ్‌కోర్స్! ఆ అనుభవంలో అందమైన జలజతో పొందు లభించింది గానీ, ఆ మానసిక క్షోభ వర్ణనాతీతం.

"మరేమంటారు మేడమ్?" అని ప్రశ్నించాను.

"అదే ఆలోచిస్తున్నాను! వాళ్ళనైతే సెల్లోనే ఉంచాను. కొంచెం కోటింగ్ ఇస్తేగానీ వాళ్ళు మనదారికి రారు. నువ్వేమంటావ్?"

"నాకేం తోచడం లేదు మేడమ్ గారూ!" అన్నాను.

"అబ్బ, మేడమ్ 'గారూ!" అన్నది వ్యంగ్యంగా.

"సారీ మేడమ్! నాకేం తోచడం లేదు".

నిజంగానే నేను కన్ఫ్యూజన్‌లో ఉన్నాను. నేను సేఫ్‌గా ఉంటే చాలు. ఈ ప్రొడ్యూసర్ కాకపోతే ఇంకొకడు. బ్రతికుంటే బలుసాకు తిని బ్రతకొచ్చునన్నదే నా అభిప్రాయం. అసలు నేను ఇలా ఉండేవాణ్ణి కాదు. అదీ, ఐదారేళ్ళ క్రితం. అంటే హైదరాబాద్‌లో వాలిన మొదటి రోజుల్లో, చాలా ఆత్మవిశ్వాసంతో,



## జరిగిన కథ

ఆస్కార్ అవార్డులపోటీల్లో అన్యభాషా చిత్రాల జాబితాలో అతడి చిత్రం ఎంపికైంది. ఇప్పుడు ఆమెరికా వెళుతున్నాడతను. విమానంలో కూర్చుని గతం గుర్తుచేసుకున్నాడు. హైద్రాబాద్‌లో ఒక జూనియర్ ఆర్టిస్టు కత్తిపోట్లకు గురైంది. ఆమెను కాపాడిన నేరానికి అతడు దోషిగా మారాడు. ఆమెపై దాడి చేసిన నిర్మాత, పరపతితో తప్పించుకున్నాడు. కానీ అతని వద్ద వీడియో సాక్ష్యం ఉంది! డీసీపీ పుష్పాకిరణ్ ఆ విషయం గ్రహించింది. అతగాణ్ణి విముక్తుణ్ణి చేసింది. ఆమె అతడిపట్ల సాఫ్ట్‌కార్నర్‌లో ఉంది! ఆ తర్వాత.....

న్యాయం కోసం, నమ్మిన సిద్ధాంతం కోసం పోరాడే గుణం నాలో ఉండేది. ఎంతో ఆత్మవిశ్వాసం నాలో తొణికిసలాడుతుండేది. ఊహల రెక్కలు కట్టుకుని, క్రియేటివిటీ ఆకాశంలో ఎగురుతుండే వాడిని.

ఇప్పుడలా కాదు. గిల్టీగా, ఇన్ఫీరియారిటీ కాంప్లెక్స్‌తో గడుపుతున్నాను.

ఇంతలో, ఫోన్లో మేడమ్ మాటలు విన్పించాయి.

"ఓకే. లిజన్..." అంటూ తన ప్లాన్ చెప్పింది. నేను విస్మయంగా, నోరు వెళ్ళబెట్టుకుని విన్నాను.

"మేడమ్! వాళ్ళు ఒప్పుకుంటారా?" అని ఆశ్చర్యంగా అడిగాను.

"నీకెందుకు, నేనున్నానుగా! కానీ, నేను చెప్పినట్టు మాత్రం చెయ్యాలి. ఓకే!" అంటూ ఫోన్ పెట్టేసింది.

•••

పోలీస్‌స్టేషన్‌లోకి అడుగు పెడుతుంటే, నా కాళ్ళు బలం కోల్పోయి, రబ్బరు బొమ్మలకు ఉండే మెత్తటి కాళ్ళల్లా, కూలడానికి సిద్ధంగా ఉన్నాయి.

నేను మేడమ్ రూంలోకి వెళ్ళగానే, సోఫాలో కూర్చున్న ప్రొడ్యూసర్, ఆయన పక్కనే ఉన్న రాజకీయనాయకుడు కనిపించారు. నన్ను చూడగానే ప్రొడ్యూసర్ తన భారీకాయాన్ని సోఫాలో నుంచి లేపి, నా దగ్గరికి వచ్చి 'డైరెక్టర్‌గారూ! బాగున్నారా? అసలూ..' అని అంటుండగానే, డీసీపీ మేడమ్...

"మీరు కూర్చోండి..." అంటూ గర్జించింది. ప్రొడ్యూసర్ భయంగా సోఫాలో కూలబడ్డాడు.

"మీరూ కూర్చోండి డైరెక్టర్‌గారూ!" అని తన పక్కనున్న సోఫా చూపించింది.

ఆమె సైగనందుకుని నీళ్ళు, కాఫీ అందించాడు అటెండర్, నా ఒక్కడికే.

"ఊఁ చెప్పండి! అసలు నిన్నేం జరిగింది? మీరు నిజంగా అక్కడున్నారా?" అని ప్రశ్నించింది.

"ఉన్నాను మేడమ్?"

"అక్కడ ఎందుకున్నారు?"

"ప్రొడ్యూసర్‌గారు ఒక సినిమా తీద్దామని ప్లాన్ చేస్తున్నారు. ఆ విషయమే డిస్కస్ చేయడానికి గత ఆరు నెలలుగా రోజూ వాళ్ళ ఆఫీసుకు వెళ్తున్నాను. అలాగే నిన్నకూడా వెళ్ళాను మేడమ్!"

"ఆహా! నిన్న ఏం జరిగింది? వివరంగా చెప్పండి!"

నేను చూసిన విషయాన్ని వివరంగా చెప్పాను. ప్రొడ్యూసర్ ముఖం మాడిపోయింది.

"అచ్చా! మీరు ఈ ఇన్సిడెంటును ఫోటో తీశారా?"

అన్నీ ఆమెకు తెలిసినా, రికార్డులకోసం ఇంకా ప్రొడ్యూసర్‌కి, రాజకీయనాయకుడికి అర్థం కావాలని నన్ను అడుగుతోందని గ్రహించాను.

"అవును మేడమ్!"

"తర్వాత."

"వీడియో కూడా తీసి హైదరాబాద్ సిటీ పోలీసుకు వాట్సప్ ద్వారా పంపించాను. 100కి, 108కి ఫోన్ చేశాను మేడమ్! ఆ అమ్మాయిని హాస్పిటల్‌కి, మమ్మల్ని జూబ్లీ హిల్స్ పోలీస్ స్టేషన్‌కు తీసుకొచ్చారు. నా తప్పేమీ లేకుండానే, మీ సీఐ సింగ్ నన్ను బాగా టార్చర్ చేశాడు. చూడండి మేడమ్!" అంటూ నా దెబ్బలు చూపించాను.

"సరే, సరే! ఆ వీడియో ఇప్పుడు మీ దగ్గర ఉందా?"

"ఉంది మేడమ్!" అంటూ సెల్‌ఫోన్ లోని వీడియోను చూపించాను.

ఆమె కాసేపు చూసి, ప్రొడ్యూసర్ పక్కన కూర్చున్న రాజకీయ నాయకుడికి ఇచ్చింది. ఆయన పూర్తిగా చూశాడు. ప్రొడ్యూసర్ కూడా తొంగి తొంగి చూశాడు. ఫోన్ తిరిగి నా చేతికి వచ్చింది.

"ఊ! చెప్పండి సార్? ఏం చేద్దామంటారు?" అని రాజకీయనాయకుడిని ప్రశ్నించింది.

"ఏదో పొరపాటున జరిగిందమ్మా! చూసీ చూడనట్టు వదిలేయండి. అన్న చెప్పిండు గదా?"

"ఏందిరా వదిలేసేది? ఆ వీడియో ప్రెస్సుకు, ఎలక్ట్రానిక్ మీడియాకు లీకయితే, మా ఉద్యోగాలు ఊడుతాయ్! మీ అన్న మంత్రి పదవి కూడా హుష్ కాకి అయితది. వీని లాంటోళ్ళు ఒళ్ళు కొవ్వెక్కి తాగి తందనాలాడి, డ్రగ్స్‌కు బానిసలయి, అమాయకులను చంపేస్తుంటే, మేము మాత్రం చూసీ చూడనట్లు వదిలేయాల్నా! గాజులేసుకుని మోండా మార్కెట్లో కూరగాయలు అమ్మాల్నా?'

రాజకీయనాయకుడు బెదిరిపోయాడు.

ఇంతలో, హిందీ హీరో ఇన్‌స్పెక్టర్ లోపలికి వచ్చి, మేడమ్‌కి సెల్యూట్ చేసి నిలబడ్డాడు.

"ఊఁ?" అంది.

"మేడమ్! క్రైం సీనులో విదేశీ మద్యం బాటిల్స్, పైరేటెడ్ సీడీలు, బ్లూ ఫిల్ములు, నాలుగు రకాల డ్రగ్స్, కొకైన్ ఉన్నాయి మేడమ్! పంచనామా చేసి సీజ్ చేశాం మేడమ్!" అంటూ ఆమె ముందు ఫైల్ పెట్టాడు.

"ఏందిరా ఇది? ఆఫీసు నడుపుతున్నావా లేక బ్రోతల్ హౌజ్ నడుపుతున్నావా?" అంటూ ప్రొడ్యూసర్ని గర్జించింది.

ప్రొడ్యూసర్ గడగడలాడుతూ లేచి నిలబడ్డాడు.

ఇంతలో, రాజకీయనాయకుడు "మేడమ్! అన్న ఫోన్ చేసిండు. మీతో.." అంటూ ఫోన్ ఇచ్చాడు.

వాణ్ణి కాల్చేసేటట్టు చూసి, "గుడ్ ఆఫ్టర్‌నూన్ సార్!... సార్.. కానీ, అబ్బాయి దగ్గర వీడియో కాపీలు చాలా ఉన్నాయట సార్. న్యాయం జరగకపోతే ప్రొడ్యూసర్ కౌన్సిల్‌కు వెళ్తానంటున్నాడు సార్! అక్కడికెళ్తే, అన్ని విషయాలూ బయటికొస్తే...

మనకే.. అదే... డిపార్టుమెంటుకే ప్రమాదం సార్!"

తమకు తెలియని విషయాలన్నీ ఆమె చెబుతుంటే వాళ్ళిద్దరూ విస్తుపోయారు. అసలు కౌన్సిల్‌కు కంప్లైంట్ చేసే విషయం నేను ఆలోచించ లేదు కూడా!

"సార్! అలాగే సార్! కానీ మీ వాళ్ళకు కూడా కొంచెం చెప్పండి సార్! డ్రగ్స్, పైరసీ సీడీలు, బ్లూ ఫిలింలు... మరీ బ్రోతల్ హౌస్ నడుపుతున్నట్టుంది సార్.. లేదు సార్. నేను ఏదో ఒకటి చేస్తాను. ఒప్పిస్తాను సార్. ట్రై చేస్తాను సార్! ఆ అబ్బాయేదో సినిమా అంటున్నాడు... ఆc అదే.. మీ వాళ్ళకు చెప్పండి సార్. ఉంటాను సార్. ఆల్వేస్ ఎట్ యువర్ సర్వీస్ సార్! ఇస్తున్నాను సార్.." అంటూ ఫోన్ రాజకీయనాయకుడి ముఖం మీద పడేట్టుగా కోపంగా విసిరేసింది.

ఒక్క జంప్‌చేసి ఆ ఫోను అందుకుని, రాజకీయ నాయకుడు మాట్లాడి ప్రొడ్యూసర్‌కి ఇచ్చాడు.

"బావా! అలాగే బావా! సరే బావా! తప్పయింది బావా! సారీ బావా! ఉంటా బావా!" అంటూ ఫోన్ చుట్టేసి చేతులు కట్టుకుని నిలబడ్డాడు.

"ఒరేయ్! హోం మంత్రి చెప్పినంత మాత్రాన ఈ కేస్ క్లోజ్ కాదు. ఆయన... ఆయన ఒప్పుకుంటే మాత్రమే క్లోజ్ అవుతుంది" అంటూ నా వైపు చూపించింది.

ప్రొడ్యూసర్ నా దగ్గరకొచ్చి "నన్ను కాపాడండి సార్! జీవితాంతం మీకు ఋణపడి ఉంటాను. ఆ వీడియో తీసేయండి. లేకుంటే ఇండస్ట్రీలో పరువు పోతుంది" అంటూ కాళ్ళావేళ్ళా పడ్డాడు.

మేం ముందుగా అనుకున్నట్టుగానే నా ఫోన్‌కు మెసేజ్ వచ్చింది, 'ఒప్పుకోవద్దు' అని.

"నాకు ఏం వద్దు సార్! నాకు న్యాయం కావాలి" అనగానే, 'అమ్మా!' అంటూ డీసీపీ వైపు చూశాడు.

"పోనీయండి డైరెక్టర్‌గారూ! ఆ అమ్మాయి హాస్పిటల్లో కోలుకుంటోంది. వాళ్ళ కుటుంబానికి పొద్దున్నే పదిలక్షలు ఇచ్చొచ్చాడు ప్రొడ్యూసర్. వాళ్ళతో అబ్జెక్షన్ లేదు. మీకేం కావాలి? మొహమాటం లేకుండా చెప్పండి. ప్రొడ్యూసర్ సర్ చాలా మంచోడు. ఈ విషయం ఇక్కడితో వదిలేసి, లెటజ్ మూవ్ ఫార్వార్డ్" అంటూ నాతో చెప్పింది.

నేను నోరు తెరిచేలోగానే, 'డోంటాక్!' అని మెసేజ్ వచ్చింది.

నేను మౌనంగా నిలబడ్డాను.

"చెప్పండి?" అని నన్ను ప్రశ్నించింది.

నాకు వణకు పుట్టింది. ఆమె గేమ్‌ప్లాన్ కొంచెం అర్థమయినా, 'మాట్లాడొద్దు' అని మెసేజ్‌చేసి, మళ్ళీ నన్నే ప్రశ్నిస్తోంది. నేనేమీ మాట్లాడకపోయేసరికి,

"ప్రొడ్యూసర్ సర్! మీ ముందు మాట్లాడ్డానికి డైరెక్టర్‌గారు కొంచెం మొహమాట పడుతున్నారు. మీరొక్క ఐదు నిమిషాలు బయట వెయిట్ చేయండి. నేను మాట్లాడి సెటిల్ చేస్తాను" అంటూ అతని భుజం తట్టింది.

డీసీపీ భుజం మీద చెయ్యి వేసేసరికి, ప్రొడ్యూసర్ ఖుష్ అయిపోయాడు.

వాళ్ళు వెళ్ళగానే 'నేనో ప్రపోజల్ పెడ్తాను. నువ్వు దాన్ని ఒప్పుకోకు. నీ సినిమాకు కావాల్సిన క్యాపిటల్ వాడితో పెట్టిద్దాం. నీకేం కావాలో బార్గెయిన్ చేసి జబర్దస్త్‌గా అడుగు. నీదే పై చేయి. నేను వాళ్ళవైపే మాట్లాడుతున్నట్లు నటిస్తాను. నేను మెసేజ్‌చేసి, ఓకే చెప్పగానే డీల్ క్లోజ్ చెయ్యి. నువ్వేమీ గిల్టీగా ఫీల్ కావాల్సిన అవసరం లేదు. వాళ్ళు చేసిన క్రైమ్‌కి, ముగ్గురికీ కనీసం మూడేళ్ళ జైలుశిక్ష పడుతుంది. ఇంకా నార్కోటిక్ కేసు కూడా కలిపితే, చెప్పలేం.

కాబట్టి, వాళ్ళు ఎంత చేసినా తక్కువే!" అంటూ తన ప్రపోజల్ ఏమిటో చెప్పింది.

●●●

రెండు కోట్ల పెట్టుబడితో నా సొంత బ్యానరు మీద నేను సినిమా నిర్మించే విధంగా బ్యాంక్ అకౌంట్, ఒక 'ఆడీ' కారు విత్ డ్రైవర్, వాళ్ళ పాత ఆఫీసులోని ఆఫీస్ బాయ్, విడిగా నాకో ఆఫీసు, ఆ సినిమా మేకింగ్‌లో ఎటువంటి జోక్యం ఉండొద్దన్న కండీషన్లతో కూడిన ప్రపోజల్ పెట్టింది.

ప్రొడ్యూసర్ నోరు వెళ్ళబెట్టి చూస్తుండిపోయాడు. తేరుకుని,

"మేడమ్! ఇది అన్యాయం.." అని ఇంకా ఏదో అనబోతుంటే...

"సరే. మీ ఇష్టం. వెళ్ళండి" అని కోపంగా అంటూ బెల్లు కొట్టింది. అటెండర్ రాగానే "సారు వాళ్ళు వెళ్తున్నారు. పంపించి రా!" అంటూ లేచి

**తప్పు చేసిన నిర్మాతకు రాజకీయ నాయకుడి అండదండలు ఉన్నప్పటికీ డైరెక్టర్‌కి న్యాయం చేయాలని సంకల్పించుకుంది డీ.సీ.పీ పుష్ప. నిర్మాత, రాజకీయ నాయకుడు వచ్చి టాక్స్‌లో కూర్చున్నారు. డైరెక్టర్‌ని పిలిపించి డీల్ ఓకే చేసింది డీ.సీ.పీ. రోజూ భోజనానికి కూడా వెతుక్కునే డైరెక్టర్ ఆ దెబ్బతో ఒక రేంజ్‌కి ఎదిగిపోయాడు. ఇంతకూ ఆమె ఏం చేసింది?**

నిలబడింది.

వాళ్ళు "మేడమ్!..." అంటుండగానే అటెండర్ 'రాండి సార్!' అంటూ పిలిచాడు.

●●●

సరిగ్గా, యాభై ఆరో రోజు నాటికి గణపతి కాంప్లెక్స్‌కు దగ్గరలో ఉన్న ఓ కొత్త బిల్డింగ్‌లో, మూడో ఫ్లోర్‌లోని త్రిబెడ్‌రూం ఫ్లాటులో నా ఆఫీసు మొదలయింది. కార్పొరేట్ స్టైల్లో, ప్రతీ గదిలో ఏసీలు, డిజైనర్ ఫర్నిషింగ్స్, గోడలకు అందమైన పెయింటింగ్స్, కన్సీల్డ్ లైటింగ్, మాడ్యులర్ కిచెన్, ఫ్రిజ్, కాఫీ, కూల్‌డ్రింక్ మేకింగ్ మెషీన్లతో తళతళలాడుతూ, కళకళలాడుతూ తయారయింది. ఆఫీసులోకి ఎంటర్‌కాగానే, నేను అవార్డు తీసుకున్నప్పటి లార్జర్‌దేన్ లైఫ్‌సైజ్ ఫోటో ఒకటి పలకరిస్తోంది. ఇంకోపక్క మా బ్యానర్ లోగో 'వాల్యూస్... వుయ్ క్రియేట్' అన్న ట్యాగ్‌లైన్, అందంగా గోడలమీద అలంకరించారు.

ఇక నా రూం సంగతి చెప్పనే అక్కరలేదు. ఈశాన్య కార్నర్‌లో, వాల్ టూ వాల్ కార్పెట్, గ్లాస్ వాల్స్, డెకొరేటివ్ పీసెస్, పెయింటింగ్స్, లైటింగ్, కౌచెస్‌తో చాలా విశాలంగా ఉంది.

నా ఆఫీసు ఓపెనింగ్ డీసీపీగారి చేతుల మీదుగా జరిగింది. రిబ్బన్ కట్‌చేసి లోపలికి రాగానే, ఆమెను నా సీట్లో కూర్చోమని రిక్వెస్ట్ చేశాను. ఆమె వద్దంటుంటే చనువుగా తన భుజాలపైన చేతులు వేసి కూర్చోబెట్టాను.

ఆరోజు ఆమె పోలీసు అధికారిగా రాలేదు. నా ఫ్రెండ్‌గా వచ్చింది. అందమైన చీర, స్లీవ్‌లెస్, బ్యాక్‌లెస్ బ్లౌజ్‌లో, కళ్ళకు రేబాన్ గ్లాసెస్‌తో వచ్చింది.

అందరూ ఆమెను చూసి, నా కొత్త సినిమాలో హీరోయిన్ అని అనుకున్నారు. ప్రెస్ వాళ్ళయితే ఆమెను ప్రశ్నలతో విసిగించారు కూడా. ఆమె కాదని నవ్వుతూ తల ఊపుతుంటే, ఆమె చెవులకున్న ఇయర్‌డ్రాప్స్ గమ్మత్తుగా మెరిశాయి. వాళ్ళు ఫోర్స్ చేసేసరికి, ఇంక ఆ బాధ భరించలేక, ఆమె తన పర్సులోనుంచి రివాల్వర్ తీసి, ముందున్న టేబిల్ మీద పెట్టి, తను ఐపీయస్ అనీ, డీసీపీ అని చెప్పేసరికి మైకులన్నీ మూగపోయాయి. వాళ్ళు పక్క రూంలోకి పరిగెత్తి, టిఫిన్ల మీద పడ్డారు.

నా రూం తలుపులు మూశాను. ఇందాక నా కుర్చీలో కూర్చోపెట్టేటప్పుడు ఆమె నా చేతిని అవ



**సినీవాలి**

**కూపన్ నెం.1 విజేత**

**జి.లక్ష్మీజనార్ధన్**

**తాండూరు, వికారాబాద్**

సరం కన్నా ఒక నిమిషం ఎక్కువగానే పట్టుకుంది. ఇప్పుడు అందరూ వెళ్ళిపోయాక, నా చేతిని తన చేతుల్లోకి తీసుకుని చెంపకు ఆనించుకుంది. ఆమెలోని ఆ దగ్గరితనాన్ని నేను థ్రిల్లింగ్గా ఫీలయ్యాను. ఒక్క క్షణం మనసు వశం తప్పింది. నా చేతులు పని ప్రారంభించకముందే, బుద్ధి మేల్కొంది. దూరంగా జరిగాను. ఆమె చూపులో నిరాశ కన్పించింది.

అంతలోనే తను కూడా సర్దుకుని,

"ఆర్యూ హ్యాపీ నౌ?" అని అడిగింది.

నేను చిన్నపిల్లాడిలా సంతోషంగా తలూపాను.

"మీ ప్రొడ్యూసర్ రాలేదా?"

"మీరొస్తున్నారని తెలియగానే జంప్ అయ్యాడు. మేడమ్! మీకెలా కృతజ్ఞతలు చెప్పాలో నాకు తెలియటం లేదు. మీరుచేసిన సహాయానికి అసలు ఒక్క మాటలో 'థాంక్స్' అని చెబితే సరిపోతుందా? సరిపోదు. ఆ భావాన్ని జీవితాంతం గుండెల్లోనే పదిలంగా దాచుకుంటాను.." అన్నాను ఎమోషనల్గా.

తను చిన్నగా నవ్వింది.

"అలాగే ఉంచుకో! నాకు కావాల్సినప్పుడు నేనే తీసుకుంటాను" అని వెళ్ళడానికి లేచింది.

"ఓకే, ఫర్గెట్ ఆల్దీజ్! నువ్వొక మంచి సినిమా తీయాలి. అందులో సమాజానికి మంచి మెసేజ్ ఉండాలి. ఐ డోంట్ లైక్ ఆల్ దీజ్ మసాలా ఫార్ములాస్. జీవితాన్ని నీదైన కోణంలో, యదార్ధ జీవితానికి దర్పణంలా తీసి, మన తెలుగు సినిమా ఖ్యాతిని అంతర్జాతీయ స్థాయిలో నిలబెట్టు. అవార్డులు, రివార్డులు అన్నీ నీకే రావాలి. I wish you should win all the awards in the film field" అని షేక్ హ్యాండ్ ఇచ్చి, హగ్ అంటే అలవోకగా ఆలింగనం చేసుకుంది.

నా మనసు హాయితో పులకరించింది.

నా శరీరం పరవశించింది.

తను వెళ్ళిపోయాక కూడా నా గదంతా ఆమె వదిలి వెళ్ళిన పరిమళాలతో, నా మదంతా ఆమె మృదు మధుర స్పర్శతో ఆనంద డోలికల్లో తేలియాడింది.

●●●

ఆ రోజు డీసీపీ మేడమ్ కోపంగా వెళ్ళమని చెప్పేసరికి, ప్రొడ్యూసర్ మరో మాట మాట్లాడకుండా అన్ని ప్రపోజల్సుకు, అన్ని కండీషన్లకు ఒప్పుకున్నాడు. అవన్నీ వంద రూపాయల నాన్ జ్యుడీషియల్ స్టాంప్ పేపరు మీద టైప్ చేయించి అందరి సంతకాలు తీసుకుంది. నేను ఫోన్లోని వీడియోను డిలీట్ చేసేశాను.

"రెండు నెలల్లో షూటింగ్ స్టార్ట్ కావాలి. నేను, హోం మినిస్టర్ గారితో కలిసి ముహూర్తం రోజున వస్తాను. తేడా రావద్దు. రాజకీయనాయకుల పదవీ కాలం ఐదేళ్ళే. కానీ నేను ముప్పై ఏళ్ళవరకు ఇదే డిపార్టుమెంటులో, ఇంకా పెద్ద పొజిషన్లో, ఇదే రాష్ట్రంలో ఉంటాను. జాగ్రత్త!" అని హెచ్చరించింది.

బయటకు రాగానే, ప్రొడ్యూసర్ కారు డోరు తెరచి పట్టుకుంటే, నేను వెనుక సీట్లో కూర్చున్నాక కారు బయల్దేరింది.

కారు రయ్యిమని జూబ్లీహిల్స్ రోడ్ల మీద పరిగెడుతుంటే, నాలో నేనే నవ్వుకున్నాను.

ఆ కేసును నేను గనుక డీల్ చేసి ఉంటే, ఒక్క పూట భోజనం పెట్టేస్తే మొత్తం వీడియోను డిలీట్ చేసేవాణ్ణి. లేదా తెలుగువిలన్ సీఐ మరో నిమిషం కోటింగ్ ఇచ్చి ఉన్నా, ఫోన్, ల్యాప్టాప్ హ్యాండోవర్ చేసి మా ఊరికి పారిపోయేవాణ్ణి!

మేడమ్ దయవల్ల అలా ఆరోజు నా జీవితంలో సువర్ణాధ్యాయం మొదలయింది.

●●●

ఇది మోసంతో జరిగిన ఒప్పందమే. తప్పే! కానీ, ప్రొడ్యూసర్ చేసిన మోసాన్ని మరో మోసంతో సరిదిద్దుకునేట్లు చేశాను. జూనియర్ ఆర్టిస్టుకు పదిలక్షలు అందాయి. రెండు కోట్ల బడ్జెట్తో, నాకు సినిమా డైరెక్షన్ చేసే అవకాశం దక్కింది. నేను నా బ్యానర్పైనే సినిమా తీసినా, వచ్చే లాభాలన్నీ ఆయనకే చెందుతాయి. మేడమ్ నాకు రెండు కోట్ల క్యాష్ ఇప్పిస్తానన్నా ఒప్పుకోలేదు నేను. బ్యానర్ పేరుమీద బ్యాంకులో డిపాజిట్ చేయమని మాత్రమే చెప్పాను. కేవలం నాకు పూర్తి స్వేచ్ఛ

---

**ఈవారం సినీవాలి చదివారు కదా!**
**మా ప్రశ్నకు మీ జవాబు క్రింది కూపన్లో స్పష్టంగా రాసి**
**కూపన్ని కత్తిరించి మాకు పంపండి. లక్కీడిప్లో ఫ్యాన్సీ చీర గెలుచుకోండి!**

## సినీవాలి-3 (2-11-2016)

మా ప్రశ్న: **జూనియర్ ఆర్టిస్టుకి ఎంత డబ్బు ముట్టింది?**

మీ జవాబు------------------------------------------------------------------------------------------

చిరునామా------------------------------------------------------------------------------------------

------------------------------------------------------------------------------------------------

--------------------------------------------పిన్-----------------------ఫోన్నెం---------------------------

**ఈ కూపన్ను 1 నవంబర్ 2016 తేదీలోగా మా కార్యాలయానికి పంపగలరు.**

మా చిరునామా:నవ్య వీక్లీ, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం. 76, రోడ్ నెం 70, అశ్వనీ లే అవుట్, హుడా హైట్స్, జూబ్లీ హిల్స్, హైదరాబాద్-33

మాత్రమే కోరుకున్నాను.

నా నిజాయితీకి మేడమ్‌తో పాటూ, ప్రొడ్యూసర్ కూడా హ్యాపీగా ఫీలయ్యాడు.

"అదే వేరేవాడైతే, ఈ సినిమారంగం వాడైతే, ఐదు కోట్లు తీసుకుని ఉడాయించేవాడే! మీరు జెంటిల్మన్ సార్! మీకు సినిమా తీయాలనే కమిట్మెంటు ఉంది. మనం మంచి సినిమా తీద్దాం సార్!" అని అన్నాడు.

మేడమ్ ఈ ప్రపోజల్ చెప్పినప్పటి నుంచి నా మనసులో పేరుకుపోయిన గిల్టీ మేఘం కరిగిపోయింది.

నేను రంగంలోకి దూకడానికి సిద్ధమయ్యాను.

కారు జూబ్లీహిల్స్‌లోని పాత ఆఫీసు ముందర ఆగింది.

●●●

నేను నా పాత బ్యాచ్‌లోని జెమ్స్‌లాంటి కుర్రాళ్లను, అనుభవజ్ఞులను ఎంపికచేశాను. వాళ్ళందరికీ ప్రీ ప్రొడక్షన్ దశలో నెల జీతం చొప్పున చెల్లిస్తాననీ, ప్రొడక్షన్ టైంలో వాళ్ళవాళ్ళ అర్హతలను బట్టి ఇండస్ట్రీలో చెల్లించేదాని కన్నా ఎక్కువగానే ముట్టచెబుతానని చెప్పాను. అంటే.. సినిమా యాక్ట్యువల్ షూటింగ్‌కు వెళ్ళేముందు చాలా




తతంగం ఉంటుంది. ఓం ప్రథమంగా కథను ఫైనలైజ్ చేసుకోవాలి. తర్వాత, ఇంకో ముఖ్యమైన పని, కథలోని పాత్రలకు అనుగుణంగా నటీనటులను ఎంపిక చేసుకోవాలి. మన అవసరాలకు వీలుగా, మన బడ్జెట్ పరిమితులను దృష్టిలో ఉంచుకుని సాంకేతిక నిపుణులను - అంటే కెమెరామెన్, మ్యూజిక్ డైరెక్టర్, ఎడిటర్ మొదలైనవారు - ఫైనలైజ్ చేసి, వారికి అడ్వాన్సులు ఇచ్చి డేట్లు బ్లాక్ చేసుకోవాలి.

బయట జనాలకు తెలియదుగానీ, అసలు షూటింగ్ కంటే చాలా ముందుగానే, ప్రీ ప్రొడక్షన్ పని మొదలవుతుంది. అనేక పనులు సమాంతరంగా, ఒకదాని తరువాత ఒకటి జరుగుతూనే ఉంటాయి. ఒక పక్క నటీనటుల ఎంపికకు ఆడిషన్లు జరుగుతుంటే, లొకేషన్ల ఎంపిక, వాటికి కావలసిన అనుమతులు, ఆయా ప్రదేశాల్లో ఎవరి స్థాయిని బట్టి వాళ్ళకు అకామడేషన్లు, ట్రాన్స్‌పోర్టేషన్లు, ప్రభుత్వ పర్మిషన్ల కోసం మనుషులు ఇంకో పక్క తిరుగుతూనే ఉంటారు.

ఇవికాక... ప్రొడ్యూసర్ కౌన్సిల్లో రిజిస్ట్రేషన్లు, ఎఫ్‌డిసిలో రిజిస్ట్రేషన్లు మొదలైన పనులతో, ఆఫీసంతా గొప్ప హడావుడిగా ఉంటుంది.

కథ ఫైనలైజ్ అయ్యాక షెడ్యూలింగ్ అనేది చాలా ముఖ్యమైన ప్రక్రియ. ఒక సినిమాను ఎన్ని రోజుల్లో తీయాలి? మనం ఎంచుకున్న నటీనటుల కాల్షీట్ల లభ్యతను బట్టి షెడ్యూల్ ఎలా వేయాలి? పాపులర్ స్టార్ల, ప్యాడింగ్ ఆర్టిస్టుల, క్యారెక్టర్ ఆర్టిస్టుల, టెక్నికల్ టీం వాళ్ళ డేట్లు మ్యాచ్ అవుతున్నాయా? లేదా? నిజంగా అదో భగీరథ ప్రయత్నం.

ఇదే సినిమా ఇండస్ట్రీ ఐరనీ!

మాకు కావల్సిన ఆర్టిస్టుల చుట్టూ డేట్ల కోసం మేం తిరుగుతుంటే, వేషాలు కావాలని మా ఆఫీసు చుట్టూ వందలాదిమంది తిరుగుతుంటారు. వాళ్ళను చూస్తుంటే బాధగా ఉంటుంది. ఎన్నో ఏళ్లుగా ఇదే రంగాన్ని అంటిపెట్టుకుని జీవితం గడుపుతున్నా, ఇన్ని సంవత్సరాల తర్వాత కూడా మళ్ళీ ఏ రోజుకారోజు వేషం వెతుక్కోవాల్సిందే. వాళ్ళంతా ఎన్నో ఏళ్లుగా వెండితెర మీద మనకు ఆనందాలు పంచినవాళ్ళే. వాళ్ళు పేమెంట్‌తో సంబంధం లేకుండా పని చేస్తామంటారు. వాళ్ళకి కావాల్సింది పని. పని దొరికిననాడు మహారాజులా ఫీలవుతారు. ఆత్మవిశ్వాసం తొణికిసలాడుతుంది. పని దొరకని రోజున నీరసపడి పోతారు.

కానీ, వాళ్ళ గురించి పట్టించుకునే తీరికా, ఓపికా ఇప్పుడు టాలీవుడ్‌లో ఎవ్వరికీ లేదు. పరిస్థితి పూర్తిగా భిన్నంగా ఉంది. లైంలైటులో ఉన్నవాడి చుట్టూ ప్రొడ్యూసర్లు వెంట పడతారు. వాళ్ళకు కావాల్సినంత ఇచ్చి, ప్రసన్నం చేసుకోవాలని చూస్తారే గానీ, కొత్త వాళ్ళను, పాత వాళ్ళను ఎంకరేజ్ చేయాలని చూడరు.

అందుక్కారణం కూడా ఉంది. బొమ్మ పడిందంటే అందులో, ప్రేక్షకులకు బాగా తెలిసిన ముఖం ఉండాలనీ, ప్యాడింగ్ ఆర్టిస్టులుండాలనీ డిస్ట్రిబ్యూటర్లు గోల పెడతారు. కొత్త ఆర్టిస్టులతో తీసిన సినిమాను ఇండస్ట్రీలో ఎవ్వడూ కొనగోటితో కూడా టచ్ చేయడు.

అందుకే, అవే రొడ్డకొట్టుడు కథలు, ముఖాలు, పిచ్చి సెంటిమెంట్లు, పిచ్చి ఫైట్లు ఉన్నా సరే, ఆ సినిమాలకే గిరాకీ!

'ఎంటర్‌టైన్‌మెంట్ కావాలండీ' అంటారు. ఎంటర్‌టైన్‌మెంట్ అంటే ఐటెం సాంగులు, అసహ్యం పుట్టించే హాస్యం, మానవ మాత్రులకు సాధ్యం కాని ఫైట్లు, హీరో ఆవారా అయినా సరే, కలలు మాత్రం స్విట్జర్లాండ్‌లోనే కనాలి.. వంటివే ఇంకా ఐదారు విషయాలున్నాయి.

కొంచెం లైన్ మార్చి కొత్త కథతో, కొత్తవాళ్ళను పెట్టి సినిమా తీస్తే థియేటర్లు ఇవ్వరు. ఏ పెద్ద ప్రొడ్యూసరో లేదా సినిమారంగాన్ని, థియేటర్లను గుప్పిట్లో పెట్టుకుని శాసిస్తున్న వాళ్ళో లేదా ఏదో ఒక సినిమా ఫ్యామిలీ నుంచి వచ్చిన నటబ్రహ్మ హీరోనో, హీరోయినో అయితేనే, వాళ్ళు కొత్తవారయినా సరే థియేటర్లు దొరుకుతాయి.

వేషం కోసం వచ్చిన వాళ్ళను చులకనగా చూడడం అలవాటు.

నేను ఆ ట్రెండును మార్చదలుచుకున్నాను.

ఎవ్వరొచ్చినా, ప్రతివారినీ సాదరంగా ఆహ్వానించాలి. రాగానే, కూర్చోమనాలి. మంచినీళ్ళు, టీ, బిస్కట్లు అందించాలి. లంచ్‌టైంలో వస్తే, తప్పనిసరిగా భోజనం చేయమనాలి. ఇవి నా రూల్స్! వచ్చినవాడు వేషం దొరకకున్నా, తనలోని కళను గుర్తించారు కానీ అందుకు తగిన వేషం లేని కారణంగానే తనకు ఛాన్స్ రాలేదనే ఫీలింగ్‌తో వెళ్ళాలని నా కోరిక!

చాలామంది నా ట్రీట్మెంటును మెచ్చుకున్నారు. కేవలం భోజనం కోసమే కొంతమంది వచ్చేవాళ్ళు. అయినా పర్వాలేదు. ఒక పెద్ద హీరోకి ఇచ్చే రెమ్యునరేషన్‌లో ఈ ఖర్చు లక్షో వంతు కూడా ఉండదు. కానీ, ఒక్కపూట అన్నం తినే భాగ్యం, ఈ కళాకారులకు కల్పించడమే నా ఉద్దేశం.

నేను ఆకలితో అలమటించిన రోజులు ఎన్నడూ మరచిపోలేదు. 'సినిమా' నాకు వ్యాపారం కాదు. నా పాషన్! నా జీవన విధానం.

ఇవి ప్రొడ్యూసర్ డబ్బులు కాబట్టే ఇలా ఖర్చు చేయడం లేదు. ఇంత పెద్దఎత్తున కాకున్నా, నేను సొంతంగా తీసిన రెండు సినిమాల సమయంలో కూడా, ఇలాగే ప్రవర్తించాను.

అనుకున్న సమయానికి, అనుకున్న పేమెంట్ ఆర్టిస్టులకు, టెక్నీషియన్లకు ముట్టాలన్న నా నియమం కూడా అమలుపరిచాను. పెద్ద పెద్ద ప్రొడక్షన్ హౌజెస్ కూడా చిన్నచిన్న ఆర్టిస్టులకు ఇచ్చే కొద్దిపాటి డబ్బుల విషయంలో పిసినారిగా వ్యవహరిస్తాయి. హీరో కాళ్ళు మొక్కి కోట్లకు కోట్లు సమర్పించుకున్న వాళ్ళు, జూనియర్ ఆర్టిస్టులకు ఇచ్చే ఐదారు వందల దగ్గరికి వచ్చేసరికి లేకిగా వ్యవహరిస్తారు. ఇది మేనేజర్ చేతివాటమో, ప్రొడ్యూసర్లే చేయిస్తారో తెలియదుకానీ, ఈ మధ్య వైజాగులో కూడా ఇటువంటి సంఘటనే జరిగింది.

మా బ్యానర్‌లో వేషం దొరికినా దొరకకపోయినా మధ్యాహ్న భోజనం, ఒకవేళ అవకాశం దొరికితే పేమెంట్ పక్కా అన్న విషయం ఇండస్ట్రీలో పాకిపోయింది.

**(ఇంకా వుంది)**



# సాక్షి

సి.యమున

**"ఏరా బిజీగా ఉన్నావా? మాట్లాడొచ్చా?"**

**నాకు నవ్వు వచ్చింది. ఎవరైనా ఫోన్ చేసి మొదట 'ఎలా ఉన్నావు?' అని అడుగుతారు. కాని ఏ వేళ చేసినా ఈ ప్రశ్న అడిగేది బహుశా వీడొక్కడే. అలా అడుగుతున్నాడంటే నేను ఏదో పనిచేస్తున్నాననే నమ్మిక. ఆ పనిపట్ల వాడికి గౌరవం.**

**"నీతో మాట్లాడలేనంత బిజీ కాదులేరా!"**

"అలా అని కాదు మీ రచయితలు ఎప్పుడు ఏ మూడ్‌లో ఉంటారో చెప్పడం కష్టం. డిస్టర్బ్ చెయ్యడం ఎందుకని?"

"ఆపరా నీ ఉపన్యాసం. నీ సంగతులేమిటిరా? క్యాంపుతో బిజీగా ఉన్నట్లున్నావు"

"క్యాంపు ఎప్పుడో అయిపోయింది. అమ్మా నాన్నలను తీసుకురావటంలో బిజీగా ఉన్నాను"

"అవునా! అమ్మానాన్నల ఋణం తీర్చుకుంటు న్నావు. అదృష్టవంతుడివి".

"అమ్మా, నాన్నలకు ఋణం తీర్చుకోవడం ఏమిటరా? వాళ్ళ ఋణం ఎప్పటికీ తీర్చుకోలేనిది. వాళ్ళకు సేవచేయడం మన బాధ్యత మన అదృష్టం, అంతులేని ఆనందం"

విరక్తిగా నవ్వాను. నా నవ్వులోని విరక్తి గమనించాడేమో ఏమో సంభాషణ మళ్ళిస్తూ..

"ఏరా నీ సాహిత్య ప్రయాణం ఎలా సాగుతోంది?" అన్నాడు.

" ఆ ఏదో ఉంది".

"పోటీకి కథరాసి పంపావా?" వాడి ప్రశ్నకి ఉలికిపడ్డాను. వాడిప్పటికి పదిసార్లు చెప్పాడు. నేను ఇంకా శ్రీకారం కూడా చుట్టలేదు.

"సారీ రా. మర్చిపోయాను".

"మర్చిపోయావా లేక వద్దనుకున్నావా?".

"ఏమిటో రాయాలని అనిపించటం లేదు".

"అనిపించేది ఏమిటీ, ఏదో ఒకటి రాయి".

"ఏం రాయాలో తెలియటంలా. అయినా ఏదో ఒకటి రాస్తే వేసుకునే వాళ్ళు ఉండద్దూ!"

"అదీ కరక్టే కానీ ఏముందిరా ఈరోజుల్లో హాట్ టాపిక్ 'పెద్దవాళ్ళని చూడకపోవడం, బాధలు పెట్టడం.. ఆస్తికొల్లగొట్టి ఆశ్రమాలకు పంపడం' అది ఎవ్వర్ గ్రీన్ సబ్జెక్ట్ దానిమీద రాసెయ్'.

ఒక్క నిమిషం మనస్సు కలుక్కుమంది. సంఘంలో ఓ బాధాకరమైన సంగతి రచయితల కథావస్తువు కింద పనికొస్తోందా? అంతేనా?

"ఏంట్రా మౌనం? నువ్వు చాలా ఆర్ద్రంగా రాయగలవు. పోటీ ముగియడానికి ఇంకా నాలుగు రోజులే టైముంది. అశ్రద్ధ చెయ్యకుండా రాసి పంపు. ఇంక ఉంటాను."

ఎక్కడెక్కడో ఉన్న పత్రికల్లో పోటీల గురించి నాకు చెపుతూ గుర్తు చేస్తూ రాయమంటాడు చిన్ననాటిస్నేహితుడిగానే కాక రచయితగా వాడికి నేనంటే ఓ ప్రత్యేక అభిమానం.

వాడు చెప్పిన కథాంశాన్ని గురించి ఆలో

చిస్తున్నాను. ఏదో ఆలోచన, తేల్చుకోలేనితనం, గుంజాటన..శబ్దానికి తలతిప్పి కిటికీలో నుండి చూశాను. ఎదురుగా కుండీలో తల్లిపావురం, రెండు పిల్ల పావురాల నోటిలోకి ఆహారం జొనుపుతోంది. ఆగలేని ఆరాటమో, ఆనందమో అవి కిచకిచలాడుతూ అందుకుంటున్నాయి. గుడ్లుపెట్టి ఎండనక, వాన నక, పగలు రేయి వాటి మీద కూర్చుని వాటిని పొదగడం తరువాత మాంసపు ముద్దలలాంటి ఆ పిల్లలను రెక్కల క్రింద దాచుకుని కాపాడుతూ ఆహారం తెచ్చిపెడుతూ ఎంతో కష్టపడుతోంది. గత కొన్ని రోజులుగా నేను వాటిని గమనిస్తూనే ఉన్నాను.

రేపు అవి ఎగిరి వెళ్ళిపోతే బాధపడుతుందా? ఎగిరిపోయినా అవి టచ్‌లోనే ఉంటాయా? ఈ పావురం ముసల్ది అయిపోతే అవి మరలా వస్తాయా? అవే ఆలోచనలు.

ఆ పిల్ల పావురాలు, మళ్ళీ ఎగిరి వెళ్ళి ఆహారం తెచ్చిన ఆ తల్లిపావురం మీదపడి ముక్కులతో గుచ్చుతూ ఆహారాన్ని లాక్కుంటున్నాయి. వాటితో ఆ తల్లి పావురానికి ఎంత ఓర్పు కావాలో నోరులేని పక్షి కూడా ఎంత ప్రేమ చూపిస్తోంది. 'అమ్మ' అనే పదంలోనే అంత గొప్పదనం ఉందా? సృష్టిలో అమ్మకున్న విలువ దేనికీ లేదు. ప్రతి చోట తాను ఉండలేక దేవుడు తనకి బదులుగా అమ్మని పెట్టాడట. నిజమే లేకపోతే ఈ సృష్టి ఆగిపోయేది. అలాంటి అమ్మల కథలు కమ్మనైనవే కదూ! అలాంటి అమ్మ కథ రాస్తే? కథ రాయడం మొదలు పెట్టాను.

రాత్రి పదిగంటలు అవుతోంది. మొబైల్ రింగైంది. తీసి చూశాడు సాగర్. అమెరికాలో ఉంటున్న చెల్లి లలిత నుండి ఫోను. మొన్నటి దాకా ఆ ఫోన్‌కాల్ వస్తే భలే ఆనందంగా ఉండేది. ఇంట్లో ఒకరి తరువాత ఒకరు గంటసేపు మాట్లాడే వాళ్ళు. ఇప్పుడుమటుకు చిరాకు. ఇంటరెస్టు లేని పనులు చెయ్యమని చెప్పే ఫోను కాల్ ఎవరికి మటుకు చిరాకు తెప్పించదు. అందుకే ఆన్సర్ బటన్ నొక్కి "ఊ చెప్పు ఏంటి విశేషాలు" అన్నాడు పొడిపొడిగా.

"ఏముంటాయి మాకు. రొటీన్ "అంటూ ఓ ఐదు నిమిషాలు మాట్లాడి" "ఇంతకూ అమ్మను నీ దగ్గరకు ఎప్పుడు తీసుకు వస్తున్నావు?" అడిగింది

'తీసుకువస్తాను తొందరపడితే ఎట్లా? నా ఇబ్బందులు కూడా చూసుకోవాలిగా?".

"ఏంటి అన్నయ్యా, అక్కడ అమ్మ అంత అవస్థ పడుతుంటే ఇంత కూల్‌గా మాట్లాడుతున్నావు".

"మరీ అంత ఇబ్బందేమీ పడటం లేదు. వారం క్రితమే నేను వెళ్ళి చూసి వచ్చాను. బానే ఉంది".

"ఏమి మాట్లాడుతున్నావు అన్నయ్యా? ఒంట రిగా ఉన్న ఆమెకు రేపు ఏదన్నా అయితే మనం బాధపడాల్సి వస్తుంది".

"నాకు మటుకు అలా వదిలెయ్యటం ఆనందమా? కానీ నాకు ఉన్నది రెండు బెడ్‌రూముల ఇల్లు. పిల్లాడు హైస్కూల్‌కి వస్తున్నాడు. వాడికి చదువు బర్డెన్ పెరిగింది. నీకు తెలియనిది ఏముంది? అమ్మను తెస్తే ఎలా ఎడ్జస్ట్ అవ్వాలా అని ఆలోచిస్తున్నాను"

"భవిష్యత్తు గురించి ఆలోచించి నువ్వు మూడు బెడ్‌రూములు ఉన్న ఇల్లు కొన్నా సరిపోయేది".

"నీకే తేలికగా చెపుతావు. నేను, నా భార్య ఏదో ప్రైవేట్ ఉద్యోగం చేసుకుంటున్న వాళ్ళం. సిటీలో ప్లాట్ కొనటం ఎంత కష్టం. ఇప్పటికే పొలం అమ్మిన డబ్బు సరిపోక అప్పు చేయాల్సి వచ్చింది. ఇంకో బెడ్‌రూం అంత తేలికా? మేము రూపాయలలో సంపాదిస్తున్నాం. డాలర్లలోకాదు".

ఆమాటకు దెబ్బ తిన్నట్టు అవతల మౌనం. "మీ బావగారు ఏదో మంచి అవకాశం వచ్చిందని ఇద్దరు పిల్లలతో సహా ఇక్కడకు తీసుకువచ్చారు. వచ్చి యేడాదిదాటింది. మేమింకా సరిగా సెటిల్ కాలేదు. ప్రతీది ఆచితూచి ఖర్చు పెట్టాల్సి వస్తోంది. నాకు ఎవరికి చెప్పుకోవాలో తెలియటం లేదు. అమ్మని చూడాలని ఎంత మనసు పీకుతోందో తెలుసా? ఖర్చు భరించలేక రావడంలేదు" ఆమె గొంతులో ఆపుకుంటున్న దుఃఖం అది విని సాగర్‌కి బాధ అనిపించింది. తోబుట్టువు మీద ప్రేమ పొంగింది.

"బాధపడకు లల్లీ. అన్ని సర్దుకుంటాయిలే. అమ్మ గురించి నువ్వు దిగులు పడకు. అమ్మను నేను ఇక్కడకు త్వరలో తీసుకువస్తాలే. పిల్లలు జాగ్రత్త.." అని పది జాగ్రత్తలు చెప్పి పిల్ల వాడితో, భార్యతోనూ కూడా మాట్లాడించి ఫోను పెట్టేశాడు.

వాళ్ళిద్దరూ తాపత్రయపడేది వాళ్ళమ్మ తులశమ్మ గురించి, ఆమెకు పదహారో ఏట వెంకటప్పయ్యతో పెళ్ళి అయ్యింది. ఆమె పుట్టింటి బీదరికం వాళ్ళ పెళ్ళికి కారణమ్మైంది. పెళ్ళై నాలుగేళ్ళు కూడా కాకముందే తన అడ్డమ్మైన సరదాలతో పది ఎకరాల పొలాన్ని రెండెకరాలు చేసి, ఇద్దరు పిల్లల్ని మిగిల్చి కన్ను మూశాడు వెంకటప్పయ్య. ఆమె పెద్దగా చదువుకున్నది కాదు. లోకంతెలిసినది కాదు. పిల్లలమీద ప్రేమ, వారిని ఒక దోవకు తేవానే బలమ్మైన కోరిక వలన ఆమె యవ్వనంలో ఉన్న తనని తాను కాపాడుకుంటూ ఆ రెండెకరాలలో వ్యవసాయం సాగిస్తూ పిల్లల్ని పైకితేగలిగింది.

**దేవుడు ప్రతి ఇంటిలో ఉండలేకే అమ్మను సృష్టించాడన్నది లోకోత్తరమ్మైన నానుడి. కొడుకు ఎంతటి దుర్మార్గుడైనా తల్లి భరిస్తుంది. వాడు ఒట్టి అమాయకుడని వెనకేసుకొస్తుంది. ఈ కథలో మాత్రం బాంబు ప్రమాదంలో కొడుకు శరీరం చచ్చుబడి, మూలపడినప్పుడు చంటిబిడ్డలా సాకిందతణ్ణి. భయంకరమ్మైన సత్యాన్ని గుండెల్లో దాచిపెట్టి కొడుకు వేలుపట్టుకుని నడిపించిందా తల్లి!**

"ధరలు రోజు రోజుకు పెరుగుతున్నాయి. పిల్ల వాడూ ఎదుగుతున్నాడు. మేము అద్దె ఇళ్ళల్లో ఇరుక్కోలేం. నావాటా అమ్మి ఇల్లు కొనుక్కుంటాను" అని సాగర్ పట్టు పట్టడంతో తులశమ్మకు కష్టం అనిపించినా వాటాలు పంచాల్సి వచ్చింది. ముగ్గురికీ మూడు వాటాలు. తులశమ్మ పేరిట ఒక వాటా ఆమె తదనంతరం ఆమెని చూసుకున్న వాళ్ళకి చెందుతుంది. సాగర్ తన వాట ఉపయోగించుకున్నారు. వయసు ప్రభావమో ఆ ముక్కలైన పొలం చుట్టూ అలుముకున్న ఆలోచనలో ఏమో తులశమ్మకు హై బిపీ వచ్చింది. ఒకరోజు పొలంలో కళ్ళు తిరిగి పడిపోయింది. రెండురోజుల్లోనే ఆమె కోలుకున్నా అలా ఒంటరిగా ఉండటం మంచిది కాదని పదిమందీ అనటంతో ఆమె ఊరు వదిలి పెట్టే పరిస్థితి వచ్చింది.

అమ్మను తీసుకురావడానికి పల్లెకు వెళ్ళాడు సాగర్. "నువ్వు ఎప్పుడు వస్తావా అని ఎదురు చూస్తున్నానుకన్నా! ఎందుకో, ఇంక ఒంటరిగా ఉండలేననిపిస్తోంది." అంది తల్లి నుండి విడిపోయి మళ్ళీ కలిసిన లేగ దూడలా సాగర్‌ని ఆలింగనం చేసుకుంటూ చిన్న వయసులోనే భర్తని పోగొట్టుకుని ఒంటరిగా పిల్లని పెంచినా ఆ దైన్యాన్ని ఆమె ఎప్పుడూ చూపించలేదు. ఇప్పుడు అలా బేలగా మాట్లాడేసరికి సాగర్‌కి హృదయం కదిలిపోయింది.

"నేనుండగా నువ్వు ఒంటరిగా ఎందుకమ్మా ఉండటం? అవసరం లేదు. ఒకటి రెండు రోజుల్లో ఇక్కడివన్నీ సెటిల్ చేసుకుని వెళ్ళి పోదాం" భరోసా ఇచ్చాడు. ఉన్న కాస్త పొలం అమ్మడానికి తులశమ్మ ఇష్టపడక పోవడంతో తమ పొలాన్ని ఆనుకునే ఉన్న ప్రక్కపొలం అతనికి కౌలుకు ఇచ్చేశారు. "ఇంటి చుట్టూ ఉన్న మొక్కలు జాగ్రత్తగా చూసుకోమని" చెప్పి ఆఊరి గుడి పూజారికి, ఇంటికి



## వంట చేయడం వచ్చేసిందట!

*'అందాల రాక్షసి' లావణ్య త్రిపాఠికి వంట చేయడం బాగా వచ్చేసిందట! ఈ మాట లావణ్యే స్వయంగా చెప్పుకొచ్చింది. 'నువ్వు నాలాగా చేస్తున్నావని' తన తల్లే తనను మెచ్చుకుందని అంటోంది. 'గతంలో నాకు అస్సలు వంట చేయడం వచ్చేది కాదు. ముంబైలో అప్పుడప్పుడు ప్రయోగాలు చేసేదాన్ని అవి మొన్న బాగా ఉపయోగపడ్డాయి మా మదర్ అనారోగ్యంతో హాస్పిటల్‌లో జాయిన్ అయ్యారు. ఆ సమయంలో నేనే వంట చేసి హాస్పిటల్‌కి పంపాను. అప్పుడు మా మదర్ పై విధంగా నాకు కాంప్లిమెంట్ ఇచ్చింది' అంటూ చెప్పింది.*

ఉచితంగా ఉండటానికి ఇచ్చి నగరానికి బయలు దేరారు.

పల్లె వాళ్ళందరూ వీడ్కోలు ఇచ్చారు. 'ఎంతో కష్టపడి మిమ్మల్ని ఒంటరిగా పెంచింది మీ అమ్మ. పెద్ద కొడుకువి. నీదే బాధ్యత జాగ్రత్తగా చూసుకో" అని కర్తవ్యం కూడా బోధించారు.

వచ్చిన నాలుగు రోజుల వరకు ఇంటి వాతా వరణం బానే ఉంది. పళ్ళ బిగువనున్న కోడలి కుసంస్కారం బైటపడటం మొదలైంది. కోడలు పల్లెత్తు మాట అనదు. అవమానించదు, ఆద రించదు. అసలు మాట్లాడదు. అదోరకమైన కంటికి కనబడని హింసపెట్టడం. మనవడికి తన బెడ్ రూమ్‌ని బామ్మతో పంచుకోవడం కష్టంగాఉంది. అమ్మ బుద్ధులే పుణికి పుచ్చుకున్నవాడు నాయన మ్మతో మాట్లాడటమే మానేశాడు.

మౌనం కూడా ఓహింస అని ఆమెకి అర్థం కాలేదో, లేక తన కష్టాన్ని కొడుక్కి చెప్పి ఇబ్బంది పెట్టడం ఇష్టం లేకో తులశమ్మ మూములుగానే ఉంది. ఫోనులో కూతురి పలకరింపులతో సంతో షంగానే ఉంటోంది.

అత్తగారితో మాట్లాడని కోడలు, కొడుకు దగ్గర మాత్రం మౌనం పాటించలేదు, "మీ చెల్లెలికి బాధ్యత లేదా? అంతా మీకేనా?" అని సణగడం మొదలుపెట్టింది. ఆమె బాధ్యత తీసుకునే పరిస్థి తిలో లేని చెల్లి గురించి ఏం మాట్లాడాలో తెలి యక ఈ మాటు సాగర్ మౌనం వహించాడు. దానితో ఆమె సణుగుడు ఇంకా ఎక్కువైంది. చూసీ చూడనట్టు పోతున్నాడు సాగర్. ఆరునెలలకు ఆ సణుగుడు ఆకాశాన్ని అంటింది.

ఒకరోజు పొద్దున్నే లేచి తులశమ్మ. సాగర్ స్నానాలు చేశారు. లలితాదేవి గుడికి బయలు దేరారు. లలితాదేవి తులసమ్మకి ఇష్టదైవం. ఎప్పుడో ఏళ్ళ క్రితం చూసింది ఆ గుడి. ఊరు, పొలం విడిచి పెట్టి ఆమె కొడుకు దగ్గరకి వచ్చి ఉన్నది తక్కువ. ఎప్పుడన్నా వచ్చినా ఉన్న ఆ నాలుగు రోజుల్లో మళ్ళీ ఆ గుడి చూడటానికి వీలు పడలేదు. ఇన్నేళ్ళ తర్వాత మళ్ళీ ఇప్పుడు చూడబోతోంది. పిల్లవాడికి పరీక్షలని కోడలు మనవడు రామన్నారు.

తులశమ్మ, సాగర్ ప్రదక్షణాలు చేసుకున్నారు. తులశమ్మ మొహంలో ప్రశాంతత. ఏదో నిర్మలత్వం, అంతలోనే ఏదో గుర్తొచ్చినట్లు "సాగర్, పూజా సామాను కొందామని మర్చిపోయాను నేనిక్కడే కూర్చుని పారాయణ చేసుకుంటుంటాను నువ్వెళ్ళి కొనుక్కురా అర్చన చేయిద్దాం' అని తులశమ్మ అడగటంతో కొనుక్కురావడానికి బైటకు వెళ్ళాడు సాగర్.

పావుగంట గడిచింది. బయట పెద్ద శబ్దం. బాంబు ప్రేలుడు. భయంతో జనాలు పరుగులు పెడుతున్నారు. ప్రొటెక్షన్ కోసం గుడి మహాద్వారం మూసేస్తున్నారు. తులశమ్మ అదిరే గుండెలతో బైటకు పరుగెత్తింది.

బాంబు ప్రేలుడులో సాగర్‌కి నడుము నుండి క్రింద భాగం చచ్చుబడిపోయింది. తులశమ్మ దుఃఖం చెప్పరానిది సంపాదనకీ, సంసారానికి పనికిరాని వాణ్ణి భరించి సేవచేసే అవసరం ఓపిక తనకు లేదని తనచేతల ద్వారా కోడలు స్పష్టంగా తెలియ చేస్తోంది. తులశమ్మ అది అసలు తట్టుకోలేక పోతోంది. సాగర్ పిచ్చి వాడైపోయాడు. తను దేనికీ ఎవరికీ పనికి రాననే నిజం అతన్ని పూర్తిగా కృంగదీసింది. అది చూసి కొడుకు దక్కడేమో అనే భయం పట్టుకుంది తులశమ్మకి. ధైర్యం తెచ్చు కుని కొడుకుతో సహా తిరిగి పల్లె చేరింది. భార్య. పిల్లాడుకనికరంతో మొదట్లో ఫోన్ చేసి కాస్త పలకరించేవాళ్ళు, ఆ తరువాత మాట్లాడటమే మానేశారు. ఓ వేస్ట్ ఫెలోతో టైం వేస్ట్ ఎందుకని వారి ఉద్దేశ్యం.

తులశమ్మ కన్న కొడుకుని పసిబిడ్డని చూసినట్లే చూసింది. పుట్టి పెరిగిన ఊరివారి ఆదరణతో అమ్మ ప్రేమతో సాగర్ తొందరగానే కోలుకున్నాడు. కానీ 'పర్పస్, పనీ లేకుండా జీవితాన్ని ఎలా గడ పాలీ' అనేది అతని ముందున్న సమస్య. సమస్య ఉంది కాని అమ్మ తోడు ఉందిగా! కాలేజీ రోజుల్లో అతనికి ఓ హాబీగా ఉన్న రచనా వ్యాసంగాన్ని తిరిగి ప్రారంభించమని ప్రోత్సహించింది తుల




శమ్మ. ఆశా, నిరాశలతో ఉన్న సాగర్ రాస్తున్నంత సేపూ తనూ ప్రక్కనే కూర్చునేది. పెద్దగా చదువు కోకపోయినా రాసింది శ్రద్ధగా చదవి సలహాలు ఇచ్చేది. ఆ వయసులో అటువంటి కష్టాన్ని ఎదు ర్కొని నిలబడటమే కాక ఎంతో ఓర్పుతో కొడు కుకు ఆమె ఇస్తున్న ప్రోత్సాహాన్ని చూసి ఆ ఊరు నివ్వెరపోయింది.

కాలానికి ఎవరి కష్టాలు, కన్నీళ్ళు సుఖాలు, సౌఖ్యాలు అడ్డరావు. అది ముందుకు సాగుతూనే ఉంటుంది.

సాగర్ రచనా వ్యాసంగం ఓ బొట్టుగా ఆరం భమై ఏరై, సెలయేరై. నదియై సాగుతూనే ఉంటోంది. తులశమ్మ ఈనాడు ఓ ప్రముఖ రచ యిత తల్లిగా గర్వపడే స్థితిలో ఉంది.

"ఏరా చంద్రం, ఇంత రాత్రి అయింది. ఇంకా రాస్తున్నావా! లే పడుకుందువు గాని" అన్న అమ్మ మాటలకు రాస్తున్నది ఆపి ఈలోకంలోకి వచ్చాను.

"పూర్తికావచ్చింది అమ్మా!"

"రేపు నీకు సన్మానసభ కూడా ఉంది. మరీ అలసిపోతే కష్టం. మిగతాది తర్వాత రాద్దువులే".

"నేను ఏం కష్టపడుతున్నాను. పెద్దదానివి ఈ వయసులో నేను నిన్ను సుఖ పెట్టాల్సింది పోయి కష్టపెడుతున్నాను" నా గొంతులో జీర.

"అలా ఎప్పుడూ అనుకోవద్దు. నా కొడుకు ఓ ప్రముఖ రచయిత అంటే నాకు ఎంత గర్వమో తెలుసా! ఆ అదృష్టం మటుకు ఎంతమందికి దక్కుతుంది?' అంది అమ్మ గోడకి ఆన్చిపెట్టిన క్రచెస్ తీసి నాకు ఇస్తూ. వాటిని చంకల క్రింద పెట్టుకుని లేచి నిలబడి నా మంచం చేరాను నిద్ర పోవడానికి. కాని నిద్ర రావడం లేదు. రాసిన కథ గురించి ఆలోచిస్తున్నాను. తులశమ్మని గుడికి తీసుకు వెళ్ళినప్పుడు సాగర్ మనసులోని ఆలో చన గురించి ఆలోచిస్తున్నాను. నా మనసు ఆవేద నకు గురవుతోంది ఎందుకంటే ఈ చంద్రమే ఆ సాగర్ కనుక. అది నేనే కనుక! ఆరోజు అమ్మని గుడికి తీసుకు వెళ్ళింది కేవలం గుడి చూపించడానికే కాదు. తనకు ఆ గుడి వాళ్ళు నడిపే ఆశ్రమం చూపించి మెల్లగా ఒప్పించి తనని అందులో చేర్పించటానికి అని తెలిస్తే అమ్మ నన్ను క్షమిం చేదా? ఇంత ఆదరించేదా? ఆమెకి నా మనసు లోని పథకం గురించి ఆమెకి తెలియదు. అందుకే నాకు బాసటగా నిలబడి చంటి బిడ్డలాగా చూస్తోంది. ఈ అక్షర భిక్ష పెట్టి ఇంతటివాణ్ణి చేసింది. కాని ఆ విషయం తెలిసిన కొడుకు నేను అనుభవించే ఆవేదన, బాధ ఎవరితో చెప్పుకోను? అమ్మ కథ రాశాను. నాలాంటి దుర్మార్గపు ఆలోచన చేసిన కొడుకు గురించి పూర్తిగా రాయలేకపోతు న్నాను. చదివి ప్రజలు నన్ను అసహ్యించుకుంటారని కాదు. నిజం తెలిస్తే నాలాంటి కొడుకుని కన్నందుకు అమ్మ పడే క్షోభ గురించే నా ఆలోచన. ఎంతో కష్ట పడుతున్న ఆమెను మరింత కష్టపెట్టలేను.

అవును, కాలం ఆగదు ఎవరి కష్టాలకు కన్నీ ళ్ళకు..సుఖాలకు, సౌఖ్యాలకే కాదు కఠినమైన నిజాలకు కూడా అది చెక్కు చెదరక సాగి పోతుంది. తానొక సాక్షిగా వాటిని చూస్తూ సాగి పోతూనే ఉంటుంది. ఆశ్రమం నుండి వచ్చిన ఫోను కాల్ అనుకోకుండా అందుకున్న తులశ మ్మకు తనను ఆశ్రమంలో చేర్పించాలనే కొడుకు మనసులోని ఆలోచన తెలిసిపోయింది. ఆ నిజం తెలిసినా కూడా కాలం ముందుకు సాగిపోతూనే ఉంది మూగ సాక్షిగా.

**సెల్: 95504 45911**

# మంశిలిపి

రామాచంద్రమౌళి

**రాత్రి.... ఒంటిగంట దాటిఉంటుందా? అనుకున్నాడు సర్కిల్ ఇన్‌స్పెక్టర్ నరహరి.**

**అప్పుడతను తన పోలీస్‌స్టేషన్లో, తన ప్రత్యేక గదిలో సోఫాలో వెనక్కివాలి నెత్తిపైనున్న టోపీని ముఖంపైకి లాక్కుని కప్పుకుని, కళ్ళుమూసుకుని, ఒకరకమైన జ్వలిత జాగ్రదావస్థలో ఉన్నాడు. అతడి మనసు, ఆత్మ కణకణలాడుతున్న నిప్పుకణికలా ఉన్నాయి. శరీరం గడ్డకట్టిన మంచుగడ్డలా ఉంది.**

మంచుగడ్డలో నిప్పుకణిక. నిప్పుకణికపైన చుట్టూ ఆవరించి కప్పేసి, కబళించి మంచుగడ్డ మంచుపొరా, తెరాకాదు గడ్డ. గడ్డే ఉంటుందా అలాజరుగుతుందా... అలా... జరుగుతుంది. జరుగుతుంది. ఒక్క మనిషి విషయంగానే జరుగుతుంది. అంతర్యుద్ధంలో మనిషి కూరుకుపోయినపుడు సకల కాలుష్యాలతో మలినమైన శరీరాన్ని భౌతిక లౌల్యాలన్నీ ఆక్రమించి భ్రష్టుపట్టించిన తర్వాత ఒట్టిఅవశేష సదృశ్యంగా మారిన శరీరం నిజంగా ఒట్టి మంచుగడ్డే. కాని లోపల ఆత్మ... తన ప్రక్కకు ఏ మలినమైనా చేరగానే వెనువెంటనే దహించివేసి మనిషిని నిలదీసి ప్రశ్నించి, శుభ్రించే ఆత్మ, ఆత్మఎప్పుడూ నిప్పే. ఆరిపోని నిప్పు. నిరంతర దహనకారి.. నిప్పు.. నిప్పు. తనలోపల అజ్ఞాతంగా దాక్కుని అనుక్షణం కాల్చేసే నిప్పు.

శరీరం, ఆత్మ, ఒకదానితో ఒకటి, ఒకదానిలో ఒకటి అనుసంధానమై అనుబంధమై టు ఇన్ వన్. వన్ విత్ ఇన్విజిబుల్ టు. టోపీలోఉన్న ముఖంతో కళ్ళు తెరిచాడు నరహరి. ఏమీ కనబడలేదు. నల్లగా ఒట్టి చీకటి. నెత్తి నూనె, మాసిపోయినజుట్టు, చెమట కలగలిసిన ఒకరకమైన జిడ్డు. గత్తు వాసన. తన జీవితం వలెనే.

పోలీస్‌స్టేషన్ ఆ క్షణం పాములపుట్టలా అతి నిశ్శబ్దంగా ఉంది. శీతాకాలం కావడంవల్ల చలిచలిగా, తేమతేమగా, ఎవరో మంత్రిస్తే ఆవరించినట్టు అంతా మత్తుగాఉంది. మొత్తం స్టేషన్లో డ్యూటీలో ఉన్న కానిస్టేబుల్స్, గార్డ్స్ లాకప్‌లోని అనిర్ధారిత నేరస్తులు అందరూకలిసి ఓ పదిహేను మంది ఉంటారేమోగానీ, రోజంతా చిటపటలాడుతున్న చిదుగుల మంటలాఉండే పోలీస్‌స్టేషన్ అప్పుడా క్షణం ఆరిపోయిన కుంపటి. ఒట్టి బూడిద మిగుల్చుకున్నట్టు స్తబ్దుగాఉంది. గాలినిండా తుపాకుల వాసన. కరుకుదనం వాసన. అస్సలు కనబడని అమానవీయ మృగవాసన. వెరసి గాలంతా హింస వాసన.

ఎందుకో చటుక్కున తను వెనుకటి చదువుకున్న తన రీజనల్ ఇంజనీరింగ్ కాలేజ్ మెటలర్జీ ల్యాబ్, ప్రొఫెసర్ సూర్యప్రకాశ్ జ్ఞాపకమొచ్చారు. మెకానికల్ ఇంజనీరింగ్ వాళ్ళక్కూడా మెటలర్జీ... లోహశాస్త్రం చాలా లోతుగానే ఉండేది. సిలబస్‌లో లోహపరివర్తన, లోహధర్మాలూ, ప్రవర్తన, లక్షణాలూ... వీటిగురించి చెబుతూ, ఒకనాడు లోహాల ప్రవర్తనను మార్చడానికి ఉపయోగించే 'అగ్ని చికిత్స' గురించి చెప్పాడు ప్రొఫెసర్ సూర్యప్రకాశ్. హీట్ ట్రీట్మెంట్ చాలా ముఖ్యమైన, మనిషి జీవితానికి అన్వయించగలిగే ఎన్నో సామ్యాలున్న ఒకానొక చికిత్స. ఆ రోజు ఏమి చేశాడంటే,

మెటలర్జికల్ ఫర్నేస్.. బట్టీలో... తామందరి

ముందే రెండు మైల్డ్ స్టీల్ మెత్తని ఇనుప నమూనా కడ్డీలను తీసుకుని, రాక్వెల్ హార్డ్నెస్ టెస్టింగ్ మెషిన్‌తో వాటి కాఠిన్యాన్ని, అంటే హార్డ్‌నెస్ నంబర్‌ను పరీక్షించి నమోదు చేసుకున్నాం. అది సి 78గా ఉంది. తర్వాత రెండింటినీ ఫర్నెస్‌లో సందిగ్ధ ఉష్ణోగ్రత క్రిటికల్ టెంపరేచర్‌కి 923 డిగ్రీ సెంట్రీగేడ్‌కంటే ఎక్కువ స్థాయికి వేడిచేసి, రెండింటినీ ఒకేసారి బైటికి తీసి ఒకదాన్ని అదే ల్యాబ్‌గదిలో ఓ మూలకున్న ఇనుపటేబుల్‌పై ఒక కొసపై అలా గాలిలో వదిలేసి, అంటే ఊరికే గాలిలో అతి సహజంగా దానంతటఅదే చల్లబడి గది ఉష్ణోగ్రతకు చేరేందుకు వదిలేశాం. ఎర్రగా ధగధగలాడుతున్న మరో ఇనుపముక్కనుమాత్రం చటుక్కున బైటఉన్న చల్లని నీటితొట్టెలో ముంచాం. సుయ్..సుయ్..మనే శబ్దంతో ఆ ఇనుపముక్క అకస్మాత్తుగా చల్లబడి క్షణాల్లో గది ఉష్ణోగ్రతకు చేరి మామూలైపోయింది. అటు టేబుల్‌పై ఉన్న ముక్కమాత్రం రెండుగంటల తర్వాత చల్లబడింది సహజంగా.

అప్పుడు రెండింటినీ మళ్ళీ వాటి హార్డ్‌నెస్ నంబర్ కనుక్కుని పరీక్షిస్తే గాలిలో చల్లబడ్డ ఇనుపముక్క మెత్తబడి మృదుత్వాన్ని పొందింది.. దాన్నే 'అనెలింగ్' అంటాం. రెండవది దేన్నైతే అకస్మాత్తుగా చల్లబర్చామో అంటే 'క్వెంచ్' చేశామో అది మాత్రం మొదటిదానికి వ్యతిరేకంగా చాలా కఠినమై బండబారిపోయింది. అదే హార్డెనింగ్ ప్రోసెస్. పదార్థమదే. దానిపై ఉష్ణంరూపంలో నిర్వహించబడ్డ చికిత్సవల్ల దాని మూల లక్షణాలన్నీ మారిపోయాయి.

మనుషులుకూడా అంతేనా. జన్మతః మనుషులందరూ శుద్ధ ఇనుమువలెనే ఒకేరకమైన ఉమ్మడి లక్షణాలను అంటే వాని డిఎన్ఎ స్వరూ

**మెకానికల్ ఇంజనీరు అతను. ఛాలెంజింగ్‌గా తీసుకుని మంచి ఉద్యోగం చేయాలని కలలు కన్నాడు. కానీ పేదరికం. తక్షణ అవసరంగా పోలీసు ఉద్యోగంలో చేరాడు. చుట్టూ పరిస్థితులు అతణ్ణి కూడా ఆ తానులో ముక్కలా మార్చేశాయి. ఇక వెగటుపుట్టింది. అతడిలో ఆత్మావలోకనం...! సమాజంకోసం ఆలోచించే వాళ్ళను అంతమొందించే కర్కశత్వం అతడిలో అంతర్మథనానికి తెరలేపింది. పశ్చాత్తాపం, ఆవేదన..అవన్నీ అతణ్ణి ఎటు నడిపించాయి?**

పాన్నిబట్టి సంక్రమించే ప్రవర్తనను కలిగి ఉంటారా! వారిపై వయస్సుతో పాటూ రోజురోజుకూ ప్రభావితమయ్యే కాలుష్యాలన్నీ మనిషిని కల్తీమనిషిగా, అనైతికవాదిగా నీతిహీనునిగా, నేరస్తునిగా, అరాచకవాదిగా, లంచగొండిగా, దోపిడీదారుగా మారుస్తాయా! సామాజిక స్థితిగతులే ఒక చికిత్సగా మనిషిపై పని చేస్తాయా! మళ్ళీ అదే దృశ్యం జ్ఞాపకమొచ్చింది నరహరికి.

ఆమె పూర్తిగా ఇరవైఏడేళ్ళు కూడా నిండని

## సన్నీకి పోటీగా సనా

*ఇప్పటివరకూ బాలీవుడ్‌లో అందాల ఆరబోతలో సన్నీదే టాప్ ప్లేస్. ఇప్పుడు ఆ స్థానాన్ని సనాఖాన్ ఆక్రమించింది అంటున్నారు అక్కడి జనాలు. సనా నటిస్తున్న 'వజాహ్ తుమ్ హో' సినిమా పోస్టర్ ఇటీవల ఒకటి విడుదల చేశారు. అందులో సనా అందాల ఆరబోత చూసి కొందరు నోళ్ళు వెళ్ళబెట్టారట! ఈ విషయంలో ఇప్పటి వరకూ సన్నీ మాత్రమే అనుకుంటే ఆమెకు తోడుగా సనా దిగిందని జోకులేస్తున్నారు. హీరోయిన్లు నటనని నమ్ముకోవాలి కానీ అందాలను కాదు అని కొందరు ఆమెకు సలహా ఇస్తున్నారట కూడా!*



ఆ అమ్మాయి. తెల్లగా, లేతగా అమాయకంగా, స్వచ్ఛంగా కలువ పువ్వా! తుడిచిన అద్దమా! గొంతు నులిమి పాయింట్ బ్లాంక్ రేంజ్‌లో బుల్లెట్లు పేల్చితే శరీరం పికిలిపోయి ప్రాణాలు విడిచిన తెల్ల కుందేలా.. ఎర్రగారక్తం. అందులో తెల్లగా చచ్చిన కుందేలు. కడుపుచిరిగి, పేగులు బైటపడి, శరీరం ఛిద్రమై చేతులు విరిగి, మెలికలు తిరిగి, కాళ్ళలోకి తుపాకీ గుళ్ళు చొచ్చుకుపోయి, నుజ్జు నుజ్జు కానిది ముఖమొక్కటే. అలాగే నీటిపైతేలుతున్న అప్పుడే వికసించిన కలువపువ్వువలె నిర్మలంగా ప్రశాంతంగా ప్రశ్నిస్తూ, ప్రతిఘటిస్తూ.

'ఏడబుట్టె.. ఏడకొచ్చె

ఏడకొచ్చి ఏడచచ్చె... ఏ తల్లి కన్నబిడ్డలోళి... చెమ్మకేళిల హోళి'.

పాట...ఎవరూ పాడనిపాట..

మౌనంగా.. నిశ్శబ్దంగా వినబడే పాట. కళ్ళు మూసుకుంటే, గుండెల కొండల్లో ఒక ప్రళయ గీతమై విస్ఫోటించే పాట.

గాజు కళ్ళు అవి. అప్పటిదాకా సూర్యకిరణాల్లా వెలుగులను నింపుకుని వికసించిన కళ్ళు ఇప్పుడు కరెంట్ పోయిన తర్వాత ఆరిపోయిన బల్బ్‌వలె జీవి... నిర్జీవి. వస్తువుంది కాని కాంతిలేదు. మనిషుంది. కాని ప్రాణంలేదు.

ప్రక్కన ఒక తుపాకీ. పాయింట్ త్రీ రైఫిల్. ఎప్పటిదో తాతలనాటి మోడల్. రీ లోడబుల్ గన్...ప్!

మనుషులు వాళ్ళేగానీ, ఆలోచనలు వేరు. శరీరం అదేగాని చింతనవేరు. చదువు అదేగానీ లక్ష్యాలూ గమ్యాలూ వేరు. కళ్ళు అవే. కానీ చూపు వేరు, దృష్టివేరు.

ఈ దృష్టి భేదమేమిటి?

చుట్టూకొండలు. దట్టమైన అడవి. లోయలు, ముళ్ళకంపలు, కాలిబాటలు, బురద దారులు, కఠోరమైన నడక.

ఎందుకు? ఆమె కూడా ఐఐటిలో ఎంటెక్ పూర్తి చేసి గోల్డ్ మెడల్‌తో బయటికొచ్చిన అమ్మాయే. హాయిగా ఏ అమెరికాకో అమ్ముడుపోయి ఆడి కార్లలో తిరుగుతూ, హాయిగా డాలర్లనిషాలో మునిగి, స్వప్నాల్లో తేలిపోవచ్చు గదా!

ఈ వైవిధ్యమైన చింతన ఏమిటి... ఎందుకు?

సడెన్‌గా భయంకరమైన కేకలు వినిపించిన ట్టనిపించాయి. ఉలిక్కిపడి ముఖంపై కప్పుకున్నా ఖాకీరంగు టోపీని చటుక్కున చేతితో తొలగించుకుంటూనే కళ్ళు తెరిచాడు నరహరి.

ఏ శబ్దమూలేదు. అంతా ప్రశాంతమే. పోలీస్ స్టేషనంతా. పాముల పడగల నీడలోని చిత్తడి నేలవలె.

బైట దూరంగా గేట్‌దగ్గర సెంట్రీడ్యూటీలో బద్రునాయక్. ఒక శిలావిగ్రహం వలె కనిపిస్తున్నాడు. నీడలా.

నీడలు.. నీడలు.. కదిలే నీడలు.. వేటాడే నీడలు.. ధ్వంసించే నీడలు.. విస్ఫోరించే నీడలు.

'సూర్యుడెవరు...? అని ప్రశ్న.'

వెలుతురునూ... ప్రకాశాన్నీ ఇచ్చేవాడు. అని జవాబు.

కాని.. సూర్యుడంటే నీడలను ప్రదానం చేసేవాడు. అని మరో జవాబు.

ఈ గ్లాసు సగం ఖాళీగాఉంది అని ఒకడంటే, ఈ గ్లాసు సగం నిండి ఉంది. అని ఇంకొకడు! వస్తువు అదే, కాని దృష్టి వేరా?

సమాజమదే కాని దాన్ని వీక్షిస్తున్న చూపువేరా?

జీవితమదే కానీ జీవిస్తున్న తరీఖా వేరా?'

నరహరి రెండు రోజులనుండి ఇంటికి పోలేదు. నిన్న రాత్రి హైదరాబాద్ డిజిపి పేషీ నుండి వచ్చిన ఒక అర్జంట్ కాల్ మీద హడావిడిగా.. హుటాహుటిన పోలీస్‌స్టేషన్‌కు వచ్చిన వచ్చుడు. ఇక ఒకటేపరుగు. 'యాక్షన్' తుపాకులు.. ప్రేలుళ్ళు... వేట... లాకప్‌లు.. అజ్ఞాత విచారణలు.. పోలీస్ భాషలో... ప్రశ్నలు... గోళ్ళలోకి సూదులు గుచ్చడాలు... తలక్రిందుల వ్రేలాడతీతలు.. ఎర్రగాకాల్చిన కర్రుతో కాల్చడాలు, అరుపులు కేకలు, బీభత్సం. హింస... శారీరకహింస, మానసికహింస. భయంకరమైన విచ్ఛేదన. ఊహించలేని అతిక్రూరమైన దాడి. నిస్సహాయమైన వ్యక్తిపై అధికారిక దాడి. పైశాచిక

ఆక్రమణ. రక్తచాపల్యం, హింసాచాపల్యం. లో లోపల ప్రతిమనిషిలోనూ అజ్ఞాతంగా దాగిఉండే హింసా కాంక్షను తీర్చుకునే పాశవికదాడి.

నిన్న రాత్రంతా వర్షం. భీకరమైనవర్షం. అసలు శీతాకాలంలో అంతవర్షం తనెప్పుడూ చూడలేదు. ఏదో ప్రత్యేక సందర్భంలో వలె కుండపోతగా ఒకటే ఎడతెగని వర్షం. ఆ అమ్మాయిని స్పెషల్ కోంబింగ్ స్క్వాడ్ రాత్రి పదకొండు గంటలకు తన పోలీస్‌స్టేషన్‌కు విచారణ నిమిత్తమని తీసుకొచ్చారు. అప్పుడు మొదలైనవర్షం విచారణ పేరుతో జరిగిన అతిఘోర హింస తర్వాత, ఆ అమ్మాయిని ఒక పదిమంది ప్రత్యేక శిక్షణ పొందిన స్పెషల్ స్క్వాడ్ వెంట తీసుకుని తనుకూడా బయలుదేరుతుండగా కూడా వర్షమే. ఆకాశం దుఃఖిస్తున్నాదా, ఆకాశం ఆమెపై జరుగుతున్న పైశాచికదాడికి విలపిస్తూ భూనభోంతరాళాలను ఏకంచేస్తూ కన్నీళ్ళను కారుస్తున్నదా అన్నట్టు వర్షం.

ఈ అతిరహస్య ఖైదీల విచారణసెల్ తన




పోలీస్ స్టేషన్ లోనే ఉంది. ఆ విషయం తనతో పనిచేసే చాలామంది సామాన్య పోలీస్‌లకు అసలు తెలియనే తెలియదు. భూ గృహమది. మధ్య హోల్‌లో నుండి లోపలికి మెట్లు. లోపల చీకటి. అంతా రాతికట్టడం గుహ. ఎప్పుడో నిజాం కాలంనాడు కట్టించిన ఇంటరాగేషన్ సెల్. దాంట్లో అంతా దుఃఖఘోష. కన్నీళ్ళవాసన. దశాబ్దాల నాటి వందల వేలమంది హతుల ఆత్మల నిశ్శబ్ద వేదనా ప్రతిఫలనలు, ఆక్రందనలు, ఆక్రోశాలు, రోదనలు, వెరసి.. 'ఆ చల్లని సముద్ర గర్భం దాచిన బడబానలం' అది ఉదయించని భాస్కరులెప్పుడొస్తారో.

నరహరికి ఎదుట తన టేబుల్‌పై తన 'బెరెట్టా' పిస్టల్ కనబడింది. ధగధగ మెరుస్తూ, చుట్టచుట్టుకుని పడుకున్న పాములా. తను సర్వీస్‌లో సబ్-ఇన్‌స్పెక్టర్‌గా చేరినప్పుడు పన్నెండేళ్ళ క్రితం ప్రభుత్వమిచ్చింది. పిస్టల్ చేయగలిగింది కేవలం హింస ఒక్కటే. భయపెట్టడం, భయపడడం. ఈ రెండే తన జీవితమంతా తన అనుభవంలోకి వచ్చిన అతి దుర్మార్గ విషయాలు. పోలీసన్నవాడు ఎదుగుతున్నకొద్దీ తన కిందివాళ్ళనూ, ప్రజలనూ భయపెట్టడం, పైవాళ్ళ దగ్గర బూట్లునాకేంత నీచంగా భయపడడం.. హృదయాన్ని చంపుకుని!

మొట్టమొదటినాడు ఈకొత్త పిస్టల్ తీసుకున్న నాటి రాత్రి జ్ఞాపకమొచ్చింది నరహరికి.

లోపల ఏదో ములముల. దాన్ని ఉపయోగించాలన్న దుగ్ధతో కూడిన గులగుల. కాల్చాలి. దేన్నైనా.. ఎవరినన్నా బుద్ధితీర బుల్లెట్‌తో కాల్చి చంపాలి. హింసించాలన్న బలమైన కోరిక. చిన్న పిల్లవాడిచేతికి ఒక పెన్ను ఇస్తే, దానితో కాగితం మీదనో బండమీదనో ఎక్కడో ఒక దానిమీద పరపరా గీకి ఆనందించాలన్న తహతహ, దాహం, దురద. పిల్లవాడికి ఒక బొద్దింక కనిపిస్తే చీపురు పుల్లతో దాన్ని గుచ్చిగుచ్చి చంపాలన్న అజ్ఞాత మృగతత్వం! తూనీగ కనిపిస్తే రెక్కలుచించి తోకకు దారంకట్టి ఎగరేస్తూ మజా చేస్తూ చివరికిదాన్ని హింసిస్తూ చంపాలన్న అప్రత్యక్ష వాంఛ. హింసా చాపల్యం.

మనిషి తత్వంలోవచ్చే మార్పు ఎప్పుడూ క్రమానుగతంగా సంభవిస్తుందా? నిజానికి తను చేస్తున్న ఈ ఉద్యోగం తను కావాలని ఇష్టపడి ఎంచుకుని చేస్తున్నది కాదు. మెకానికల్ ఇంజనీరింగ్ చదువును రీజనల్ ఇంజనీరింగ్ కాలేజ్ వంటి ఒక ప్రీమియర్ ఇన్‌స్టిట్యూట్‌నుండి పూర్తి చేసిన తను ఏదైనా ఒక భారీపరిశ్రమలో చాలెంజింగ్‌గా ఉద్యోగం చేస్తూ పైకి ఎదగాలని కలలు కన్నాడు. కానీ అలా జరగలేదు. బీదరికం. తండ్రి చనిపోవడం, కుటుంబ భారం పైబడడం. ప్రవాహంలో కొట్టుకుపోతున్నప్పుడు ఏ ఆసరా దొరికితే దాన్నే పట్టుకుని బైటపడ్డరీతిలో... చటుక్కున ఈ ఎస్.ఐ. ఉద్యోగం నోటిఫికేషన్ రావడం, అప్లై చేస్తే భగవంతుడిచ్చిన భారీవిగ్రహం సహజంగానే ఉన్న తెలివితేటలు, సమయజ్ఞత, చొచ్చుకుపోయే తత్వం, ఈ దేశంలో రాజ్యాంగమిచ్చిన కుల రిజర్వేషన్... అన్నీ కలిసి మొత్తంమీద డైరెక్ట్ సబ్-ఇన్‌స్పెక్టర్‌గా అపాయింట్‌మెంట్.

ఇక వచ్చింది పెనుమార్పు తనలో. తనకు తెలియకుండానే. నిజానికి ఉద్యోగంలో చేరిన కొద్దిరోజుల్లోనే అర్థమైన విషయమేమిటంటే, కొత్తగా ఉద్యోగంలో చేరేనాటికి చాలామంది స్వచ్ఛంగా నీతివంతంగానే ఉంటారు. ఐతే కాలం గడుస్తున్నకొద్దీ తనతోటి ఉద్యోగులు చేస్తున్న అక్రమాలూ, సంపాదనమార్గాలూ, మెలకువలూ, మెలికలుపెట్టి మనుషుల బలహీనతలనుండి డబ్బు గుంజే దారులూ... అన్నీ క్రమక్రమంగా తెలుస్తూ చేయి లోపలిదాకా చొప్పించడం నేర్చుకుని. ఇక విజృంభణ నోట్లను కుప్పలుగా ఊడ్చుకోవడం, ఇంకా దోపిడీ.. ఈ దేశంలో అవినీతి ఒక జీవనవిధానమైన విషసంస్కృతి విస్తరిస్తూ విస్తరిస్తూ అలవాటైపోయింది. మొదటిసారి ఎస్.ఐ. యూనిఫాం వేసుకుని పోలీస్‌స్టేషన్‌లో అడుగుపెట్టగానే హెడ్ కానిస్టేబుల్ ద్వారా కొంత, తనపైనున్న సిఐ ద్వారా కొంత. తమ జ్యూరిస్‌డిక్షన్‌లోని ఆదాయ వనరులూ, సంపాదనా మార్గాలూ, రహస్య కేంద్రాలూ, అన్నిదారులు విప్పుకుని ఎదుట పరుచుకుంటూ, ఒకరకమైన కవ్వింత. పైఅధికారి డబ్బు తెచ్చివ్వమని బలవంతం. కిందివాళ్ళు తనకు కొంతఇప్పించి తద్వారా తాముకొంత బావు కోవాలని నిరంతర ప్రయత్నం. అవినీతి ఒక పెట్రోల్ మంట. దావానంలా వ్యాపిస్తుంది. ఒక్కసారి చేయి చాపామంటే ఇకఊబిలోకి కూరుకుపోతున్నట్టు లెక్కే. లంచ మిచ్చేవాడు క్రమక్రమంగా నెత్తికెక్కి నృత్యం చేస్తాడు అజమాయిషీ చేస్తూ. చుట్టూ రకరకాల మనుషులు. మంచి చెడూ, తెగింపు, చొరవ దేనికైనారెడీ అనే ఆడా మగా, చేయి చాపితే అందే సెక్స్ చేయి వంకరపెడితే విపరీతమైన డబ్బు! చిత్రమేమిటంటే ప్రతిరోజూ ఒక నిత్యనూతనమైన కేసులు. వింతసంఘటనలు, ప్రేమలు, విడిపోవడాలు. కొట్లాటలు, దాడులు. నీకిదిస్తే నాకదిస్తావా అంటూ బేరసారాలు. వేశ్యాగృహాలు, పేకాటక్లబ్బులు. పైకి దేవునిలా కనిపించేవాడు లోపల అతివికృతంగా దర్శనమిస్తూ... అంతా ఒకమాయ! ఒక భ్రమ! ఒక భ్రాంతి! అధికారం మనిషికి పిచ్చెక్కిస్తూ తిరిగి వెనక్కిచూడనివ్వకుండా వ్యామోహంలోకి తరుముతుంది.

అప్పుడు తన మొదటినెల జీతం పదిహేను వేలు. లంచాలు ముప్పైరెండు వేలు. తర్వాత జీతం అదే పదిహేను వేలు. పైపై ఆదాయం నలభై వేలు. ఒక కొత్త అందమైన స్త్రీ పరిచయం. ఇంట్లో అందమైన, అనుకూలవతైన భార్య ఉండగా మరో బజారు రూపవతిమీదికి మనసు మళ్ళింత. ఆరు నెలల్లో రెండవ సెటప్.

జారిపోతున్నానడిపోతున్నాను. అధఃపాతాళానికి కూరుకుపోతున్నానని తెలుస్తున్నా, కోలుకోవాలని కోరుకోలేని బలహీనతలు. ట్రాన్స్‌ఫర్లు. మళ్ళీ కొత్త పచ్చని గడ్డి భూమి.. మళ్ళీ మేత! కొత్త సంబంధాలు, కొత్త స్త్రీలు కొత్త సెక్స్, కొత్త పరిచయాలు. అంతా గివ్ అండ్ టేక్ వ్యవహారాలు.

ఐదేళ్ళు కాగానే ఇనెస్పెక్టర్ ప్రమోషన్. మళ్ళీ కొత్తచోటు. ఇక కుటుంబం అక్కడే కరీంనగర్ లోనే. ఇద్దరు పిల్లలు, భార్యకు నగలు, చీరలు, ఇల్లు, కుక్కలు, బ్యాంక్ బ్యాలన్స్‌లు రక్షణకు ఓ కానిస్టేబుల్. విస్తృతమైన డిపార్ట్‌మెంట్ సంబంధాలు డీలింగ్స్ అన్నింటికీ ప్రతి రాత్రీ పార్టీలు.

మందు తర్వాత మగువ. విందులు పొందులు.

ఐతే, మొత్తమ్మీద ఓ రెండు సంవత్సరాల క్రితం నుండీ ఏదో ఒక రకమైన అపరాధభావన. లోపల ఏదో చెదలు వంటి విధ్వంసక జీవులు కుప్పలు కుప్పలుగాచేరి లోలోపలే తనను తినేస్తున్నట్టు రోజురోజుకూ తనుఖాళీగా, బోలుగా శిథిలమైపోతున్నట్టు..! చివరికి అసలు తన అస్తిత్వాన్నే కోల్పోతున్నట్టు దుఃఖం. నిశ్శబ్దదుఃఖం.. మౌనదుఃఖం. భరించలేని, ఏ భాషకూ అందని, లొంగని గాఢ దుఃఖం.

దుఃఖానికి ఒక రూపం, భాష, వ్యక్తీకరణకు ఒక అభివ్యక్తి. దుఃఖలిపీ ఉంటాయా!

మళ్ళీ ఆ అమ్మాయి జ్ఞాపకమొచ్చింది. నిన్న రాత్రంతా తన పోలీస్‌స్టేషన్‌లోని ఇంటరాగేషన్ గదిలో.

పేరు.. పేరేమిటి... ఆ..ఆ.. నిర్మల.. నిర్మలమైన ముఖం. నిర్మలమైన హృదయం. నిర్మలమైనమాట. నిర్మలమైన ఆలోచనలు.

ఎంత హింసో. పాపం బిడ్డపై ఒక్క కుందేలుపిల్లపై వంద రేచుక్కలు దాడిచేసి మూకుమ్మడిగా కరిచినట్టు.

'ఇంతకూ ఆ అమ్మాయిచేసిన పాపం, చేసిన ద్రోహం ఏమిటి?'

ఆలోచించడం...! ఈ దేశంగురించి.. కుళ్ళిపోతున్న ఈ సమాజం గురించీ, ఇక్కడి స్వరాల్నీ ఎక్కడో ఎవరికో ఎవరో తాకట్టు పెడుతున్న పాలకుల గురించీ ఆలోచించడం!

'ప్రజలను ఆలోచించనీయకూడదు. ఆలోచనాపరులెప్పటికైనా పాలకులకు శత్రువులుగా మారి అధికార పీఠాలను కూలదోస్తారు వాళ్ళను నిర్మూలించాలి. కూకటి వేళ్ళతో సహా ఆలోచించే వాళ్ళను పెకిలించివేసి ధ్వంసించాలి'.

ఆలోచించడమే ఆమె చేసిన తప్పు.

రాత్రి... ఒక జీపులో నిర్మలను పదిగంటలకు తన స్టేషన్‌కు ముగ్గురు కోంబింగ్ స్క్వాడ్ డిఎస్‌పిలు తీసుకురాగానే, మొదట లాకప్... ఇంకో గంటలో హైదరాబాద్‌నుండి ఓ ఎనిమిదిమంది బృందం, ఉన్నతస్థాయి ఆక్టోపస్ బ్లాక్ యూనిఫాం. లోపలికి తీసుకుపోయి చేతులు వ్రేలాడదీసి బంధించి ఇద్దరు ముగ్గురు తప్ప అందరూ కొత్తే. బయటి వాళ్ళే. తనొక్కడే స్థానికుడు. ఒక గంట తర్వాత తన జిల్లా ఎస్‌పి వచ్చాడు. ఆ ఒక్క గంటలోనే అంతా ఐపోయింది.

"చెప్పు మీ దళ నాయకుడు ఎవడు? మీ హై కమాండ్ ఉనికి ఎక్కడ.. నీది ఏ ఊరు. ఐఐటి చదివి నీకిదేమి దారే.. ఏ అమెరికాకోవెళ్ళి హాయిగా బతుకొచ్చుగదా.." వంటి కోటి ప్రశ్నలు.

అందులో కొందరిచరిత్రలు తెలుసు తనకు. అందరూ దొంగలే. అందరిపైనా అవినీతి ఆరోపణలు బోలెడు. చీకటి ముఠాలతో ఏవేవో సంబంధాలు.

ఏ ఒక్కదానికీ ఆ బిడ్డ జవాబు చెప్పలేదు. నానా హింస. తెల్లని పాలకడ్డీలవంటి చేతివేళ్ళ గోళ్ళలోకి గుండు సూదులు కసుక్కున గుచ్చుతుంటే విలవిల్లాడిపోయి గిలగిలా తన్నుకుని.

"అమ్మా..అమ్మా" అని భూమి బ్రద్ధలయ్యే కేక.

"దీని తండ్రి టీచరట. తల్లికూడా టీచరేనట.




## చివరకు మిగిలేది

తను చాలాకాలంగా నాకు తెలుసు
విశ్వాసాల ఊపిరులతో
పాతికేళ్ళ కలల్ని మోసుకుని
అడుగిడిన క్షణాలూ గుర్తే
అప్పుడు తన రెప్పలకు రెక్కలుండేవి.
అంజన లేపనాలతో పాదాలు పరుగులెత్తేవి
స్నేహ వీచికను చుట్టుకుని
నిగర్వంగా మనుషుల్లోకి నడిచినప్పుడు
జీవస్పర్శతో ఒక సాంద్రగీతం
సానుకూలంగా వినవచ్చేది.
మెల్లమెల్లగా వేళ్ళూనుకున్నాక
తడారిన గొంతున పొడి వాక్యాలు మొదలై
అసహజత్వం గుర్రపుడెక్కలా పాకడం
మొదలెట్టింది.
ఇక వరసలన్నీ తారుమారై
వెలుగు పాటలు ఏంజల్‌పాటై
వలస పక్షులకు మురిపాలెక్కువవడమూ తెలుసు
చర్మ సరిహద్దులు మొదలై
చెట్లనూ... గూళ్ళను నరికేసి నవ్వేశాక
కువకువమనలేని పావురాళ్ళు
బాధరాల్చుకునేవి విలువలకు తల ఒగ్గుతూ.
ఇరుదిక్కులా తానుగా వెలిగే వత్తివేసి
నిశిరేఖ ఒకటి చుట్టూ గీసుకుని
మలుపు తిరిగిన సంజెవాలులో
ఏటిఒడ్డున దొర్లిన ముత్యాలను
మోసుకుపోవడమూ తెలుసు
కానీ కొన్ని తెలిమబ్బుల్నీ.. పూరేకుల్నీ
మేలిమ నవ్వుల్లో ముంచి వదలిపోతే
బావుండేది.



కొంచెం మలయజశీతల స్పర్శని.
మిగిల్చిపోయినా బావుండేది.
అలలు తీరాన్ని తాకినట్టు
తన తలపుల తావులు
ఒకింత రాగ వ్యాకులత రేపేవి.
మనం లేకున్నా మనవైన ముద్రలు
వదలిపోయినప్పుడే కదా
మరపు గాలికి నోరొచ్చి
మధుర జ్ఞాపకాలు పాడేది

-ఆవాల శారద

సెల్: 92956 01447

బుద్ధిలేదు కొడుకులకు. పిల్లలకివే బోధిస్తున్నారా".

అలా అంటున్న పోలీసాఫీసర్ బిడ్డలిద్దరూ అమెరికాలో సెటిలై హాయిగా...!

ఒకడు చేతిలోని కర్రతో.. కాళ్ళపై అరిచేతులపై చెప్పలేని ప్రైవేట్ ప్రాంతాలపై దాడి అందరి కళ్ళలో కసి. హింసించి పొందే పైశాచిక ఆనందం తాలూకు నవ్వులు, హాస్యాలు.

"ఏం ఎన్‌కౌంటర్ స్పెషలిస్ట్.. ఏం చేద్దాం దీన్ని".

"లేజావ్ సాలీకో... కహీ అందర్ లేజాకే ఫారెస్ట్ మే ఖతం కరో... హం దేఖ్ లేంగే బాద్మే".

దెబ్బలు తినీతినీ సొమ్మసిల్లి స్పృహ కోల్పోయి అపస్మారకంగా.

ఆ క్షణం కూడా ఎంత దుఃఖమో... తనలో ఎన్ని దహించుకుపోతున్న అడవుల్లో లోపల.. కాని ఏమిచేయ గలిగాడుతను. ప్చ్! ఏమీలేదు. ఒట్టి నిస్సహాయత. పై అధికారుల కింద తను ఒక చిన్నపోలీస్! ఒక కుక్క అంతే.

ఒక అరగంటలో ఐదారు ఇన్నోవాల్లో ఇరవై మంది సాయుధ బృందం. అంతా నిశ్శబ్దం. ఒక్క యువతిని చంపేందుకు ఇంతమంది సామూహిక వ్యూహాత్మక కుట్ర.

ఆ క్షణమే తనకు తన ఎనిమిదేళ్ళ కూతురు శృతి జ్ఞాపకం వచ్చింది. నిర్మలమైన ముఖం. శృతి, నిర్మల... ఇద్దరూ తెల్లగా వెన్నెల బొమ్మలవలె!

బొమ్మలు పగులగొట్టబడ్డాయి. ముక్కలు చేయబడ్డాయి. ధ్వంసించబడ్డాయి.

తెల్లవారగట్ల నాలుగ్గంటలకు వరుసగా ఆరు వెహికిల్స్ లోపల స్పృహలేని నిర్మలను ఒక మాంసం ముద్దలా లోపలకు తోసి, బయల్దేరి అతి వేగంగా దూసుకుపోయి...

తెలుసు తనకు తర్వాత ఏమౌతుందో.

'ప్రాతఃసమయ ఎదురు కాల్పుల్లో ఒక మావోయిస్ట్ మృతి' అని వార్త.

పది గంటలప్పుడు తనువెళ్ళాడు. జిల్లా అధికారులతో కలిసి అప్పటికి అసలు స్క్వాడ్ వెళ్ళిపోయింది. ఎన్‌కౌంటర్ అని చెప్పబడ్తున్న చోట యుద్ధవాతావరణం. అంతా చిందరవందర.

కడుపులోకి ఐదారు బుల్లెట్లు దూసుకుపోయి, నిర్మలముఖం చితికి, భరించలేని వికృతి.

ఎందుకో తట్టుకోలేని దుఃఖం ముంచుకొస్తూ...

స్కిప్... స్కిప్ ఫ్రం దట్ ప్లేస్ 'ఉండలేను.. ఉండలేనక్కడ'.

పోలీస్‌స్టేషన్‌కు రాగానే మరొక్కవార్త. నగరంలోని అరవై ఏడేళ్ళ మేధావి, పూర్వ యూనివర్సిటీ వైస్‌ఛాన్స్‌లర్. మానవ హక్కుల పరిరక్ష

## 'రాచపీనుగు తోడు లేకుండ పోదు'

'రాచపీనుగు తోడు లేకుండ పోదు'- ఇది సామెత గాదు. యధార్థమే. భారత చరిత్రలో 'నరబలి', 'సతీసహగమనము' మూఢ విశ్వాసాలు సమాజానికి చాలహాని చేశాయి.

ఒక మహారాజు మరణించినప్పుడు ఆయన్ను



దహనం లేక ఖననం చేయదలచినవారు ఒక మూఢ విశ్వాసం ఆధారంగా మరొక వ్యక్తిని ఆ రాజు శవంతో పాటు దహనం లేక ఖననం చేసేవారు. రాచపీనుగు తోడులేకుండా పోకూడదనే మూఢవిశ్వాసమే ఇందుకు కారణం.

మరణించిన రాజుతో పాటు మరొకరిని బలవంతంగా చంపివేసే ఈ అచారాన్ని 'కీఙుగుంట' (రెండు శరీరాలను కలిపి ఒకే గుంటలో పాతి పెట్టటం) సంస్కారం అనేవారు. ఈ విధమైన త్యాగం? చేసినందుకు ప్రతిఫలంగా అతని సంతతికి మాన్యం ఇచ్చేవారు.

క్రీ.శ. 9వ శతాబ్దంలో కడప వైదుంబ వంశానికి చెందిన గణ త్రినేత్రుడు అనే మహారాజు యుద్ధంలో మరణిస్తే అతనితో పాటు మరొకరిని చంపి మహారాజుకు 'కీఙుగుంట సంస్కారం' జరిపినట్లు 'గణ్డ త్రిణేత్ర వైదుంబ మహారాజు వన్నాడి శాసనం' తెలియజేస్తున్నది.

ఈ శాసన విషయాన్ని శ్రీ జి.పరబ్రహ్మశాస్త్రి 'తెలుగు శాసనాలు' (1975) గ్రంథంలో విపులంగా తెలిపారు.

రాజు చనిపోతే అతనితోపాటు మరొకరిని చంపే ఈ ఘోర దురాచారం భారతదేశంలో ఎప్పుడు ప్రారంభమైందో ఎప్పుడు అంతరించిందో తెలుసుకునే స్పష్టమైన ఆధారాలు లేవు.

**సేకరణ: రామమోహనరాయ్**

కుడు. కరప్షన్ ఫ్రీ ఇండియా అధినేత, మొన్నటికి మొన్న ఏడువందల కోట్లరూపాయల ఇనుప ఖనిజ స్కాంగురించి కీలకపత్రాలతో సహా హైకోర్టుకు సమర్పించి రాష్ట్రమంత్రి నొకణ్ణి కటకటాల వెనక్కి పంపిన నిష్కల్మష నాయకుడు. అరవింద్ సామలను పదిగంటలకు ఒంటరిగా నివసిస్తున్న ఆయన ఇంటికి కొరియర్ బాయ్‌గా మోటార్‌సైకిల్‌పై వచ్చిన ఇద్దరు యువకులు పిస్టల్‌తో ముఖంపై సూటిగా కాల్చిచంపి..

హింస, హింస, నిర్మలమైన మనసుతో ఈ సమాజాన్ని శుభ్రం చేద్దామని ఉద్యమిస్తున్న నిష్కల్మష వ్యక్తులపై దాడి! హింస, ప్రతీకార హత్యలు, విశృంఖలత.

వెంటనే అక్కడికి పరుగు.

అరవింద్‌సామల కూడా తెల్లగా కలువ పువ్వులా సున్నితంగా గాజుబొమ్మలా.

"అరవైరెండు బుక్స్ రాశాడుసార్. ఎంత విలువైనవో పాపం ఈ దేశం" ఇంకా ఏమో అంటున్నాడు ఎవరో వృద్ధుడు తను పంచనామాకు వెళ్ళినప్పుడు చటుక్కున తను తలెత్తి చూస్తే డెబ్బై ఏళ్ళుంటాయేమో, స్వచ్ఛమైన మనిషి, నిర్మలమైన ముఖం. ఏ కల్మషమూ లేదు.

ఎదురుగా ముఖమంతా రక్తపు ముద్దై అరవింద్ శవం.

'ఏం పాపం చేశాడితడు?' అనే ప్రశ్న ఆత్మను వేధిస్తోంది.

ప్చ్ జవాబు లేదు.

ఒంటిపై ఖాకీ బట్టలు.. సిగ్గుసిగ్గు...

రాత్రి నిర్మల... అరచిన దుఃఖభరితమైన అరుపులు.. ఆక్రందనలు.. ఏడ్పులు.

ప్రొద్దున బహిరంగ హత్య. ఒక మేధావిది.

అయినా తనలో నిన్నటినుండి ఎందుకీ అవ్యక్త దుఃఖం. ఈ హంతకుల కుటుంబంలో ఒకడినైన తనలో తనకే అర్థం కాని ఈ పశ్చాత్తాపం ప్రాయశ్చిత్తకాంక్ష, ఏమిటిది?

లోపల భయంకరమైన అలజడి... కల్లోలం తుఫాను.

మెన్నీమధ్య చదివిన ఫ్రాయిడ్ శిష్యుడు ఎరిక్ ఫ్రాం రాసిన 'ట్రామిక్ బిహేవియర్' గురించి స్ఫురణ.

సున్నితమైన మనస్సుతో మనిషి తనకు నచ్చని కార్యాలను జీవితకాలమంతా చేస్తూ పోతున్న కొద్దీ, ఒక గాయపడిన అవయవంతో పని చేస్తూంటే లేక ఒక విరిగిన చేయితోనో ,కాలుతోనో మొండిగా అలాగే పనిచేస్తూ పోతూంటే ఎలాగైతే ఆ గాయం ఇంకా ఇంకా ముదిరి మృత్యుపర్యంత హాని కలిగిస్తుందో.. పరస్పరవిరుద్ధ తత్వాలతో, వైరుధ్య అంతరంగంతో మనిషి ఒక మానసిక 'ట్రామా'ను లేక అఘాతాన్నిపొంది ఆ స్థితిని విస్మరిస్తూ కొనసాగుతాడో ఆ వ్యక్తిలో ఊహాతీతమైన రెప్రెషన్. దమనం తెలియకుండానే పెరిగి పెరిగి భయంకరమైన ప్రవర్తనా విచ్ఛిన్నతకు కారకమౌతుంది. స్ప్లిట్.... యునైట్. అగైన్ స్ప్లిట్. రీ యునైట్...అగైన్ స్ప్లిట్...

చివరికి ఒక పెనుతుఫాను.. పెనుకల్లోలం పెను బీభత్సం సంభవించి... నరహరి ఉలిక్కిపడి... తీక్షణంగా చూశాడు చుట్టూ.

ఎదురుగా గడియారంలో రెండూ ఇరవై నిమిషాలు. టిక్... టిక్... టిక్.. నడుస్తూనే ఉంది.

ఇటుప్రక్క లాకప్ గది. నిన్నరాత్రి నిర్మల దాంట్లో అరచి, ఏడ్చి, చిదమబడి, శరీరం చితికి, నుజ్జునుజ్జై...

అడవిలో రక్తసిక్తమై శరీరం... ఛిద్రమై.

ఈరోజు అరవింద్ సామల... సమాజాన్ని ప్రశ్నిస్తున్న పాపానికి ముఖం చితికిపోయి.

తన చుట్టూ అవినీతి. తాము ఎవరికి రక్షకులు...?

నిర్మల ఐఐటి గోల్డ్‌మెడల్. అరవింద్‌సామల యూని వర్సిటీలో పూర్వ ఉపకులపతి.

రెండు ముఖాలూ చితికి రక్తాలోడుతూ..

నరహరి సూటిగా చూస్తున్నాడు తన ఎదురుగా ఉన్న గేట్‌దిక్కు. అక్కడంతా తెల్లగా మంచు తెర. బద్రూ నాయక్ సెంట్రీ డ్యూటీలో ఉండాలి, కానీ కనిపించట్లేదు. అంతా మసక మసక.

రెండు ముఖాలు.. రక్తసిక్తమై. నిర్మల.. తెల్లగా మంచువలె ప్రక్కనే.. అరవింద్ సామల. ముఖం చితికి... రక్తసిక్తమై తెల్లగా మంచువలె.

రక్తం కూడా మంచువలె తెల్లగా.. వెన్నెల వలె.. నిర్మలంగా స్వచ్ఛంగా ఉంటుందా?

నరహరి మెల్లగా వంగి టేబుల్‌పైఉన్న తన బెరెట్టా రివాల్వర్ చేతిలోకి తీసుకున్నాడు.

"ఢన్" మని చప్పుడు ఒకే ఒక తూటా ప్రేలి.

బయటినుండి బద్రూనాయక్ లోపలికి తొంగిచూచి పరుగెత్తుకొచ్చాడు మెరుపులా. చేతిలో రైఫిల్‌తో.

ఎదురుగా నరహరి సర్కిల్ ఇన్‌స్పెక్టర్ కణతల్లో కాల్చుకుని...

అంతా రక్తపు మడుగు... ఎర్రగా...!

**సెల్: 93901 09993**





# మేను మెరిసి పోవాలంటే....

**దీపావళిరోజు పిండివంటలకే కాదు పూజలకూ, వ్రతాలకూ పెద్ద పీట వేస్తారు. రోజంతా హడావిడి హడావిడిగా గడిచిపోతుంది. రోజంతా ఎలా ఉన్నా సాయం సమయంలో టపాసుల వెలుగుతో సమానంగా మెరిసిపోవాలంటే మీ కోసం కొంత సమయం కేటాయించుకోండి. కొద్దిపాటి జాగ్రత్తలతో మీరూ మహాలక్ష్మిలా మెరిసిపోవచ్చు. ఇంట్లో లభించే వస్తువులతోనే మీ మోము దీపావళి మతాబులా వెలిగిపోతుంది. అది ఎలాగో ఆ వివరాలు...**

## ముఖవర్చస్సుకు

- బాగా పండిన అరటిపండును గుజ్జుగా చేసుకుని అందులో చిటికెడు పసుపు, టేబుల్ స్పూను తేనె కలిపి పేస్ట్‌గా చేసుకుని దాన్ని ముఖానికి పట్టించి ఆరిన తరువాత తీసివేసి ముఖాన్ని చల్లని నీటితో కడుక్కోండి. మీ ముఖ వర్చస్సు మీకే ఆశ్చర్యం కలిగిస్తుంది.
- టమోటాలోని బీటాకెరోటిన్, లైకోపిన్‌లు చర్మానికి అందాన్నీ, నిగారింపును తీసుకువస్తాయి. టమోటాను గుండ్రంగా కోసి దాని మీద కొద్దిగా చక్కెర చల్లి ఓ రెండు నిమిషాల తరువాత ఆ ముక్కలతో ముఖం మీద గుండ్రంగా సున్నితంగా రుద్దుకోండి. ఓ పది నిమిషాలు ఆ విధంగా రుద్దుకున్న తరువాత నీటితో ముఖం శుభ్రం చేసుకుంటే సరిపోతుంది.
- ముఖం మీద ఉన్న బ్లాక్ హెడ్స్‌ను సమర్ధవంతంగా, త్వరగా తొలగించుకోవాలనుకుంటే ఈ విధంగా చేసి చూడండి. రెండు స్పూన్ల బొప్పాయి పండు గుజ్జులో స్పూను బియ్యంపిండి, రెండు స్పూన్ల తేనె, కొద్దిగా తేనె కలిపి పేస్ట్‌గా చేసి ఐదు నిమిషాల పాటు స్క్రబ్ చేసుకుంటే బ్లాక్ హెడ్స్ చాలా వరకూ తొలగిపోతాయి.
- పొడిచర్మం కలవారు ముఖం మెరుస్తూ ఉండడానికి ఈ చిట్కా పాటించండి. గంధం పొడిలో కొద్దిగా పాలు కలిపి ముద్దగా చేసుకుని ముఖానికి పట్టించి బాగా ఆరనివ్వాలి. అనంతరం చల్లని నీటితో శుభ్రం చేసుకుంటే ముఖం కాంతివంతంగా మారుతుంది.



- తేనె నిమ్మరసం సమానంగా తీసుకుని ఈ మిశ్రమాన్ని సున్నితంగా ముఖానికి అప్లయ్ చేసి పది నిమిషాల తరువాత చల్లని నీటితో శుభ్రం చేసుకుంటే ముఖం తేటగా, అందంగా కనిపిస్తుంది.
- కప్పు చల్లని పాలలో రెండు స్పూన్ల తేనె కలిపి ఈ మిశ్రమాన్ని ముఖం, మెడకు పట్టించి బాగా ఆరనివ్వాలి. అనంతరం చల్లని నీటితో శుభ్రం చేసుకుంటే మురికి పోయి ఫ్రెష్‌గా కనిపిస్తారు.
- గుడ్డులోని తెల్లసొనను మాత్రమే తీసుకుని దానికి టేబుల్ స్పూను తేనె జతపరిచి ఈ మిశ్రమాన్ని ముఖం, మెడకు అప్లయ్ చేసి బాగా ఆరనివ్వాలి. అనంతరం చల్లనీటితో శుభ్రం చేసుకోవాలి. ఈ చిట్కాతో మీ ముఖం, మెడ మిలమిలా మెరుస్తూంటాయి.
- టమోటా గుజ్జులో స్పూను ఆలివ్ ఆయిల్ లేదా కొబ్బరినూనె జత చేసి ఈ మిశ్రమాన్ని ముఖం, మెడకూ పట్టించి ఇరవైనిమిషాల పాటు ఆరనిచ్చి అనంతరం చల్లని నీటితో శుభ్రం చేసుకోవాలి. పొడి చర్మంగల వారు ఈ విధంగా చేస్తే ముఖం ప్రకాశవంతం అవుతుంది.

## మోచేతులకు:

కొందరికి ముఖం మెడ మెరుస్తూ ఉన్నా, మోచేతులు, మోకాళ్ళు నల్లగా ఉంటాయి. అలాంటి వారు కొద్దిగా మినపప్పును రాత్రి సమయంలో నానబెట్టి తెల్లవారి మెత్తగా రుబ్బుకొని దానికి బొప్పాయి గుజ్జు కలిపి నల్లగా ఉన్న ప్రదేశంలో అప్లయ్ చేసి బాగా ఆరనిచ్చి అనంతరం చల్లని నీటితో శుభ్రం చేసుకోవాలి. ఈ విధంగా చేస్తే నలుపుదనం పోయి ఆ ప్రదేశంలో కూడా చర్మం కాంతివంతమవుతుంది.

## నూనెవస్తువులకు దూరంగా:

పండగ ముందు నుంచే నూనె వస్తువులకు దూరంగా ఉంటే మంచిది. నూనె వస్తువులు ఎక్కువగా తీసుకోవడం వలన దాని ప్రభావం ఉదరం మీదే కాకుండా చర్మం మీద కూడా పడుతుంది. చర్మం కాంతి విహీనంగా తయారు కావడానికి నూనెవస్తువులు, బయట దొరికే ఫుడ్ కూడా కారణం కావచ్చు. పండగకు ఒక వారం ముందు నుంచే వీటికి దూరంగా ఉంటే మంచిదని నిపుణులు సూచిస్తున్నారు.

## హెవీ మేకప్ వద్దు:

పండగ రోజు ప్రత్యేకంగా కనిపించాలనే ఉద్దేశంతో చాలా మంది భారీ మేకప్ చేసుకుంటారు. ఇది చర్మానికి మరింత హాని కలిగిస్తుందని నిపుణులుహెచ్చరిస్తున్నారు. అంత భారీ మేకప్‌ను తొలగించుకోవడం కూడా కష్టమవుతుంది అంతే కాకుండా మొటిమలు వచ్చే ప్రమాదం కూడా ఉందని వారు హెచ్చరిస్తున్నారు.

-చిన్ని




**మల్లమ్మని పడవలో వైద్యశిబిరానికి తీసుకురావడానికి రెండు గంటలు పట్టింది. హుటాహుటిన సిజేరియన్ ఆపరేషన్‌కి కావల్సిన ఏర్పాట్లుచేసి, పక్క శిబిరంలో ఉన్న గైనకాలజిస్టు సహాయం తీసుకుంది మాధురి. శిశువు అమ్నియాటిక్ ఫ్లూయిడ్ (ఉమ్మనీరు) ఎక్కువగా తాగి, గర్భంలోనే మరణించింది. హీమోగ్లోబిన్ నాలుగు గ్రాములే ఉండటం వలన, ఒక యూనిట్ బ్లడ్ కావాలని గైనకాలజిస్ట్ చెప్పడంతో, వెంటనే మల్లమ్మ బ్లడ్‌గ్రూప్ చెక్ చేయించారు.** 'O-Negative'. **అదృష్టవశాత్తూ, నవీన్ బ్లడ్‌గ్రూపు అదే కావడంతో మల్లమ్మని కాపాడగలిగారు.**

క్యాంపు కొచ్చిన డాక్టర్లు మాధురిని అభినందించారు.

"మధూ! చూడటానికి ఎంత సాఫ్ట్‌గా ఉంటావో, అవసర సమయాల్లో ఇంత ఫాస్ట్‌గా ఉండడం, నీలో ఇంత ధైర్యం, సాహసం ఉన్నాయని ఇప్పుడే తెలుసుకున్నానే" అంటూ మాధురిని హగ్ చేసుకుంది అరుణిమ.

"అది పనిరాక్షసే! ఏదైనా మొదలుపెడితే, పూర్తయ్యే వరకూ నిద్రపోదు" అంది గీత.. దగ్గరకొచ్చి.

"ఈ వరదల్లో... నీళ్ళలో పేషంట్‌ని షిఫ్ట్ చెయ్యడం.. వావ్.. సాహసవనిత అవార్డు నీకే" అన్నాడు రాజేష్ షేక్‌హ్యాండిచ్చి.

ఆ రోజు రాత్రి డిన్నరయ్యాక, పడుకోబోతున్న మాధురికి, రూప ఫోన్ చేసింది.

"మధూ! ఈ వర్షాల్లో, వరదల్లో ఎలా ఉన్నారే మన గ్యాంగంతా! ఉదయం నుండీ ఫోన్‌చేస్తుంటే.... ఇప్పుడు దొరికావు" అంటూ ప్రశ్నలు సంధిస్తుంటే...

"రూపా! ఇవాళేం జరిగిందో తెలుసా!" అని ఉదయం నుండీ జరిగిందంతా ఆర్ట్ సినిమా స్క్రీన్‌ప్లేలా నెమ్మదిగా వివరించి చెబుతుంటే...

"ఆc.... ఊc...." అంది రూప.

### జరిగిన కథ

భాస్కరం, రాజశేఖరం బాల్యమిత్రులు. హైదరాబాద్‌లో పక్కపక్కనే ఇళ్ళుకట్టుకుని స్థిరపడ్డారు. వాళ్ళ పిల్లలే కౌషిక్, మాధురి. అతను బీటెక్, ఆమె మెడిసిన్ పూర్తిచేశారు. ఇద్దరి మధ్యా లవ్‌ట్రాక్! కానీ మాధురి స్నేహితురాలు రూప కౌషిక్‌ను దక్కించుకోవాలని ప్లాన్ చేసి రంగంలోకి దిగుతుంది. ఇంతలో మాధురి గోదావరిజిల్లాల్లో వరద బాధితులకు వైద్య సహాయం చేసేందుకు వెళుతుంది. వరదనీటిలో ఆపదలో ఉన్న ఒక గర్భిణీని తన మరబోటులో ఎక్కించుకునేందుకు సాక్షాత్తూ కలెక్టరే ఇష్టపడకపోవడం డాక్టర్ మాధురిని అవాక్కయ్యేట్టు చేస్తుంది. **ఆ తర్వాత.....**

మాధురి చెప్పి ముగించగానే "మధూ! ఇవాళేం జరిగిందో తెలుసా!" అని ఉదయం కౌషిక్‌ని కల్సుకున్న దగ్గర్నుంచి, తనకి బర్త్‌డే గిఫ్ట్‌గా కౌషిక్ రిస్ట్‌వాచ్ కొనిచ్చినట్టు కమర్షియల్ సినిమా స్క్రీన్‌ప్లేలా... ఉన్నదానికి నాలుగింతలు కలర్ కోటింగిచ్చి చెప్పేసరికి మాధురికి మూడ్ ఆఫ్ అయింది.

రూప ఫోన్ కట్ చేసింది.

మాధురి కౌషిక్‌కి ఫోన్ చేద్దామనుకుంది. కానీ.. ఆమె సెల్‌ఫోన్‌లో ఛార్జింగ్ అయిపోయింది.

రెండ్రోజుల తర్వాత వరదలు తగ్గుముఖం పట్టడంతో జనజీవనంలో కదలిక మొదలైంది. ఎటు చూసినా రోడ్లు, ఇళ్ళు రూపాలు కోల్పోయి కళావిహీనంగా కన్పిస్తున్నాయి. వరదల్లో కొట్టుకొచ్చిన జంతుకళేబరాలు, పంటలు, వస్తువులు అనేక రూపాల్లో, మట్టికొట్టుకుపోయి ఇళ్ళలో కన్పిస్తుంటే జనం భయభ్రాంతులవుతున్నారు.

ప్రభుత్వ, స్వచ్ఛంద సంస్థల వాలంటీర్లు ప్రజలకు ధైర్యం చెబుతూ వాళ్ళని ఇళ్ళకు చేర్చే ప్రయత్నం చేస్తున్నారు. క్రమంగా పునరావాస కేంద్రాలు ఖాళీ అవుతుండడంతో, పారామెడికల్ బృందాలు, డాక్టర్లు తిరిగి వెళ్ళిపోతున్నారు.

ఆ రోజు రెడ్‌క్రాస్ బృందం తిరిగి వెళ్తున్నట్టు పూర్ణచంద్ చెప్పి, మరికొంతసేపట్లో కలెక్టర్ వచ్చి వైద్య శిబిరంలో పన్జేసిన డాక్టర్లని అభినందిస్తారని చెప్పాడు.

గంట తర్వాత శిబిరానికొచ్చిన కలెక్టర్, డాక్టర్లనందర్నీ పరిచయం చేసుకుని, అభినందించి, మాధురిని చూసి...

"మొన్న... డెలివరీ కేసులో... మీరే కదా!" అంటూ గుర్తు చేసుకున్నాడు.

"ఎస్సార్! ఎగ్జాట్లీ... ఆ రోజు జలదిగ్బంధంలో చిక్కుకున్న ఏజెన్సీ గ్రామం చింతలూరులో డెలివరీ కేసు హ్యాండిల్ చేసిన డాక్టర్ని నేనే. మీరు ఆ రోజు మోటార్‌బోటు ఇచ్చుంటే.. పేషంట్‌తో బాటు, బేబీని కూడా కాపాడగలిగి ఉండేవాళ్ళం. ఫీటస్ అడ్డం తిరగటంతో, ఆలస్యం అవటం వల్ల బేబీ ఆమ్నియాటిక్ ఫ్లూయిడ్ అధికంగా తాగటం వల్ల లోపలే మరణించింది.

"ఐయాం సారీ! ఆరోజు మినిస్టర్స్ ప్రోగ్రాం అనుకోకుండా రావడం వలన..."

"కానీ... సార్! మోటార్‌బోట్‌లో ఇరవై నిమిషాలు పట్టే ప్రయాణం, వరద ఉధృతి వల్ల సాధారణ బోట్‌లో రెండు గంటలు పట్టింది".

మాధురి మాటలకు అక్కడున్న వాళ్ళంతా మొహాలు చూసుకున్నారు.

"సార్! అప్పుడొకమాటన్నారు. సారీ! ఫర్ రిపీటింగ్... డాక్టర్‌గా మీకు తెల్సింది ఒకటే ప్రొఫెషన్. నా స్థానంలో మీరుంటే కలెక్టర్ ఉద్యోగంలో కష్టాలు తెలుస్తాయన్నారు" మనం ఏ ప్లేసులో ఉన్నా, ఏ పొజిషన్‌లో ఉన్నా, ఆ స్పాట్‌లో తగిన సమయంలో, సముచిత నిర్ణయాలు తీసుకోవటంలోనే మనం ఉన్న పదవికి వన్నెతెస్తుంది. కానీ ఆపదలో, ప్రాణాపాయస్థితిలో ఉన్న పేషంట్‌ని కాదని, మినిస్టర్స్ ఏమంటారోనని... మానవత్వానికి భిన్నంగా ప్రవర్తించారు. బేబీ చనిపోయింది. అదే ఆ తల్లి చనిపోయుంటే, నలుగురు చిన్నచిన్న ఆడపిల్లలు అనాథలయ్యేవాళ్ళు. మీ స్థానంలో నేనుంటే ఖచ్చితంగా వైజ్ డెసిషన్ తీసుకునేదాన్ని" ఒకింత ఆవేశంగా అంది మాధురి.

చుట్టూ ఉన్న డాక్టర్లు, సిబ్బంది అవాక్కయి వింటున్నారు.

"సార్! ఒక డాక్టర్ తల్చుకుంటే కలెక్టరవటం కష్టం గాదు. కానీ కలెక్టరే డాక్టరవటం కష్టం... కానిపని. ఇన్నాళ్ళు నేను చదువుకున్నది, డాక్టరుగా ప్రమాణంచేసి డిగ్రీ తీసుకున్నది, రోగుల ప్రాణాలు కాపాడటం కోసమే. కానీ మా డెడికేషన్, మీ అధికారం ముందు... పక్కకి తప్పుకోవాల్సిందేనని మొన్న అనుభవపూర్వకంగా తెలుసుకున్నాను. ఏ నిర్ణయమైనా స్పాట్‌లో తీసుకునే అధికారం, డిగ్నిటీ ఉన్న కలెక్టరుగా మీరు, ప్రాణాల్తో పోరాడుతున్న పేషంటుని కాదని, పదవుల్లో ఉన్నవాళ్ళ ప్రాపకం కోసం పరిగెత్తటం చూశాక... నేను కలెక్టర్నెందుకు కాకూడదు అన్పిస్తోంది.

ప్రజలకి ఆరోగ్యం అందించే డాక్టరుకి పదవి, అధికారం ఉంటే ప్రజాసేవ ఎంతటి ఉన్నత ప్రమాణాలకి తీసుకెళ్ళవచ్చో, సామాన్యులకి దగ్గరగా ప్రభుత్వాన్ని ఎలా తీసుకెళ్ళవచ్చో... నిరూపిస్తాను. నన్ను బ్లెస్ చెయ్యండి సార్" అంది ఆవేశంగా.

చుట్టూ ఉన్నవాళ్ళంతా మాధురి మాటలు ఆశ్చర్యంగా, నోరు తెరుచుకుని వింటుంటే... కలెక్టర్ కూడా మాధురి మాటలు విని, నవ్వుతూ,

"ఓ.కే. డాక్టర్... అయిపోయిందా? మీరు కలెక్టరైతే ఐయాం ద ఫస్ట్ పర్సన్ టు ఫీల్ హ్యాపీ. అడ్వాన్స్‌డ్ కంగ్రాచ్యులేషన్స్. బట్ వన్‌థింగ్... టెల్లింగ్ ఈజ్ ఈజీ. డూయింగ్ ఈజ్ డిఫికల్ట్! విష్యూ ఆల్ ద బెస్ట్!" అని మాధురికి షేక్‌హ్యాండిచ్చి వెళ్ళిపోయాడు కలెక్టర్.

అప్పటివరకూ అవాక్కై విన్న డాక్టర్లంతా, మాధురిని చుట్టుముట్టి రకరకాల కామెంట్స్ విన్పిస్తుంటే... "ప్లీజ్! త్వరగా వెళ్ళిపోదాం. పదండి" అంది.

•••

"మధూ! మాట్లాడు మధూ! వారం రోజులు వరదల్లో గడిపి వచ్చావు. వచ్చి 24 గంటలైనా, ఎందుకే ఇలా తప్పించుకు తిరుగుతున్నావు. మాట్లాడవే ప్లీజ్!" అని అటూ, ఇటూచూసి మాధురి చెయ్యిపట్టుకుని లాగి, గట్టిగా హత్తుకున్నాడు కౌషిక్.

"ఏయ్.... ఏంటిది? సిగ్గులేకుండా.. వదులు" అని మాధురి దూరంగా జరుగుతుంటే, ఆమెను వదిలేశాడు.

"ఇంకెప్పుడైనా మాట్లాడటం మానేస్తే... ఇంట్లో అందరిముందు కూడా ఇదే పని చేస్తా!" అని వెళ్ళిపోయాడు.

"ఛీ!... నిన్నూ..." అంటూ గోడకి ఆనుకుని సిగ్గుపడుతూ, కళ్ళు మూసుకుని తనలో తనే మాట్లాడుకుంటున్న మాధురిని చాటు నుంచి చూసిన తాతలిద్దరూ నవ్వుకుంటూ,

"ఇహ వీళ్ళిద్దర్నీ కల్యాణమండపం ఎక్కించాల్సిందే! కలవరింతలు, పలవరింతల వరకూ వచ్చారంటే... ఇహ ఆలస్యం అమృతం విషం అవుతుంది" అన్నాడు గోపాలకృష్ణయ్య.

వెనకగా వచ్చి ఎవరో గట్టిగా కళ్ళు మూయటంతో ఉలిక్కి పడింది మాధురి.

"ఎవరు?" అంటూ కళ్ళు మూసిన చేతుల్ని తడుముతూ "వదులు" అంటూ కౌషిక్ చేతుల్ని విడిపించుకుని గభాల్న లోపలికి వెళ్ళబోతుంటే..

"మ్యాడ్రీ! ఆగు.. ఆగు" అని ఆమె చెయ్యిపట్టుకుని బలంగా గుంజాడు. అంతే! ఈసారి మాధురి కలగన్నట్టు నిజంగానే ఆమె పడబోతుంటే, పట్టుకోబోయిన కౌషిక్‌ని గట్టిగా హత్తుకుని, అతని ఎద మీద తలాన్చి, "ఈస్థానం నాది! దీన్ని వేరెవరూ కన్నెత్తి చూడటానిగ్గానీ, కనీసం దీన్ని గురించి కలగనటానిక్కూడా వీల్లేదు.. వీల్లేదు.. వీ...ల్లే..దు" అంది వణుకుతున్న గొంతుతో.

ఆ అసంకల్పిత చర్యకి అవాక్కైన కౌషిక్ భయంగా, చుట్టూచూశాడు. ఎవరూ కన్పించలేదు.

ధైర్యంగా ఆమె చుబుకాన్ని పైకెత్తాడు. ఎర్రబడి, వర్షిస్తున్న ఆమె కళ్ళని చూసి గాభరాగా...

"మధూ! ఏమిటి? ఏమైంది? నీకేమైనా పిచ్చా! నీకు తప్ప నా హృదయంలో ఇంకెవరికో స్థానం ఇస్తానని ఎలా అనుకుంటున్నావు! ఈ స్థానం ఎప్పటికీ నీదే! ఇన్నాళ్ళూ ఎలా చెప్పాలో తెలీక, నువ్వే చెప్తావని ఎదురుచూస్తున్నాను. థాంక్‌గాడ్.. నో బడీ కెన్ టచ్‌ఇట్" అంటూ ఆప్యాయంగా ఆమె నుదుటి మీద సున్నితంగా ముద్దుపెట్టాడు, వేలితో కన్నీళ్ళు తుడుస్తూ.



## రేలంగికి భంగపాటు

'హాస్యబ్రహ్మ' రేలంగి వెంకట్రామయ్యకు తెరమీదనే గాక ఎక్కడైనా ఎప్పుడైనా తన చుట్టూ ఉన్న వారిని నవ్వించటం సరదా. ఒకసారి కాకినాడ రైల్వేస్టేషన్‌లో రేలంగి, సుప్రసిద్ధనటులు పీసపాటి నరసింహమూర్తిగారిని కలుసుకున్నారు.



పీసపాటిని ఆటపట్టించాలని అనిపించింది రేలంగికి. "మొన్న సూర్య కళామందిరంలో మీ 'కురుక్షేత్రం' నాటకం చూశాను. కృష్ణుడిగా మీరు చేస్తున్నంత సేపూ - ఓహ్! నవ్వలేక చచ్చాననుకోండి గురూ గారూ" అన్నాడు.

పీసపాటి రేలంగికి తగిన విధంగా గంభీరంగా "కృష్ణపాత్రను మీ అంత గొప్పగా అర్థం చేసుకున్న మనిషి ఆంధ్రదేశంలో మరెవ్వరూ నాకు తారస పడలేదు. చాలా సంతోషం. ఈ మధ్య మీరు 'సుబ్బిశెట్టి'గా నటించిన 'చింతామణి' నాటకం చూశాను. మీ హావ భావ ప్రదర్శన చూసి, నాకు నిజంగా కన్నీళ్ళొచ్చాయి" అన్నాడు.

రేలంగి బిక్కచచ్చిపోయేడు

*-సేకరణ: రామమోహనరాయ్*

"ఐ లవ్యూ! మధూ!" అనేసరికి, అతన్ని గట్టిగా హత్తుకుని, వదిలి... దూరంగా జరిగింది.

"త్వరగా... తయారై రా! బయటికెళ్దాం" అంది నవ్వు, ఏడుపు మిళితమైన గొంతుతో...

అప్పుడామె మొహంలో ఎన్నడూ చూడని ప్రశాంతతను చూసిన కౌశిక్, అది కలో! నిజమో! అర్థం గాక... "అలాగే" అంటూ సందిగ్ధంలోనే లోపలికి వెళ్ళాడు.

●●●

కాలింగ్ బెల్ శబ్దం విని తలుపుతీసిన వైదేహి, ఎదురుగా కన్పించిన మాధురిని చూసి ఆశ్చర్యంగా...

"ఎన్నాళ్ళకి మేం గుర్తొచ్చాం డాక్టరమ్మా! బాగున్నావా! ఏం చేస్తున్నావు? ఎక్కడున్నావు?" అంటూ ప్రశ్నల వర్షం కురిపిస్తుంటే..

"ఆంటీ! లోపలికి రానిస్తారా?" అంది మాధురి.

"అయ్యో! నామతిమండా! రా! రా!" అంటూ లోపలికి నడిచింది వైదేహి. కూర్చున్నాక... వైదేహి అడుగుతున్న ప్రశ్నలకు, ఓపిగ్గా జవాబులు చెప్తోంది మాధురి.

"ఎంతసేపిలా ప్రశ్నలేస్తావమ్మా! ఇంటికొచ్చిన వాళ్ళకి కాఫీ ఇస్తావా?" అంటూ అక్కడికొచ్చిన శ్రీకాంత్ గొంతు విని వెనక్కి తిరిగింది మాధురి.

"హల్లో! మధూ! ఎలా ఉన్నావు?" అంటూ మాధురికి ఎదురుగా ఉన్న కుర్చీలో కూచున్నాడు.

"నువ్వెలా ఉన్నావు శ్రీ" అంది నవ్వుతూ.

"ఇదుగో... ఇలా" అన్నాడు పెరిగిన గడ్డం చూపిస్తూ.

"ఇదేం కొత్తకాదుగా! ఇది లేకపోతేనే నిన్ను గుర్తుపట్టలేం" అంది.

"ఏంటి? అర్జంటుగా మాట్లాడాలన్నావు? ఇక్కడ మాట్లాడదామా? బయటికెళ్దామా?" అన్నాడు శ్రీకాంత్.

"పైనున్న నీ గది కెళ్దాం"

అంతలో వైదేహి కాఫీ ఇచ్చింది ఇద్దరికీ.

"కాఫీ తాగుతూ.. "ఎలా ఉంది నీ సాఫ్ట్‌వేర్ జాబ్?"

"ఠీక్‌హై.... బట్ పర్సనల్‌గా సంతృప్తిగా లేదు".

"ఎలా ఉంటుంది? ఐ.ఎ.ఎస్. లక్ష్యం కళ్ళముందు కన్పిస్తుంటే... ఎన్నిసార్లు దండయాత్రలు కొనసాగిస్తావు?" అంది మాధురి నవ్వుతూ.

వైదేహి కల్పించుకుని... "ఏం ఐ.ఎ.ఎస్సో గానీ నిద్రాహారాల్లేకుండా ప్రతిసారీ కష్టపడటం... పరీక్ష రాయటం... ఏదో ఒక పేపరు పోవటం, ఇదే తంతు. నెమ్మదిగా కూచోలేడు, తినలేడు, నిద్రపోడు. పోనీ ఉద్యోగం మానేసి ప్రిపేరవ్వడానికి మా ఇద్దరికీ మరే ఆధారమూ లేకపాయె" అంది.

"అమ్మా! ఆపు. మన గురించీ, మన కుటుంబం గురించీ మాధురికి చిన్నప్పట్నుంచి తెలుసుగానీ.. ఏదైనా టిఫిన్ చెయ్యమ్మా!" అని తల్లికి పురమాయించి, మాధురిని తన గదికి తీసుకొచ్చాడు.

గదిలో ర్యాక్స్ నిండా బుక్సు, మూలగా చాప మీద పరుపు, చిన్నటేబిలూ, కుర్చీ... దానిమీద పుస్తకాలు, న్యూస్ పేపర్లు, మ్యాగజైన్లు.. ఓ పక్కగా కంప్యూటరు, గదంతా పుస్తకాలు, పేపర్లతో చిందరవందరగా ఉంది.

పక్కగా ఉన్న కేన్ చెయిర్స్‌లో కూచున్నారిద్దరూ.

"గది చూసి భయపడకు. నెలకో, రెణ్ణెల్లకో, టైమున్నప్పుడు సర్దుతా!" అన్నాడు శ్రీకాంత్.

"ఇలా గదంతా పుస్తకాలు పరిస్తేనే గదా.. చూసేవాళ్ళకి నువ్వు జీనియస్ అని తెలిసేది".

"ఎవరో గుర్తించాలన్న పాకులాట లేదు నాకు. నా కోసం నేను నేనుగా బ్రతకాలనుకునేవాణ్ణి. అది నీకూ తెలుసు. ఇంతకీ పనేంటో చెప్పు".

"ఈసారి, నేనూ నీతోబాటు ప్రిలిమ్స్‌కి ప్రిపేర్ అవుదామనుకుంటున్నా"అంతే.. ఆ మాటకి షాక్కొట్టినట్టు ఆమెవైపు చూశాడు.

"ఏంటలా చూస్తున్నావు? నిజమే చెబుతున్నాను".

"అది కాదు.. నువ్వు"

"ఏం డాక్టరు కలెక్టరవ్వకూడదా?"

"నిన్నలా అండరెస్టిమేట్ చెయ్యగలనా?"

"శ్రీ.... అసలేం జరిగిందంటే..." అని భద్రాచలంలో కలెక్టర్‌కీ, తనకీ మధ్య జరిగిందంతా చెప్పింది.

అంతావిని... "డోన్ట్‌వర్రీ! ఈసారి ప్రిలిమ్స్‌కి ఇద్దరం రాద్దాం. ఇ.సి.ఐ.ఎల్ క్రాస్‌రోడ్స్‌లో సివిల్ సర్వీస్ సెంటర్‌కి తీసుకెళ్తాను. అవసరమైతే కోచింగ్‌కి కూడా కలిసే వెళ్దాం".

"థాంక్యూ! ఖచ్చితంగా కోచింగ్‌కి వెళ్దాం. అయితే ఈ విషయం మనిద్దరి మధ్యే ఉండాలి. ముఖ్యంగా మా ఇంట్లో తెలియనివ్వకూడదు".

"నా సంగతి తెల్సుగా మధూ! నువ్వెవరని అడిగినా నాకు తెలీదంటా, సరేనా!"

శ్రీకాంత్ సివిల్ సర్వీసెస్ గురించి, ఎగ్జామ్స్‌లో ఎన్ని స్టేజెస్ ఉంటాయి, ఏ స్టేజ్‌లో ఎన్ని పేపర్లుంటాయి, మెయిన్స్ పేపర్ ఆప్షన్స్ గురించి వివరంగా చెప్తుంటే, మాధురి ఆసక్తిగా వింటోంది.

వైదేహి వేడివేడి ఉప్మా తెచ్చి ఇద్దరికీ ఇచ్చింది.

మాధురి, శ్రీకాంత్ ఇంటర్మీడియట్ క్లాస్‌మేట్స్. అప్పట్నుంచే శ్రీకాంత్ కలెక్టరవ్వాలని కలలుగనేవాడు. ఇంటర్ రెండో సంవత్సరం చదువుతున్నప్పుడు వాళ్ళ నాన్నగారు యాక్సిడెంట్లో మరణించడంతో, ఎం.సి.ఎ. చదివి, వెంటనే ఉద్యోగం వెతుక్కోవాల్సిన పరిస్థితి. ఎం.సి.ఎ. చదివేటప్పుడే అదనపు కంప్యూటర్ కోర్సులు చదవటం వలన కష్టపడకుండానే ఉద్యోగం వచ్చింది. కానీ, అతనిలో నిద్రాణమై ఉన్న ఐ.ఎ.ఎస్ కోరిక మాత్రం అతనిని మనశ్శాంతిగా నిద్ర పోనివ్వటం లేదు. ఉద్యోగంలో చేరాక రెండుసార్లు ప్రిలిమ్స్ రాశాడు. సక్సెస్ కాలేదు. అయినా వదిలి పెట్టకుండా మళ్ళీ ప్రిపేర్ అవుతున్నాడు.

ఫ్రెండ్స్ సర్కిల్లో అతనిని 'కలెక్టర్ శ్రీకాంత్' అని పిలుస్తారు. మాధురి మాత్రం శ్రీకాంత్ ఐఏఎస్ అంటుంది.

ఇంటర్మీడియట్‌తోనే ఆగిపోకుండా ఇద్దరి మధ్య ఇప్పటికీ ఫ్రెండ్‌షిప్ కొనసాగుతూనే ఉంది.

"ఏంటీ దీర్ఘాలోచన?" అన్నాడు శ్రీకాంత్.

"ఏంలేదు. మన పరిచయం, ఫ్రెండ్‌షిప్ గురించి... మెమొరీలోకెళ్ళా"

"నాకంత తీరిక, ఓపిక లేవు.. ఆఫీసుకెళ్ళాలి".

"ఓకే. నేనూ బయల్దేరతా.. ఎక్కడ, ఎప్పుడు కలుద్దాం" అని లేచింది.

"నేన్నీకు ఫోన్ చేస్తా... సారీ!" అన్నాడు.

"ఇట్స్ ఓకే... శ్రీకాంత్ ఐఏఎస్" అంటూ కిందికి దిగింది మాధురి.

●●●

"అనుకున్నవి అనుకున్నట్టుగా జరిగితే మనిషి దేవుడైపోయి, దేవుణ్ణే మనిషిగా మార్చి ఆడిస్తాడు మానవుడు".

గోపాలకృష్ణయ్య పుస్తకంలోని శ్లోకం చదివి, సుందర్రామయ్యకి తాత్పర్యం చెప్తున్నాడు.

వెనక నుండి వచ్చిన మాధురి, కౌశిక్ ఒకేసారి..

**మాధురి ఐఎఎస్ చదవాలని సంకల్పించుకుంది. ఇంట్లోవాళ్ళకు చెప్పకుండానే ప్రిపేర్ కావడం ప్రారంభించింది.**
**దీంతో ఆ స్నేహితుల ఇద్దరి ఇళ్ళల్లో సందడి తగ్గిపోయింది. మౌనం రాజ్యం చేయడం వారి తాతలకు నచ్చలేదు. ఇంట్లో శుభకార్యం చెయ్యాలనీ, కౌషిక్, మాధురిలకు వివాహం జరిపించాలనీ నిశ్చయించారు. మరి ఈ వివాహం మాధురికి ఇష్టమేనా?**

"...ఆc హా... అలాగా!?" అన్నారు ఒకేసారి.

కంగారుగా వెనక్కితిరిగిన సుందర్రామయ్య కౌషిక్‌ని చూసి,

"భడవా! ముందుకొచ్చి మాట్లాడరా!" అన్నాడు.

"ఇంకా మేం మాట్లాడేందుకేముంది... తాతలు నీతులు మాట్లాడుకుంటుంటే...".

"అంటే రోజూ బూతులు మాట్లాడుతున్నారే

టండీ" అన్నాడు అక్కడే ఉన్న గోవిందు.

గోపాలకృష్ణయ్య లేచి.... "ఒరేయ్! అంపజోళ్ళ వెధవా! నువ్వూ అనేవాడివేనట్రా?" అని లేవబో తుంటే...

"అయ్ బాబోయ్.. ఊర్కెనే అన్నానెండి... మీరు కూకోండి పెద్దయ్యా?" అని లోపలికి పరిగెత్తాడు.

"ఏంటి? పేకాట, చెస్సు వదిలి ఇలా రామాయణ, భాగవతాలు ముందేసుక్కూచున్నారు?" అంది మాధురి.

"అంటే మీ దృష్టిలో మేం..." అని సుందర్రామయ్య ఏదో అనబోతుంటే... భాస్కర్రావు, రాజశేఖరం వేగంగా లోపలికొచ్చి, సోఫాలో కూచున్నారు.

వాళ్ళిద్దరి మొహాల్లో అసహనం కొట్టొచ్చినట్టు కనిపిస్తోంది. భాస్కర్రావు చేతిలో ఉన్న పేపర్స్ టీపాయ్ మీద పడేసి, సెల్‌ఫోన్‌లో నంబర్ నొక్కాడు.

"హలో! రామచంద్రరావుగారూ! అర్జంటుగా ఓసారి ఇంటికి రండి!" అని ఫోన్ పెట్టేశాడు.

అసహనంగా... "వాడికి ఎంత ధైర్యముంటే.. మనకి నోటీసులు పంపిస్తాడు" అన్నాడు.

"నువ్వు అనవసరంగా ఆవేశపడకురా! లాయ ర్‌కి ఫోన్ చేశావుగదా! అన్నివిషయాలు మాట్లా డదాం. ఏంచెయ్యాలో ఆయనే చూసుకుంటాడు" అన్నాడు రాజశేఖరం.

"ఏంటి డాడీ! ఎవరు నోటీసు పంపారు? దేన్ని గురించి?" అడిగాడు కౌషిక్.

"మనం కట్టించబోతున్న హాస్పిటల్ స్థలం తనదని... మల్లేష్ యాదవ్ లీగల్ నోటీసులు పంపాడు".

"మల్లేష్‌యాదవ్ అంటే... ఎం.పి. నిరంజన్ యాదవ్ తమ్ముడు కదా!"

ఇంతకుముందు కూడా ఈ స్థలం దగ్గర గొడవ పడింది అతనే కదూ!"

"ఆс వాడే.."

"మళ్ళీ ఏంటట? అప్పుడు సెటిలైందిగా!"

"ఏముంది!? అధికారపక్షం వాళ్ళది. ఏం చేసినా అడిగే వాళ్ళుండరన్న అహంకారం"

"వాడికెలా బుద్ధిచెప్పాలో లాయర్ చూసు కుంటాడు గదరా! నువ్వు అనవసరంగా బి.పి. పెంచుకోకు" అన్నాడు మళ్ళీ రాజశేఖరం.

"అది కాదురా! నేను ఎక్కడ, ఏ ల్యాండు కొన్నా లీగల్ డాక్యుమెంట్స్, లింక్ డాక్యుమెంట్స్ అన్నీ కరెక్ట్‌గా ఉంటేనే తీసుకుంటా. అలాంటిదివాడు మనమీదే గొడవ పడుతున్నాడంటే, వాళ్ళ అన్న అండచూసుకునే గదా!"

"మీరు స్థలం కొన్న ఆ నాయుణ్ణే ఈ సమస్యని సాల్వ్ చెయ్యమనండి డాడీ" అన్నాడు కౌషిక్.

"నాయుణ్ణి, ఈ మల్లేష్ యాదవ్ మనుషులు పైకి పంపి రెండేళ్ళవుతోంది" మాధురికి ఆ మేట రేంటో అర్థం కానట్టు చూస్తోంది.

శారద టీ తెచ్చిచ్చి "మళ్ళీ ఏంటి సమస్య" అడిగింది. భాస్కర్రావు ఆవేశంగా చెప్పబోతుంటే..

"నువ్వు నెమ్మదిగా టీ తాగరా! చెల్లెమ్మకి నేను చెబుతాను" అన్నాడు రాజశేఖరం.

సరిగ్గా అప్పుడే లాయర్ రామచంద్రరావు రావ టంతో, ఆయన్ని తీసుకుని మేడమీద గదికెళ్ళారిద్దరూ.

●●●

మాధురి, కౌషిక్‌ల కోసం భాస్కర్రావు, రాజ శేఖరం కలిసి కట్టాలనుకున్న హాస్పిటల్, సాఫ్ట్‌వేర్ కంపెనీల బిల్డింగ్ ఆదిలోనే హంసపాదన్నట్టు ఆగి పోయింది.

మల్లేష్ యాదవ్ మీద కోర్టులో కేసు ఫైల్ చేశారు.

భాస్కర్రావు, రాజశేఖరం కోర్టు వ్యవహారాల్లో తల మునకలవుతున్నారు. గోపాలకృష్ణయ్య, సుందర్రా మయ్యలని పలకరించేవాళ్ళు లేక రొటీన్ జీవి తంలో బోర్ ఫీలవుతున్నారు. పేకాట, చెస్సూ ఆడీ ఆడీ విసుగుపుట్టి, కంప్యూటర్ గేమ్స్ ప్రాక్టీస్ చేస్తున్నారు.

కౌషిక్ ఆన్‌లైన్‌లో ఎమ్మెన్సీ కంపెనీల ఇంట ర్వ్యూలకి అటెండవుతున్నాడు. మాధురి పీజీ. ఎగ్జామ్స్‌కి ప్రిపేరవుతున్నట్టు ఇంట్లోవాళ్ళకి చెప్పి, శ్రీకాంత్‌తో బాటు సివిల్స్‌కి ప్రిపేరవుతూ, కోచిం గ్‌కి వెళుతూ, క్షణం తీరిక లేకుండా పుస్తకాలతో కుస్తీ పడుతోంది.

శారద, లలిత లావైపోతున్నామని మార్నింగ్ వాక్, యోగాలతోబాటు డైటింగ్‌లో భాగంగా మొల కలు, ముడిబియ్యపు అన్నం, ఉప్పులేని చప్పిడి కూరలు, వెజిటబుల్ జ్యూస్‌లు, ఫ్రూట్‌జ్యూస్‌లు తాగుతూ... డ్రమ్ముల్లా పెరిగిన దేహాల్ని, స్లిమ్ముగా తయారుచేసుకోవడానికి తంటాలు పడుతున్నారు. ఎప్పుడూ గలగలా మాట్లాడుతూ, జోక్స్‌తో అందరినీ నవ్వించే కౌషిక్, మాధురి సైలెంటై పోవటంతో, రెండిళ్ళలోనూ నిశ్శబ్దం రాజ్యమేలుతోంది. ఆర్నెల్ల పాటు నిశ్శబ్దాన్ని భరించిన తాతలకి... ఓపిక నశించి, నెల రోజులు తీర్థయాత్రలకి బయల్దేరారు.

అప్పుడు ఇంట్లోవాళ్ళకి నిశ్శబ్దం తాలూకు భయపు ఛాయలు వెంటాడుతున్నట్టనిపించసాగింది. అర్ధ రాత్రిళ్ళు నిశ్శబ్దం పుట్టించే భయం కన్నా, పట్టపగలు నిశ్శబ్దపు నీడల్లో జాడలు చూపించే ఒంటరితనం అంటే విసుగు, విరక్తి పుడుతున్నా... ఎవరూ ఎవరితోనూ మాట్లాడుకోలేనంత బిజీ పనుల్లో తిరుగుతున్నారు.

ఎవరిపనులు వాళ్ళవి. అవసరాలు సజావుగా, యథావిధిగా గడచిపోతున్నంత కాలం... పక్కమని షిని పలకరించడం కూడ వేస్ట్ అన్నట్టు, అందరి మధ్య మాటలు మౌనం దాల్చాయి. తడిపొడి మాటలు తప్ప, మనసు విప్పి మాట్లాడుకోవడానికి సమయం అనుమతించట్లేదెవ్వరికీ. నెలరోజులిట్టే గడిచిపోయాయి. తాతలిద్దరూ తీర్థయాత్రల నుండి




ఇవ్వాళ మా ఇంటికి
ఓ మహాకవి కొత్త పుస్తకమై వచ్చాడు
తరలి వచ్చిన వసంతంలా!

టీపాయిఎక్కి
'ఏమ్మా! కులాసా! పలకరిస్తున్నాడు
బతుకమ్మలా!

## గాయం మంచిదే!

ప్రశ్న సూటిగానే ఉంది
జవాబే సులువుగా లేదు
అస్పష్ట కవితా శకలంలా!

అతను తలనిమురుతున్నా
ఏదో లోలోన కాసింత బెరుకు
నిజాయితీ లేని వాక్యంలా!

అతని చూపు
గొంతు పొలమారితే నీళ్ళిచ్చే చేతిలా
లోన నేనే పెదవి దాటని మాటలా!

అతని తడి హృదయానికి
తట్టుకోలేక
ఏ పక్కకీ ఒత్తిగిలలేని మనిషిలా!

అతనిప్పుడు ఒట్టి పుస్తకం కాదు
ఎండాకాలం ప్రవహించే పంట కాలువ
ఈదుతున్నా ఎగిరి గంతేస్తున్న చేపపిల్లలా!

భోంచేస్తారా?
తపోభంగం చేస్తూ వనజాత పిలుపు
కొట్టేసిన వాక్యంలా!

చేస్తున్నదదేగా



నేను పరధ్యానంగా
అసందర్భ సంభాషణలా!

ఒక్క పెదవి విరుపుతో
ముదిరిన పిచ్చి అంటగట్టి
వెళ్ళింది అలిగిన వాక్యంలా!

ఆమె రాత్రిని కప్పుకుంది
నేను ఉదయాన్ని హత్తుకున్న
నేనిక ఏ పక్కకి ఒత్తిగిలినా భయంలేదు
గాయం మంచిదే!
(శ్రీ. కె.శివారెడ్డి "పక్కకి ఒత్తిగిలి"... చదివి)

*-కోట్ల వెంకటేశ్వరరెడ్డి*
*సెల్: 94402 33261*

తిరిగొచ్చారు. అయినా రెండిళ్ళలోనూ అదే నిశ్శబ్దం. పట్టి పీడిస్తున్న ఈ నిశ్శబ్దాన్ని ఛేదించే అస్త్రాన్ని సంధించేందుకు సన్నద్ధమై, రెండు కుటుంబాల సభ్యులందర్నీ సమావేశపరిచారు తాతలు. ఆ గెట్ టు గెదర్ మీటింగ్‌కి కౌశిక్, మాధురిలు గైర్‌హాజరయ్యారు.

గోపాలకృష్ణయ్య మాట్లాడుతూ...

"ఒరేయ్! భాస్కరం... అసలీ రెండిళ్ళకీ ఏమైందిరా! ఎప్పుడూ గలగలమంటూ, కళకళలాడుతుండే ఈ ఇళ్ళల్లో నిశ్శబ్దం భయం పుట్టిస్తోందిరా! ఆర్నెల్లు భరించాం. ఇంట్లో వాళ్ళందరి ఉత్సాహాన్ని, ఉల్లాసాన్ని ఎవరో ఉఫ్‌మని ఊదేసినట్టు... మాట్లాడిస్తేనే పాపంలా, ఎవరికి వాళ్ళు తప్పించుకు తిరుగుతున్నారు. ఇంక మా వల్ల కాదు. దీనికేమైనా పరిష్కారం ఉందో లేదో చెప్పండి" అన్నాడు.

"ప్రత్యేక కారణాలు, అపార్థాలు ఏముంటాయి నాన్నా! ఎవరి పనుల్లో వాళ్ళు బిజీ అయిపోయారంతే!"

"అందుకేరా! ఉండలేక పోతున్నాం."

"పోనీ... ఏం చెయ్యమంటారో చెప్పండి"

"చెప్పాక మాట తప్పకూడదు మరి" అన్నాడు సుందర్రామయ్య.




"చెప్తేగదా... తెలిసేది.." రాజశేఖరం విసుగ్గా తండ్రివైపు చూశాడు.

"కౌషిక్‌కి, మాధురికి పెళ్ళి జరిపిస్తే... ఈ స్తబ్ధత సద్దు మణుగుతుందనుకుంటున్నాం.." అన్నారు తాతలిద్దరూ.

అందరి మనసుల్లోనూ ఉన్న విషయమే అయినా... తాతల నోటివెంట అదే విషయం వినేసరికి అందరి మొహాల్లోనూ సంభ్రమం తొంగిచూసింది.

"వాళ్ళిద్దరూ.... సెటిలవ్వాలిగా!" అన్నాడు రాజశేఖరం.

"చదువులయ్యాయిగా! వాళ్ళు సంపాదించే తినాలని లేదుగా! వాళ్ళే సెటిలవుతారు. ముందు పెళ్ళి చేసేద్దాం" గట్టిగా అన్నాడు గోపాలకృష్ణయ్య.

"అవును. ఈ ఆస్తులన్నీ వాళ్ళవి కావా? ఇద్దరూ చిలకా గోరింకల్లా తిరుగుతుంటారు" అన్నాడు సుందర్రామయ్య.

ఇంట్లో వాళ్ళంతా తాతల మాటకే ఓటెయ్యటంతో రాజశేఖరం మాట్లాడలేకపోయాడు.

"నాయకా... నాయికలెక్కడ్రా" సంతోషంగా అన్నాడు గోపాలకృష్ణయ్య.

"ఉదయం నుంచీ కన్పించటం లేదు" అంది లలిత.

"కౌషిక్ ఆఫీసుకెళ్ళాడు" అంది శారద.

రాజశేఖరం బయట పనుందని వెళ్ళిపోయాడు.

"హిట్లర్ ఒప్పుకున్నాడు. వాడి మూడ్ మారకముందే ఆ మూడుముళ్ళు త్వరగా వేయించెయ్యాలి" అన్నాడు అందరినీ ఉద్దేశించి సుందర్రామయ్య.

"నాకు తెల్సు, రాజశేఖరం ఒక్కసారి ఒప్పుకుంటే మాట మార్చడు నాన్నా!" అన్నాడు భాస్కర్రావు.

"అసలు కౌషిక్, మాధురి ఏమంటారో..." అంది లలిత.

"మన మాట కాదంటారా?" అన్నాడు భాస్కర్రావు.

"వాళ్ళిద్దరితో మాట్లాడిన తరువాతే నిర్ణయిద్దాం" అన్నాడు గోపాలకృష్ణయ్య.

"శుభస్య శీఘ్రం" అన్నాడు సుందర్రామయ్య.

"ఒరేయ్ సుందరం.. ఈ పెళ్ళి విషయం... అసలు నాయకా నాయికలకు చెప్పకుండా ఉంటే ఎలా ఉంటుందంటావ్! వాళ్ళిద్దరూ మనల్నెంత ఏడిపిస్తున్నార్రా? వాళ్ళనీ సరదాగా ఓ ఆటపట్టిద్దాం" అన్నాడు గోపాలకృష్ణయ్య.

"నేనూ ఇదే అనుకున్నారా! నువ్వూ అదే చెప్పావు. అయినా మనం అనుకుంటే సరిపోతుందా! ఇంట్లో అందరూ సహకరించాలిగా!"

"సహకరించేట్టు చేద్దాం."

అంతలో కౌషిక్ వచ్చి... "ఇక్కడున్నారా! తాతలూ... మీ కోసం ఎక్కడెక్కడో వెతుకుతున్నా!" అన్నాడు.

"రా! రా! మేమూ నీ కోసమే చూస్తున్నాం. ఓ ఆటాడదాం రారాదూ" అడిగాడు సుందర్రామయ్య.

"మాధురి కన్పించిందా?"

"ఊంహూ...." ఇద్దరూ తెలీదన్నట్టు పెదవి విరిచారు.

కౌషిక్ అసహనంగా వెళ్తుంటే... తాతలిద్దరూ నవ్వుతూ, "సెల్లుందిగా... ఫోన్ చెయ్యి" అన్నారు.

"ఆ మాత్రం నాకూ తెల్సు... 'ఎంగేజ్' అనొస్తోంది" అంటూ వెళ్ళాడు.

"సరైన సమయం కదా! అందుకే.. అలా వచ్చింది" అన్నాడు గోపాలకృష్ణయ్య.

●●●

ఆ సమయంలో మాధురి, శ్రీకాంత్‌తో ఫోన్లో మాట్లాడుతోంది. సివిల్ సర్వీసెస్ మెయిన్స్ ఇద్దరూ పాసవటం యాదృచ్ఛికం కాదు. ఇద్దరూ పడ్డ శ్రమకి ప్రతిఫలం.

"సాయంత్రం గ్రాండ్‌గా సెలబ్రేట్ చేసుకుందాం మిస్టర్ శ్రీకాంత్ ఐఏఎస్" అంది.

"నీతో కలిసి ప్రిపేరవటం వల్ల నీ మేధావితనం, నీ అదృష్టం నాకూ అంటుకుని, నేనూ పాసయ్యాను... థాంక్యూ" అన్నాడు.

"అది చెప్పాల్సింది నువ్వు కాదు శ్రీ, నేను. నన్ను ఎంకరేజ్ చేసి, మెటీరియల్ ఇచ్చి, నా డౌట్స్ క్లియర్ చేస్తూ, నాతోబాటు కోచింగ్‌కి వచ్చి కోపరేట్ చేసింది... నువ్వు".

"అంత పొగడొద్దు. నాకు కొమ్ములొస్తాయి. సాయంత్రం కలుద్దాం" అని ఫోన్ పెట్టేశాడు.

మాధురి కోచింగ్ సెంటర్ నుండి ఇంటికొస్తూ.. ఈ విషయం ఇంట్లో ఎవరికి ముందు చెప్పాలో అర్థంగాక... చివరికి కౌషిక్‌కే చెప్పాలని నిర్ధారించుకుంది.

ఇంటికొచ్చి ఎవరితోనూ మాట్లాడకుండా కౌషిక్ కోసం ఇల్లంతా వెతికింది. ఎక్కడా కన్పించలేదు.

కౌషిక్ వాళ్ళింటికొచ్చింది.

పూజ గదిలో ఉన్న శారదతో "ఆంటీ కౌషిక్ ఉన్నాడా?" అంది.

"బయటికెళ్తానన్నాడు.. ఎక్కడికని చెప్పలేదు" అంది.

లాన్‌లో బెంచీమీద తాతలిద్దరూ కార్డ్స్ ఆడుతూ, అటువైపు వస్తున్న మాధురితో... "చెస్ ఆడదాం వస్తావా?" అన్నాడు గోపాలకృష్ణయ్య.

"కౌషిక్ కన్పించాడా?"

"ఒరేయ్! గోపాలూ! నాయికా నాయకులు ఒకరి కోసం ఒకరు ఎలా వెతుక్కుంటున్నారో చూశావా?" అన్నాడు సుందర్రామయ్య.

కిసుక్కున బోసినోటితో నవ్వాడు గోపాలకృష్ణయ్య.

"ఏంటి, బదులు చెప్పకుండా మీలో మీరే నవ్వుకుంటున్నారు?" దగ్గరకొచ్చి అంది మాధురి.

"ఊంc... హూంc...." అంటూ తలలు అడ్డంగా తిప్పారు తాతలిద్దరూ.

"ఇవ్వాళేంటి ఇద్దరూ తేడాగా కన్పిస్తున్నారు" అంది మాధురి.

"కౌషిక్ కావాలా? అంత అర్జంటైతే ఫోన్ చెయ్యొచ్చుగా!" అన్నాడు సుందర్రామయ్య.

"ఎంగేజ్ అనొస్తోంది".

"అవును.. రావాల్సిన సమయంలోనే వచ్చింది".

"ఏంటీ."

"ఏం లేదు... వాడు.. వాడు.. కన్పించలేదు"

"తాతులూ... మీకేదో అయింది. సంబంధం లేకుండా స్టేట్మెంట్లిస్తున్నారు" అని అక్కణ్ణుంచి బయల్దేరింది.

"ఒరేయ్! సుందరం... అందుకేరా! కల్యాణం వచ్చినా... వచ్చినా ఆగదంటారు"

"వీళ్ళిద్దరూ ఆ స్థితికి వచ్చేశారంటావా?"

"చూస్తే తెలీటంలా... మన్మథలీలా.. మధురము కాదా?" అని గోపాలకృష్ణయ్య అన్నాడు.

"విప్పావుర్రా... నీ మన్మథ పురాణం! అన్నాడు సుందర్రామయ్య తల పట్టుకుని.

"ఒరేయ్! ఆ వయసులో..."

"ఆపెయ్...రా... బాబూ! ఆపెయ్. ఆ కాలం నుండీ ఈ కాలం దాకా నీ మన్మథ లీలాగోల వినీ వినీ నా తల..." అన్నాడు సుందర్రామయ్య, మిలమిలలాడుతున్న బట్టతల చూపిస్తూ.

**(ఇంకావుంది)**

## ఇంటర్వ్యూ

చిత్రకళలో అందెవేసిన చేయి కడలి సురేష్. నాలుగున్నర దశాబ్దాలుగా చిత్రకళకు అంకితమైన సినీ పబ్లిసిటీ డిజైన్ ఆర్టిస్టు. పెద్ద పెద్ద నిర్మాతలు సైతం ఆయన డిజైన్లకోసం ఎంతో సమయం ఓర్పుగా కాచుకుని ఉండేవారు. పనిరాక్షసుడుగా చిత్రకళకు అంకితమయ్యారుతప్ప నిర్మాతలను కాకాపట్టే ధోరణి కాదు. 300 చిత్రాలకు పబ్లిసిటీ డిజైన్ ఆర్టిస్టుగా చేసినప్పటికీ సొంత ఇల్లుకూడా సమకూర్చుకోలేకపోయారు!! సినీరంగం గురించి ఆయన చెబుతున్న మాటల్లో ఎంతో ఆర్తి, ఆర్ద్రత కనిపిస్తుంది. ఆవేదన ఉంటుంది. సినిమా రంగంలో నిజాయితీ లేదని అంటున్నారాయన.

శ్రమకుతగ్గ ఫలితం చెల్లించే దృక్పథం లేదు. సినీరంగంలో విలువలు వృద్ధిచెందాలి, నిజాయితీ రావాలి. అలాంటి నిజాయితీ ప్రదర్శించినవారికి శిరస్సువంచి పాదాభివందనం చేస్తాను అంటున్న కడలి సురేష్ ఇంటర్వ్యూ....



# కష్టానికి తగిన ఫలితం దక్కలేదు!

- సురేష్ కడలి

mskartmedias@gmail.com
cell: 81219 67040

పశ్చిమగోదావరిజిల్లా నర్సాపురం మా ఊరు. నా పూర్తిపేరు కడలి సూర్యనారాయణమూర్తి. అందరూ నన్ను సూర్య, సురేష్ అని పిలిచేవారు. చివరకు నా పేరు సురేష్‌గానే ఉండిపోయింది. మా నాన్నగారు కడలి ముసలయ్య. అమ్మ వెంకట నర్సమ్మ. మేం నలుగురం అన్నదమ్ములం. ఒక చెల్లెలు. 1964లో అమ్మమ్మగారింట నర్సాపురంలో పుట్టాను. నాన్నగారు చనిపోవడంతో మా ఆర్థిక పరిస్థితి దయనీయంగా ఉండేది. కానీ అమ్మ ఎంతో కష్టపడి మమ్మల్ని పెంచింది. తోటల్లో హోల్ సేల్‌గా సపోటాలు కొని అమ్మేది. నా చదువు రెండో తరగతి దగ్గరే ఆగిపోయింది.

### దేవుడు ఇచ్చినవరం చిత్రకళ

నారుపోసినవాడు నీరుపోయక మానడు అంటారు. నా విషయంలో అదే జరిగింది. నేను ఒకటవ తరగతిలో ఉండగానే చక్కగా బొమ్మలు వేసేవాణ్ణి. దేవుడు పుట్టుకతోనే నాకు చిత్రకళను ఒక వరంగా ఇచ్చాడు. క్లాసులో ఓసారి మా మాస్టారు బోర్డుమీద కుండబొమ్మ వేశారు. దాన్ని చూసి అందర్నీ వెయ్యమన్నారు. క్లాసులో అందరి కంటే నేను వేసిన బొమ్మ మాస్టారికి చాలా బాగా నచ్చేసింది. ఆ బొమ్మ అందరికీ చూపించి నన్ను పిలిపించి అందరిచేత చప్పట్లుకొట్టించి నన్ను ప్రశంసించారు. ఆ విధంగా నాలో ఒక చిత్రకళా కారుడు ఊపిరిపోసుకున్నాడు. నాలోని ఆ టాలెంట్‌ని అమ్మ గుర్తించింది. నా ఆసక్తి గమనించి నర్సాపురంలో చిత్రకళాకారుడు మూర్తిగారి దగ్గర చేర్పించింది.




### అమ్మ ముగ్గులే స్ఫూర్తి!

చిన్నప్పటినుంచీ అమ్మ వేసే ముగ్గులు ఎంతో ఆసక్తిగా చూసేవాణ్ణి. అవే నాకు స్ఫూర్తిని ఇచ్చి ఉండొచ్చు. మూర్తిగారు నాకు బొమ్మలు నేర్పుతూనే బాపు, గంగాధర్ లాంటి మద్రాసులో ఉన్న గొప్ప ఆర్టిస్టుల పేర్లు చెబుతూ వాళ్ళ బొమ్మలు చూపిస్తూ ఉండేవారు. దాంతో ఇంకా ఆసక్తి పెరిగింది.

మా చిన్నాన్న వీరదాసు. హరికథాకళా






కారుడు. భీమవరంలో ఉండేవారు. ప్రముఖ హాస్యనటుడు సారథి ఆయన కొడుకే! నేను బొమ్మలు బాగా వేస్తానని చిన్నాన్నకు మా అమ్మ చెప్పింది. నన్ను వెంటనే భీమవరం రప్పించి, నా బొమ్మలన్నీ చూశారు. మద్రాసులో ఉన్న మా అన్నయ్య సారథి దగ్గరకు నన్ను పంపించారు. ఆ విధంగా 1978-79లో మొదటిసారి సర్కార్ ఎక్స్‌ప్రెస్ ఎక్కి మద్రాసు చేరుకున్నాను. ప్రముఖ సినీ పబ్లిసిటీ డిజైనర్ ఈశ్వర్‌గారి అన్నయ్య కేతా మా సారథికి మంచి స్నేహితులు. నేను మద్రాసులో దిగిన రోజునే వెళ్ళి కేతాగారి దగ్గర ఆర్టిస్టుగా పనిలో చేరిపోయాను. అలా పెయింటింగ్ నేర్చుకుని ఆర్టిస్టుగా ఎదుగుతూ వచ్చాను. తర్వాత ఈశ్వర్, గంగాధర్, పాణి, దావూద్ వంటి గొప్ప ఆర్టిస్టుల దగ్గర కూడా పనిచేశాను.

మా అన్నయ్య నర్సాపురంలో హోటల్ నడిపేవాడు. ఇద్దరు పిల్లల తండ్రి. చిన్న వయసులోనే రోడ్డు ప్రమాదంలో మరణించాడు. కుటుంబంలో నేను రెండోవాణ్ణి కావడంతో కుటుంబ భారం నామీదే పడింది. మా చెల్లి, తమ్ముళ్ళు, అన్నయ్య పిల్లల్ని మద్రాసు తీసుకువచ్చేశాను. గంగాధర్ గారి దగ్గర, ఆర్టిస్టు రామారావుగారి దగ్గర పనిలో పెట్టాను. నేను కూడా జీతానికి ఉద్యోగం మానేసి పీస్‌వర్క్ చేయడం ప్రారంభించాను.

## జీవితాన్ని మలుపు తిప్పిన పల్నాటిసింహం

సినీ పబ్లిసిటీ డిజైనర్ గంగాధర్‌గారి దగ్గర ఆర్టిస్టుగా పనిచేసే అంకయ్య, నేను కలిసి 'సింధూర' పేరుతో పబ్లిసిటీ డిజైనర్స్ కంపెనీ ప్రారంభించాం. డబ్బింగ్ సినిమాలు చేస్తూ ఉండేవాళ్ళం. అప్పటి వరకు అంటే 1982 వరకు ఫొటోలు అతికించి కలరింగ్ చేసి వాల్‌పోస్టర్లు డిజైన్ చేసేవారు. 1982-83 ప్రాంతంలో మేం వచ్చిన తర్వాత 'పల్నాటిసింహం' సినిమాతో పోస్టర్స్ డిజైనింగ్‌లో హ్యాండ్‌వర్క్ ప్రారంభమైంది. సినీనటుడు కృష్ణగారి పుట్టినరోజు సందర్భంగా ఒక లోగో డిజైన్ వర్క్ వచ్చింది. ఎమ్మెస్‌రెడ్డిగారి సినిమా 'పల్నాటి సింహం' టైటిల్ లోగోకి ప్యాంటూ షర్టూ ధరించిన కృష్ణగారి ఫోటో పంపించారు. అది నాకు నచ్చలేదు. దాంతో నేనే సొంతంగా ఒక డిజైన్ తయారు చేశాను. కృష్ణగారికి గడ్డం పెట్టి, కత్తిపట్టుకున్నట్టుగా ఆర్ట్ వేశాను. నాలాంటి ఆర్టిస్టుల చేత ఎమ్మెస్‌రెడ్డిగారు అలా గీయించుకున్న 21 బొమ్మలన్నింటిలోకీ నేను గీసిన లోగో వాళ్ళకెంతో నచ్చింది. నా లోగో చూసిన తర్వాతే పరుచూరి బ్రదర్స్ స్ఫూర్తి పొంది కృష్ణగారికి సరిపడ బలమైన కథ తయారు చేశారు. దాంతో నాకు మంచి పేరు ప్రతిష్టలు లభించాయి. ఆవిధంగా పల్నాటిసింహం నాకు మంచి బ్రేక్ ఇచ్చింది. ఇక అప్పటినుంచీ పెద్దపెద్ద నిర్మాతలు నా వద్దకు రావడం ప్రారంభించారు. రామానాయుడుగారు, అల్లు అరవింద్, దాసరినారాయణ రావుగారు, విజయబాపినీడు, రాఘవేంద్రరావు, పద్మాలయా స్టూడియోస్....ఇలా ఎందరో ప్రముఖుల చిత్రాలకు పబ్లిసిటీ ఆర్టిస్టుగా చేశాను.

## 300 చిత్రాలు

వెంకటేష్ తొలిచిత్రం 'కలియుగ పాండవులు'కి నేనే పబ్లిసిటీ ఆర్టిస్టు.

డిటెక్టివ్ పుస్తకాలకు కవర్‌పేజీలు, బొమ్మరిల్లు పిల్లల పుస్తకాల్లో బొమ్మలు కూడా వేస్తూ ఉండేవాణ్ణి. అదే సమయంలో ఎమ్మెస్‌రెడ్డిగారి కుమారుడు శ్యాంప్రసాద్‌రెడ్డిగారు 'వస్తాదు' సినిమాకి లోగో డిజైన్ చెయ్యమన్నారు. అప్పటికే పార్ట్‌నర్ అంకయ్యతో విభేదాలు రావడంతో విడిపోయి సొంతంగా ఆఫీసు పెట్టుకున్నాను. మా చిన్నాన్న కొడుకు సారథి నిర్మించిన 'అగ్గిరాజు' చిత్రానికి పబ్లిసిటీ ఆర్టిస్టుగా చేశాను. అలా 'తలంబ్రాలు' చిత్రం నాటికి పబ్లిసిటీ ఆర్టిస్టుగా ఒక ట్రెండ్ సెట్ చేసుకున్నాను. అంకుశం, ఆహుతి, తాండ్రపాపారాయుడు, అగ్నిపుత్రుడు... ఇలా ఎన్నో చిత్రాలకు టైటిల్స్, పోస్టర్స్ పబ్లిసిటీ డిజైనింగ్ చేశాను. అలా నా కెరీర్‌లో సుమారు 300 చిత్రాల పబ్లిసిటీకి బాధ్యతలు నిర్వహించాను.

## సరైన గురువు బాపు

ప్రముఖ చిత్రకారుడు, దర్శకుడు బాపు సినిమాలకు, ఎన్.టి.రామారావుగారి చిత్రాలకు పని చేయాలనే గట్టి కోరిక ఉండేది. 'శ్రీనాథ కవిసార్వభౌమ' సినిమా తీయబోతున్నారని పేపర్లో చదివి ఈ సినిమాకు డిజైనింగ్ చేస్తే బాగుండుననిపించింది. నేనే సొంతంగా పలు రకాల టైటిల్ డిజైన్స్ తయారుచేసి బాపుగారికి పంపించాను. ఆ టైటిల్స్ చూసి వారు చాలా గొప్పగా ఫీలవుతారనీ, నాకు అవకాశం లభిస్తుందనీ భావించాను. కానీ బాపుగారి నుంచి ఎటువంటి సమాధానం రాలేదు. దాంతో నేను తయారుచేసిన టైటిల్ డిజైన్స్ పట్టుకుని ఎన్టీఆర్‌గారిని కలిశాను. ఎన్టీఆర్‌గారు ఆ డిజైన్స్ చూసి, బాపుగారికి చూపించమన్నారు. బాపుగారు చూసి నా డిజైన్స్ బాగున్నాయన్నారు. అదే ఆయనతో నా మొదటిపరిచయం. నేను చాలా పెద్ద పెద్ద టైటిల్స్ తయారుచేశాను. కానీ బాపుగారు అప్పటికే చిన్నసైజులో బాగా కనిపించేలా టైటిల్ డిజైన్‌చేశారు. అది నాకు చూపించారు. దాంతో నేను ఆయన కాళ్ళమీద పడిపోయాను. నాకు ఇన్నాళ్ళకు సరైన గురువు దొరికాడని ఎంతో సంబరపడిపోయాను. అప్పటినుండీ బాపుగారితో నా అనుబంధం, స్నేహం గట్టిగా పెనవేసుకుంది. టెక్నీషియన్‌గా కాకుండా ఆయన కుటుంబంలో ఒక సభ్యుడిగా కలిసిపోయాను. బాపుగారు నా చేత బొమ్మలు వేయించి పత్రికలకు పంపేవారు.



# బాపు జ్ఞాపకాలు



**బా**పు తెలుగువారిని వదిలివెళ్ళిపోయినా ఆయన గీసిన చిత్రాలు, సినిమాలు ఎప్పటికీ మనకు తోడుంటాయి. మరి బాపు కళ్ళజోడు ఎవరికి తోడుగా ఉందో తెలుసా? ఆయన పాదరక్షలు ఎవరిదగ్గర ఉన్నాయో తెలుసా?

బాపు పరిచయం కాకపూర్వం సురేష్ ఆయనకు ఏకలవ్య శిష్యుడు. పరిచయమైన తర్వాత ఆయన ప్రియశిష్యుడు. బాపుతో ఆయనకు అత్యంత సాన్నిహిత్యం. బాపు మరణంతో సురేష్ ఎంతో కలత చెందారు. బాపు తనతోనే ఉండాలని కోరుకున్నారు. కానీ ఏం చెయ్యాలి? బాపు కుమారుణ్ణి అడిగి ఆయన కళ్ళజోడు, పాదరక్షలు తెచ్చుకున్నారు. బాపు కళ్ళజోడుతో లోకం చూడాలనీ, అందులోంచే కళను దర్శిస్తూ బొమ్మలు గీయాలనే తలంపుతో వాటిని తనకు తోడుగా తెచ్చుకున్నారు. భరతుడు శ్రీరాముడి పాదుకల్ని సంరక్షించినట్టుగా బాపు పాదుకల్ని భద్రపరుచుకున్నారు సురేష్. అంత గొప్ప శిష్యుడాయన!

'బాపుగారి కళ్ళజోడు ఫ్రేములో నా కళ్ళద్దాలు వేసుకుని బొమ్మలు గీస్తూ, ఆ ఫ్రేములోంచి కళను ఆస్వాదిస్తూ సంతృప్తిగా జీవిస్తున్నా. నా అకాడమీలో నా కుర్చీ పక్కనే బాపుగారు తొడుక్కున్న చెప్పులు తెచ్చిపెట్టుకున్నాను. ఒక గాజుపెట్టెలో వాటిని భద్రంగా దాచుకున్నాను. ప్రతిరోజూ ఆఫీసుకు రాగానే ఆ చెప్పులపై పువ్వులు ఉంచి నమస్కరించి దినచర్య ప్రారంభిస్తాను. ఆ చెప్పులు, కళ్ళజోడు ప్రతిరోజూ బాపుగారి నిజాయితీనీ, నిరాడంబరతనూ నాకు గుర్తుచేస్తూ ఉంటాయి' అన్నారు సురేష్.

పోర్ట్రైట్స్ చిత్రించేందుకు నా పేరు రికమెండ్ చేసేవారు. ఆ బంధం 'శ్రీరామపట్టాభిషేకం', ఆ తర్వాత ఆయన అంతిమశ్వాస వరకు కొనసాగింది. షిరిడీ సాయి చిత్రానికి పెన్సిల్ స్కెచ్‌లు బాపుగారే వేశారు. ఆయన మిగిల్చి వెళ్ళిపోయిన పెయింటింగ్స్‌ని నేనే పూర్తిచేశాను.

## గొప్ప ఆర్టిస్టులందరికీ ఏకలవ్య శిష్యుణ్ణే

ఫైన్ ఆర్ట్స్ కాలేజీలో చేరాలనీ, చిత్రకళాకారుడుగా డిగ్రీ సంపాదించాలనీ నాకో బలమైన కోరిక. అందుకు కనీస విద్యార్హత పదోతరగతి ఉండాలి. నాకా అర్హతలేదు. దాంతో అది నా జీవితంలో ఒక కలగా మిగిలిపోయింది. ఆ కల నెరవేరదని తెలిసిన తర్వాత చిత్రకళను అధ్యయనం చేయడం ప్రారంభించాను. ఆ అధ్యయనంలో రాజారవివర్మ, బాపు దగ్గర్నుంచీ గోపీ, చంద్ర వంటి గొప్ప ఆర్టిస్టుల దాకా అందరికీ నేను ఏకలవ్య శిష్యుడిగా మారిపోయాను. వాళ్ళ బొమ్మలు, పెయింటింగ్స్, వారి స్టైల్స్ అన్నీ సునిశితంగా గమనిస్తూ నన్ను నేను తీర్చిదిద్దుకున్నాను.

## వర్క్‌మైండ్, క్రియేటివిటీలే సక్సెస్

చిత్రకళను ప్రాణప్రదంగా ప్రేమించేవాణ్ణి. సొంతంగా బొమ్మలు గీస్తూ, క్రియేటివిటీ ప్రదర్శించాలనే తపన. అలా నాకు తెలియకుండానే నాలో వర్క్‌మైండ్ అభివృద్ధి చెందింది. డబ్బు గురించి ఆలోచన లేదు. నిర్మాతలు, దర్శకులు అడ్వాన్సులు ఇచ్చేవారు. ఇక అంతే! పని పూర్తైన తర్వాత మిగిలిన బ్యాలన్స్ డబ్బు ఇచ్చేవారు కాదు. బాకీల వసూలుకోసం సిటీబస్సుల్లో కిలోమీటర్ల దూరం ప్రయాణం చేయాలి. పదిసార్లు వారి చుట్టూ తిరగాలి. ఆర్టిస్టుగా అంత సమయం నాకు ఉండేది కాదు. ఆ విధంగా డబ్బు రూపంలో నా శ్రమ నాకు దక్కకుండా పోయింది. నిర్మాతల్ని కాకాపట్టే ధోరణి నాలో మొదటినుంచీ లేదు. నా పనితనమే పెద్దపెద్ద నిర్మాతల్ని నా దగ్గరకు రప్పించిందితప్ప నేను ఎవరిచుట్టూ తిరగలేదు.

## సొంతఇల్లు కూడా లేని విజేత!

పల్నాటి సింహం లోగో ఎంతో క్రియేటివిటీతో చేశాను. అది చూసి స్ఫూర్తిపొందే పరుచూరి బ్రదర్స్ గొప్ప కథ తయారు చేశారు. ఈ చిత్రం 100 రోజుల ఫంక్షన్ సభలో పరుచూరి బ్రదర్స్ స్వయంగా ఆ విషయం వెల్లడించారు. తాండ్ర పాపారాయుడు చిత్రానికి కాస్ట్యూమ్స్ గెటప్ డిజైన్స్ నాచేతే తయారు చేయించుకున్నారు. విజేత సినిమాకి అల్లుఅరవింద్‌గారు నా దగ్గర ఫుల్‌పేజీ డిజైన్ చేయించుకున్నారు. దానికి మంచి రెస్పాన్స్ వచ్చింది. నిర్మాతలు నూటికినూరుశాతం సంతృప్తిచెందే డిజైన్స్ తయారుచేసి ఇచ్చేవాణ్ణి. ఎంత కంగారు పెట్టినా వాళ్ళని పట్టించుకునేవాణ్ణి కాదు. దర్శకుడు సత్యారెడ్డిగారు సాయికుమార్ హీరోగా నిర్మించిన 'మిత్రుడు' సినిమా లోగో డిజైన్‌కోసం వచ్చారు. నేను చేసిన డిజైన్ చూసి థ్రిల్ అయిపోయారు. లోగోకు ఇచ్చే రెమ్యునరేషన్ కాకుండా మరో 10 వేల కట్టతీసి బహుమానంగా ఇచ్చి ఎంతో సంబరపడ్డారు.

## పెద్దనిర్మాతల్లో కూడా నిజాయితీలేదు

నైపుణ్యం గలవాడు ఎంతమందిలో ఉన్నా గుర్తించి ఉపయోగించుకుంటుంది సినిమారంగం. కానీ వాళ్ళ శ్రమకు తగిన ఫలితం ఇవ్వాలనే నిజాయితీ ఆనాటినుంచీ ఈనాటి వరకూ చిత్ర పరిశ్రమకు లేదు. దీనివల్ల ఎందరో నైపుణ్యంగల వారు పేరు సంపాదించుకున్నాగానీ ఆర్థికంగా నిలదొక్కుకోలేకపోతున్నారు. ఈ కారణంగా సినిమా రంగంమీద నాకు అసంతృప్తి ఏర్పడింది.

## హైదరా'బ్యాడ్'

అందరితోపాటే 1997లో హైదరాబాద్ తరలి వచ్చాను. మూడు సినిమాలు చేశాను. నిర్మాతలు రెమ్యునరేషన్లు ఎగ్గొట్టారు. ఇక్కడ బతకడం కష్టం అనిపించి విసుగెత్తి హైదరా'బ్యాడ్' అనిపించింది. తిరిగి మద్రాసు వెళ్ళిపోయా. బాపుగారి దయవల్ల 'శ్రీరామరాజ్యం'తో మళ్ళీ హైదరాబాద్ నగరానికి నాకు అనుబంధం పెరిగింది. మూడేళ్ళక్రితం హైదరాబాద్ వచ్చి మణికొండలో చిత్రకళాఆర్ట్ అకాడమీ స్కూలు ఏర్పాటు చేశాను. 250 మంది పిల్లల్ని చిత్రకళాకారులుగా తయారుచేశాను.

## కుటుంబం

నా భార్య విజయ. మాకు ఇద్దరు పిల్లలు. ఇద్దరూ మంచి చిత్రకారులే! అబ్బాయి శివరామకృష్ణ చిత్రకళా ఆర్ట్ అకాడమీ స్కూలు నిర్వహిస్తున్నాడు. అమ్మాయి వినయదుర్గ. వివాహిత. అల్లుడు పగడాల ప్రవీణ్. మనవడు జ్ఞానేశ్వర్.

**-టి.రామ్మోహన్**

# ఇవన్నీ నిజాలే!

## వ్యవసాయ ఆవిర్భావం

A వ్యవసాయం మొట్టమొదట పన్నెండు వేల సంవత్సరాల క్రితం మధ్యాసియా దేశాల్లో ఆవిర్భవించింది.

•••

A ఇరాన్‌లోని జాగ్రోస్ పర్వతాలు, సదరన్ లెవాంట్ (ఇజ్రాయిల్-జోర్డాన్), ఆసియా మైనర్ (ఆధునిక టర్కీ) మూడు ప్రాంతాల్లోనూ ఒకరికొకరికి సంబంధం లేకుండా తొలి వ్యవసాయదారులు, ఫార్మింగ్ టెక్నాలజీ పుట్టుకొచ్చినట్టు జీనోమ్ ప్రాజెక్టు ద్వారా ఇటీవల జరిపిన పురాతన మానవ శకలాల డీఎన్ఏ పరిశోధనలో వెల్లడైంది.

•••

A యూరప్‌లో అతి ప్రాచీనమైనది ఐరిష్ సంప్రదాయం. ఇది అతి గొప్పది. వీరి కెల్టిక్ పురాణాలు, కావ్యాలు మన రామాయణ, భారతాలవలే గానమాధుర్యమైనవి.

•••

A సృష్టికి సంబంధించి మన దేశంలో ఉన్న 'జల ప్రళయం, మనువు వంటి గాథలు క్రీస్తుపూర్వం 2,500 కాలంనాటి బాబిలోనియన్ నాగరికతా పురాణాల్లో కూడా ఉన్నాయి. ఏడు ఇటుక రాళ్ళపై గ్రంథస్థం చేసిన ఇలాంటి కథ బాబిలోనియన్ చక్రవర్తి లైబ్రరీ శిథిలాల్లో 162 సంవత్సరాల క్రితం లభించింది.

## లావా

A భూగోళంలో ప్రవహించే 'లావా' లో 75 శాతం సముద్ర గర్భంలోని అగ్ని పర్వతాలు బద్దలు కావడం వల్ల వస్తున్నదే. హై రిజల్యూషన్ కెమేరాలను రోబోలకు అమర్చి మిడ్ అట్లాంటిక్ సముద్ర గర్భంలో చేసిన ప్రయోగాల్లో ఈ సాక్ష్యాలు లభించాయి.

•••

A ఆంటేరియో గ్రేట్ లేక్స్ గర్భంలో 213 ఏళ్ళనాటి ఒంటిస్థంభం ఓడ జాడను ఇటీవల కనుగొన్నారు. మనదేశం నుంచి కొనుగోలు చేసిన సరుకును కెనడా వ్యాపారి నయాగరాకు తరలిస్తుండగా భయంకర తుపానులో చిక్కుకుని ఓడ అప్పట్లో జలసమాధి అయింది.

•••

A అంటార్కిటికా వెళ్ళిన తొలి భారతీయ మహిళ మెహర్ హీరోయిన్ మూస్. ఆమె వయసు ఎంతో తెలుసా? డెబ్బైఏళ్ళు. 181 దేశాలు చుట్టివచ్చిన సాహసయాత్రల వృద్ధనారి!

•••

A ప్రపంచ సాహిత్యంలోనే మొట్టమొదటి గ్రంథం ఋగ్వేదం.

•••

A నిన్ను నువ్వు జయించడమే అసలైన గెలుపు.

- గ్రీకు తత్త్వవేత్త ప్లేటో

•••

A మహాభారత యుద్ధం క్రీస్తుపూర్వం 1000 - 800 ప్రాంతంలో జరిగి ఉంటుందని కొందరు పురాతత్త్వవేత్తల అంచనా.

-చిన్నారి

# సుధామ పదగారడి-285

సెల్: 98492 97958

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | h | 2 | | 3 | h | 4 | h | 5 |
| 6 | h | | h | | h | 7 | 8 h | |
| | h | | h | | h | 8 h | | h |
| h | h | h | 9 | h | 10 | h | 11 | 12 |
| 13 | 11 h | 14 | | h | 15 | | h | h |
| 16 | 17 | 15 | h | h | | h | h | h |
| h | | h | 18 | 19 | | 20 | h | 21 |
| 22 h | | 23 | h | | h | 24 | h | |
| | h | 25 | | | h | | h | |

## ఆధారాలు

**అడ్డం**

2. పర్వము (3)
6. ఉపశాఖ (3)
7. పక్షి (3)
11. చెలికత్తె (2)
14. కలెక్టర్ అధీనమునందుండు ప్రదేశము (2)
15. పానకం మధ్యలో వదిలేయచ్చు (2)
16. మిల్కీబ్యూటీ అనే తెలుగు సినీ తార, బాహుబలి హీరోయిన్ (3)
18. మార్పు, పోలిక (4)
22. అల్లరి, గలబయే! (3)
24. విరేచనాలు (3)
25. ముస్లింల ప్రార్థనా మందిరం (3)

**నిలువు**

1. మొలక, అంకురము (3)
2. సస్యములు, పండేవి (3)
3. ద్వారము యొక్క క్రింది కమ్మి (3)
4. స్త్రీ (2)
5. టమారం తోటి విద్య!? (2)
8. అడుగునుంచి సేవ యే! (3)
9. ఈ పెట్టె అంటే డబ్బులు దాచేది! (2)
10. దీపాలవరుస, పండుగనామం (4)
12. కోట (2)
13. దీనికి తగ్గ బొంత దొరకకపోతుందా!? (2)
14. దేశవిభజన కారకుడు. రమ్ముకాదా? మరో మద్యమా? (2)
17. కొందరికి కూరల్లో వాటిల్లో ఇదెక్కువ ఉంటే గిట్టదు, ఈ వాసనలు పడవు (3)
19. జెట్టీ (3)
20. గోవధ స్థలము (3)
21. బ్రహ్మ (3)
22. హైద్రాబాద్ సందు (2)

## పదగారడి-284 సమాధానాలు

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | 1 స్నే | 2 హ | ల | 3 త | | 4 అ | ర | 5 వై |
| 6 బెం | | స | | 7 హా | 8 వి | స్న | | జా |
| 9 గ | ళ | నం | | | హా | | 10 బా | గ్ |
| ళూ | | | 11 మ | 12 నో | హ | 13 రం | | |
| 14 రు | ద్రా | 15 రి | | మ | | 16 భా | ను | 17 త్రి |
| | | 18 తి | ర | స్కా | రం | | | త్రే |
| 19 ప్ర | కా | ష | | | | 20 ప | ను | ధ |
| త్యూ | | | 21 ఉ | 22 షి | | సం | | ర |
| 23 ష | ర | తు | | 24 అ | క్ష | త | లు | |

Printed and Published by VEMURI RADHAKRISHNA, Managing Director, on behalf of Aamoda Publications Pvt. Ltd., Plot No.76, Aswani Layout, Huda Heights, Jubilee Hills, Hyderabad-500 033. Ph.(040) 23558233/44, Fax No.23558288. Printed at Aamoda Press, R.S.No.191/3, Ward No.43, Donka Road, Patamata, Vijayawada 520 010, Reg.No.: APTEL/2004/12594. Editor: A.N.JAGANNADHA SARMA

| | | |
|---|---|---|
| 28. | తులసి నిత్యపూజ, తులసీఉపయోగాలు | 10-00 |
| 29. | శ్రీ చక్ర రహస్య విజ్ఞానమ్ | 36-00 |
| 30. | శ్రీచక్ర పూజావిధానం(పెద్దది) | 36-00 |
| 31. | లక్ష్మి - గౌరీ నిత్యపూజ | 10-00 |
| 32. | శ్రీ సరస్వతీ నిత్యపూజ | 10-00 |
| 33. | శ్రీ దుర్గానిత్యపూజ | 10-00 |
| 34. | కాలభైరవ నిత్యపూజ | 10-00 |
| 35. | శివపూజ | 10-00 |
| 36. | వీరభద్ర పూజ | 10-00 |
| 37. | ఆంజనేయ నిత్యపూజ | 10-00 |
| 38. | నాగేంద్ర స్వామి పూజ | 10-00 |
| 39. | సుబ్రహ్మణ్య నిత్యపూజ | 10-00 |
| 40. | రామదేవుని కథ | 10-00 |
| 41. | శివదేవుని కథ | 10-00 |
| 42. | లక్ష్మీనరసింహపూజ | 10-00 |
| 43. | వేంకటేశ్వరపూజ | 10-00 |
| 44. | బ్రహ్మంగారి నిత్యపూజ | 10-00 |
| 45. | సూర్య నిత్యపూజ | 10-00 |
| 46. | నవగ్రహ నిత్యపూజ | 10-00 |
| 47. | రుక్మిణీ కల్యాణం | 25-00 |
| 48. | ఉమామహేశ్వర వ్రతం | 36-00 |
| 49. | శ్రీ కామేశ్వరీ వ్రతం | 36-00 |
| 50. | 16 సోమవారముల వ్రతము | 25-00 |
| 51. | పార్వతీకల్యాణం | 25-00 |
| 52. | సహస్రకమలవర్తి వ్రతము | 25-00 |
| 53. | పంచముఖ ఆంజనేయ పూజావిధానము | 36-00 |
| 54. | అష్టనాగపూజ | 36-00 |
| 55. | పూజలు ఎందుకుచేయాలి ? | 36-00 |
| 56. | ఏ దేవునికి ఏపుష్పాలతో పూజించాలి? | 36-00 |
| 57. | ఏ దేవునికి ఏప్రసాదం నైవేద్యం పెట్టాలి? | 36-00 |
| 58. | ఏదేవునికి ఏవిధముగాదీపారాధనచెయ్యాలి? | 36-00 |
| 59. | ఏదేవునికి ఎన్ని ప్రదక్షిణలుచేయాలి ? | 36-00 |
| 60. | హనుమద్ వ్రతం | 36-00 |
| 61. | పంచాయతన పూజ | 63-00 |
| 62. | 28 వ్రతములు | 120-00 |

| | | |
|---|---|---|
| 63. | కలశపూజలు (9ఒకేసారి) | 150-00 |
| 64. | కలశపూజలు (విడివిడిగా) (ప్రింటులో) | .... |
| 65. | హ్రీంకార మహాయజ్ఞం (ప్రింటులో) | .... |
| 66. | గోమాత | 40-00 |

## 2. స్తోత్రాలు-సుప్రభాతములు సహస్రనామములు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ లలితా విష్ణు సహస్రనామస్తోత్రాలు<br>పురాణపండ రాధాకృష్ణమూర్తిగారి సంకలనం | 45-00 |
| 2. | లలితావిష్ణు సహస్రనామస్తోత్రములు (హిందీ) ,, | 50-00 |
| 3. | లలితావిష్ణు సహస్రనామస్తోత్రములు (ఇంగ్లీషు) ,, | 50-00 |
| 4. | స్థూలాక్షరిలలితావిష్ణుసహస్రనామస్తోత్రములు(పత్రికసైజ్) | 99-00 |
| 5. | లలితావిష్ణు (కేస్ బైండ్) 1/8 డెమ్మి | 63-00 |
| 6. | స్థూలాక్షరీ లలితావిష్ణు (క్రౌన్‌సైజు)కేస్‌బైండ్ | 108-00 |
| 7. | సర్వదేవతా స్తోత్రమంజరి | 120-00 |
| 8. | సకలదేవతా అష్టోత్తరశతనామావళిః (63) | 24-00 |
| 9. | విష్ణుసహస్రనామస్తోత్రమ్ (క్రౌన్) | 25-00 |
| 10. | లలితా సహస్రనామ స్తోత్రమ్ (క్రౌన్) | 36-00 |
| 11. | లలితా సహస్రనామములు | 24-00 |
| 12. | లక్ష్మీ సహస్రనామములు | 24-00 |
| 13. | దుర్గా సహస్రనామములు | 24-00 |
| 14. | ఆంజనేయ సహస్రనామములు | 24-00 |
| 15. | శివ సహస్రనామములు | 24-00 |
| 16. | విష్ణు సహస్రనామములు | 24-00 |
| 17. | గణపతి సహస్రనామములు | 24-00 |
| 18. | సుబ్రహ్మణ్య సహస్రనామములు | 24-00 |
| 19. | గాయత్రి సహస్రనామములు | 24-00 |
| 20. | లలితావిష్ణు సహస్రనామస్తోత్రాలు | 24-00 |
| 21. | శ్రీరామా సహస్రనామములు | 24-00 |
| 22. | సరస్వతి సహస్రనామములు | 24-00 |
| 23. | సూర్యసహస్రనామములు & ఆదిత్యహృదయం | 24-00 |
| 24. | శ్రీవేంకటేశ్వరసహస్రనామములు | 24-00 |
| 25. | మణిద్వీపవర్ణన (పెద్దది) | 24-00 |
| 26. | సంధ్యావందనం | 24-00 |
| 27. | మంత్రపుష్పమ్ | .... |
| 28. | త్రిభాషా హనుమాన్‌చాలీసా | 15-00 |
| 29. | హనుమాన్ చాలీసా | 10-00 |

